1960 మార్చి పరీక్షలో నూటికి 98 మార్కులు సంపాదించిన

మీ అభిమానపాత్రమైన తెలుగునోట్సు.

# కల్పతరు నోట్సు

## S. S. L. C. & MATRIC EXAMINATION 1961
## TELUGU VERY POPULAR FULL NOTES,
## PARTS 1 & 2

కల్పతరువు నూతన పద్ధతులతో గత అన్ని సంవత్సరముల

కన్న బహు విపులముగా వ్రాయబడినది

కల్పతరువునకు సాటి కల్పతరువే!



ఇందు ప్రతి పద్యమునకు అర్థము, తాత్పర్యము- ప్రతి పాఠముచివర ముఖ్యమైన ప్రశ్నలు - జవాబులు - నానార్థములు - ప్రకృతులు, వికృతులు, వ్యాకరణాంశములు, వ్యుత్పత్త్యర్థములు, ఛందస్సు సమాసములు, ముఖ్యమగు కఠినపదములకు అర్థములు, ప్రత్యేక పాఠ్యభాగమున ప్రత్యేక వ్యాకరణము, వ్యాసములు, సామాన్య భాగమున వ్యాకరణము మారిర తర్జుమా ముక్కములు (Transla-tion Passages) సమస్తము గలవు.

గ్రంథకర్త:

కవిభూషణ కవి...

శ్రీ శిష్టా వేంకట సుబ్బయ్యగారు

ప్రధానాంధ్రోపాధ్యాయులు, టైలర్ హైస్కూలు

నర్సాపురం.

ప్రకాశకులు:

**A. V. RAM & Co.,**

**NARSAPUR (W. G. Dt.)**

**1960**

# విషయసూచిక

## సామాన్య పాఠ్యభాగము - మొదటిభాగము



## పద్యభాగము



## గద్యభాగము



---

క్ర

| పాఠ్యభాగము | కవి - కాలము - బిరుదు | |
|---|---|---|
| 1. శిశుపాల వధ (భారతము-సభాపర్వము) | నన్నయభట్టు - 1022 ఆదికవి; శబ్దశాసనుడు | |
| 2. ఉత్తరకుమార ప్రజ్ఞలు. భారతము విరాటపర్వము | తిక్కన - 1250. కవిబ్రహ్మ; ఉభయకవిమిత్రుడు | |
| 3. గజేంద్రమోక్షము. భాగవతము 8 వ స్కంధము | పోతన - 1422 సహజపాండిత్యుడు | |
| 4. నీతిపద్యములు - సుభాషితత్రిశతి- | ఏనుగు లక్ష్మణకవి 18 వ శతాబ్దము. | 1 2. 3. |
| 5. మిత్రభేదము. నీతిచంద్రిక | పరవస్తు చిన్నయసూరి. 1806-62 | 1. భా 2. ఆ 3. ఆం |

# కంఠస్థము చేయవలసిన పద్యములు

## శిశుపాలవధ

మ. అవనీనాథులనేకులుండఁగ విశిష్టారాధ్యులార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులుపల్వురుండఁగ ధరిత్రీనాథ గాంగేయ దు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి
యవివేకంబెఱిఁగించితిందఱకు; దాశార్హుండు పూజార్హుఁడే.

ఉ. ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁడని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని; యుక్తము గాకిది యేమి దోషమే?

ఉ. పాలితదుర్నయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల భూ
పాలక నీకుఁ బట్టువడుపన్ మఱి ధర్మువెఱుంగ వీనికిం
బోలునె రాగరోషపరిభూత మనస్కున కల్పరాజ్య ల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహాత్మపరివాద శీలికిన్

చ. రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్ర సం
చయముల సంచలచ్చటుల సైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజకుకురాంధకవాహినియుం గలంగ ని
ర్దయతరరోషమారుతనితాంత సమీరితమై క్షణంబునన్.

చ. ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటి త్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్.

## ఉత్తరకుమార ప్రజ్ఞలు

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కటనెత్తివచ్చినం
దేరు బృహన్నలా భళిగతిన్ జరియించిన గెల్వవచ్చుఁ ద

ధీరగుణంపుసొంపు, పృథివీవరనందన మున్నె ఱుంగుదుం
గారణజన్మమై తను వికారమువచ్చినఁ బెంపుదప్పునే?

ఉ. ఖాండవమేర్చునప్పుడు దగన్ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయముగల్గ నొనర్చినయట్టి బుద్ధియున్
దండితనంబు నీ యెడనతక్కెనె? నాదెస మైత్రి పెన్పు మిం
కొండొకమాటదక్కుము రణోత్సహనం బొనరింపు గ్రక్కునన్.

సీ. అభినవజలధర శ్యామంబులగునెడ
లాప జొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమ చ్ఛాయంబులగుపట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళ గౌరములగుచోటులు
దఱచుఁ బూఁబొదలచందంబునొంద
హరిద్రరుచిసమానాకృతులగు తావు
లడరెడు పుష్పాదులట్లు మెఱయఁ

తే. గలయ సెగసి ధరాధూళి లలితవనము
దివికి నడిఁ గాపుఁ బోయెడు తెఱఁగుఁ దాల్ప
గోగణము ముంగలిగ నేలకోడి నడఁగ
నడచు కౌరవరాజసైన్యంబుఁ గనియె.

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరాకీర్ణము శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలజలాత్యుగ్రం బుధగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిది! యేఁ జేరంగ శక్తుండనే?

ఉ. కౌరవసేనఁ జూచి వడఁకం దొడఁగెన్ మదిలోన, మేను నీ
పూరకపోవుచున్న యిదియొప్పునె! యిప్పటిభంగిఁ జూచిన
వీరల సేనమార్కొనమి నిశ్చయ, మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణముల దీపనమున్ వినవే బృహన్నలా!

## గజేంద్ర మోక్షము

మ. అల వైకుంఠపురములో నగరిలో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిన్ బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతిజీ
వనసంపత్తినిరాకరిష్ణు కరుణావర్ధిష్ణు యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్.

మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరశుక్రమున్ బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్,

కం. మకర మొకటి రవిఁ జొచ్చెను
మకరము మఱియొకటి ధనదుమాటున డాఁగెన్
మకరాలయమునఁ దిరిగెడు
మకరంబులు కూర్మరాజు మఱువునకరిగెన్.

మ. తమముంబాసిన రోహిణీవిభుక్రియన్ దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా
దములల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీ కరోక్షితసుధాంభస్స్నాన విశ్రాంతుఁడై.

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్
సారోదారసిత ప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్న దైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్.

## నీతి పద్యములు

చ. మకరముఖాంతరస్థమగు మానికమున్ బెకలింపవచ్చుఁ బ్రా
యకచలదూర్మికా నికరమైన మహోదధి దాఁటవచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె సర్పము నైన ధరింపవచ్చు మ
చ్చిక ఘటియించి మూర్ఖజనచిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్.

శా. ఆకాశంబుననుండి శంబుని శిరంబందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువిభూలోకంబునందుండి య
స్తోకాంభోధిఁ బయోధినుండి పవనాంధోలోకముం జేరె గం
గాకూలంకష; పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్

చ. జలముల నగ్ని ఛత్రమున జండమయూఖుని దండతాడనం
బుల వృషగార్దభంబులను బొల్పగు మత్తకరీంద్రమున్ సృణిన్
దెలఁగెడు రోగ మౌషధముచే విషముం దగు మంత్రయుక్తి ని
మ్ములఁ దగఁ జక్కఁజేయనగు; మూర్ఖుని మూర్ఖత మాన్పవచ్చునే.

మ. గురుముఖ్యుల్ గల దేవపూర్వురు శుభాంగుల్ ఖేచరుల్ వారితో
వరవిక్రాంతివిహారి రాహు వెపుడున్ వైరంబు సేయుండు భా
స్వరులన్ భాస్కరయామినీచరుల నే బాధించుచున్నాఁడు త
త్పరతన్ మస్తకశేషమూర్తి యగు నా దైత్యుండు గర్వంబునన్.

ఉ. చేరి యొకండు నవ్వఁబడి చిక్కఁ జేరెఁడు శాలిధాన్యమే
కోరు నతండు పిమ్మట నఖండధనోన్నతుఁడై వసుంధరం
బూరికి సాటిగాఁ దలఁచు భూరిధనాఢ్యుల చొప్పనేకమై
గౌరవమున్ లఘుత్వమును గైకొను వస్తువులందు నిల్పెడున్.

మ. పరహింసా పరకీయ విత్తహరణాభావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితోదంతోక్తి మూకత్వముం
బరతృష్ణాఝరభంజనంబు గురునమ్రత్వంబునుం బ్రాణభృ
త్కరుణా శాస్త్ర సమత్వసద్విధులు భద్రప్రాప్తికిన్ మార్గముల్.

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్; వృథాన్యార్థభం
గముఁ గావించెడు వారలెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్.

చ. హృదయమువచశ్శరీరములనెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదమున బహూపకారముల మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణలవంబులు గొండలుచేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు మాన్యులు గొందఱు వొల్తురిద్ధరన్.

మ. ధర ఖర్వాటుఁడొకండు సూర్యకర సంతప్త ప్రధానాంగుఁడై
త్వరతోడన్ బరువెత్తి చేరినిలిచెన్ దాళద్రుమచ్ఛాయఁద
చ్ఛిరముం దత్ఫలపాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాఁ
బొరి దైవోపహతుండు పోవుకడకుం బోవుంగదా యాపదల్.

మ. చెలువౌ రత్నఘటంబునం దతఁడు సుశ్రీఖండఖండంబులం
దిలపిణ్యాకము వండె నారుగల కరిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్ జిల్లెడు దూదికై పుడమిదున్నెన్ బైఁడిసాగేళ్ళ ని
మ్ములఁ గర్మక్షితిబుట్టి యెవ్వఁడు దపంబుల్ సేయఁ డప్రాజ్ఞతన్.

ఈ క్రింది విషయములు ప్రభుత్వ ప్రకటన ననుసరించి గ్రహింపఁ బడినవి. ప్రతి విద్యార్థి, విద్యార్థినియు నీ యంశములను చక్కగా గమనింప వలెను.

1. మాతృభాషలోని పాఠ్యభాగము రెండు భాగములు. మొదటి భాగమును మాతృభాష ప్రతివిద్యార్థియు చదివితీరవలెను. (First Language Telugu) Part I-paper I-Texts and Grammar Part I-Part II రెండవ భాగము క్రింద విద్యార్థి తనమాతృభాషనో లేక

ప్రాంతీయ భాషనో, సంస్కృతము వంటి మరి యే యితర భాషనో గ్రహింపవచ్చును. హిందీ మాతృభాష గా గలవారు తప్పితరులు దానిని రెండవ భాగముగా గైకొనరాదు.

ప్రతి విద్యార్థియు కంఠస్థము చేయవలసిన పద్యములు మొదటి భాగములో (Part-I Paper-I లో) యుండును. రెండవ భాగమున (Special Telugu లో) కంఠస్థము చేయవలసిన పద్యము లుండవు. Part I-Paper I ప్రశ్న పత్రము $2\frac{1}{2}$ గంటల కాలపరిమితి. 60 మార్కులు గలది. రెండవ ప్రశ్న పత్రము (Part I-Paper II) కాలపరిమితి 2 గంటలు. ఇందు ఉపవాచకములు (Non-detailed Texts) రెండింటిలోనుండి వ్రాయవలసిన రెండుప్రశ్నలకు (15×2) 30 మార్కులు. భాషాంతరీకరణమునకు (Translation) 10 మార్కులు మొత్తము 40 మార్కులు. ఇట్లు మొదటి భాగమునకు (60+40) 100 మార్కులు. ఈ రెంటను కలుపబడును.

రెండవ పాఠ్యభాగ మగు ప్రత్యేక పాఠ్యభాగపు ప్రశ్న పత్రము $2\frac{1}{2}$ గంటల కాలపరిమితి కలది. (Special Telugu-First Language-Part II Intensive Study) ఇందు గద్య పద్య భాగములకు 50 మార్కులును, వ్యాకరణమునకు 25 మార్కులును, విద్యార్థుల కల్పనాశక్తి స్వయంకృషి, వ్యాసరచనకు (10+15) 25 మార్కులున్ను మొత్తం 100 మార్కులు. ఈ రెండవభాగమున సంస్కృతముగాని మరి యే విదేశ భాషగాని గ్రహించినచో $2\frac{1}{2}$ గంటల కాలపరిమితియు 100 మార్కులును గలపరీక్షాపత్ర మీయబడును.

---

# ఆంధ్ర వ్యాకరణము

## సంస్కృత సంధులు

1. సవర్ణదీర్ఘసంధి (అకస్సవర్ణే దీర్ఘః) హ్రస్వదీర్ఘములయిన అ ఇ ఉ ఋ ఌ-అను వర్ణములకు వాని సవర్ణములు పరమైనప్పుడు వాని దీర్ఘాక్షరము లేకాదేశమగు. ఏకాదేశ మనగా పూర్వపరస్థానములయందలి రెండచ్చులకును బదులుగా నొకే యచ్చు వచ్చుట. ఏయచ్చునకైనను దాని హ్రస్వదీర్ఘములు సవర్ణము అగును. అ, ఆ యనునవి రెండును అకారమునకు సవర్ణములు. ఇట్లే తక్కినయచ్చుల సవర్ణములను గూడ తెలియునది.

ధన+అభిలాష=ధనాభిలాష; రామ+ఆజ్ఞ=రామాజ్ఞ; లతా+అంతము=లతాంతము; రమా+ఆరాధన=రమారాధన; ముని+ఇంద్రుడు=మునీంద్రుడు; కవి+ఈశ్వరుఁడు=కవీశ్వరుఁడు; గౌరీ+ఇష్టము=గౌరీష్టము; సతీ+ఈశుడు=సతీశుడు; భాను+ఉదయము=భానూదయము, మృదు + ఊరువు = మృదూరువు; వధూ+ఉత్తమము=వధూత్తమము; చమూ + ఊర్ధ్వము=చమూర్ధ్వము; పితృ+ఋణము=పితౄణము.

2. గుణసంధి:—(అదేఙ్గుణః) అ ఎ ఓ అను మూడక్షరములను గుణము లందురు. (ఆద్గుణః) అకారమునకు గాని ఆకారమునకు గాని ఇ ఉ ఋ ఌ వర్ణములు పరము అగునపుడు వీనికి క్రమముగా ఏ ఓ అర్ అల్ అనునవి యేకాదేశంబు అగును. దేవ+ఇంద్రుడు = దేవేంద్రుడు; పరమ+ఈశ్వరుఁడు=పరమేశ్వరుడు; పార్థివ+ఇంద్రుడు=పార్థివేంద్రుడు; మహా+ఈశ్వరుడు=మహేశ్వరుడు; శాస్త్ర + ఉక్తము=శాస్త్రోక్తము; దేవ+ఊర్జితము=దేవోర్జితము; గంగా+ఉదకము=గంగోదకము; సీతా+ఊర్మిళ=సీతోర్మిళలు; బ్రహ్మ+ఋషి=బ్రహ్మర్షి; మహా + ఋణము = మహర్ణము; తవ+ఌకారము=తవల్కారము.

3. వృద్ధిసంధి:—(వృద్ధిరాదైచ్) అ ఐ ఔ అను మూడక్షరము లను వృద్ధులందురు. (వృద్ధిరేచి) అ కారమునకు గాని ఆ, కారమునకు గాని ఏ, ఐ లు పరమైనపుడు పూర్వపరాచ్చులు రెండింటికిని బదులుగా ఐ కారము వచ్చును. అ, కారమునకుగాని, ఆ,కారమునకు గాని ఓ, ఔ లు పరమైనపుడు పూర్వాపరాచ్చులు రెండింటికిని బదులుగా ఔకారము వచ్చును.

భీష్మ+ఏకాదశి=భీష్మైకాదశి; ప్రథమా+ఏక=ప్రథమైక; సర్వ+ఐశ్వర్యము=సర్వైశ్వర్యము; ప్రజా+ఐక్యము = ప్రజైక్యము; దురిత + ఓఘము=దురితౌఘము; గంగా+ఓఘము=గంగౌఘము; రామ+ఔత్కంఠ్యము=రామౌత్కంఠ్యము; మహా+ఔదార్యము=మహౌదార్యము.

4. యణాదేశసంధి:—(ఇకార స్థానే యణస్స్వర సవర్ణే అచి పరే) ఇ, ఉ, ఋ, ఌ లకు తరువాత అసవర్ణమగు అచ్చు పరమగుచో క్రమముగా య్, వ్, ర్, ల్ అనునవి యాదేశములగును. అసవర్ణమనగా సమానముకాని వర్ణము. య, వ, ర, ల కు యణ్ణులని పేరు. అతి + అధికము=అత్యధికము; మధు+అరి=మధ్వరి; పితృ+ఆజ్ఞ = పిత్రాజ్ఞ; ఌ + ఆకృతి=లాకృతి.

5. విసర్గసంధి:—సకారాంతపదములకు చ, ఛ, శ అనువర్ణములు పరమైనపుడు స, కారము శవర్ణ మగును.

మనస్+చలనము=మనశ్చలనము; దోస్+శక్తి = దోశ్శక్తి; సకారాంతపదములకు క, ఖ, ప, ఫ వర్ణములు పరమగునేని విసర్గమువచ్చును. మనస్+కమలము=మనఃకమలము; తపస్+ఫలము=తపఃఫలము.

ఇస్, ఉస్ అంతమందుగల ఉపసర్గములయం, శబ్దములయం, స, కారమునకు క, ఖ, ప, ఫ వర్ణములు పరమగునేని ష, కారము వచ్చును. నిస్+కారణము=నిష్కారణము; ధనుస్+ఖండము = ధనుష్ఖండము; చతుస్+పథము=చతుష్పథము.

సకారమునకు ట, వర్ణము పరమగునేని షత్వము వచ్చును. ష, కారము పరమగునేని షత్వవిసర్గములు వచ్చును.

ధనుస్+టంకారము=ధనుష్టంకారము; మనస్+షట్పదము=మనష్షట్పదము; మనఃషట్పదము.

అస్ అంతమందుగల పదములకు క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష, స, వర్ణములు తప్ప తక్కిన హల్లులు పరమగునేని అస్. స్థానమున ఓకారము వచ్చును,

మనస్+గతి=మనోగతి; తపస్+బలము=తపోబలము; శిరస్ + భారము=శిరోభారము, మనస్+రథము=మనోరథము.

ఇకారాద్యచ్చులు పూర్వమందుగల స, కారమునకు క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష, స, వర్ణములుతప్ప తక్కినహల్లులు, అచ్చులు పరమగునేని రేఫము వచ్చును.

బహిస్+అంగము=బహిరంగము; ఆశీస్+వాదము=ఆశీర్వాదము; చతుస్+ముఖుడు=చతుర్ముఖుడు.

స్వస్, అంతస్, ప్రాతస్, పునస్, అహస్. శబ్దముల సకారమునకు క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష, స, వర్ణములకంటె భిన్నములగు హల్లులు, అచ్చులు పరం బగునేని రేఫము వచ్చును.

స్వస్+ఆనందము=స్వరానందము; అంతస్+భాగము=అంతర్భాగము; ప్రాతస్+అశనము=ప్రాతరశనము; పునస్+ఆగమము=పునరాగమము; అహస్+గణము=అహర్గణము.

ఇకారాద్యచ్చులు పూర్వమందుగల సకారాంత శబ్దములకు రేఫము పరమగునేని స, కారమునకు లోపమును, పూర్వాచ్చునకు దీర్ఘమును వచ్చును. స్వస్+రాజ్యము=స్వారాజ్యము; ఆశీస్+రవము = ఆశీరవము; చతుస్+రాజీవము=చతూరాజీవము.

6. హల్సంధి, (జస్త్వ సంధి):—క, చ, ట, త, ప, లకు అచ్చులును, (క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష, స, అను వర్ణములకు భిన్నములగు) హల్లులును పరమగుచో గ, జ, డ, ద, బ, లు క్రమముగా నగును.

వాక్+ఈశుడు=వాగీశుడు; అచ్+అంతము=అజంతము; రాట్ + గణము రాడ్గణము; కకుప్+అంతము=కకుబంతము.

అట్లు వచ్చిన ద, కారమునకు జ, ఝ, వర్ణములు పరమగు నేని, జ, కారము వచ్చును. తత్ (తద్) జాతి=తజ్జాతి;
తత్ (తద్) ఝరము=తజ్ఝరము.

తకారమునకు లకారము పరమగు నేని లకారము వచ్చును. (పరరూపసంధి)

తత్+లయము=తల్లయము; సత్+లలితము=సల్లలితము.

7. అనునాసిక సంధి:— గ, జ, డ, ద, బ లకు న, మ (అనునాసికవర్ణములు) పరమగు నేని ఙ, ఞ, ణ, న, మ లు క్రమముగా వికల్పముగా వచ్చును.

వాగ్+నైపుణ్యము=వాఙ్నైపుణ్యము; వాగ్నైపుణ్యము; వాగ్+మాధుర్యము=వాఙ్మాధుర్యము, వాగ్మాధుర్యము, జగద్+నాథుడు = జగన్నాథుడు; జగద్నాథుడు;

గ, జ, డ, ద, బ, వర్ణములకు మయము మాత్రము మొదలగు మకారాది ప్రత్యయములు పరమగు నేని క్రమముగా నిత్యముగా ఙ, ఞ, ణ, న, మ వర్ణము అగును.

వాగ్+మాత్రము=వాఙ్మాత్రము; చిద్+మయము = చిన్మయము ఈషద్+మాత్రము=ఈషన్మాత్రము;

తకారమునకు చ, ఛ, శ, వర్ణములు పరమగుచో చవర్ణము వచ్చును. మరుత్+చలనము=మరుచ్చలనము; అసత్+శాంతి=అసచ్ఛాంతి, తత్+శబ్దము=తచ్ఛబ్దము;

8. శ్చుత్వసంధి:—స, త, థ, ద, ధ, న అనువానికి శ, చ, ఛ, జ, ఝ, ఞ అనునవి పరము అగునపుడు వరుసగా నవియే ఆదేశము అగును. మనస్+శాంతి=మనశ్శాంతి; తటిత్+చంచలము = తటిచ్చంచలము; తత్+జలము=తజ్జలము; సత్+జనులు=సజ్జనులు.

9. ష్టుత్వసంధి :—స, త, థ, ద, ధ, న అనువానికి ష, ట, ఠ, డ, ఢ, ణ లతో సంయోగము కలిగినచో షకార, టవర్గములు క్రమముగా నగును. మనస్ + షట్పదము, మనష్షట్పదము అయస్ + టంకము=అయష్టంకము; తత్+టీకా=తట్టీకా;

10. తుగాగమసంధి :—

యజన+ఛాగము=యజనచ్ఛాగము; వృక్ష+ఛాయ=వృక్షచ్ఛాయ.

## ముఖ్యమగు తెనుఁగు సంధులు

పూర్వపరస్వరంబులకు పరస్వరం బేకాదేశం బగుట సంధి యనం బడును.

అకారసంధి :—

1. అత్తునకు అచ్చుపరంబగునపుడు సంధి బహుళము.

బహుళ మనగా నిత్యము, నిషేధము, వైకల్పికము, అన్యవిధ మని నాల్గు భేదములం గలది. (నిత్య మనగా సంధి యెల్లప్పుడు కలిసి యేయుండుట. నిషేధమనగా కలియకుండుట. వైకల్పిక మనగా కలిసి యొక రూపము, కలియక యొక రూపము. అన్యవిధ మనగా మరి యొక విధముగా నుండుట. బహుళ మని ప్రత్యేకముగా చెప్పినచో కొన్నిచోట్ల నిత్యముగాను, కొన్నిచోట్ల వికృతముగాను, కొన్నిచోట్ల మరియొకవిధముగా నుండుట. విభాష యనగా కొన్నిపదముల కొకా నొక సూత్ర మన్వయించి కొన్ని పదముల కన్వయింపకుండుట).

(a) సంధి లేనిచోట స్వరంబుకంటె పరంబైన స్వరంబునకు యడాగమంబగు. ఆగమం బనగా వర్ణాధిక్యంబు. మేన+అల్లుడు = మేనల్లుడు, మేనయల్లుడు; బహుళ మనుటచే స్త్రీవాచకతత్సమసంబోధ నావధారణంబులకు సంధిలేదు.

స్త్రీవాచకము – అమ్మ+ఇచ్చెను=అమ్మ యిచ్చెను.

తత్సమము – దూత+ఇతడు=దూత యితడు.

సంబోధనము – చెలువుడ+ఇదిగో=చెలువుడ యిదిగో.

అవధారణము – నీవు+అ+ఏగుము=నీవ యేగుము.

(b) నామముల చివరగల అకారమునకు అన్నాదులు, అవు, అంత, ఏసి, పరమగునపుడు సంధి నిత్యము. ఉదా:— రామన్న, చింతావు, అంతేసి.

(c) తామర శబ్దమునకు ఆకు శబ్దము పరంబగునపుడు పుగా గమము వైకల్పికము. ఉదా:—తామరాకు, తామరపాకు.

(d) దీర్ఘాచ్చులకు సంధిలేదు. ఉదా:— నీ + ఆదరము=నీ యాదరము;

2. ఇకార సంధి:—

(a) మధ్యమపురుషక్రియలందలి ఇకారమునకు సంధినిత్యము. ఏలితివి+అపుడు=ఏలితివపుడు;

(b) ప్రథమోత్తమ పురుష బహువచనక్రియల ఇకారమునకు సంధి వైకల్పికము. ఉదా:— వచ్చిరి + ఎల్లరు = వచ్చిరెల్లరు, వచ్చిరి యెల్లరు.

(c) ఏమ్యాదుల ఇకారమునకు సంధి వైకల్పికముగా నగు. (ఏమి, మఱి, కి షష్ఠి; అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి- ఇది యాకృతిగణంబు) ఏమి+అంటివి = ఏమంటివి; ఏమియంటివి; హరికిన్ + ఇచ్చె=హరికిచ్చె; హరికి నిచ్చె.

(d) క్రియాపదంబులందలి ఇకారమునకు (ప్రథమోత్తమ క్రియల) సంధి వైకల్పికముగానగు;

వచ్చిరి+అప్పుడు=వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు.

వచ్చితిమి+ఇప్పుడు=వచ్చితి మిప్పుడు; వచ్చితిమి యిప్పుడు.

(e) క్త్వార్థ ఇకారమునకు సంధిలేదు.

వచ్చి+ఇచ్చెను=వచ్చి యిచ్చెను.

(f) ఇకాదులకు తప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు. (ఇంక ఇంగ, ఎట్టకేలకు; ఎట్టకేని—ఇవి ఇకాదులు. వీనికి సంధి వైకల్పికము) వచ్చున్ + ఇప్పుడు = వచ్చునిపుడు; చూడన్+అయితి = చూడనయితి.

(g) ఎడు పరమగునపుడు దోసిలి మొదలగువాని తుదివర్ణమునకు లోపము నిత్యము. (దోసిలి, పిడికిలి, గుప్పిలి మొదలైనవి)

3. ఉకారసంధి :—

(a) ఉత్తునకు అచ్చుపరం బగునపుడు సంధినిత్యము.

రాముడు+అతడు రాము డతడు.

(b) ప్రథమేతరవిభక్తి శత్రర్థక చువర్ణంబులం దున్న ఉకారము నకు సంధి వైకల్పికముగానగు.

నాకొఱకున్+ఇచ్చెన్=నాకొఱ కిచ్చెన్; నాకొఱకు నిచ్చెన్.

నాకున్+ఆదరువు=నాకాదరువు; నాకు నాదరువు.

నాయందున్+ఆశ=నాయందాశ; నాయందు నాశ.

చూచుచున్+ఏగెను=చూచుచేగెను; చూచుచు నేగెను.

(c) అచ్చులకు ఏసి పరమగునపుడు సంధినిత్యము.

మూరెడు+ఏసి=మూరెడేసి.

(d) అచ్చున కామ్రేడితము పరంబగునిపుడు సంధి తఱచుగానగు. (ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనబడును)

ఔర+ఔర=ఔరౌర; ఓహో+ఓహో=ఓహోహో.

(e) అంద్వవాగమంబులం దప్ప అపదాది స్వరంబు పరంబగు నపుడు అచ్చునకు సంధియగు.

మూర+ఎడు=మూరెడు.

4. గ స డ ద వాదేశసంధి:—

(a) ప్రథమమీది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగు. వాడు+కొట్టెను=వాడు గొట్టెను.

(b) తెలుఁగులమీది సాంస్కృతికపరుషములకు గ స డ ద వ లు రావు. వాడు+కంసారి=వాడు కంసారి.

(c) ఈ కార్యము కళలగు క్రియాపదములమీద సయితము కానం బడియెడిని. రారు+కదా=రారుగదా.

(d) ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గ స డ ద వ లగు. కూర+కాయలు=కూరగాయలు.

5. త్రికసంధి:—

ఆ, ఈ, ఏ, లు త్రికంబు నాబడు.

త్రికంబుమీది ఊష్మరేఫేతరఅసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు=ఆ+కన్య=అక్కన్య.

ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు అచ్చికంబగు షష్ఠి యగు
హ్రస్వంబగు=అక్క-న్య.

6. సరళాదేశసంధి :—

(a) ద్రుతప్రకృతికముమీది పరుషములకు సరళములగు.

పూచెను+కలువలు=పూచెను గలువలు.

(b) ఆదేశసరళములకు ముందుండు ద్రుతమునకు బిందుస్వత్వ
సంశ్లేషలు విభాషగానగు.

పూచెంగలువలు (బిందురూపము)

పూచెను గలువలు (స్వత్వరూపము)

పూచెఁ గలువలు (అరసున్న రూపము)

పూచెన్గలువలు (సంశ్లేషరూపము)

7. ద్రుతసంధి :—

(a) ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబగునపుడు లోపసంశ్లేష
ములు విభాషనగు. వచ్చెను+గోవులు=వచ్చెగోవులు (లోపము) వచ్చె
న్గోవులు (సంశ్లేషము) వచ్చెను గోవులు (స్వత్వము) వచ్చెం గోవులు
(బిందు) మెఱసెఖడ్గము; మెఱసె న్గడ్గము; మెఱసెను ఖడ్గము; మెఱసెం
ఖడ్గము.

(b) వర్గయుక్సరళములు పరములగునపుడు ఒకానొకచో ద్రుతము
నకు పూర్ణబిందువులు కానంబడియెడి. (వర్గయుక్కు అనగా ప్రతివర్గ
లోని రెండవ, నాల్గవ యక్షరములు—ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ,
ధ, ఫ, భ—ఇవి)

వచ్చెను+ధాత్రీపతి=వచ్చెం ధాత్రీపతి (వర్గయుక్కు.)

పాడెను+గంధర్వుడు=పాడెంగంధర్వుడు (సరళము)

(c) అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని
లోపంబు బహుళంబుగానగు—వాడు వచ్చెన్=వాడు వచ్చె.

(d) కొన్నియెడల ద్రుతంబుమీద నకారంబు గానంబడియెడి.

ఉదా:—అడియనుంగాక.

8. పుంప్వాదేశసంధి:—

కర్మధారయమందు మువర్ణమునకు పుంపులగు.

ఉదా:—సరసము+మాట=సరసపుమాట; సరసంపుమాట.

9. టుగాగమసంధి:—

(a) కర్మధారయములందు ఉకారమునకు అచ్చు పరంబగునపుడు టుగాగమంబగు. ఉదా:—కఱకు+అమ్ము=కఱకుటమ్ము.

(b) కర్మధారయమందు పేర్వాదిశబ్దములకు అచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు (పేర్వాదులు—పేరు, పొదరు, చిగురు మొదలగునవి) పేరు+ఉరము=పేరురము, పేరుటురము; పొదరు+ఇల్లు=పొదరిల్లు; పొదరుటిల్లు; చిగురు+ఆకు=చిగురాకు; చిగురుటాకు.

(c) కర్మధారయేతరములందును టుగాగమంబు కన్పట్టెడిని.

వెలుపు+ఏఱు=వెల్పుటేఱు; వెల్పు+అవు=వెల్పుటావు; (ఉకారాంతము కాకున్నను టుగాగమంబు—తేనెటీగ; దుక్కిటెద్దు)

10. దుగాగమసంధి:—

యుష్మదస్మదాత్మార్థంబులకు ఉత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభావనగు—నీ+దయ=నీదుదయ; నీదయ.

11. రుగాగమసంధి:—

(a) పేదాదిశబ్దములకు ఆలుశబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు (పేదాదులు:—పేద, బీద, ముద్ద, బాలెంత, కొమ, జవ, అయిదువ, మనుమ, గొడ్డు మొదలైనవి)

పేద+ఆలు=పేదరాలు.

(b) కర్మధారయమునందు తత్సమ శబ్దములకు ఆలు శబ్దము పరంబగునపుడు రుగాగమంబును అత్వంబునకు ఈత్వంబునగు.

ధీర+ఆలు=ధీరురాలు.

12. నుగాగమసంధి:—

(a) షష్ఠీసమాసమందు ఉకార ఋకారములకు అచ్చు పరంబగునపుడు నుగాగమంబగు—రాజు+ఆజ్ఞ=రాజునాజ్ఞ; విధాతృ+ఆనతి=విధాతృనానతి.

(b) ఉదంత తద్ధర్మార్థక విశేషణమునకు అచ్చు పరంబగునపుడు నుగాగమంబగు- చేయు+అతడు=చేయునతడు.

(c) సమాసంబుల ఉదంత స్త్రీసమంబులకు పుంపులకు పరుష సరళంబులు పరంబగునపుడు నుగాగమంబగు. (ప్రథమావిభక్తి ప్రత్యయములు లేకయే ప్రథమావిభక్తులగు శబ్దములకు స్త్రీసమము అని పేరు.) మంచు+న్+కొండ; మంచు+న్+గొండ; మంచుంగొండ.

(d) ఉదంత స్త్రీసమంబులకు, పుంపులకు, అదంతగుణవాచకంబులకు తనంబు పరంబగునపుడు నుగాగమంబగు.

సొగసు+తనము=సొగసుందనము; చక్క + తనము = చక్కందనము.

13. ప్రాఁతాదిసంధి:—

(a) సమాసంబున ప్రాఁతాదుల తొలియచ్చుమీది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు.

లేఁత+దూడ=లేదూడ.

(b) లుప్తశేషమునకు పరుషములు పరంబగునపుడు నుగాగమంబగు. ప్రాఁత+కెంపు=ప్రా+కెంపు; ప్రా+న్+కెంపు; ప్రాఁగెంపు.

(c) క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషమునకు కొన్నియెడల నుగాగమంబును కొన్నియెడల మీదిహల్లునకు ద్విత్వము నగు.

క్రొత్త+చాయ=క్రొంజాయ; క్రొత్త=కారు+క్రొక్కారు.

పరుషేతరములు పరంబగునపుడు నుగాగమప్రాప్తిలేమింజేసి వానికి ద్విత్వమగు. క్రొత్త+గండి=క్రొగ్గండి; క్రొత్త+మావి=క్రొమ్మావి.

14. ఆమ్రేడిత సంధి:—

(a) ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులందు తొలిఅచ్చు మీది వర్ణంబులకెల్ల అదంతంబగు ద్విరుక్తటకారంబగు. (కడాదులు; కడ, ఎదురు, కొన, చివర, తుద, తెన్ను, తెరువు, నడుము, పగలు, పిడుగు, బయలు మొదలగునవి)

కడ+కడ=కట్టకడ; బయలు+బయలు=బట్టబయలు;

(b) ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు. అప్పటికిన్+అప్పటికిన్=అప్పటప్పటికిన్; అప్పటికప్పటికిన్ బహుళగ్రహణముచేత ఇంచుక, నాడు ఇత్యాదుల అంతిమాక్షరమునకు లోపంబగు—ఇంచుక+ఇంచుక=ఇంచించుక, ఇంచుకించుక; నాడు + నాడు=నానాడు; నాఁడునాఁడు.

(c) ఆమ్రేడితము పరం బగునపుడు మధ్యమ 'ము, డు' లకు లోపంబు విభాషనగు—ఉదా:—ఉండును+ఉండుము=ఉండుండుము; ఉండుముండుము;

15. విశేషసంధులు:—

(a) కర్మధారయంబున తెలుచుగ పెన్వాదులకడ హల్లునకు అచ్చు పరంబగునపుడు ద్విత్వంబు కన్పట్టుచున్నది.

పెను+ఊత==పెన్నూత; పెను+ఉరము=పెన్నురము.

(b) ప్రాతాదులకును, క్రొత్తాదులకును గాక తక్కిన కొన్ని శబ్దములకు కూడ లోప, నుగాగమ, ద్విత్వంబులు ప్రయోగములందు కన్పడుచున్నవి.

నెఱ+చెలి=నెచ్చెలి; నిండు+వెఱ=నివ్వెఱ; సగము + కోరు= సంగోరు; తొమ్మిది+పది=తొంబది.

(c) వ్యతిరేక మధ్యమ ముపర్ణమునకెల్లయెడల లోపంబు విభాషనగు. నమ్మకుము+ఇక=నమ్మకిక; నమ్మకుమిక.

(d) విసర్గంబునకు అనుకరణంబున లోపంబగు.

వర్ధతాం+శ్రీః+అనియె=వర్ధతాంశ్రీయనియె.

## సమాస ప్రకరణము

వేర్వే ర్వర్థములుగల కొన్ని పదములు కలిసి యొక్కపదమగుట సమాస మనబడును. సమాసమున రెండు గాని అంతకుమించి కాని పదము లుండవచ్చును. సమాసమునకు వృత్తియనియు పేరు. సమాస

మున మొదటి పదమునకు పూర్వపద మనియు, రెండవపదమున ఉత్తరపదమనియు వ్యవహారము.

సమాసమునందలి పదములకు లోపించిన విభక్తి ప్రత్యయములఁ చేర్చి సమాసమునకు అర్థము చెప్పుట విగ్రహవాక్య మనబడును.

రామబాణము (సమాసము) రామునియొక్క బాణము (విగ్రహ వాక్యము)

సాంస్కృతికసమాసములు, ఆచ్ఛికసమాసములు, మిశ్రసమాసములని సమాసములు మూడు విధములు.

సాంస్కృతిక సమాసములు తిరిగి సిద్ధములు, సాధ్యములని రెండు విధములు.

కేవలసంస్కృతశబ్దముల సమాసము సిద్ధము. ఉదా:—పద్మనాభుఁడు. తత్సమంబుల సమాసము సాధ్యము-ఉదా:—రాజాజ్ఞ.

కేవలము తెనుగుపదముల సమాసము ఆచ్ఛికము-ఉదా:—సిరిమగఁడు. తత్సమాచ్ఛికములయు, ఆచ్ఛిక తత్సమములయు సమాసము మిశ్రమము. ఉదా:—సింహపుఁబిల్ల ; బడిబాలురు.

అర్థభేదముచే సమాసము నాల్గువిధములు:—1. అవ్యయీభావము 2. తత్పురుష 3. బహువ్రీహి 4. ద్వంద్వము.

పూర్వపదార్థప్రధానము తత్పురుష-ఉదా:—ఆవుపాలు.

తత్పురుషము వ్యధికరణము, సమానాధికరణము అని రెండు విధములు.

సమాసగతశబ్దముల ధర్మములు భిన్నాశ్రయంబు లగుట వ్యధికరణ మనఁబడును. ఉదా:—మాటనేర్పరి.

సమాసగతశబ్దములధర్మములు ఏకాశ్రయములగుట సమానాధికరణ మనబడును. ఉదా:—నల్లకలువ.

ప్రథమాతత్పురుష- ఏకదేశిసమాసము-, ఉదా:—మాసజాతుడు. ద్వితీయాదివిభక్త్యంతశబ్దములమీఁది పదములతో సమసించుట వ్యధికరణము. ఇట్లు సమసించినప్పుడు వీని నాయావిభక్తి తత్పురుషము లందురు.

| సంజ్ఞ | ఉదాహరణము | విగ్రహవాక్యము |
|---|---|---|
| ద్వితీయాతత్పురుషము | నెలతాల్పు | నెలను ధరించినవాడు |
| తృతీయాతత్పురుషము | రాజపూజితుడు | రాజుచే పూజితుడు |
| చతుర్థీతత్పురుషము | యజ్ఞాశ్వము | యజ్ఞముకొఱ కశ్వము |
| పంచమీతత్పురుషము | పాపభీతి | పాపమువలన భీతి |
| షష్ఠీతత్పురుషము | రామబాణము | రామునియొక్క బాణము |
| సప్తమీతత్పురుషము | యుద్ధకుశలుడు | యుద్ధమందు కుశలుడు |
| నఞ్ తత్పురుషము | అజ్ఞానము | జ్ఞానము లేనిది |

విశేషణ విశేష్యముల సమాసము కర్మధారయము.

1. విశేషణ పూర్వపదకర్మధారయము–ఉదా:—నీలోత్పలము
2. విశేషణోత్తరపద కర్మధారయము (లేక) విశేష్యపూర్వపద కర్మధారయము– ఉదా:—కపోతవృద్ధము
3. విశేషణోభయపద కర్మధారయము–ఉదా:—శీతోష్ణము
4. ఉపమానపూర్వపదకర్మధారయము–ఉదా:—చిగురుకేలు
5. ఉపమానోత్తరపద కర్మధారయము– ఉదా:—చరణకమలము.
6. సంభావనపూర్వపదకర్మధారయము–ఉదా:—వింధ్యాటవి
7. అవధారణపూర్వపద కర్మధారయము– ఉదా:—కోపాగ్ని (దీనికే రూపక సమాసమనియు నామాంతరము)
8. మధ్యమపదలోపికర్మధారయము– ఉదా:—శాకపార్థివుడు

సంఖ్యావాచకము పూర్వమందు గల్గి ఉత్తరపదముయొక్క అర్థము ప్రధానముగాగల సమాసము ద్విగువు. ఉదా:—ముజ్జగములు.

అన్యపదార్థప్రధానము బహువ్రీహి–ఉదా:—చక్రపాణి.

సమాసము మొదట 'స' కాని 'సహ' కాని యున్నప్పుడు సహపూర్వపదబహువ్రీహి–ఉదా:—సపుత్రుడు, సహామాత్యుడు.

ఉభయపదార్థప్రధానము ద్వంద్వము– ఉదా:—పార్వతీ పరమేశ్వరులు.

విభక్తులు లోపించిన సమాసములను లుక్సమాసము అందురు.
ఉదా:—నెలతక్కువవాడు.

విభక్తులు లోపింపని సమాసములను అలుక్సమాసము అందురు.
ఉదా:—కంఠేకాలుడు; నీతోడి చెలిమి.

## ఛందస్సు

యతి, గణ, ప్రాసములతో కూడిన పద్యముల లక్షణములను గూర్చి చెప్పు శాస్త్రమునకు ఛందశ్శాస్త్ర మని పేరు. గణములయొక్క కలయికచే పద్యము లేర్పడును. గురులఘువులకలయికవలన గణము లేర్పడును. ఒక్కమాత్ర కాలములో ఉచ్చరింపబడు వర్ణములు హ్రస్వములు లఘువులు. రెండు మాత్రలకాలములో ఉచ్చరింపబడు వర్ణములు దీర్ఘములు గురువులు. గురువునకు 'గ' అనియు, లఘువునకు 'ల' అనియు సంజ్ఞలు. । ఇది లఘువునకు గుర్తు. ౮ ఇది గురువునకు గుర్తు.

హ్రస్వాచ్చులు వానితో కూడిన హల్లులు లఘువులు.
ఉదా:—అ, ఇ, ఉ, ఋ, ఎ, ఒ, కి, కృ, కె.

1. దీర్ఘాక్షరము లన్నియును గురువులు- ఉదా—ఆ, ఈ, ౠ, కౄ, కై.

2. సంయుక్తాక్షర ద్విత్వాక్షర పూర్వమందున్న లఘువులు గురువు లగును.

ఉదా:— విప్ర; అక్క (౮ । ౮ ।)

3. బిందువుతో కూడినవి-ఉదా:—అంకము; తన్వంగి (౮ । । ౮ ౮ ।)

4. విసర్గముతో కూడినవి-ఉదా:—దుఃఖము. (౮ । ।)

5. హల్లులు పొల్లుతో కూడినవి-ఉదా:—తత్, విన్, త్వక్ (౮ ౮ ౮)

N B:— అద్రుచు, విద్రుచు, కద్రువ చిద్రుపలు, పద్రుచు, ఎద్రుచు మొదలగు పదములందు మాత్రము సంయుక్తాక్షరమునకు ముందుండు లఘువు గురువుకాదు.

2. ృ కారమునకు పూర్వమందున్నవి లఘువులే కాని గురువులు కావు. ఉదా:—విజృంభించు-వి. లఘువే కాని గురువు కాదు.

ప్రకృతి- కృ. కి పూర్వమందున్న, ప్ర లఘువే కాని గురువు గాదు,

3. సమాసమునందే కాని అసమాసములో సంయుక్తాక్షర పూర్వాక్షరములు లఘువులే కాని గురువులుకావు. ఉదా:— రాజ్యశ్రీ శ్రీకి పూర్వమందున 'జ్య' గురువు. రాజ్యము శ్రీయును- ఇది అసమాసము. శ్రీకి పూర్వమందున్న 'ము' లఘువువే కాని గురువు కాదు.

నిసర్గగణములు, ఉపగణములు అని గణములు రెండు రకములు. మూడక్షరగణములు నిసర్గ గణములు. రెండక్షరగణములు నాలుగు.

| | |
|---|---|
| I I = లత-లలము | I U = లతా-లగము (వగణము) |
| U I = రామ-గలము (హగణము) | U U రామా - గగము. |

మూడక్షర గణములు 8

కం. గురువులు మూడిడ మగణము। పరగంగా ఆదిగురువు భగణం
బయ్యెన్.
ధర మధ్య గురువు జగణము। సరసగుణా। అంత్యగురువు
సగణం బయ్యెన్.

కం. నగణంబు మూడు లఘువులు। యగణంబున కాది లఘువు
యమతనయనిభా!
రగణంబు మధ్య లఘువగు। తగణంబున కంత్య లఘువు
దాక్షిణ్యనిధీ!

శ్రీరామా U U U మగణము- రాముడు U I I భగణము
ముకుంద I U I జగణము- వరదా I I U సగణము
వరద I I I నగణము- మురారీ I U U యగణము
మాధవా U I U రగణము- దైత్యారి U U I తగణము

స్వాల్పాక్షరముల గణములు:—

కం. నగణముపయి గురువున్నన్ । నగమగు, లఘువున్న యెడల నల
మగు వరుసన్
సగణముపయి లఘువున్నన్ । తగసలమగు కంజమిత్ర సుధాకర
నయనా !

గురువరా I I I U నగము: కమలము I I I I నలము; వనజాక్షి
I I U I సలము

ఇంద్రగణములు, సూర్యగణములు, చంద్రగణములు - ఈ మూడును ఉపగణములు.

కం. నల, సగ, సల, భ, ర, తలు నా । నెలమిని నీయారు గణము
లింద్రగణంబుల్
గల, నగణములీ రెండును । జలజాప్తగణంబులయ్యె జగదాధారా ?

ఇంద్రగణములు 6. నలము, నగము, సలము, భగణము, రగణము తగణము.

సూర్యగణములు 2. నగణము, గలము.

చంద్ర గణములు 14. నగగ, నహ, సలల, భల, భగురు, మలఘు, సవ, సహ, తల, రల, నవ, నలల, రగ, తగ గణములు.

పద్యములకు యతిప్రాసములు ముఖ్యములు. పద్యపాదముయొక్క మొదటియక్షరమునకు యతి అని పేరు. దీనికే విరతి; విశ్రాంతి, విశ్రమము, విరామము; విశ్రామము, వడి, వళి మొదలైనవి పేరులు గలవు. ప్రతి పద్యములోను ప్రతిపాదమునందు మొదటి యక్షరమునకు ఆయా పద్యములందు లక్షణము నిర్ణీతమైన స్థానమునందు వేసికొను మిత్రవర్ణములో సంబంధముండును. అట్టిటికే యతిస్థానము (లేక) విశ్రాంతిస్థాన

మనియు పేరు. ప్రతిపద్యమునందు సాధారణముగా నాలుగు పాదము లుండును. ప్రతిపాదమున రెండవ అక్షరము ప్రాసమని పేరు. ప్రాసాక్షరములకు ముందక్షరములు సర్వత్ర గురువులైన గురువులు, లఘువులైన లఘువులు, బిందుయుతములైన బిందుయుతములుగా నుండవలెను. ప్రాసమునకు హల్మైత్రి ముఖ్యము గాని స్వరమైత్రి ముఖ్యముకాదు.

యతిమైత్రి :—

1. అ, ఆ, ఐ, ఔ
2. ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ
3. ఉ, ఊ, ఒ, ఓ

ఇవి తమలో తాము మిత్రములు. హ, య, అ స్వరసామ్యమును పొంది పై స్వరములకన్నిటికిని మిత్రము లగుచు పరస్పరమైత్రిని పొందును.

రేఫము స్వరసామ్యమును గల్గి ఋ, ౠ లకును, వానితోడి అన్ని హల్లులకును మిత్రము లగును. ఋ, ౠలతో కూడిన హల్లులు తమలో తాము మైత్రిగలవి యగుచు ఋ, ౠలతోడను వానిమిత్రములతోడను మైత్రి గల్గియుండును. సంస్కృతసంధిలో ఆదేశముగా వచ్చెడి ఐకారమునకు, ఏకారములును, అట్టి ఔకారమునకు ఓకారాదులును మిత్రము లగును.

| | |
|---|---|
| క, ఖ, గ, ఘ, క్ష | ఇవి పరస్పర మిత్రములు |
| చ, ఛ, జ, ఝ, శ, ష, స, క్ష | |
| ట, ఠ, డ, ఢ | |
| త, థ, ద, ధ | |
| ప, ఫ, బ, భ, వ | |
| ర, ఱ, ఌ | |
| ల, ళ, డ | |
| ఙ, న, ణ | |
| అ, హా, య, ౡ | |

పూర్ణబిందుపూర్వకములగు ట, ఠ, డ, ఢ, త, థ, ద, ధ లును క, ఖ, గ, ఘ లును, చ, ఛ, జ, ఝ లును పూర్ణ బిందుపూర్వకములై వరుసగా ణ, ఞ, మ లతో మిత్రము లగును.

పు, ఫు, బు, భు, ము లు పరస్పర మిత్రములు.

యతిస్థానమున సంయుక్తవర్ణము వచ్చెనేని అందలి వర్ణములలో దేనికైనను యతి వేసికొనవచ్చును.

వృత్తములు, జాతులు, ఉపజాతులని పద్యములు మూడు రకములు. నిసర్గగణములతో నేర్పడునవి వృత్తములు. కందపద్యము మొదలైన వానికి జాతులని పేరు, తేటగీతి, ఆటవెలది మొదలగువానికి ఉపజాతులని పేరు.

పద్యలక్షణములు :—

ఉ. భానుసమాన ! విన్ భ,ర,న,భా,ర,లగంబులఁ గూడి విశ్రమ
స్థానమునందు పద్మజయుతంబుగ నుత్పలమాలయై చనున్.

చ. న,జ,భ,జ, జజ్జరేఫలపెనంగి దశాయతితోడఁ గూడినన్
త్రిజగదభీష్టదా ! బుధనిధీ ! విను చంపకమాలయై తగున్.

శా. సారాచారవిశారదా ! ఇనయతిన్ శార్దూలవిక్రీడితా
కారంబై మ,స,జస్సలిత్సగ పతాగప్రాప్తమై చెల్వగున్.

మ. స్మరయదూరా ! విలసత్త్రయోదశయతిన్ మత్తేభవిక్రీడితా
హ్వాయమయ్యెన్ స,భ, రమ్ములన్ న, మ, య, వ, వ్రాతంబులం
గూడగన్.

మత్త :—సత్తయౌ ర,స,జా,భ, రల్ భవసంఖ్య విశ్రమ మొప్పినన్
కోకిల వృత్తమా నసమానరంగ నృపాలకా !

| గణములు— | | యతిస్థానములు— |
|---|---|---|
| ఉత్పలమాల— | భ,ర,న,భ,భ,ర, లగము | 10 వ అక్షరము |
| చంపకమాల— | న,జ,భ,జ,జ,జ,ర | 11 వ అక్షరము |
| శార్దూలము— | మ,స,జ,స,త,త,గురువు | 13 వ అక్షరము |
| మత్తేభము— | స,భ,ర,న,మ,య,వ | 14 వ అక్షరము |
| మత్తకోకిల— | ర,స,జ,జ,భ,ర | 11 వ అక్షరము |

ఉదాహరణములు:—

| ఉ. శారద | సేనగా | ఛత్రిజ | గంబులు | నొక్కట | నెత్తివ | చ్చినం |
|---|---|---|---|---|---|---|
| U I I | U I U | I I I | U I I | U I I | U I U | I U |
| భ | ర | న | భ | భ | ర | లగ |

| చ. రయమవి | చలత్తు | రంగమ | తరంగ | ములన్మ | దసాగ | నక్రసం |
|---|---|---|---|---|---|---|
| I I I | I U I | U I I | I U I | I U I | I U I | U I U |
| న | జ | భ | జ | జ | జ | ర |

| శా. లావొక్కిం | తయులే | దుధైర్య | మువిలో | లంబయ్యె | ప్రాణంబు | లున్ |
|---|---|---|---|---|---|---|
| U U U | I I U | I U I | I I U | U U I | U U I | U |
| మ | స | జ | స | త | త | గ |

| మ. పరిభూ | తాంబర | శుక్రమున్ | బహువి | ధబ్రహ్మాం | డభాండ | చ్ఛటాం |
|---|---|---|---|---|---|---|
| I I U | U I I | U I U | I I I | U U U | I U U | I U |
| స | భ | ర | న | మ | య | వ. |

తేటగీతి పద్యలక్షణము

సూర్యు డొక్క రుండు సురరాజు లిద్దఱు । దినకరద్వయంబు తేటగీతి. 1 సూర్య. 2 ఇంద్ర. 2 సూర్య- ప్రతిపాదమునకు నుండవలెను ప్రతిపాదమందు నాల్గవగణము మొదటి యక్షరమునకు యతి చెల్లును దీనికి ప్రాసయతి కూడ చెల్లును. ప్రాసనియమము లేదు.

| | | | | |
|---|---|---|---|---|
| అర్జు | సునకు ఖాం | డవదహ | నాదు | లైన |
| U I | I I I U | I I I I | U I | I I |
| గల | నగ | నల | గల | గన |

ఆటవెలది పద్యలక్షణము :—

ఇనగణత్రయంబు నింద్రద్వయంబును । హంస పంచకంబు ఆటవెలది. ఆటవెలదికి మొదటిపాదములో మొదటి 3 సూర్య. పిదప 2 ఇంద్రగణము లుండవలెను. రెండవపాదములో 5 సూర్యగణము లుండవలెను. మూడవపాదము మొదటి పాదమువలెను 4వ పాదము రెండవ పాదమువలెను ఉండవలెను. ప్రతిపాదమందును 4వ గణము మొదటి యక్షరమునకు యతి చెల్లును. ప్రాసయతి కూడ చెల్లును. ప్రాస నియమము లేదు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పూజ | నీయుం | లైన | పురుషుల | లోపల | నెవ్వ | డయ్యె |
| U I | U I | U I | I I I I | U I I | U I | U I |
| గల | గల | గల | నల | భ | గల | గల |

| | | |
|---|---|---|
| కృష్ణు | డిట్టు | లేల |
| U I | U I | U I |
| గల | గల | గల |

సీసపద్యలక్షణము :—

ఇంద్రగణము లాఱు ఇనగణంబులు రెండు పాద పాదమునకు పరగుచుండు,

ఆట వెలఁదియైన తేటగీతియైన చెప్పఁదలయు పైని సీసమునకు.

సీస పద్యమునకు ప్రతిపాదమునందు 6 ఇంద్రగణములు 2 సూర్య గణము లుండవలెను. ప్రతిపాదమునందు మొదటి గణము మొదటి యక్షరమునకు, మూడవ గణము మొదటి యక్షరమునకును, 5 వ గణము మొదటి యక్షరమునకు 7 వ గణము మొదటి యక్షరమునకు యతి చెల్లును. అనగా పాదమునకు రెండేసి యతిస్థానములు. అట్లు నాల్గుపాదముల అనంతరము ఆటవెలది పద్యముగాని, తేటగీతి పద్యముగాని వ్రాయవలయును. దీనికి ప్రాసయతికూడ చెల్లును. ప్రాసనియమము లేదు.

| బుద్ధిజుం | డనివిచా | రించిపూ | జించితే |
|---|---|---|---|
| – | | – | |
| U I U | I I I U | U I U | U I U |
| ర | నగ | ర | ర |

| ద్వైపాయ | నుఁడుండ | ధర్మ | యుక్తి |
|---|---|---|---|
| U U I | U I U | I I | U I |
| త | ర | నగణ | గల |

కందపద్య లక్షణము :—

కం. కందము త్రిశరగణంబుల, నందము గా, భ, జ, స, నలములట వడి మూటన్
పొందును నల, జల, నాటిటనొం, దుం దుద గురువు జగణముం డదు బేసిన్.

ఇందు మొదటిపాదమునకు 3 గణములు రెండవ పాదమునకు 5 గణములుండును. అవి గగము, భ, జ, స, నలములలోనివై యుండవలయును. మొదటిపాదమువలె మూడవపాదము రెండవపాదమువలె నాల్గవపాద ముండవలెను. మొదటి పాదమునందు మూడవ పాదమునందు యతి లేదు. రెండు, నాల్గు పాదములయందే 4 వ గణము మొదటి యక్షరము యతి స్థానము ప్రాసము మాత్రము నాల్గు పాదములందు నుండవలెను. ప్రాసయతి చెల్లదు. 2, 4 పాదాల చివర గురువే యుండవలెను.

రెండవపాదములోని 3 వ గణము 4 వ పాదములో 3 వ గణము నలముగాని జగణముగాని యుండవలెను (అనగా 6 వ గణము) బేసి సంఖ్య గణములలో జగణ ముండరాదు.

| ధరణికి | లంఘిం | చి వెసం |
|---|---|---|
| – | | |
| I I I I | U U | U I I |
| నల | గ గ | భ |

| బురిదెస | కనుల | జపీటిఁ | బోవం | బాలెన్ |
|---|---|---|---|---|
| – – | | | – | |
| I I I I | I I U | I U I | U U | U U |
| నల | స | జ | గ గ | గ గ |

మత్తకోకిల కుదాహరణము :—

| వేదురెం | తయుంగ | ష్టమైన | ను వేలు | లేని సు | హృజ్జనున్ |
|---|---|---|---|---|---|
| – | | | – | | |
| U I U | I I U | I U I | I U I | U I I | U I U |
| ర | స | జ | జ | భ | ర |

ద్విపద లక్షణము :—

ప్రతి పాదమునందును 3 ఇంద్రగణములు 1 సూర్యగణము ఉండవలెను. 3వ గణము మొదటి యక్షరమునకు యతి చెల్లును. రెండేసిపాదముల కొక్కొక్క ప్రాస యుండవలయును.

| గర్వించి | తను నెత్తఁ | గడగిరే | లెంచు |
|---|---|---|---|
| U U I | I I U I | I I I U | U I |
| త | సల | నగ | గల |

| సుర్వీశ | బలములా | హుతులంగ | మ్రింగ |
|---|---|---|---|
| U U I | I I I U | I I I I | U I |
| త | నగ | నల | గల |

**వృత్తముల మార్పు:—**

శార్దూలమునందలి మొదటి గురువును రెండు లఘువులుగా మార్చినచో మత్తేభమగును. (2) ఉత్పలమాలలో మొదటి గురువును రెండు లఘువులుగా చేసినచో చంపకమాల యగును. (3) మత్తకోకిలలోని మొదటి గురువును రెండు లఘువులుగా చేసినచో తరల యగును. (తరళము–న, భ, ర, స, జ, జ, గురువు) (4) ద్విపదలోని రెండు పాదములొక్క పాదముక్రింద లెక్కించిన తరువోజ యగును

**సూక్ష్మముగా గణములను జ్ఞప్తియుందుంచుకొనుటకు మార్గములు:—**

'య మా తా రా జ భా న స ల గం' అను వాక్యమునందెచ్చటనుండియైనను మూడక్షరములు వరుసగా తీసికొనినచో అందలి మొదటి యక్షర మాగణము పేరు తెలియజేయును.

యమాతా–| U U = యగణము; మాతారా–U U U = మగణము తారాజ–U U | = తగణము; రాజభా–U | U = రగణము; జభాన–| U | = జగణము; భానస–U | | భగణము; నసల–| | | = నగణము; సలగం – | | U = సగణము

మరియు నీక్రిందిపద్యము కంఠస్థము చేసిన గణములు వచ్చును.

గీ. ఆది, మధ్యాంత లఘువులు య, ర, త గణము
లాది మధ్యాంత గురువులనా భ, జ, స, లు
అన్ని గురులైన మగణమౌ నన్ని లఘువు
లగునగణము, గలము హామ్ములగము వమ్ము.

## అనువాదము చేయునపుడు గమనింపవలసిన ముఖ్య విషయములు

1. తర్జుమా చేయుట కివ్వబడిన భాగమును రెండు మూడుసారులు చదువుకొని విషయమును చక్కగా గ్రహింపవలెను.

2. అనువాదము చేయునప్పుడు మాట మాటకు తర్జుమా చేసితివ
లేదా యని మాత్రము చూచుకొనరాదు. వాక్యము నంతయు చదువుకొ
అందలి భావమును మనస్సునకు పట్టించుకొని జాతీయములతో దేశీయ
ములతో తేటతెల్లమగు తెనుగు పదములతో చిన్న చిన్న వాక్యములల
భావమును ప్రకటింపవలయును. అదే జాతీయము సాంప్రదాయ సిద్ధమ
అనువాదమగును. మక్కీకి మక్కీగా చేసిన తర్జుమా తర్జుమా కాజాలద

3. కష్టములైనట్టియు, అర్థము తెలియనట్టియు పదము లూక
రెండు విడిచిపెట్టినను బాధలేదు కాని సందర్భమును మాత్రము విడి
పెట్టరాదు. సందర్భము విడిచిపెట్టినచో అసలు భాగము నీ కర్థము కా
దని పరీక్షాధికారి తలంచును.

4. ఆంగ్లభాషా సంప్రదాయము వేఱు. తెనుగు సంప్రదాయ
వేఱు. తెనుగు సంప్రదాయముల ననుసరించియే తర్జుమా చేయవలెను.

5. ఆంగ్లములోని పెద్ద పెద్ద వాక్యములను చిన్న చిన్న వాక
ములుగా విడగొట్టి సరళమైన పద్ధతిలో వ్రాయవలెను.

6. సంజ్ఞావాచక పదములను తర్జుమా చేయనక్కఱలేదు.

7. సాంకేతిక పదములకు, పారిభాషిక పదములకు తెనుగు తె
యనిచో ఆ పదముల నట్లే వాడుట మంచిది. లేనియెడల వినాయకు
చేయబోయిన కోతియైనట్లగును. క్రొత్త క్రొత్త పదములను సృష్టి
వలదు.

8. మూలముతో సమానముగా అనువాదశైలి యుండవలెన
పెద్ద పెద్ద సమాసములను, మారుమూల పదముల నుపయోగింపవల
చదువుకొనెడి యీ భాగ మనువాదముగా నుండక స్వతంత్ర రచనగ
యునన ట్లుండవలెను.

1. Translate the following passage into simple and idiomatic Telugu :—

Gandhiji wants that kind of education which can make an Indian student love his own country and his own people and civilisation. In the second place, he thinks that our education at present is too bookish. It teaches our students to despise manual labour. He feels that every student should learn some kind of craft such as hand spinning or hand weaving for apart from other things it would provide him with an occupation afterwards. Again he believes that education of the heart also that is to say, it should aim to train character. Thirdly, he believes that education should be imparted through the medium of the mother tongue. All these ideas of him on national education have been embodied in the Wardha scheme of education which is being put into force in India (1950)

తనదేశము నెడల తనదేశ ప్రజల యెడల తన నాగరికత యెడల ప్రేమ పుట్టించు విద్యావిధానమే ప్రతి భారతీయ విద్యార్థికిని కావలయు గాంధీమహాత్ముని కోరిక. మరొక విషయ మేమనగా ఇప్పటి మనచదువు కేవలము పుస్తకాపేక్ష గల చదువని యాయన యుద్దేశము. అది మన విద్యార్థులకు పరిశ్రమలయెడల నెక్కువ నిర్లక్ష్యమును బోధించును. ప్రతి విద్యార్థియు చేనూలు వడుకుటో చేనేత నేయుటో మొదలగు వృత్తులను నేర్చియుండవలె ననియు నితర విషయముల మాట యెట్లున్నను అది వానికి ముందు ముందు జీవనోపాధి వృత్తిని కల్పించగలదనియు ఆయన యభిప్రాయము. మరియు విద్య ఆధ్యాత్మిక విద్యయై యుండవలయు ననియు, అది సుశీలము నలవరచునట్టిదై యుండవలయు ననియు ఆయన నమ్మకము. మరియు మాతృభాషలోనె విద్య నేర్పవలయు ననియు నాయన విశ్వాసము. జాతీయ విద్యలను గురించి యాయనకున్న ఆశయములన్నియు నిప్పుడు భారతదేశమున నమలుపరుప బడుచున్న వార్ధా విద్యా ప్రణాళికలో రూపొంది యున్నవి.

2. There is no boy or girl in India who does not know of Gandhiji. His kind smile and sweet expression are so

familiar to us from a thousand pictures and photographs that we feel as if we knew everything about him. Almost every day of our lives we have heard his name Spoken with love and reverence, yet few of us know of half the wonderful things he has done for India. If we studied his life and his work carefully, we should not be content with just loving him we should try to follow his teachings as well and to be as like him as possible. This is not so difficult as it sounds because he has left as many rules to follow. All that we have to do is to go on following these rules every day, and never give up following them (1951)

హిందూదేశములో గాంధీజీని అబాలగోపాల మెఱుంగుదురు. ఆయనయొక్క వేలకొలది బొమ్మల మూలమున, ఛాయాపటముల మూలమున ఆయన దయారసపూరిత మందహాసము, ఆయన తియ్యని భావములు మనకెంతో పరచయమైనవి గనుక ఆయనను గుఱించి మన కంతయు తెలియునని తలంతుము. మన జీవితములో నించుమించుగా ప్రతిదినము నాయన పేరు నతి ప్రేమతో మిక్కిలి గౌరవముతో నుచ్చరింతుము. కాని అతడు భారతదేశమునకు చేసిన అద్భుతకార్యములు మనలో కొద్ది మందికి మాత్రమే తెలియును. ఆయన జీవితమును ఆయన చేసిన పనులను మనము శ్రద్ధగా పరిశీలించిన యెడల కేవల మతనిని ప్రేమించుట మాత్రము చేతనే తృప్తిపడక ఆయన బోధనల ననుసరించి యాయనవలె ప్రవర్తించుటకు ప్రయత్నింపవలెను. తన్ననుసరించుట కాయన అనేక నిబంధనలను చూపినాడు గనుక అది అనుకొనినంత కష్టతరము గాదు. అనుదినమీ సూత్రముల ననుసరించుటయే మన కర్తవ్యము. మన మెప్పుడును వానిని విడిచిపెట్ట కూడదు.

3. Socrates was was a great lover of his country. When the Greeks went to war he went with them as a soldier and fought like a hero. In one battle he saved the life of a rich, handsome yong man, who was very popular in Athens. This youth soon learned to love the philosopher, who later became his teacher. Two other great men were pupils of Socrates. One of them became one of the greatest historians and the other a great philosopher. They were both authors

and they wrote all that is known to day about Socrates, who did not leave any writings to show what we believed and taught.

సోక్రటీసు గొప్ప దేశభక్తుడు. గ్రీకులు యుద్ధమునకు పోయినప్పుడు అతడు వారితో నొక యుద్ధ భటుడుగా వెళ్ళి మహావీరునివలె పోరాడెను. అతడొకానొక యుద్ధములో ఏథెన్సు నగరమున మహా ప్రసిద్ధి పొందిన ధనవంతుడు, అందగాడు నైన యొక యువకుని ప్రాణములను రక్షించెను. ఆ యువకుడా వేదాంతిని మిక్కిలి ప్రేమింపజొచ్చెను. పిమ్మట సోక్రటీసు వానికి గురువయ్యెను. మరి యిద్దరు గొప్పవారు సోక్రటీసునకు శిష్యులైరి. వారిద్దరిలో నొకడు గొప్ప చరిత్రకారు డయ్యెను. మరియొకడు గొప్ప వేదాంతి యయ్యెను. వారిద్దఱును గ్రంథకర్తలే. మనమిప్పుడు సోక్రటీసును గురించి తెలుసుకొన్నదంతయు వారు రచించినదే! సోక్రటీసు వేనిని విశ్వసించి బోధించెనో వాని నన్నిటిని వివరించు వ్రాతలయం దేదియూ ఆ గ్రంథకర్తలు వ్రాయక విడిచిపెట్టలేదు. (1954)

4. A farmer found one morning that one of his horses had been stolen. He could not catch the thief and was therefore very unhappy. After some days, he went to a horse fair and there saw his stolen horse being offered for sale. Approaching the seller, he seized the reins of his horse and said to the man, "this is my horse." But the other replied. "No you are mistaken. It is mine." Then the farmer covered the eyes of the animal with his hands and said; "It is so, then you will be able to say in which eye it is blind" Though the stranger did not know the truth, he answered at once, "In the right eye." "No" answered the farmer "It is clear you are the the thief and uncovered the right eye." "What" said the stranger, I meant the eye on my right." "Oh!" exclaimed the farmer, "It is not blind at all and you are not only a thief, but also a liar." (1955)

ఒకనాటి యుదయమున నొకకాపు తన గుఱ్ఱములలో నొక గుఱ్ఱము నెవరో దొంగిలించిరని తెలిసికొనెను. అతడు దొంగను పట్టుకొన

లేకపోవుటచే చాల విచారించుచుండెను. కొన్ని దినములు తరువాత నత డొక గుఱ్ఱపు సంతకు వెళ్ళెను. దొంగిలింపబడిన గుఱ్ఱము నొకడా సంతలోని కమ్మకమునకు తెచ్చెను. కాపు గుర్తించెను. అతడు గుఱ్ఱము నమ్ము వారిని సమీపించి యా గుఱ్ఱము కళ్లెము పట్టుకొని "ఇది నా గుఱ్ఱము"ని పలికెను. 'కాదు, నీది చాల పొరపాటు. ఇది నాదే" యని యతడు బదులు చెప్పెను. వెంటనే యా కాపు తన చేతులతో గుఱ్ఱము కన్నులనుమూసి "ఇది నీదే యైనచో దీని కేకన్ను గ్రుడ్డిదో చెప్పుము" అని యడిగెను. ఆ క్రొత్తవాడు తెలియక పోయినను వెంటనే "కుడికన్ను గ్రుడ్డిది" అని చెప్పెను. "కాదు. నీవు దొంగవని తెలిసిపోయినది" అని యతడు తన కుడికంటిపైని చేతిని తీసివేసెను. ఆ క్రొత్తవాడు తొందరనే "ఏమీ? నాకు కుడివైపున నున్న కన్ని అభిప్రాయ" మని చెప్పెను. "అట్లనా! అది అసలు గ్రుడ్డిదే కాదు. నీవు దొంగవే కాక అసత్యవాదివి కూడ నగుచున్నావు" అని కాపు నొక్కి వక్కాణించెను.

5. Mohandas passed his Matriculation in 1887 at the age of eighteen and on the advice of an old family friend, his elder brother sent him to England to study law. People in our county then used to think that there in England one could not be as religious or as pious as one could in India, And it was with great difficulty that Mohandas's people agreed to send him abroad. But before allowing him finally to go to England, his mother made him promise three things firstly, that he would not eat meat, secondly, that he would not drink and thirdly, that he would not make friends with girls. Mohandas gave his solemn word, that he would do as his mother wished, and then with the blessings of his people, he left for England, alone. (1956)

మోహనదాసు తన పదునెనిమిదవయేట 1887 సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షయం దుత్తీర్ణుడు కాగానే యతని పెద్దఅన్నగారు తన కుటుంబమునకు మిత్రుడగు నొక వయోవృద్ధు సలహా ననుసరించి

న్యాయశాస్త్రము నభ్యసించుటకై యతనిని ఇంగ్లాండు పంపించెను. ఇంగ్లండున నున్నప్పు డెవ్వడును హిందూదేశమునం దున్నప్పటివలె, నిజ మతాభిమానిగా, పరమపవిత్రుడుగా నుండ నేరడని యా దినములలో మనదేశమువా రనుకొనెడివారు. అందుచే మోహనదాసింగ్లాండు పోవుట కాతని వంశమువా రతి కష్టముపై నొప్పుకొనిరి. కాని యింగ్లండు వెళ్ళు ముందు మోహనదాసు తల్లి ముఖ్యముగా మూడు విషయములం దాతనిచే బాసచేయించెను. మొదటిది మాంసము తిననని యు, రెండవది మద్య పానము చేయననియు మూడవది ఆడపిల్లల స్నేహము చేయననియు వాగ్దానము చేయించెను. మోహనదాసు తల్లి కోరినట్లు ప్రమాణముచేసి ఆప్తుల దీవెనలతో నొంటరిగా నింగ్లాండునకు ప్రయాణమయ్యెను.

6. One night one of these men was going about the city. As he was going he heard shouts of anger inside a house. He stopped at once and listened. Whose house was it ? Between whom was the quarrel ? That was the house of a washerman. He was talking angrily to his wife. He was saying to her, "The proper place for a married woman is her husband's home. She has to be with him wherever he is, she has to share his joys and sorrows, this is Dharma," (1957)

ఆ మనుష్యులలో నొక డొకనాటి రాత్రి పట్టణమందు తిరుగ బోయెను. అట్లు పోవుచుండగా నతనికొక యింటిలోనుండి కోపపు మాటలు వినబడెను. తక్షణమే యతడాగిపోయి యా మాటలు వినెను. ఇది యెవరి యిల్లు? ఎవరెవరికి మధ్య ఆ పోట్లాట? అదియొక చాకలి వాని యిల్లు. వాడు కోపోద్దీపితుడై తన భార్యతో మాట్లాడుచుండెను. వాడామెతో పెండ్లియైన స్త్రీకి మగనియిల్లే యుండదగినచోటు. అత డెక్కడుండిన నామె యక్కడనే యుండవలయును. అతని కష్టసుఖ ములను పంచుకొనవలయును. ఇదియే ధర్మము" అని చెప్పుచుండెను.

7. It is more than twenty-five hundred years since the Buddha was born in the garden of Lumbini. His father was Suddhodana, a mighty chief among the tribe of the Sakyas. His mother Mahamaya was the daughter of a neibouring

king. Shortly before the birth of her son, she started on a journey, while she was resting one night among the cool trees of the garden of Lumbini that her child was born. He was given the name of Siddhardha, but we know him as the Buddha. (1958)

ఇప్పటికి రెండువేల ఐదువందల సంవత్సరములకు పైగా బుద్ధుడు లుంబినీవనమునందు జన్మించెను. అతని తండ్రి శాక్యవంశమున ముఖ్య నాయకుడైన శుద్ధోధనుడు. అతని తల్లి మహామాయ యిరుగు పొరుగు రాజుకూతురు. కుమారుని పుట్టుకకు కొంత ముందుగా నామె పుట్టినింటికి బయలుదేరెను. ఆ ప్రయాణ సమయమున నామె లుంబినీ వనమందలి చల్లని నీడనిచ్చు చెట్లక్రింద విశ్రాంతి తీసికొను చుండగా నొకనాటి రాత్రి యామె బిడ్డను గనెను. ఆబిడ్డకు సిద్ధార్థుడను పేరుపెట్టబడెను. కాని యతడు బుద్ధుడని ప్రఖ్యాతి వహించెను.

8. It was twelve o'clock when we reached the house and soon a servant brought in dinner. It was one large piece of bread in a plate about twenty-four feet wide. Around the plate sat the farmer and his wife, three children and an old grand mother, the farmer placed me on the table near him and as the table was thirty feet high. I kept as far as possible from the edge so as not to fall off, the Wife cut up a small piece of bread and placed it with some butter on a smaller plate before me. (1959)

మేమిల్లు చేరుసరికి పండ్రెండు గంటలైనది. వెంటనే పరిచారకుడు భోజనము తెచ్చినాడు. సుమారు ఇరువది నాలుగడుగులు వెడల్పుగల పెద్ద రొట్టెముక్క నొక పళ్ళెములో నుంచెను. ఆ పళ్ళెముచుట్టు కృషికుడు అతని భార్య, ముగ్గురు పిల్లలు నొక ముసలి యవ్వ కూర్చుండిరి. నన్ను కృషికుడు తన దగ్గరగా బల్లమీద కూర్చుండబెట్టెను. ఆ బల్ల ముప్పది యడుగుల యెత్తున్నది. పడిపోకుండ సాధ్యమైనంత వరకు నేను బల్ల అంచునకు దూరముగానే కూర్చుంటిని. కృషికుని భార్య చిన్న రొట్టె ముక్కను కోసి కొంచెము వెన్నతో నొక పళ్ళెములో నా ముందు పెట్టినది.

# March 1961.

## MODEL PAPERS.

### First Language - Part I - Paper I - Text and Grammar
### (In Telugu)

*Time—Two hours and a half ]* *[ Maximum 60*

I. (a) తిక్కన యేకాలము వాఁడు? అతఁడు వ్రాసిన గ్రంథము లెవ్వి? అతని బిరుదములను సమకాలికకవులను పేర్కొనుము.

లేదా

పోతన యేకాలమువాఁడు? అతఁడు వ్రాసిన గ్రంథములను, బిరుదమును, సమకాలిక కవులను పేర్కొనుము.

(b) ఈ పద్యములలో నొకదానికి మాత్రము దండాన్వయము వ్రాయునది.

రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
గయములు సంచలచ్ఛటుల సైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణి భోజకుకురాంధక వాహినియుంగలంగ ని
ర్దయతర రోషమారుత నితాంతసమీలితమై క్షణంబునన్.

ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చి నరుణద్యుతినుద్వృతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటిత్రిమార్గగా
కృతిఁ బ్రబంజనప్రియతనూజుని కంఠకమూర్తి కచ్చటన్.

(c) ఈ క్రిందిపదములలో నైదింటికిమాత్ర మర్థములు వ్రాయునది.

1. గజేంద్ర మోక్షము, 2. దీధిషికలు, 3. సౌహార్దము,
4. ఏడ్తెఱ 5. ఇమ్ముదప్పు, 6. ఆధోరణుఁడు, 7. మృతకల్పుఁడు

II. ఈ క్రిందివానిలో నాల్గింటికి మాత్రము సమాధానము వ్రాయవలెను.

(a) కర్ణశూలంబులైన భీష్ముని పలుకులు విని శిశుపాలుఁ డల్కతో నేమనెను ?

(b) "అమ్ముద్దియపలుకులు ముద్దుసేసి" —ఆ ముద్దియ యెవరు ? ఆ పలుకులెవ్వి ?

(c) గజేంద్రుఁ డీశ్వరసన్నిధానంబు కల్పించుకొని యీశ్వరు నేమని స్తుతించెను ?

(d) కోసలరాజు దాతృత్వమును కాశీరాజెట్లు పరీక్షించెను ?

(e) రాముఁడు భరతుని పల్కులువిని వాని భావమెఱిగి యేమని సమాధాన పఱచెను ?

(f) ధర్మరాజును వారించి శిశుపాలుంజూచి భీష్ముఁ డేమనెను ?

III. ఈ క్రిందివానిలో రెండింటికి సమాధానము వ్రాయుము.

(a) "ఆయువు గట్టిగానుండె నా మహామృత్యువు నాకుఁ జొచ్చియైనను మరలి రావచ్చును" దీనికి మీపాఠ్యభాగమునుండి యొకదృష్టాంతము వ్రాయుము.

(b) రాజు భయముపోగొట్టి రాజానుగ్రహము సంపాదింతుమని పల్కు దమనకునకు కరటకుఁ డేమని సమాధానమిచ్చెను ?

(c) శంఖమూడుని వృత్తాంతమును వ్రాయుము.

(d) కెసానెంటురికార్డరు నిర్మాణమును దాని ప్రయోజనమును జగదీశు డెట్లు ప్రకటించెను ?

(e) వర్తమాన యుగమున నాటకకళావిర్భావ విశిష్టత యేది ?

IV. ఈ క్రిందివానిలో రెండింటిని గూర్చి యిరువదేసి పంక్తులకు మించని వ్యాసములు వ్రాయవలెను.

(a) జీమూతవాహనుని కథ.

(b) పరాధికారముపైఁ బెట్టుకొనరాదను నీతిని బోధించుకథ.

(c) ఇరువదియవ శతాబ్ది ప్రారంభమునుండియు నాంధ్రుల కళా జీవితమునందు నూతనశకమొకటి యెట్లు విరిసెను?

V. (a) ఈ క్రిందివానిలో నేనాల్గింటికైన ప్రకృతులకు వికృతులను వికృతులకు ప్రకృతులను వ్రాయునది.

క్రీడి; యజ్ఞము; ముద్దియ; శంఖము; మచ్చరము; యోధుఁడు.

(b) ఈ క్రిందివానిలో మూడింటిని మాత్రము విడదీసి వ్యాకరణ కార్యములు వివరించునది.

పుష్పాడి; నిట్టూర్పు; దుష్టురాలు; పేరడవి.

(c) ఈ క్రిందివానిలో నాల్గింటిని మాత్రము విడదీసి యవి యే సమాసములో పేర్కొనునది.

గోగణము - తుచ్ఛభోగము - కర్ణశల్యులు - నాట్యమందిరము - హృద్వనము - ముఖారవిందము.

(d) ఈ క్రింది పద్యపాదములలో నేయొక్కటికైనను గణవిభజన చేసి యతిని నిరూపించునది.

ననుసైరంధ్రి గడంగి పేర్కొనియె దానంబెంపుమైఁ బిల్చితో
తావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్

VI. (a) 'అల వైకుంఠపురంబులో' అని యారంభించు పద్యమును గాని

(b) 'ధరఖర్వాటుఁడొకండు' అని యారంభించు పద్యమును గాని వ్రాయుము.

## Paper II

I. (a) భారతభాగముల కేమని పేరు? అట్లన నేల? (లేదా) భాగవత భాగముల కేమని పేరు? అట్లన నేల?

(b) భారతభాగముల నెవరు రచించిరి? (లేక) భాగవత శైథిల్యముల నెవరు పూరించిరి?

(c) నీతిచంద్రికకు మూలగ్రంథములెవ్వి? నీతిచంద్రికలోని యే యే భాగముల నెవరు రచించిరి? (లేదా) భర్తృహరి సుభాషితముల నాంధ్రీకరించిన ముగ్గురు కవులను పేర్కొనుము.

(d) ఈక్రిందిపద్యములలో నొకదానికి దండాన్వయమువ్రాయునది

భీష్మద్రోణకృపాదిధన్వి నికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వ కలితంబుసైన్యమిది యేఁజేరంగ శక్తుండనే?

పూరించెన్ హరిపాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్
సారోదార సితప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్

(e) ఈక్రింది పదములలో నైదింటికిమాత్ర మర్థములు వ్రాయునది.
బాసట; అనునయము; బీభత్సుఁడు; దనుజానీకము; కుండాలము; పురుహూతసుతుఁడు.

II. ఈ క్రిందివానిలో నాల్గింటికి మాత్రము సమాధానము వ్రాయునది.

(a) శిశుపాలుఁడు కృష్ణు నాక్షేపించుచు ధర్మరాజునకేమనెను ?

(b) ఉత్తరుఁడు కౌరవసైన్యమునుజూచి బృహన్నలతో నేమనెను?

(c) గజప్రాణావనోత్సాహియై విష్ణువెట్లు బయలుదేరెను ?

(d) భద్రప్రాప్తికేవి మార్గములు ?

(e) సజ్జనులు, మధ్యములు, దైత్యు లెట్టివారు ?

(f) తపసివేషము పూనతగునెయని హితముపలుకు రామునకు భరతుఁడిచ్చిన సమాధాన మేమి ?

III. ఈ క్రిందివానిలో రెండింటికి మాత్రము సమాధానము వ్రాయునది.

(a) మనము ప్రధానులము కాము, మన కీవిచారముతో ప్రయోజన మేమి యనిపలుకు కరటకునకు దమనకుఁ డేమి సమాధాన మిచ్చెను ?

(b) జగదీశుని మొక్క లేమని పిల్చినవి ?

(c) ఆధునిక యుగమున చిత్రలేఖన వికాసమునుగూర్చి వ్రాయుము

IV. ఈ క్రిందవానిలో రెండింటినిగూర్చి యిరువదేసి పంక్తులకు మించని వ్యాసములను వ్రాయుము.

(a) జోలిమాలిన పనికి పోరాదను నీతినిబోధించుకథ.

(b) శిశుపాలుఁడు కృష్ణునాక్షేపించుచు ధర్మరాజుతో నేమనెను?

(c) జగదీశచంద్రబోసు వృత్తాంతము.

V. (a) ఈ క్రిందివానిలో నేనాల్గింటికేని ప్రకృతులకు వికృతులను వికృతులకు ప్రకృతులను వ్రాయుము.

ఉవిద - సంధ్య - కసుమాలము - సిరి - ప్రాంతము - రిత్త

(b) ఈ క్రిందివానిలో మూడింటిని మాత్రము విడదీసి వ్యాకరణ కార్యములను దెల్పుము.

నెమ్మనము - అరయ్యెడుమని - వ్యాకులపడు - నొరపనేల.

(c) ఈ క్రిందివానిలో నాల్గింటిని మాత్రము విడదీసి యవి యేసమాసములో పేర్కొనునది.

యథాశక్తి - విద్యాధికుఁడు - క్రూరసత్త్వము - అసాధ్యము - చక్రాయుధుఁడు - ఆటపాటలు.

(d) ఈ క్రింది పద్యపాదములలో నేయొక్కటికైనను గణవిభజనముచేసి యతిని నిరూపించునది.

వాసమునందుఁ గ్రుమ్మరిలు వానిని గోసలదేశనాయకున్.
ధరణి నొసంగి సత్యమునఁ దప్పకనిల్చిన తండ్రిపల్కుచే.

VI. (a) 'ఆకాశంబుననుండి' యని యారంభించు పద్యమునుగాని

(b) 'వినువీథింజను దేరఁ గాంచిరమరుల్' అని యారంభించు పద్యమునుగాని వ్రాయుము.

# కల్పతరువు 61

## సామాన్య భాగము

## పద్య భాగము

### మహాభారతము

## శిశుపాలవధ

వేదవ్యాసునిచే రచింపఁబడిన సంస్కృతభారతమును కవిత్రయమనుపేర ప్రసిద్ధికెక్కిన నన్నయభట్టు, తిక్కన, ఎఱ్ఱాప్రగడ యను ముగ్వురుకవులాంధ్రీకరించిరి. ఆది, సభా పర్వములను, అరణ్యపర్వములో నాల్గవయాశ్వాసములో మూఁడువంతులు నన్నయభట్టురచించెను. ఇతఁడు క్రీ. శ. 1022 మొదలు 1068 వఱకు రాజమహేంద్రవరము రాజధానిగాఁ జేసికొని వేఁగిదేశమును పరిపాలించిన రాజరాజనరేంద్రుని యాస్థానకవి. క్రీ. శ 13వ శతాబ్దమున నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధిమహారాజు ఆస్థానమున కవి, మంత్రి రాజకీయవేత్తయైన తిక్కన విరాటపర్వము మొదలు స్వర్గారోహణపర్వముచివఱవఱకు 15పర్వములు తెనిగించెను. అరణ్యపర్వశేషమును ఎఱ్ఱాప్రగ్గడపూర్తి చేసెను.

తెనుఁగులో సలక్షణమైనభాషలో గ్రంథమును వ్రాసి: ఆదికవి నన్నయ. దారి తెన్నులు లేక విలక్షణముగానుండి: తెనుఁగుభాషను సంస్కరించి భాషనుశాసించుటచే, శబ్దమును శాసించుటచే శబ్దశాసనుఁడు (లేక) వాగనుశాసనుఁడను బిరుదువచ్చెను. ఆంధ్రశబ్దచింతామణి, లక్షణసారము. ఇంద్రవిజయము, చాముండికావిలాసము, రాఘవాభ్యుదయము మొదలగు గ్రంథములనుకూడ నన్నయరచియించెనందురు.

గొప్పదగు భరతవంశ రాజులచరిత్ర యిందు వర్ణింపఁబడుటచే దానికి మహాభారత మను పేరువచ్చెను. నాల్గువేదముల నొక వైపునను భారతము నొక వైపునను త్రాసునందుంచి తూచగా భారతము వైపునకే మొలుసూపి వేదములకంటె మహాభార మయ్యెను గనుక మహాభారత మను పేరు వచ్చినదని ప్రౌఢోక్తి, నాల్గు వేదముల సార మిందుండుట చేతనే దీనికి పంచమ వేదమను ప్రసిద్ధిగలదు. (భారతః పంచమోవేదః) భారతభాగములకు పర్వములనిపేరు. పర్వ మనగా చెఱకుకణ్ణలోని గనుపు. భారత మొక చెఱకుకణ్ణకు పోల్పఁబడినది. 'ప్రతిపర్వ రసోదయ' మ్మనునట్లు గనుపు గనుపు నందును రసము చిప్పిలునట్లు భారతములోని ప్రతిభాగము నందు రసము చిప్పిలు చుండును. కనుక పర్వమని పేరు పెట్టుటచే సార్థకము. ఇందు పదునెనిమిది పర్వములు గలవు.

'భారత మితిహాసము. ఇతిహాస మనఁగా పూర్వగాథ. ఈ పాఠ్యభాగము సభాపర్వము ద్వితీయాశ్వాసము లోనిది.

గణితశాస్త్రమును పద్యకావ్యముగా వ్రాసిన పావులూరి మల్లనయు, అష్టభాషా విశారదుఁడైన నారాయణభట్టు నన్నయకు సమకాలికులు. భారతమును వైశంపాయనుఁడు జనమేజయ మహారాజునకుఁ జెప్పెను.

నన్నయ కవిత్వము పున్నమనాటి వెన్నెల వంటిది. ప్రసన్నతాగుణ మతనిసొమ్ము, ఎల్లెడల మనోజ్ఞత వెల్లివిరియుచుండును. అంత మధురముగా నంత అందముగా పద్యమల్లగల కవి యింకొకఁడు లేఁడు.

## క థా సం గ్ర హ ము

ధర్మరాజు రాజసూయ యాగము చేయుచుండెను. కౌరవులు, పెద్దలు, పండితులు, శిశుపాలాది సమస్త సామంత రాజులు సభ నలంకరించి యుండిరి. భీష్ముఁడా యాగవిధానమును, వైభవమును జూచి సంతోషించి కృష్ణున కర్ఘ్యమిచ్చి పూజింపుమని ధర్మరాజుతోఁ జెప్పెను. శిశుపాలుఁ డదిచూచి సహింపలేక కృష్ణు నాక్షేపించుచు, ధర్మరాజుతో నిట్లనెను.

ధర్మరాజా! ఈ సభలో రాజాధిరాజు లనేకు లుండగా, శిష్టాచార పరాయణులు, పూజార్హులగు బ్రాహ్మణు లనేకు లుండగా, భీష్ముని దుర్బోధ ననుసరించి వృష్ణివంశమున పుట్టినవానిని, దుర్మార్గ ప్రవర్తన గలవానిని కృష్ణుని పూజించి యిందరిలో నీ యవివేకమును వెల్లడించు కొంటివి. దశార్హసంతతిలోని కృష్ణుఁడు పూజార్హుఁడా? ధర్మసూక్ష్మమును

తెలిసికొనుట చాల కష్టము. ఎందరో ఉత్తమోత్తము లుండఁగా ముసలియగు భీష్ముఁడు మూర్ఖుఁడై జడుడగు కృష్ణుని పూజింపుమని చెప్పినంత మాత్రమున నీవు చేయ వచ్చునా? వృద్ధులమతి అతి చంచలమని యెఱుంగవా?

కృష్ణుని యెడ నీ కంత యిష్ట మున్నచో డబ్బియ వచ్చును. ఇంకను కోరిక లున్నచో తీర్పవచ్చును. అంతే కాని రాజాధిరాజు లున్నసభలో, విప్రశ్రేష్ఠు లున్నసభలో, అనర్హుఁడైనవాని నర్హుఁడని మిక్కిలి పొగడి పూజించుట న్యాయమా? వసుదేవుఁ డంతవాఁడీ సభనుండఁగా కృష్ణుని పెద్దవాఁడని పూజించితివా? వ్యాసు డంతటివాఁ డుండగా కృష్ణుని ఋత్విజుండని పూజించితివా? ద్రోణ కృపాచార్యు లంతవా రుండగా కృష్ణుని ఆచార్యుడని గౌరవించితివా? రాజని గౌరవించితి నందువా యాదవులకు రాజ్యార్హత లేదు. పూజార్హులను పూజింపక భీష్ముని మాటవిని మూర్ఖుఁడవైతివి. "ధర్మరాజు మహానుభావుఁడు, పూజ్యుఁడు, వాని యాగము నకు మనము తప్పక పోవలయు" నని యెంతో గౌరవముతో వచ్చిన యింతమంది రాజుల కవమాన మొనర్చుట నీకు న్యాయమా? పోనీ నీకు తెలియక యిచ్చినచో ఆ పుచ్చుకొన్న కృష్ణునకైనను తెలియదా? తగుదు నమ్మాయని సిగ్గులేక యర్ఘ్యము గ్రహింపఁ దగునా? పేడివానికి పెండ్లి, చెవిటి వానికి మధురసంగీతము, గ్రుడ్డివానికి మంచి యద్దములో సౌందర్య వస్తువు చూపుట వంటిది కృష్ణుని పూజించుట.

ఇందఱు రాజుల నవ్వులాటలకుపాలై యధర్మముగా సంచరించి ధర్మరాజును పేరు పాడుచేసి కొంటివి.''

శిశుపాలుఁ డట్లు దురుక్తులాడుచు పుత్రులతో తన బలగముతో సభనుండి లేచిపోయెను.

ధర్మరాజు శిశుపాలుని వెంటజని శాంతింపఁ జేయుచు ''రాజా! గుణవంతులగు రాజుల కిట్లు పరుష వాక్యము లాడుట తగునా? అది విషము కంటె, అగ్ని కంటె మిక్కిలి దారుణము. బ్రహ్మపుట్టుటకు కారణభూతుఁడైన వాఁడును, వేదాది సమస్త వాఙ్మయములందు పొగడబడిన వాఁడును, త్రిలోక పూజితుఁడునని తెలిసియే భీష్ముఁడంత వాఁడు కృష్ణుడే పూజార్హుఁడని చెప్పెను. అది యొప్పే కాని తప్పా? కృష్ణుని మహిమ భీష్మునికే తెలియునుగాని నీవంటి వానికి తెలిసికొన శక్యమా? పెద్దల చరిత్ర లల్పు లెఱుంగ నేర్తురా? కృష్ణుఁడు లోక గురుండని, సమస్త లోకోత్తరుఁడని నీకంటె పెద్దలైన రాజులందఱు పొగడుచుండ నీవు కాదన న్యాయమా?'' అని యనునయించు ధర్మరాజునకు భీష్ముఁ డిట్లనెను.

ధర్మరాజా! శిశుపాలుఁడు నీతిలేనివాఁడు, మూర్ఖుడు అట్టి వానికిఁ దెలియఁ బఱచుటకు ప్రయత్నింప నేల? రాగ ద్వేషపూరితునకు, అల్పరాజ్య మదాంధునకు, నిర్హేతుకముగా వాదించు స్వభావముగల వానికి, ధర్మ మేమి తెలియును.

భీష్ముఁడు ధర్మరాజును వారించి శిశుపాలునితో ''శిశు పాలా! కృష్ణున కర్ఘ్య మిచ్చుట తగదంటివి. నీ కెంత

మూర్ఖుఁడవు ! ఈ సభలో నున్న రాజు లందఱు నీ కృష్ణుని దయచేత విడిపింపఁ బడినవారే. యుద్ధమందు జయింపబడిన వారే. వానిని శరణు పొందినవారే సుమా ! వాని దయకు పాత్రుఁడుకాని వా డొక్కఁడైన నున్నాఁడేమో చెప్పుము, పెద్దలు పెద్దలందువు, పెద్దయన నెవరు ? ఉత్తమమైన జ్ఞానము చేత పెద్దయగువాఁడు బాలుఁడైనను బ్రాహ్మణుఁడుపూజ్యుఁడు. రాజులలో మహాపరాక్రమవంతుఁడే పెద్ద. ఈ రెండు కారణములచేత కృష్ణుఁడు పూజార్హుఁడు. మనకే కాదు ముల్లోకముల వారికి పూజార్హుఁడు. వయసున్న పెద్దలొక లక్షమంది యున్నను లెక్కకురారు. గుణవృద్ధని కృష్ణుని పూజించితిమి. కృష్ణ నొక్కని పూజించినచో జనులందఱును ముల్లోకముల వారును తమ్ము పూజించినట్లే తృప్తిపడుదురు. బుద్ధి, మనస్సు ప్రకృతి, పురుషుఁడు, ఆకాశము, భూమి, సూర్యాగ్ని, చంద్రులు, దిక్కులు, కాలములు, సమస్తము తానయై యీ చరాచరాత్మకమైన ప్రపంచమునెల్ల తన శక్తితో ధరించిన సర్వాత్ముని, సకల భూతములకు ప్రభువగు వానిని అందరిచే నమస్కరింపఁ దగిన వానిని కృష్ణుని నీవు తెలిసికొనఁగలవా ? యోగనిష్ఠగల మహర్షు లొక్కరే వానిని తెలిసికొనగలరు'' అని పల్కెను.

ఆ సమయమున సహదేవుడు లేచి ''కృష్ణునకే యర్ఘ్య మిచ్చితిమి. దీనికి మే మొప్పుకొనమను దుర్మార్గుల తల నిప్పుడే త న్నెద''నని కాలెత్తెను. అపుడు సభలో నెవ్వరును

నోరెత్తలేదు. సహదేవునిపై పూలవాన కురిసెను. సభ్యులద్భుతపడుచుండిరి. కలహప్రియుఁడగు నారదుఁ డానందమున తాండవించెను.

శిశుపాలుని సేనాధ్యక్షుఁడు సునీథుఁడనువాఁడు మండిపడి తమ పక్షమున నున్న రాజులను దగ్గరకుఁ జేర్చుకొని శిశుపాలుని యాజ్ఞననుసరించి యుద్ధమునకు సిద్ధపడెను. వేగవంతములగు గుఱ్ఱము లనెడు కెరటముల చేతను, మదించిన యేనుఁగు లనెడు మొసళ్ళ చేతను, సేనాసమూహము లనెడు చేపల చేతను, భయంకరమగు యదు, వృష్ణి, భోజ, కుకురాంధకుల నెడుసముద్రము, దయావిహీనమైన కోపమనెడు పెనుగాలిచే చెదర గొట్టఁబడినదై మిక్కిలి కలంగెను.

ఆ క్షత్రియక్షోభ చూచి ధర్మరాజు భయపడి భీష్మునితో "తాతా! రాజులందఱు ప్రళయకాల సముద్రమువలె కలంగిరి. ప్రజలకే హానియు రాకుండ, యజ్ఞమునకు విఘ్నమును కలుగకుండ వీరికి మనశ్శాంతి చేకూర్పుమా" యని పల్కెను.

భీష్ముఁడు ధర్మరాజుతో "రాక్షసులను జయించిన వాఁడును, యజ్ఞపురుషుఁ డగు నారాయణుఁడే యీ యజ్ఞమును రక్షించు చుండగా నితరు లెవ్వరీ యజ్ఞమును నాశనము చేయఁగలరు? కృష్ణుఁ డొకసారి కోపపుఁ జూపుఁ బఱపినా యీశిశుపాలునకై సహాయపడిన రాజులందఱు క్షణములో చత్తురు. శిశుపాలుని గర్వమిప్పుడే యణగి పోగలదు.

ఏనుఁగుల కుంభస్థలములను చీల్చుటకు సమర్థములగు గోళ్ళు గల సింహమును చూచి యెన్ని కుక్కలు మొఱిగిన నేమి లాభము ? కృష్ణుఁడు సింహ పరాక్రముఁడు. వీని శక్తి నెవ్వ రెఱుంగకున్నారు'' అని పలికెను.

భీష్ముని పలుకులు శిశుపాలుని చెవులకు ములుకులు కాఁగా నతఁడు కోపించి ''యీముసలి వెఱ్ఱిభీష్ముఁడు గొల్లకృష్ణుని పరమేశ్వరుఁడని కొనియాడుచున్నాఁడు. పాండవులకు తనకే కాని యీకృష్ణుని తత్త్వమే తెలియదట పాపము. గౌరవహీను డగు నితఁ డందఱి నవమానపఱచెను. భీష్మా! ఓడతోఁగట్టిన యోడవలె ధర్మరాజు నిన్నాధారముగా చేసికొని తనకున్న గౌరవమునుగూడ పోగొట్టుకొనినాఁడు. నీ వెంత దుర్మార్గుఁడవు! రాజులనుభయపెట్టితివి. ఈ రాజులంత పిరికివారనుకొంటివా ? కృష్ణుఁడు సింహపరాక్రముఁడా ? ఓహో! ఆడుదియగు పూతనను చంపుట, ప్రాణము లేనికొయ్యబండిని కాలితో తన్నుట, పూచిన చెట్లనుకూల్చుట, చీమపుట్టంతగానున్న కొండనెత్తి యేడుదినములచ్చటనుండుట యెద్దును చంపుట యివియన్నియు కృష్ణుని పరాక్రమసూచకములైన చిహ్నములు కాబోలునే; అవిఘనకార్యములని మీఁరుపొగడుటయా ? ఇట్లబద్ధములాడు నీనాలుక వేయిచీలికలు కాకున్నది. అట్లయిన నపుడింకను మిక్కిలిగా పొగడవచ్చును. కృష్ణునకే సభలో అర్ఘ్యయోగ్యతకలిగినదో చెప్పుము. స్త్రీలను, గోవులను, బ్రాహ్మణులను, అన్నమిడిపోషించువారిని, నమ్మిన

వారిని, చంపుట మహాపాపంబని పెద్దలు చెప్పుదురు. అందొ
కటి కాదు స్త్రీవధయు, గోవధయుం గూడ చేసినాఁడు కృష్ణుఁడు.
నీవేదో పెద్ద ధర్మము తెలిసినవానివలె వీనికర్ఘ్యమిప్పించితివి.
నీకుమాత్రమే ధర్మము తెలియును గా? మున్ను సాళ్వునివరించిన
యంబను తెచ్చితివి. నీతమ్ముఁడు విచిత్రవీర్యుఁడు న్యాయపరుఁడు
గనుక ఆమెను విడిచెను. మఱియును నీవు అనపత్యుఁడవు. అన
పత్యుఁడు జననిందితుఁడు. అట్టి నీయాజ్ఞ పాలింపతగినది కాదు.
సిగ్గులేక కృష్ణుని భట్రాజువలె పొగడెదవు. దుర్గుణుల నేల పొగ
డెదవు? నీకు ప్రొద్దుపోవలె నన్న గుణవంతులైన కర్ణశల్యాది
వీరులను పొగడరాదా? పరస్తుతి, పరనింద, ఆత్మస్తుతి,
ఆత్మనింద పూజ్యులైనవారు చేయరు" అని తెగ ప్రేలుచు
నాక్షేపించెను

భీముఁడు క్రోధోద్రిక్తుఁడై రౌద్రాకారంబుదాల్చి
పండ్లుపటపటలాడించుచు శిశుపాలుని జంపుటకు ప్రయత్నిం
చెను. భీష్ముఁడు భీముని వారించి "భీమసేనా! వీనితల్లి సాత్వతి
పూర్వము కృష్ణుని ప్రార్థించి నూఱు తప్పులు నిండువఱకు
మన్నింపుమని కోరినది. అవి నేటితో పూర్తియైనవి. వీఁడు
కృష్ణుని చేతిలో నేచచ్చును. ఇతరులచే చంపఁబడఁడు. అందు
చేతనే నన్నింతెంతిమాటలాడినను ఊరకొంటిని, లేనిచో
నితరులెవరైన నన్నిట్లు తూలనాడి బ్రతుకఁగలరా?" అని
పలుకుచుండ శిశుపాలుఁడు కృష్ణున కభిముఖుండై "కృష్ణా!
ముసలివాడగు భీష్ముని ప్రేరణచే నసర్హుఁడవగు నిన్ను పాండ

వులుపూజించిరి. పాండవు లదిచేసిరి. భీష్ముడు మహాపాపాత్ముడు మీకు చేయుచున్నా యీ పన్ను యుద్ధమునకు సిద్ధపడ్డాను.”
అని పల్కుచుండగా కృష్ణుడు రాజులందఱువినుచుండగా నిట్లనెను:

మేము భగదత్తునిమీదికి దాడివెడలినపుడు శిశుపాలుఁడు దొంగచాటుగాఁబోయి ద్వారకకునిప్పంటించి బాలురను, వృద్ధులను భయపెట్టెను. భోజవంశరాజులు రైవతకాద్రియందు విహరించుచుండగానిర్దయుడై వారినిచంపినాఁడు. వసుదేవుఁడశ్వమేధము చేయుచుండగా యాగాశ్వమును దొంగిలించినాడు. బభ్రుభార్యనపహరించినాఁడు. అనిగాక వాగ్విషయంబులైన యపకారంబుల కంతంబులేదు. మాయత్త కిచ్చిన మాటప్రకారము నూఱు తప్పులుమన్నించితిని. ఇక మన్నింపను.”

శిశుపాలుఁడామాటలువిని “ఓరీ! నీప్రేమ, నీకోప మెవరికికావలయును? నీవు పరమదుర్గుణుడవు. నాకు పెండ్లి చేయసంకల్పింపఁబడిన రుక్మిణిని సిగ్గులేక నీవెట్లు చేసికొంటివి?”
అని పలుకుచుండగనే కృష్ణుఁడుకోపించి సుదర్శనచక్రమును ప్రయోగించెను. శిశుపాలుని తలతెగెను. రక్తము వెల్లువలయ్యెను. అతనిశరీరమునుండి దివ్యతేజమొకటి బయల్వెడలి కృష్ణునిశరీరములో ప్రవేశించెను. రాజులందఱాశ్చర్యభరితులైరి.

ప్రతిపదార్థములు, తాత్పర్యములు మొదలైనవి.

1 పద్యము :— (శిశుపాలుఁడు పాండవులు ప్రథమ పూజను శ్రీకృష్ణునాక్షేపించుచు ధర్మరాజున కట్లనియెను)

ధరిత్రీనాథ=రాజా! అవనీనాథులు=రాజులు, అనేకులు+ఉండన్+కన్=పెక్కు మంది యుండఁగా; విశిష్ట+ఆరాధ్యులు=యోగ్యులచేత పూజింపఁ దగినవారు; ఆద్యులు=పెద్దలు; మహీదివిజుల్=బ్రాహ్మణులు; పూజ్యులు=పూజింపఁ దగినవారు: పల్వురు+ఉండన్+కన్=పెక్కు మంది యుండగా; గాంగేయు+దుర్+వ్యవసాయంబునన్ = భీష్ముని దుష్ప్రయత్నముచేత; కష్టచరితున్ = దుష్ప్రవర్తనము గలవానిని వార్ష్ణేయున్=వృష్టివంశమునందు పుట్టినవానిని (యదు, వృష్టి, భోజ, అంధక, కుకురాది వంశములు గొల్ల వంశములని ప్రసిద్ధి) కృష్ణున్=కృష్ణుని; పూజించి = అర్చించి; ఇందఱకున్=ఇంతమందిలో; నీ+అవివేకంబు+ఎఱిగించితి= నీయజ్ఞానమును వెల్లడించితివి; దాశార్హుండు + పూజ + అర్హుఁడు+ఏ = పల్లెలు: బోయలు మొదలగు వారికి తగినవాఁడు (లేక) భృత్యతకు, నౌకరికి తగినవాఁడు (లేక) దశార్హసంతతివాడనగా గొల్ల కులము వాఁడు (కృష్ణుఁడు) పూజ+అర్హుఁడు+ఏ= అర్చింప తగినవాఁడా? (కాదు)

తా. అనేక మహారాజు లుండగా, పూజ్యులగు బ్రాహ్మణు లనేకు లుండగా, సత్ప్రవర్తన గలవా రనేకులుండగా, భీష్ముని దుర్బోధను విని దుష్ప్రవర్తనుని, గొల్లవానిని

ఊరు పేరు లేని దశార్హ సంతతివానిని కృష్ణుని పూజించి యింత మందిలో? నీ యజ్ఞానమును వెల్లడించు కొంటివి.

విశే:—విశిష్ట + ఆరాధ్యులు = విశిష్టారాధ్యులు: పూజ+అర్హుడు=పూజార్హుడు - సవర్ణదీర్ఘసంధులు; గాంగేయుడు (వ్యు) గంగకుమారుడు (భీష్ముడు) ఎఱిగించితి+వి= ఎఱిగించితి -

సూ. లిఙ్గాట్లు విశారంబునకు లోపంబు విభాషనగు;

2. ధర్మతత్త్వము = న్యాయముయొక్క నిజస్వరూపమును కనుకొని = ప్రయత్నించి; ఎఱుంగన్ + అశక్యము = (ఎవ్వరికిని) తెలిసికొన సాధ్యముగాదు; విచారవిదూరుడు= ఆలోచనకు మిక్కిలి దూరమైనవాడు (ఆలోచనలేనివాడు) భీష్ముడు; ఇష్టుడు+ఐ=నీకు ప్రియుడై; ధర్మబాహ్యున్ నిన్ను=న్యాయమునకు వెలియైనవాడవగు నిన్ను అనగా ధర్మాధర్మము లెఱుంగని నిన్ను; ఒడబడక+కఱపి = సమ్మతించునట్లు బోధచేసి; ఉత్తములు+ఉండఁగన్ = ఈసభయందనేకులు శ్రేష్ఠులైనవా రుండగా; వాసుదేవుడు+అగ+జడునకున్=కృష్ణుడను మూర్ఖునకు; పూజ+ఇమ్ము+అని=అర్ఘ్యమిమ్మని (పూజచేయుమని) ఎంతయున్ వెడఁగు + తనంబునన్=మిక్కిలి అవివేకముచే; పనిచెన్=ఆజ్ఞాపించెను; వృద్ధుల బుద్ధులు=ముసలివారి మనస్సులు; సంచలింపవు+ఏ=మిక్కిలి చపలములుకావా? (అగును)

తా. ధర్మముయొక్క నిజస్వరూపమును తెలిసికొన నెవ్వరికిని శక్యముగాదు. ఆలోచనయే తెలియని భీష్ముఁడు నీ యందిష్టము గలవాఁడై ధర్మాధర్మము లెఱుఁగని నిన్నొప్పించి యీ సభలో నింతమంది యుత్తమోత్తము లుండగా మూర్ఖుఁడగు కృష్ణున కర్ఘ్యమిమ్మని శుద్ధ అవివేకముచే చెప్పినాఁడు. ముసలివారి మనస్సులు నిలుకడగా నుండవు కదా! భీష్ముఁడు మతిచెడి యట్లు చెప్పినాఁడు.

వి శే :—ధర్మము(ప్ర)దమ్మము (వి); న+శక్యము=అశక్యము – నఞ్ తత్పురుషము; అను+జడుఁడు=అజ్జడుఁడు–సూ. అను, కొను లోనగు ధాతుజ విశేషణముల అంత్యోకారమునకు హల్లుపరంబగునపుడు లోపంబు వైకల్పికంబు. నిన్ను+కలపి=నీవు కలచునట్లుచేసి – ఇది ప్రేరణార్థకము. చిత్రప్రయోగము (కర్త్రర్థకము) ప్రేరణార్థకము నందు 'నీ' శబ్ద ద్వితీయైకవచనమగు 'నిన్ను', అనునది ప్రేరణధాతువగు 'కలపి' అనుదానికి కర్మమైనది. అప్రేరణధాతువగు 'కలచు' అనుదానికి 'నీ' శబ్దప్రథమైక వచనమగు నీవు అనునది కర్తయైనది. అనగా అప్రేరణంబునం గర్తయైన నీవు అనునది ప్రేరణంబున 'నిన్ను'గా మాఱి కర్మయైనది. (బాలవ్యాకరణము – క్రియా – 133 సూ. గతిబుద్ధి ప్రత్యవసానార్థ శబ్ద కర్మాకర్మంబుల కప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం గర్మంబగు) వృద్ధు (ప్ర) పెద్ద (వి); బుద్ధి (ప్ర) బుద్ది(వి) వృద్ధుల......సంచలింపవే – అర్థాంతర న్యాసాలంకారము;

వెడఁగు+తనము= వెడఁగుఁదనము, సూ. ఉదంత స్త్రీసమంబులకును, పుంపులకు, అదంతగుణవాచకంబులకు 'తనము' పర బగునపుడు నుగాగమంబగు = వెడఁగు+న్+తనము; (2 ద్రుత ప్రకృతికముల మీఁది పరుషములకు సరళములగు = వెడఁగు+న్+దనము; (3) ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు, సంశ్లేష స్వాత్వరూపంబులు విభాషనగు= వెడఁగుఁ దనము.

3. ఇతనికిన్+కూర్తురు+ఏనిన్ = కృష్ణునకు ప్రియ పడుచు రేని (కృష్ణుఁడనిన అంత యిష్టమైన యెడల) ధనము+ ఇత్తురు=డబ్బిత్తురు (డబ్బియు నిచ్చు); అభీష్టములైన కార్య ముల్=కోరబడిన పనులు; మతిన్ ఒనరింతురు = ఇష్టముతో చేయుదురు; ఇష్టుఁడు+అని = అప్తుఁడని; మంతురు+కాక = పోషింతురు గాక; మహాత్+ఆత్ములు+ఐన భూపతులయున్= గొప్ప మనస్సులుగల రాజులయొక్కయును; విప్రముఖ్యుల సభన్=బ్రాహ్మణ శ్రేష్ఠులయొక్కయును సభయందు; విధి+ దృష్ట+విశిష్ట+పూజన+ఆయతికిన్ = శాస్త్రమందు; తెలియ బడిన; మిగుల యోగ్యమగు పూజయనెడు గొప్పనియోగము నకు; న+అర్హున్=అనర్హు = తగనివానిని; అర్హుఁడు+అని= తగినవాఁడని; అచ్యుతుణ్ = కృష్ణుని (చచ్చుపిన్నును) అర్చి తున్+చేయున్+పాడి+ఏ=పూజించుట ధర్మమా ? (కాదు)

తా. కృష్ణుని యందు మీకంత యిష్టమున్నచో. ధన మీయవచ్చును. వాని కోరికలు తీర్పవచ్చును, కావలసిన

తెన్నుగా పోషింప వచ్చును. ఇంతేగాని మహాత్ములున్న రాజ సభలో బ్రాహ్మణుఁడుగాని వానిని బ్రాహ్మణుని వచ్చుపేరుగను కృష్ణుని పూజించుట న్యాయముకాదు.

విశే :—ఇచ్చు+చు+ఁడు=ఇత్తుఁడు – సూ. చువర్ణంబు తోడిదుగ్ధకారంబునకు తకారంబగు, కార్యము(ప్ర)కర్జము(వి); మనుచు+ఁడు=మంతుఁడు–సూ. చువర్ణకంబు పరంబగు నపుడు అన్వాదులను స్థానంబున సున్నయగు = మంచు+చుఁడు; (2) చువర్ణంబుతోడి దుగ్ధకారంబునకు తకారంబగు = మంతుఁడు; విప్రుఁడు (వ్యు) తనను, పరుని విశేషముగా పాపము నుండి రక్షించువాఁడు (బ్రాహ్మణుఁడు) అచ్యుతుడు (వ్యు) నాశనము లేనివాఁడు (కృష్ణుడు); ఇక్కడ 'అచ్యుత' శబ్దము నిందార్థమున వాడబడినది. నిందార్థ మెట్లు వచ్చె ననగా ? భీష్ముఁడు ధర్మరాజుతో "అఖిలలోక పూజ్యు నచ్యుతు బూజింపు ! మధిప ! యదియచూవె యజ్ఞఫలము" అని చెప్పినాఁడు. భీష్ముఁ డుపయోగించిన అచ్యుత పదమునే శిశుపాలుఁడు వెక్కిరింపుగా పునః ప్రయోగము అర్థాంతరమున చేసి నట్లు నన్నచుభట్టు రచించి గంభీరభావము గల్పించినాఁడు. అచ్యుతుడు...అని అర్థాంతరము గల్గుట ప్రాచీన వ్యాకరణ సంప్రదాయ సమ్మతము శిశుపాలునకు కృష్ణుని యెడగల ద్వేషమంతియు ఆ పదములో బ్రక్కినట్లున్నది. అచ్యుతుడు అనగా ఆ చచ్చువాఁడు అనగా ఆచచ్చు పీనుగ పూజార్హుఁడా ? అని సమన్వయించుకోవలయును. పలుకుబడి

లోనే అర్థవిశేషము. ఈపద్యములో 'కేశవ' అన్నచోట కూడ నిందార్థమే కదా!

బ్రహ్మశ్రీ వేమూరి సీతారామశాస్త్రిగారి సమర్థన నుదహరించుచున్నాను :-

"అఖిల లోకపూజ్యు నచ్యుతు సర్వంపుఁబుము" అని భీష్మ వాక్యము; చ్యుతి=నాశము; అదికలవాఁడు చ్యుతుఁడు; చ్యుతుఁడు కానివాఁడు అచ్యుతుఁడు - నఞ్ తత్పురుషము; చ్యుతి ప్రాణిమాత్ర సాధారణము; అదియొకానొఁనును లేని వాఁడగుటచే అఖిలలోక పూజ్యుఁడచ్యుతుఁడు; కావున నీవగ్ర పూజ యొనర్పుము" అని భీష్ముడు బోధించెను; అది సైపని శిశుపాలుఁడు పూజ్యతాసాధకముగా భీష్ముఁడు వాడిన అచ్యుత శబ్దమునే పూజ్యతాబాధకముగా అర్థాంతర కల్పనచేసి త్రిప్పి కొట్టినాఁడు; చ్యుతి=భ్రంశము; చ్యుతుఁడు=భ్రష్టుడు "నవిద్యతేచ్యుతో యస్మాత్ సః అచ్యుతః" అని పంచమీ బహువ్రీహి. "నవిద్యతే ఉత్తమో యస్మాత్సః అనుత్తమః సర్వోత్తమః" అన్నట్లు; అనగా ఎవని కంటె చ్యుతుఁడు లేఁడో (భ్రష్టుఁడు) వాఁడచ్యుతుఁడు; సర్వథాభ్రష్టుఁడని భావము; పూతనా జీవితహారః ధేనుకాసుర భంజనః వృషభాసుర విధ్వంసీ - అనుటం బట్టి శిశుపాలుని దృష్టిలో స్త్రీహత్య గోహత్య మొదలుగా గల కృత్యములు చేయుటచే సర్వదా భ్రష్టుఁడని భావము.

4. వసుమతి+ఈశ = రాజా! వృద్ధు+అని= పెద్దవాఁడని; పూజించితి + ఏ=పూజించితివా? ద్వైపాయనుండు+ఉండన్ = వ్యాసుడుండగా; ఋత్విజుండు+ అని=యజ్ఞము చేయించువాఁడని; ధర్మయుక్తిన్ = న్యాయముయొక్కకూడికతో; కృతమతుల్ =నిశ్చితమైనమనస్సులుగలవారు (లేక) విద్వాంసులు; ఆచార్యుడుఅని = గురువని; వినయమునన్ = అణకువతో; భూనాథుడుఅనియెడుబుద్ధిన్ = రాజను అభిప్రాయముతో; అవనిలోన్ = భూమిలో; పూజనీయులైనపురుషులలోపలన్ = అర్చింపఁదగినమనుష్యులలో; ఒల్లక=ఇష్టపడక; భీష్మపనుపున్+చేసి=భీష్మునిఆజ్ఞప్రకారముచేసి; బేలవు + అయితి= మూర్ఖుడవయితివి.

తా. ఈ సభలో వసుదేవుఁడుండఁగా వయసున పెద్దవాఁడని కృష్ణునిపూజించితివా? వ్యాసునంతటివాఁడుండఁగా ఋత్విజుఁడని కృష్ణునిపూజించితివా? గురూత్తములైన ద్రోణకృపులుండఁగా గురువని కృష్ణునిపూజించితివా? రాజని పూజించితివందువా యాదవులకు రాజ్యార్హత లేదుకదా! కనుక కృష్ణుఁడు పెద్దవాఁడా కాఁడు, ఋత్విజుఁడా కాఁడు, ఆచార్యుఁడా కాఁడు, రాజా కాఁడు. పూజనీయులైన పురుషుల లెక్కలోనికే రాఁడు. భీష్మునిమాటపట్టుకొని తగినవారినిపూజింపక మూర్ఖుఁడవైతివి.

వి శే:—వసుమతి (వ్యు) ధనము దీనియందుకలదు (భూమి) వసుమతి + ఈశ = వసుమతీశ — సవర్ణదీర్ఘసంధి; ఋత్విజుండనివిచారించి — ఋ-వళి; ద్వైపాయనుడు (వ్యు)

ద్వీపమే స్థానముగాఁగలవాఁడు (వ్యాసుఁడు) మతి (ప్ర)మది (వి)
యాదవుల్ రాజులేయువనిమీఁద — (ఐతిహ్యము-Allusion)
యయాతిచంద్రవంశపురాజు. అతఁడు దేవయానిని పెండ్లాడెను.
దేవయానికి యదువు, తుర్వసువనునిద్దఱుకుమారులుగల్గిరి.
దేవయానిదాసియగు శర్మిష్ఠనుగూడ యయాతి చేరదీసి
ద్రుహ్యువు, అనువు, పూరుఁడనుకుమారులంగనెను. యయాతి
ముసలివాఁడై యింకను భోగములనుభవింపనిచ్ఛగల్గి పుత్రు
లనుపిలిచి తన ముసలితనముగైకొని వారియౌవనమునిమ్మని
యడిగెను. కొడుకులునిరాకరించిరి. కాని శర్మిష్ఠకొడుకు
పూరుఁడు తండ్రిసౌఖ్యమే తనసౌఖ్యమనిభావించి వానియౌవన
మిచ్చెను. యయాతిపెద్దకొడుకగు యదువును తక్కినవారిని
రాజ్యార్హతలేనివారినిగా శపించి కొన్నాళ్ళుభోగములనుభ
వించి మరలపూరుని యౌవనమును పూరునకిచ్చి వానిని
రాజ్యాభిషిక్తునిఁ గావించెను. యదువంశమునపుట్టినవారు
యాదవులు రాజ్యార్హతలేనివారైరి.

ధర్మనందనా=ధర్మరాజా! ఈ యుధిష్ఠిరుఁడు=ఈ ధర్మ
రాజు; రాజులలోనన్; పురుషవిశేష విత్తముఁడు=పురుషులలో
మిక్కిలి ప్రసిద్ధి పొందినవాఁడు; పూజ్యుఁడు అని=గౌరవింపఁ
దగినవాఁడని; ధారుణీశ్వరులు=రాజులు; మనంబులలోనన్=
మనస్సులందు; నీగుణ+ఆళి=నీగుణముల సమూహము; ప్రక
టించి = వెల్లడిచేసి; భవత్ + ముఖంబునకున్ వచ్చినన్=
నీయజ్ఞమునకురాఁగా; పరఁగన్=చక్కఁగా; అవజ్ఞ+చేయుట=

అవమానపఱచుట, ఇది = ఇట్టి అవమానము; పాడియే = యుక్తమా? ధర్మువు+ఎ=న్యాయమా?

తా. ధర్మరాజా! రాజులలో పూజ్యుడు ప్రసిద్ధుడు ధర్మరాజు, మన మందఱము వాని యజ్ఞమునకు పోవలయు నని మనస్సులో నీ మంచి గుణము లెన్నుకొని యెంతో ప్రీతితో రాగా నింతమంది కీ విధముగా నవమానము గలుగ జేయుట న్యాయమా? ఇది తగునా?

వి శే:—యుధిష్ఠిరుడు = యుద్ధమునందు స్థిరముగా నిలుచువాఁడు (ధర్మరాజు) గుణము (ప్ర) గొనము (వి) గుణము (నానా) స్వభావము, అల్లెత్రాడు, తామర కాడలోని దారము; ధారుణి+ఈశ్వరుడు = ధారుణీశ్వరుడు- సవర్ణదీర్ఘ సంధి; భవత్+ముఖము = భవన్ముఖము – అనునాసిక సంధి; విధము (ప్ర) వితము (వి) ఈ+విధము=ఇవ్విధము – త్రికసంధి; ధర్మువు-సూ. అర్థాదులకడ యచ్చున కుత్వంబునకు మీఁద వు వర్ణకంబును వైకల్పికంబుగా నగు.

6. నీవు+ఎఱుగక + ఇచ్చినన్ = తెలియక ఒకవేళ నీవిచ్చి నప్పటికి; ఇది నా విషయము+ఎ = ఈ యర్ఘ్యము నాకొఱకే; అని మనంబునన్ తలంపక =(నాకిచ్చిరే! ఇదినాకు [illegible]దేయని) మనస్సులో అనుకోక; లజ్జావిరహితుడు అయి= సిగ్గులేనివాఁడై; గోవిందుఁడు = కృష్ణుడు; అర్ఘ్యమున్+కొని యెన్ =అర్చన పుచ్చుకొనెను; ఉచితంబు+ఎ=తగునా!

తా. నీవు ఏకవేళ తెలియక యిచ్చినప్పటికి 'నాకిచ్చిరే, నేను దీనికి తగను' అని మనస్సులో ననుకోక సిగ్గులేక అర్ఘ్యము గోవిందుడు గ్రహించినాడు. ఇది తనకు తగునా?

విశే:—విషయము (నా) సంగతి, దేశము; గోవిందుడు (వ్యు) భూమినిగాని, గోవునుగాని, స్వర్గముగాని వేదమునుగాని పొందెడువాడు (కృష్ణుడు) లజ్జ (ప్ర) లజ్జ (వి)

7. ఇలన్ = భూమియందు; కృష్ణున్+పూజించుట= కృష్ణున కర్ఘ్యమిచ్చి గౌరవించుట; చనన్ = ఒప్పునట్లు, పేడికిన్ = నపుంసకునకు; దారక్రియయునున్ = పెండ్లియును, చెవిటికిన్ మధురగీతియునున్ = చెవిటివానికి తియ్యని సంగీతమును; చీకునకున్ = గ్రుడ్డివానికి; అతి+అనుపమ+సురూప దర్శనమునున్=మిక్కిలి సాటిలేని సుందరాకారము చక్కచూచుటను; పోలున్ = పోలును.

తా. కృష్ణున కర్ఘ్యమిచ్చుట నపుంసకునకు పెండ్లి, చెవిటివానికి సంగీతము, గ్రుడ్డివానికి మంచి యందమైన వస్తువును చూపుట వంటిది. అనగా నవి యెంతనిష్ప్రయోజనములో కృష్ణుని పూజించుట అంత నిష్ప్రయోజనము.

విశే:—అతి+అనుపమ= అత్యనుపమయణాదేశసంధి; రూపము (ప్ర) రూపు (వి)

ధీయుత = బుద్ధితో కూడినవాడా! ధర్మరాజు+అనువిశేషసమాఖ్య = ధర్మరాజను గొప్పపేరు; నిర్+అర్థకంబు+

కొన్ = నిప్పు)యోజన మగునట్లుగా; ఈ+అవని+ఈశ్వర ప్రవరులు = ఈ రాజశ్రేష్ఠులు; ఇంతఱుక = ఇంతమంది; నిన్ను+నగన్+కన్ = నిన్ను చూచి నవ్వునట్లుగా; చేయుదు+ఎ = చేయుదువా? అంచున్ = అని పల్కుచు; చైద్యుడు = చేది దేశపు రాజగు శిశుపాలుడు; స+పుత్ర+బలుండు+ఐ = కుమారుని తోడను; సేనతోడను కూడిన వాడై; సదంబు+వెల్వడి = సభలోనుండి బయలు దేరి; అల్కతోన్ = కోపముతో; ధర్మజ+నదీసుత+కృష్ణులన్ = ధర్మరాజును, భీష్ముని, కృష్ణుని; ఎగ్గులు+ఆడుచుక పోయెక = నిందించుచు వెళ్ళెను.

తా. రాజా! నీవు చేసిన పనికి రాజులందఱు నవ్వునట్లుగా జేసి, ధర్మరాజను పేరు పోగొట్టు కొంటివి. అని పలుకుచు శిశుపాలుడుకొడుకుతో సైన్యముతో సభలోనుండి లేచి పోయెను. కోపముతో ధర్మజ భీష్మ కృష్ణులను నిందించుచు పోయెను.

వి శే :—అల్క సూ. అచ్చికంబులం బద మధ్యంబుల న, ల, డ, రల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగానగు.

9. పిఱుందను+అ = వెనుకనే; చని = వెళ్ళి; ధర్మనందనుండు = ధర్మరాజు; ప్రియవచనంబులన్ = ఇష్టమైన మాటలతో; అనునయించు చున్ = బతిమాలుచు;

10. భూరిగుణ+ఉన్నతులు+అనన్ తగువారికిన్ = పెక్కు మంచి గుణములచే గొప్పవారన దగిన వారికి (గుణవంతులకు) ధీరులకున్ = పండితులకు; ధరణీ వల్లభులకున్ = రా

లకు; వాక్ + పారుష్యము = మాటల కఠినత్వము, (పలుకు ప్రల్లదనము ఇది సప్త వ్యసనములలో నొకటి) చన్నె = తగునా ? (తగదు); అది = ఆ వాక్పారుష్యము; దహనము కంటెన్ = అగ్ని కంటెను; విషహాత్ + దారుణము = మిక్కిలి భయంకర మైనది.

తా. గుణవంతులకు, పండితులకు, రాజులకు పలుకు ప్రల్లదనము పనికిరాదు. అది యగ్ని కంటెను, విషము కంటెను భయంకర మైనది.

వి శే :—భూరి (నానా) విస్తారము; బంగారము; గుణ+ ఉన్నతులు=గుణోన్నతులు – గుణసంధి; ధీరులు = పండితులు "ధీరో మనీషీజ్ఞః ప్రాజ్ఞస్సంఖ్యావాన్ పండితఃకవిః" అమరము. విషము (ప్ర) విసము (వి). గుణవంతులకు, పండితులకు, రాజులకు పనికిరాదనిన గుణహీనులకు, అపండితులకు, రాజులు కానివారికి పనికివచ్చునను ఆశంక సమర్థించుకొన- చాకచక్యము గలవారికే పనికిరాదనిన ఇతరుల కసలే పనికి రాదని పరిహారము.

11. ఆదిజుఁడు + ఐన = మొట్ట మొదట పుట్టిన; బ్రహ్మ+ఉదయంబునకున్ = బ్రహ్మరెక్కు పుట్టుకకు; ఆస్పదము+ఐనవాఁడు = చోటైనవాఁడు; వేద+ఆదిసమస్త వాఙ్మయములు అందున్ = వేదము మొదలగు సకల విద్యలయందు; ప్రశంసితుఁడు+ఐనవాడు = పొగడబడినవాఁడు; లోక+అది = లోకములకు మూలము (లేక) ప్రమాణము; త్రిలోక

పూజ్యుఁడు+అని = స్వర్గ, మర్త్య, పాతాళ లోకములందు పూజింప దగినవాడు; అని ఆత్మన్ ఎఱింగి-అని మనస్సులో తెలిసికొని; పితామహుండు = భీష్ముడు; దామోదరున్ = కృష్ణుని; పూజ్యుఁడు అని చెప్పెన్ = పూజింప తగినవాడని చెప్పెను; యుక్తము+అ+కాక = తగినదేకాని; ఇది+ఏమి+దోసము+ఏ = ఇదేమి తప్పా! (తప్పుకాదు)

తా. సృష్ట్యాదిని ఉద్భవించిన బ్రహ్మపుట్టుకకు కారణభూతుడైన వాడును, వేదాది సమస్త విద్యలయందు పొగడఁదగినవాడును, లోకములకాదియైనవాడును, ముల్లోకములందు పూజింపదగినవాడునగు కృష్ణుని పూజ్యుఁడనుట యొప్పేకాని తప్పుకాదు. అతడట్టిమహానుభావుడని యెఱింగియే భీష్ముఁడు వానినిగూర్చి చెప్పినాఁడు.

విశే:—బ్రహ్మ (ప్ర) బమ్మ (తేక) బొమ్మ (వి) బ్రహ్మ (వ్యు) ప్రజలనువృద్ధిపొందించువాఁడు; లోకము (నానా) ప్రపంచము, సమూహము ప్రజ. వాక్ + మయము = వాఙ్మయము—అనునాసికసంధి; త్రిలోకములు—ద్విగుసమాసము; దామోదరుఁడు (వ్యు) ఉదరమందుతులసిమాలిక గలవాడు (కృష్ణుఁడు) దోసము (వి) దోషము (ప్ర)

12. శిశుపాలా! పరమ+అర్థప్రతిభన్ = మిక్కిలి ప్రయోజనమగు బుద్ధివిశేషముతో (నిష్పక్షపాతబుద్ధితో) తమస్+హరున్ = అజ్ఞానమనెడుఅంధకారమును పోగొట్టువానిని; అచ్యుతున్ = తనపదవినుండి భ్రంశమునొందనివానిని;

నీకున్ఎఱుగన్+అరిది = నీవు తెలిసికొనుట అశక్యము; పెద్దల చరితంబు=గొప్పవారినడవడి; అల్పులకున్+కొద్దిపాటివారికి;

తా. శిశుపాలా! అజ్ఞానాంధకారమును పోగొట్టు శ్రీకృష్ణుని భీష్ముఁడు తెలిసికొనినట్లు నీవు తెలిసికొన నీతరమా? పెద్దల చరిత్రి లల్పులెఱుఁగనేర్తురా? (పెద్దల మహిమ సామాన్యబుద్ధిగలవారికి తెలియదనుట)

13. నీకంటెన్ వృద్ధతములు+ఐన+నర+ ఈశ్వరులు= నీకంటెపెద్దలగు రాజులు; అచ్యుతు+అర్చన=కృష్ణునిపూజను; ఎడన్ +మనస్సునందు; (మనఃపూర్వకముగా) గురుఁడు+ అని = గొప్పవాడు, పూజింపతగినవాడని; సమస్తలోక+ ఉత్తరుఁడు+అని = అన్నిలోకములందుశ్రేష్ఠుఁడని; కరము+ అభినందింపన్ =మిక్కిలిపొగడగా; తగును+ఏ=ఒప్పునా ?

తా. నీకంటెగొప్పవారగు రాజశ్రేష్ఠులు కృష్ణునే పూజింపతగినవాడని,సమస్తలోకములలో పూజ్యుడని యంగీకరింపగా నీవు తిరస్కరింపన్యాయముకాదు.

వి శే:—నర+ఈశ్వరులు= నరేశ్వరులు; లోక+ఉత్తరుఁడు+ లోకోత్తరుఁడు—గుణసంధి; అచ్యుతు+ అర్చన= అచ్యుతునర్చన—సూ. షష్ఠీసమాసమందు ఉకారఋకారంబులకు అచ్చుపరంబగునపుడు నుగాగమంబగు; ఎడ (రూ) ఎద;

14. పట్టు+పఱచుచు+ఉన్న = శాంతింపచేయుచున్న

15. భూపాలక=ధర్మరాజా!; పాలిత దుర్ణయుండు= ...ంపబడిన అవినీతికలవాఁడగు (చెడ్డనడవడి గలవాఁడు) శిశు

పాలుఁడు; బాలుఁడు=మూర్ఖుఁడు; నీచవీసిన్+పట్టుపటుపన్+
ఏల=నీకిట్టి మూర్ఖుని శాంతింపచేయుట యొందులకు; రాగ+
కోప+పరిభూత+మనస్క-సకన్=అనురాగము చేతను, కోప
ము చేతను, తిరస్కరింపబడిన మనస్సు గలవాని కనగా రాగ
ద్వేషపూరితునకు; అల్పరాజ్యలక్ష్మీ+లలన+అంధ బుద్ధికిన్ =
కొద్దిపాటి ప్రభుత్వసంపద యను స్త్రీచే గ్రుడ్డిగా చేయబడిన
మనస్సు గలవానికి అనగా కొంచె పాటిరాజ్యము గల్గిన
హేతువుచేత మిగుల గర్వించి కన్ను కానకున్న వానికి; అని
మిత్త+మహాత్+పరివాదశీలికిన్=కారణము లేకయే; గొప్ప
వారిని నిందించు స్వభావముగల వానికి "మహాత్ As the
first member of a Tatpurusha compound and
a few other cases, remains unchanged, while in
Karmadharaya and Bahuvrihi compound it is
changed to మహా" 665. Apt, వీనికిన్ = ఈ శిశుపాలు
నకు; మఱి = ఇంకను; ధర్మువు+ఎఱుంగన్+పోలును+ఎ =
న్యాయము తెలిసికొన శక్యమా ? కాదు.

తా. శిశుపాలుఁడు చెడ్డనడవడి కలవాఁడు; మూర్ఖుడు.
అట్టి వానిని శాంతింప చేయునేల ? రాగ ద్వేష పూరితుడును,
కొలదిపాటి రాజ్య సంపదకే కన్నుగానక గర్వించువాడును,
కారణము లేకయే పెద్దలను నిందించు స్వభావము గలవాడు
నగు వీనికి ధర్మము తెలిసికొన శక్యమా !

విశే:—లక్ష్మి (ప్ర) లచ్చి (వి); రాజ్యలక్ష్ములలన - రూపకము; న+నిమిత్తము = అనిమిత్తము - నఞ్ తత్పురుషము;

16. వారించి = అడ్డగించి;

17. శిశుపాల! అవినయ బుద్ధివి+ఐ = అధర్మమగు మనస్సు గలవాడవై; హరికిన్ = కృష్ణునకు; అర్ఘ్యము = పూజార్థమునకుతగిన జలాదిక మిచ్చుట; అయోగ్యము+అ+అంటి = తగనిదే యనిపలికితివి; మూర్ఖవు = అవివేకి! ఇంకన్ పలుకన్ వలసెన్ = మూర్ఖుడవు కనుక నింక చెప్పవలసి వచ్చినది; ఈ+అవనిపులు+ఎల్లన్ = ఈ రాజులందరు; పరిముక్తులు = విడిచి పెట్టబడినవారు; ఆహవజితులున్ = యుద్ధమునందు జయింపబడినవారు, తదీయ+శరణ+అర్థులున్+కాక = ఆ కృష్ణ సంబంధమైన రక్షణమును కోరినవారును గాక; ఒరులు+అయ్యె = ఇతరులా ?

తా. శిశుపాలా! నీవు దుర్బుద్ధి గలవాడవై మూర్ఖుడవై కృష్ణున కర్ఘ్య మిచ్చుట తగదంటివి. కనుక గట్టిగా చెప్పవలసి వచ్చినది. ఈ సభలో నున్న రాజులందఱును కృష్ణుని దయవలననే విడిపింప బడినవారు, అందరు అతనిచే జయింపబడిన వారే. అందఱు నతనిని శరణు వేడినవారే కాని యితరులు లేరు.

విశే:—మూర్ఖవు- సూ. ప్రథమాంతంబులగు యుష్మదస్మద్వి శేషంబులకు ఏకత్వంబున వు, నులును, బహుత్వంబున

డు, మఱియును అంతర్గమములు ప్రాయికంబుగానగు. అగుచో ఉత్వంబునకు అత్వంబగు. మూర్ఖుఁడు (ప్ర) మొఱకు (వి).

18. ఉత్తమజ్ఞాన వృద్ధునాన్+ఉండెన్+ఏనిన్=శ్రేష్ఠమైన తెలివిచే పెద్దవాడైనవాడు అనునట్లుగా నున్న యెడల అనగా గొప్పజ్ఞానియైన యెడల; బాలుడు+అయ్యున్=వయసున చిన్నవాడైనను; పూజ్యుండు = గౌరవింప తగినవాడు; ఉర్విపతులలోనన్ = రాజులలో; అమితవిక్రమ సమృద్ధిన్ = విస్తారమగు పరాక్రమముయొక్క సంపదచే;

తా. వయస్సున చిన్నవాడైనను ఉత్తమ జ్ఞానాధిక్యుడేని బ్రాహ్మణుడు పూజ్యుడు. పరాక్రమాధిక్యుడైన యెడల క్షత్రియుడు పూజ్యుడు.

వి శే :—జ్ఞానవృద్ధు-తృతీయా తత్పురుషము; బ్రాహ్మణుఁడు (ప్ర) బాపఁడు (వి)

19. ముర+అరాతి+అ=మురుడను రాక్షసునకు శత్రువైనవాడు కృష్ణుడే; అర్హుఁడు = తగినవాఁడు; మాకు+అ+కాదు = మాకేకాదు; జగత్+ఆధారుండు = లోకములకు కారణభూతు డగు నతడు; విష్టపత్రయ + ఆవాసు లకున్ = మూడులోకములందు నివసించువారికిని; సదా+ఆరాధ్యుఁడు = ఎల్లప్పుడు పూజింప తగినవాఁడు;

తా. పైని చెప్పిన రెండు కారణములచేత కృష్ణుఁడే అర్ఘ్యమున కర్హుఁడు. మాకేకాదు ముల్లోకముల వారికి సకల లోకాధారు డగు నతడే యెల్లప్పుడు పూజింప తగిన వాడు.

వి శే: — కారణము (ప్ర) కతము (వి) జగత్ + ఆధారుఁడు = జగదాధారుఁడు – జశ్త్వసంధి; ముర + అరాతి = మురారాతి - సవర్ణ దీర్ఘ సంధి.

20 వృద్ధులు + ఒకలక్ష + ఉన్నను = వయస్సున పెద్దలు లక్షమంది యున్నను; బుద్ధియె + ఎవ్వరికిన్ = బుద్ధియొక్కటియే యెవరికో (ఎవరు బుద్ధిమంతులో) వారిన్ పూజింపన్ కాఁగ = వారిని పూజించుట కారణము కాగా; ఈ + ధరణీ + ఈశుల లోన్ = ఈ రాజులలో; గుణవృద్ధు + అని = సద్గుణములచేత పెద్దయని; త్రివిక్రమున్ = కృష్ణుని;

తా. వయసున పెద్దవారు లక్షమంది యున్నను ఎవరు బుద్ధిమంతులో వారు పూజ్యులగుటచే గుణవంతుడైన కృష్ణుని పూజించితిమి.

వి శే: — ఈ + ధరణీశులు = ఇద్ధరణీశులు త్రికసంధి–సూ. త్రికంబుమీఁది ఊష్మరేఫేతర అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబు గానగు. ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు, భక్తి (ప్ర) బత్తి (వి) త్రివిక్రముఁడు (వ్యు) బలిబంధన కాలమందు మూడు లోకములను మూడడుగులచే కప్పినవాఁడు (కృష్ణుడు)

21. భూజనులు + ఒరులు = ఇతరులైన ప్రజలు; పూజితులు + అ = పూజింపబడిన వారయితే; తృప్తులు + అగుదురు = తృప్తిపొందినవా రగుదురు (ఎవరు పూజింప బడుదురో వారొక్కరే తనివి పొందుదురు) అచ్యుతుండు పూజితుడు + అగుడున్ = కృష్ణుడు పూజింపబడినవాడు కాగా; తేజమునన్ =

ప్రభావముతో; జగత్ + త్రితయము = మూడులోకములు, పూజితము + అయి = పూజింపబడినదై; పుణ్య సమృద్ధిన్ = పుణ్యముయొక్క సంపదచేత; తృప్తిన్ + పొందున్ = తనివి పొందును;

తా. ప్రజలలో నెవరైతే పూజింపబడుదురో వారే తృప్తిపొందిన వారగుదురు. కాని కృష్ణు నొక్కని పూజించిన చో ముల్లోకములలోని ప్రజలు తృప్తిపొందుదురు.

విశే:—పుణ్యము (ప) పున్నెము (వి)

22. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము — ఈ నాల్గింటికి అంతఃకరణ చతుష్టయమని పేరు. మనోబుద్ధులు రెండే ముఖ్యము. మనస్సు చంచల మైనది, బుద్ధి నిశ్చయ మైనది. పురుషుండున్ = ఈశ్వరుడును; అవ్యక్తము+ అగుచు+ ఉన్న+ప్రకృతియున్ = భేదింపఁ గూడనట్టి శక్తియును (ఈశ్వ రుని యందు తొలుత నొకశక్తి యుండెననియు, విత్తునందు చెట్టును పుట్టించుశక్తి యున్నట్లు, శక్తి యీశ్వరు నుండి భేదింపఁ గూడక యున్నదని గ్రహింప వలయును) అంబరం బున్ = ఆకాశమున్ను; ధరణియున్ = భూమియు; తరణియున్ = సూర్యుడును; దహనుండున్ = అగ్నియు; గాడ్పున్ = గాలియు; తాను+అ+ఐ = అతడేయై; జంగమ+స్థావర+ఆత్మకము+ఐన = చరాచరమైన; సకలభూత ప్రపంచంబున్ + ఎల్లన్ = సమస్త ప్రాణి సమూహమునంతను; తన దివ్యశక్తి+పైన్ = తన శ్రేష్ఠ మైన శక్తితో; తాల్చిన = ధరించిన; సర్వ+ఆత్మున్ = సమస్త మైన ఆత్మలు కలవానిని; సర్వభూత+ఈశ్వరున్ అన్ని ప్రాణు

లకు ప్రభువైన వానిని; సర్వవంద్యున్ = అందరిచే నమస్క-రింపఁదగిన వానిని; అధిక యోగ+నిష్ఠిత+ఆత్మకులు+ అగు= మిక్కిలి చిత్తవృత్తి నిరోధము చేయఁబడిన మనస్సులుగలవారగు; యోగివరులు; గొప్ప మునిశ్రేష్ఠులు; తత్త్వయుక్తిన్+చేసి = వేదాంత సత్యముయొక్క కూడికచేత; ఎఱిగిన అట్టులు= తెలిసికొనిన రీతిగా; అవసరమున్ = సమయమందు.

తా. బుద్ధి, మనస్సు, ఈశ్వరుఁడు, శక్తి, ఆకాశము భూమి, సూర్యుఁడు, అగ్ని, చంద్రుఁడు, వాయువు, దిక్కులు, కాలమును సమస్తము తానేయై చరాచరాత్మకమైన ప్రపంచమంతను తనమహాశక్తితో తాల్చిన సర్వాత్ముని, సర్వభూత ప్రభుని, సర్వవంద్యుని విజితేంద్రియులగు మునిశ్రేష్ఠులు తెలిసికొనురీతిగా నీవు తెలిసికొనలేవు.

విశే:—చంద్రుఁడు (ప్ర) చందురుఁడు (వి) శక్తి (ప్ర) సత్తి (వి)

23. ఎడపక=తప్పక (అడ్డులేక) ఒడంబడము=ఒప్పుకొనము; దుర్జనత్వమునన్=దుర్మార్గమున; మస్తకంబుపైన్= తలపై; ఇడియెదన్=పెట్టెదను; తాఁ=సహదేవుఁడు; చరణము+ఎత్తెన్=కాలెత్తెను; సభాసదుల్=సభయందున్నవారు ఉడిగి=అగి; తద్దయున్=మిక్కిలి; భీతచిత్తులు+ఐ=భయమును పొందిన మనస్సులుగలవారై;

తా. మేముతప్పక కృష్ణునకర్ఘ్యమిచ్చితిమి. మేము దీనికొప్పుకొనమని పలుకఁదనమునపలుకు వారినెత్తిమీద

తన్నాదనని పలుకుచు సహదేవుడు కాలెత్తెను. సభ్యులందరు భయపడి నోరెత్తరైరి.

విశే:—సభాసదుల్ + పలుకక = సభాసదుల్ వలుకక—సూ. ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు;

24. దివంబునన్ = ఆకాశమునుండి; చెలువుగన్ = సొంపుగా; పుష్పవృష్టి = పూలవాన; వెలయగన్ = చక్కగా; సాధువాదములు = లెస్సయైనమాటలు; వించెన్ = వినబడెను; విస్మయ+ఆకులితమనస్కులు+ఐరి = ఆశ్చర్యముచే కలతపెట్టబడిన మనస్సులుగలవారైరి; కలహబంధుండు = వైరమునకు చుట్టము (కలహప్రియుఁడు) కుంచెయున్ = నెమలియీకల కట్టయు; కృష్ణ+మృగ+అజినంబుక = నల్లలేడిచర్మమును; పలుమఱున్ = మాటిమాటికి; వీచుచున్ = విసరుచు; వేడుకన్ = సంతోషముతో, ఆడెన్ = నాట్యము చేసెను;

తా. అప్పుడుసహదేవునిపై పుష్పవర్షముకురిసెను. మంచిమాటలువినబడెను. సభ్యులందరు నాశ్చర్యపడిరి. కలహప్రియుడగునారదుడు సంతోషముతో నాట్యముచేసెను.

విశే:—పుష్పము (ప్ర) పూవు (వి) విస్మయము (ప్ర) విసుమానము (వి) మృగము (ప్ర) మెకము (లేక) మెగము (వి) కలహము (ప్ర) కయ్యము (వి) బంధుడు (ప్ర) బందుగు (వి) నారదుడు (వ్యు) జ్ఞానమునిచ్చువాడు;

25. అతిరోషపరుషవచనుండు = మిక్కిలికోపమువలన కఠినమైనమాటలుగలవాడు; స్వపక్షక్షత్రియులన్ = తనవైపు రాజులను; ఒక్కఅంతన్ = ఒకచోట; అనుమతంబునన్ = ఇష్టముప్రకారము, యుద్ధసన్నద్ధుండయి = యుద్ధమునకు సిద్ధపడినవాఁడై;

విశే:— రోషము (ప్ర) రోసము (వి); పరుషము(ప్ర) పరుసము (వి); శిశుపాలు + అనుమతము = శిశుపాలునను మతము - షష్ఠీసమాసము.

26. రయ = వేగముచే; విచలత్ = మిక్కిలి చలించుచున్న; తురంగమ + తరంగములన్ = గుఱ్ఱములనెడు కెరటముల చేతను, మద + నాగ = మదించిన యేనుగులనెడు; నక్రసంచయములన్ = మొసళ్ళ సమూహముచేతను; సంచలత్ = మిక్కిలి చలించుచున్న; చటుల = తీవ్రమైన, సైనిక మత్స్యములన్ = సేనా సమూహము లనెడు చేపలచేతను; యదు, వృష్ణి, భోజ కుకుర + అంధక + వాహినియున్ = యదువంశజులు, వృష్ణివంశజులు, భోజవంశజులు, కుకురవంశజులు; అంధక వంశజులనెడు సముద్రమును; క్షణంబునన్ = క్షణములో; నిర్దయతర = మిక్కిలి దయలేని; రోష = కోపమనెడు; మారుత = గాలిచేత; నితాంత = ఎడతెగక; సమ్ + ఈరితము + ఐ = మిక్కిలి త్రోయబడినదై; కలంగెన్ = కలతపొందెను.

తా. గుఱ్ఱము లనెడు కెరటములచేతను, మదించిన యేనుగు లనెడు మొసళ్ళచేతను, సైనికులను చేపలచేతను,

భయంకరమైన యమ, వృష్ణి, భోజాంధకుల నెడు సముద్రము క్షోపమనెడు వాయువుచే రేపఁబడినదై, నిమిషములో కలత పొందెను.

విశే :—తురంగము (ప్ర) తురికి (వి); తరంగము (ప్ర) తరఁగ (వి); తురంగము (వ్యు) వేగిరము గాపోవునది(గుఱ్ఱము) నక్రము (వ్యు) భూమి యందు పాద విక్షేపము చేయనిది (మొసలి) అలంకారము రూపకము.

27. సకలక్షత్రియక్షోభంబు+చూచి=సమస్తరాజులు కలంగుటచూచి; భయ+సంభ్రమ+ఆక్రాంత హృదయుండు+ అయి=భయముచేత; తొట్రుపాటుచేత, చుట్టబడిన మనస్సు గలవాఁడై;

విశే :—సంభ్రమము (ప్ర) సంబరము (వి); హృదయము (ప్ర) ఎద (వి);

29. పితామహా=తాతా !; ధరణిలోఁగల రాజులు+ ఎల్లన్ = భూమండలములోని రాజులందరు; దారుణ+క్షయ కాల+సాగరములు+అట్లు=భయంకరమగు ప్రళయ కాల మందలి సముద్రమువలె; ఇప్డు=ఇపుడు; కలంగిరి=కలత పొందిరి; మఖప్రయోగము = యజ్ఞతంత్రము (కార్యము) విఘ్నమున్ పొరయక ఉండఁగన్ = అంతరాయమును పొందకుండ; ప్రజ+ అపకారము+పుట్టక+ఉండన్=ప్రజలకుకీడుకలుగకుండ; చెర+ చెర=చఱ్ఱర=శీఘ్రముగా; చిత్తశాంతి= మనస్సునకు నెమ్మది జనకర్పము+ఏ=కలుగ జేయుమా !

శ్రీ, త్రాతా! రాక్షసులందరు ప్రళయ కాల సముద్రములవలె చెలరేగిరి, యజ్ఞమున కంతరాయము కలుగునేమో యని, ప్రజలకు హాని కలుగునేమో యని భయము కల్గుచున్నది. వారిని శాంతింపఁజేసి యజ్ఞమును నిర్విఘ్నముగా కొనసాగునట్లు, ప్రజల కేహానియు కలుగకుండునట్లు చేయుమా!

విశే:—చెర + చెర = చెచ్చెర—సూ. అందదుక ప్రభృతులు యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు; ఒనర్పుము+ఏ=ఒనర్పవే—సూ. ఎదాదులను ప్రయుక్తంబులగునపుడు ముజ్జునకు వుజి, రుఁటయగు. (ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య—ఇవిఎదాదులు) అగుచో ధాతువు ఉత్వంబునకు అత్వంబగు; తరలలక్షణము—ప్రతిపాదమునందును న, భ, ర, స, జ, జ, గురువు వరుసగానుండవలయును. 12వ అక్షరము యతిస్థానము. ప్రాసనియమముగలదు. తరలపాదముయొక్క మొదటిరెండులఘువులను ఒకగురువుగామార్చినచో నది మత్తకోకిలపాదమగును.

30. జితదైత్యుఁడు=జయింపబడినరాక్షసులుగలవాఁడు (రాక్షసులనుజయించినవాఁడు) యజ్ఞపురుషుఁడు=యజ్ఞఫలము నిచ్చువాఁడు; నారాయణుఁడు=కృష్ణుఁడు; అజేయపరాక్రముఁడు = జయింపఁదగని పరాక్రమముగలవాఁడు; దీనిని+చేకొని+కావన్=ఈయజ్ఞమునుపూని రక్షింపఁగా; ఒరులు=ఇతరులు; విఘ్నము+చేయన్ ఓపుదురు+ఎ=పాడుచేయగలరా

తా. రాక్షసులచే పూజింపబడువాడును, మహాపరాక్రమ వంతుడు యజ్ఞ ఫలమునిచ్చువాడును నగు శ్రీకృష్ణుడే పూని నీయాగమును రక్షించుచుండగా నితరులెవ్వరు నీయజ్ఞమున కంతరాయముకలిగింపగలరు ఎవ్వరును హానుచేయలేరు.

విశే:—యజ్ఞము (ప్ర) జన్నము(వి) దైత్యుడు(వ్యు) దితికొడుకు (రాక్షసుడు) నారాయణుడు (వ్యు) అవతారముల యందు నరశరీరమును పొందువాడు (విష్ణువు)

31. చైద్యునకు+ఐ=చేది దేశపురాజగు శిశుపాలునకై; పూని=ప్రయత్నించి; సన్నద్ధులు+ఐ= యుద్ధమునకుసిద్ధపడిన వారై; ఈక్షణంబు+అ=ఈక్షణములోనే; అల్గిచూచుడున్= కోపించిచూడగా; అంతకక్షయమునకు = యమునియింటికి (క్షయమునగాఇల్లు —"ఉటజాధామని వేశస్సరణంక్షయః" అని అమరము) అరిగెడువారు+అ=వెళ్ళెడువారే; ఘోర+ ఆహవమునన్= భయంకరమైనయుద్ధమునందు; దమఘోష నందను+దర్పంబున్=దమఘోషుడనువానికొడుకు—శిశుపా లుడు—వానిగర్వమును; ఇప్పుడు+అ +అరిగెడున్=ఇప్పుడే పోవును; కడున్+ఎక్కుడు+అయ్యున్=మిక్కిలిఎక్కువైనను ఇభకుంభ=ఏనుగులయొక్కకుంభస్థలములను; దళన=చీల్చుట యందు; మహిష్ఠ=మిక్కిలి; నిష్ఠుర=కఠినములైన, నఖ ముఖుడు= గోళ్ళకొనలుగలవాడు, అగుహరిమీదన్=ఐన కృష్ణునిమీద (సింహముమీద) ఏమిచేయన్+ఓపున్=ఏమి చేయగల్గును? సింహపరాక్రమమున్=సింహముశౌర్యమువంటి

శౌర్యము గలవానిని, కర్ణశూలములు+ఐనన్ = చెవులకు ములుకులవంటివి కాగా; చేదినాథుఁడు = శిశుపాలుఁడు; ఆగ్రహించి = కోపించి;

తా. కృష్ణునకు కోపమువచ్చి చూచిన నేచాలు యుద్ధమునకు సిద్ధపడిన యీ రాజు లందరు చత్తురు. శిశుపాలుని గర్వమిప్పుడే యణఁగిపోఁ గలదు. మదించిన యేనుఁగుల కుంభస్థలములను చీల్చ శక్తిగల గోళ్ళతో నొప్పు సింహము వెనుక బడి యెన్నికుక్కలు మొఱిఁగి యేమిచేయ గలవు? సింహపరాక్రముఁడగు కృష్ణు నెఱుఁగనివా రెవరు? అను భీష్ముని పలుకులు శిశుపాలుని చెవులకు ములుకు లయ్యెను.

విశే :—ఘోర+ఆహవము = ఘోరాహవము – సవర్ణదీర్ఘసంధి; కుక్క (వి) కుక్కురము (ప్ర) సింహము (ప్ర) సింగము (వి)

32. ఈ+ముదివెఱ్ఱి = ఈముసలి పిచ్చివాఁడు (భీష్ముఁడు) పరమ+ఈశ్వరు–కాన్+కొనియాడెన్ = భగవంతుడని పొగడినాఁడు: ధర్మతత్త్వమ్ములు = ధర్మము యొక్క నిజస్వరూపములు; ఎఱుంగరు+అట = ఎఱుగరట; అమాన్యుఁడు = మన్నింప దగనివాడగు భీష్ముఁడు; సామమ్మునన్ = శాంతముతో (మెల్లగా) ఎల్లవారిన్ = అందరను; అవమాన్యులన్+చేసెన్ = అవమానింప తగినవారినిగా చేసెను (అవమాన పతితులను) అంచున్ = అనుచు; బలగర్వితుండు = బలముచే పొగ

శక్కెన వాఁడు-శిసుపాలుఁడు; యాతీక్ష్ణముగ్రన్ = తీక్ష్ణముగా; అల్కతోన్ = కోపముతో;

తా. ఈ పిచ్చి ముసలి తాత భీష్ముడు కృష్ణుఁడే భగవంతుఁడని పొగడుచున్నాఁడు. తనకు పాండవులకే కాని ధర్మస్వరూపములు తెలియువట; ధర్మరాజు వచ్చిన రాజులనెల్ల నతిశాంతముగా నవమానించినాఁడు. అని బలముచే గర్వించిన శిశుపాలుఁడు కటువు చూపులతో భీష్మునిచూచి కోపముతో నిట్లనెను.

వి శే :—ఈ+ముది వెఱ్ఱి = ఇమ్ముదివెఱ్ఱి - త్రికసంధి; పరమ+ఈశ్వరుడు=పరమేశ్వరుఁడు—గుణసంధి;

౪౩. ధర్మనందనుఁడు = ధర్మరాజు; నెట్టన=మిక్కిలి; ప్రవలంబము+చేసి=ఆధారముగా చేసికొని; గతగౌరవుఁడు+ఐ=పోయిన గౌరవము గలవాడై (గౌరవము పోగొట్టుకొని) కడున్ తూలెన్= మిక్కిలి అవమాన మొందెను; చేపట్టి= ఆధారముగా చేసికొని; బిభీషికల్=భయములు (బెదరింపులు) చూపితి=ప్రకటించితివి; దురాత్ములు=దుర్మార్గులు; ధారుణీపతుల్=రాజులు; అంత అధీరులు+ఎ=అంత ధైర్యము లేని వారా (పిరికివారా)

తా. ఓడతో గట్టిన యోడవలె ధర్మరాజు నిన్ను గట్టి యూతగాఁ జేసికొనియున్న గౌరవముకూడ చెడగొట్టుకొనినాడు. కృష్ణుని వెనుకవేసికొని యీ రాజుల నందఱను బెదరించితివి. ఈ రాజులు నీ బెదరింపులకు బెదరువారనుకొను

[illegible] దూరాత్ము
లెవ్వరును లేరు

విశే :— పెట్టిన-గళీ; అవలంబనము+ చేసి= అవలంబము సేసి—గసడదవా దేశసంధి; గౌరవము (ప్ర) గారవము (వి)

34. పూతన+ ఆఘాతంబున్ = పూతనను చంపుటయును; చేతన+ఇతరము+ఐన= ప్రాణము లేనిదగు (నిర్జీవమైనది) శకటంబు త్రోపున్ = బండిని త్రోయుటయు, చరణనిఘాతిన్ = కాలిదెబ్బచేత; ధీరతతోన్ = ధైర్యముతో; కడున్ పూచు ప్రూకల విఱుపున్ = మిక్కిలి నిస్సారమైన చెట్లను విఱుచుటయును; వల్మీకమాత్ర పర్వతమున్ ఎత్తికొని= చీమపుట్టంత పరిమాణము గల కొండను ఎత్తికొని; వీడు లావు గలడు+ అనన్ =వీడు బలమువా డనునట్లుగా; ఏడుదివసంబులు ఉనికియున్ = ఏడురోజు లుండుటయు; వృషవధయునున్ =గోవును జంపుటయును; అనన్ కన్ =అనునట్టివి; పమ్మిన కృష్ణ బీరమ్ములు = వ్యాపించిన కృష్ణుని పరాక్రమ కార్యములు; ఒక్కడు+అయ్యున్ =ఒకటియైనను; నూఱువ్రయ్యలు కాన్+ కన్ =నూఱుచీలిక లగునట్లు; వ్రయ్యవలయున్ =చీలవలయును (బ్రద్దలు కావలయును) అట్లు+అయినన్ + కాని+అతనిన్ పొగడన్ చాలవు=(ఒక్క నాలుకతో పొగడుట, చాలదు) అట్లు నూఱునాల్క లయినఁ గాని కృష్ణుని పొగడుటకు సరిపోవు; ఎల్లదానిన్ =సమస్తమైన దానిని (అంతయు) నేను+అ= నేన= నేనే; అర్ఘ్యదానయోగ్యుఁడు= అర్ఘ్యము పుచ్చుకొనుటకు తగినవాడు; ఎందున్ +అయ్యెన్ = ఎక్కడయ్యెనో;

తా. పూతనయను ఆడు దానిని చంపుట, కొయ్య బండిని కాలితో తన్నుట, విస్తారమైన చెట్లను విఱచుట, పాము పుట్టంత పర్వతము సమాంతముగా నెత్తుట, గోవును, చంపుట యీ మొదలగుపనులను మహాపరాక్రమ కార్యము లని కృష్ణుని గూర్చి పలుకు నీ నాలుక నూఱు ముక్కలైన కాదేమి? పాపము నీకొక్క నాలుక చాలకున్నది. నూఱు నాల్కలైనచో అప్పుడు నూఱురెట్లెక్కువగా కృష్ణుని పొగడ వచ్చును. కృష్ణుని సంగతి నాదగ్గరా చెప్పుట వాడి దివఱ కెక్కడ పూజార్హుడైనాడో చెప్పుము చూతము. (చ. చవికినబండి త్రొక్కుటయు, చెట్లుపెకల్చుట, పాలొసంగుదానవి భువిం గూలం ద్రోయుట, వనంబునం బాముసు, కొంగ, నెద్దు, వా। రువమును, గర్దభంబును, విరోధులటంచు దలంచి చంపుటల్। శివ! శివ! విక్రమంబులని చెప్పంగ జిత్రములయ్యె నియ్యెడన్.)

విశే:—బీరము (వి) వీరము (ప్ర);

## ఐతిహ్యములు (Allusions)

1. పూతనాఘాతము:—శ్రీకృష్ణుడు పసిబాడై యుండగా కంసునిని యోగంబున పూతనయను రాక్షసిసుందరాకారము ధరించి విషదుగ్ధమును ధరించి కృష్ణునకు పాలిచ్చి చంప వచ్చెను. కృష్ణుడు దాని మర్మంబు తెలిసికొని పాలుత్రాగు వానివలె నటించి పాలతోఁగూడ దాని ప్రాణంబులను పీల్చి చంపివేసెను.

2. శకటంబు త్రోపు:—శ్రీకృష్ణుఁడు పిన్నవాఁడైయు న్నప్పుడు యశోద యొక యుత్సవంబు చేయించి వానిని నిద్ర పుచ్చి తనపని చూచుకొనుచుండెను. బాలుడు నిద్రనుండి లేచుసరికి కంసప్రేరితుడైన రాక్షసుడు శకటాకారముతో వచ్చి కృష్ణుని పాదముల దగ్గర వ్రాలెను. బాలస్వభావమున కృష్ణుడు కాళ్ళతో బండిని తన్నెను అది ఆకాశమున కెగ సెను. కృష్ణుఁడు బండితో పైకెగసి దానిని క్రిందకు త్రోసి నాశనము చేసెను.

3. పూచు మ్రాకుల విఱుపు:—ఒకనాడు యశోద అల్లరిచేయుచున్న బాలకృష్ణుని నోటఱోటికి కట్టివేసెను.

కుబేరుని కొడుకులు నలకూబర మణిగ్రీవులను వారు కైలాసమున చేయరాని పనులను చేయుచుండిరి. నారదుడు వారి చేష్టలు చూచి సహింపలేక భూలోకమున మద్దిచెట్లై పుట్టుడని శపించెను. వారు తెలివితెచ్చుకొని నారదుని శాప విమోచనము చేయుమని ప్రార్థింపగా కృష్ణపాద సంస్పర్శమున మరల మీ రూపములను పొందుదురని శాపము గ్రమ్మరించెను.

కృష్ణుఁడు ఱోలీడ్చుకొని పోగా సావృక్షంబులు ఱోటి కడ్డమై విఱిగెను. అందుండి నలకూబర మణిగ్రీవులు వెల్వడి కృష్ణునిపాద పద్మములకు మ్రొక్కి—తమ నివాసములకుపోయిరి.

4. వల్మీకమాత్ర పర్వతము నెత్తికొని:—గోపాలు రింద్రయాగము చేయుచుండగా కృష్ణుడు వలదని మాన్పిం

చెను. ఇంద్రుడు కోపించి రాళ్ళవాన కురిపించెను. కృష్ణుడక్కడనున్న గోవర్ధనపర్వతము నెత్తి గొడుగుగా పట్టి ఆకొండ గొడుగు చాటున, నేకహోత్రములు గోవులను గోపాలురను రక్షించెను.

5. ఒకనాడు రాక్షసుడు వృషభరూపుడై వచ్చి కృష్ణుని చంపఁ బోయెను. పర్వతశిఖరములను బోలు మూపురములతో నొప్పుచు అంకెలు వేయుచు రాగా కృష్ణుడు దాని కొమ్ములను బట్టి నేలఁగూల్చి భయపడుచున్న గోపకాంతలను రక్షించెను.

86. విశ్వసించిన వానిని=నమ్మిన వారిని; వధించుట= చంపుట; స్త్రీవధయున్ = ఆడుదానిని చంపుటయు; గోవధయున్ =గోవును చంపుటయు, అన్యకామిని=పరస్త్రీ;

విశే:—స్త్రీ (ప్ర) ఇంతి (వి); కన్య (ప్ర) కన్నె(వి) అన్యకామినియైన అంబ:—ఐతిహ్యము - అంబ కాశీరాజు కూతురు. ఈమె శిశుపాలుని తమ్ముడగు సాళ్వుని వరించినది. అంబికాంబాలికల స్వయంవర సమయమున భీష్ముడెదురొక్కనిన శత్రురాజుల నోడించి అంబాంబికాంబాలికలను తీసికొని వచ్చి తన తమ్ముడగు విచిత్రవీర్యునకు పెండ్లిచేయ నెంచెను. అంబ అంతకుపూర్వమే సాళ్వునకు దత్తమైనదని ధర్మశాస్త్రజ్ఞులు చెప్పిరి. విచిత్రవీర్యుడది విని అంబను సాళ్వుని దగ్గరకు పంపివేయుమని భీష్మునితో చెప్పగా నతడట్లొనర్చెను.

36. ధర్మనివృత్తచరిత్రక=ధర్మములనుండితొలగిన నడవడి కలవాడా (అధర్ముడు) జననిందితముఅయి= లోకులచే దూషింపబడినదై; అనపత్యత+అను+అధర్మము=సంతానము లేకపోవుటయనుపాపము; నీఅనుశాసనము=నీయాజ్ఞ; (ఉపదేశము)

తా. అన్యాయమైన ప్రవర్తనగలవాడా! నీకు సంతానము లేదు. సంతానవిహీనుడు మహాపాపియందురు. అట్టి వానియుపదేశమును జనులెవరువిందురు.

37. బూతు+పొగడినట్లు = భట్రాజుపొగడినట్లుగా; పొగడెదు= పొగడెదవు; ప్రొద్దుపోక= కాలక్షేపముగుటకు ఉబుసుపోకకు)

తా. భట్రాజువలె అదేపనిగా కృష్ణునిపొగడెదవు. నీకు కాలక్షేపముకానిచో దుర్గుణులనుపొగడిన నేమిలాభము. గుణవంతులైన కర్ణశల్యాదిమహావీరులనుపొగడినచో పుణ్యము పురుషార్థమునగు.

విశే:—శల్యుఁడు (ప్ర) సెల్లుఁడు (వి) ప్రొద్దు (వి) బ్రధ్న (ప్ర)

38. ఆపగాతనూజ= గంగకుమారుడవైనభీష్ముఁడా! అన్యకీర్తనంబున్=ఇతరులనుపొగడుటయును (పరస్తుతి) అన్యనిందయున్=ఇతరులనుదూషించుటయు (పరనింద) తన్నున్= తనను; పరఁగన్=చక్కగా; పొగడికొలున్=పొగడుకొనుటయును (ఆత్మస్తుతి) ప్రబ్బికొలున్=(తనను) నిందించుకొనుట

యును (ఆత్మనింద) వీనిని=ఈనాల్గింటిని; ఆద్యులుఅయిన మునులు=తొల్లిటిమహాత్ములు; ఆర్యవృత్తములుకావు+అనిరి= పూజ్యులైనవారినడవడులుకావని చెప్పిరి (పూజ్యులైనవారట్టి పనులుచేయరనిభావము)

తా. పరస్తుతి, పరనింద, ఆత్మస్తుతి, ఆత్మనింద పనికి రావని పూర్వమహాత్ములు చెప్పిరి.

39. రూక్ష+అక్షరవచనంబులన్ = కఠినములైనఅక్షరములుగలమాటలచే; సహింపన్ఓపక=ఓర్వలేక; అతిరౌద్ర ఆకారంబునన్ =మిక్కిలికోపముయొక్కస్వరూపముచే; అలిగి నన్ =కోపింపగా;

విశే:—అక్షరము (ప్ర) అక్కరము (వి)

40. ప్రభంజనప్రియతనూజునకు= వాయుదేవునిప్రియ మైనకుమారునకు అనగాభీమునకు; అంతకమూర్తికి=యముని యొక్క (మృత్యువు) ఆకారముపొందినవానికి; ప్రకటితకోప వేగమునన్ =ప్రసిద్ధమైన కోపముయొక్కత్వరచే (బాగుగా పైకికన్పడుచున్న కోపాతిశయముచే) పద్మదళ+ఆయత+నేత్ర ముల్ =తామర రేకులవలె విశాలమైనకన్నులు; అరుణద్యుతిన్ = ఎఱ్ఱనికాంతిచేత; భయానకతరలీలన్ + తాల్చెన్= మిక్కిలిభయంకరమైనరీతినిధరించెను. లలాటదేశమునన్ = నొసటిప్రదేశమందు; భృకుటి=బొమముడి; ఉద్యతము+ఐ= పైకెత్తబడినదై ; త్రికూటతటి= త్రికూటపర్వతముయొక్క!

త్రిమార్గగ+ అనుకృతిన్ = గంగానదిని అనుకరించినదానిగా; త్రిశాఖమైన=మూడు రేఖలతో; ప్రోల్చెన్=ప్రకాశించెను.

తా. భీముని కెక్కుడ లేని కోపమావచ్చెను. అతడు మృత్యు దేవతవలె భయంకరాకారుడై యుండెను. కన్నులు భయంకరములై యెఱ్ఱనికాంతుల నీనుచుండెను. భీమునికి నొసటి ప్రదేశమున మూడు రేఖలతో ప్రకాశించెను. బొమ ముడి పైకెత్త బడుటచే మూడు రేఖలు త్రికూట పర్వతము మీఁద మూడు మార్గములుగా ప్రవహించు గంగను బోలి యుండెను.

**41.** నిఖిల క్షత్రియ+త్రాస+జననంబు+కాన్ =సమస్త రాజులకు భయము కలుగు నట్లుగా; అలిగి=కోపించి; దంత సందష్ట=పండ్లుకొఱుక బడుటచే; దారుణ ముఖుండు+ఐ= భయంకరమైన ముఖము గలవాడై; శిశుపాల నిర్యాణ+ ఆభీల+సంరంభంబునన్+ఉన్న = శిశుపాలుని సంహరించుట యందు భయంకరమైన వేగిరపాటుతో నున్న; వారించి=అడ్డగించి; తొల్లి=పూర్వము; జగత్+వల్లభుండు=లోకములకు ప్రభువు; జనార్దనున్=కృష్ణుని; తత్ ప్రసాదంబు=వాని యను గ్రహము, పడయుటన్ చేసి=పొందుటచేత; శత+అపరాధంబులు=నూఱుతప్పులు; నిండు+అంతకున్=పూర్తియగువఱకు; అన్యుల చేతన్=ఇతరుల చేత; అప్రతిహతుండు=అడ్డగింప బడని వాడు (వారింపరానివాడనగా నితరులెవ్వరు వీనినేమియు చేయజాలరు) నిహతుండు+అగున్=చంపబడినవా డగును;

వి శే :—సుఖము (ప్ర) సొంకము (వి)

42. మారుత+ఆత్మజా=భీమసేనా! (వాయుకుమా రుడు) గభీర పరాక్రమ=లోతైన అనగా గొప్ప శౌర్యము గలవాడా! ఉలుక=ఉలుకు (వ్యర్థముగా) ఎగ్గులు+పల్కన్ కన్ పోలెన్ కా క=నిందలు పల్కిన చెల్లినది కాని; ఉద్ధత మతిన్=గర్వించిన బుద్ధితో; అన్యులు=ఇతరులు; మదీయ= నాసంబంధమగు (నాయొక్క) చాప=వింటినుండి; నిర్గత= బయల్వెడలిన; చటుల=తీవ్రమైన; ఉగ్ర=భయంకరమైన; మార్గణనికాయ=బాణసమూహమునందు; పథ్యోధిన్=సము ద్రమునందు; మునుంగక=మునిగిపోక; ఇట్లు దర్పితులు+ఐ+ పోవలెన్+నే ర్తురు+ఎ=ఈ విధముగా పొగరెక్కి తప్పించు కొని పోవగల్గుదురా;

తా. భీమసేనా! పై చెప్పిన కారణములచేత వీడు నన్నిట్లు ప్రేలిన సరిపోయినదిగాని యితరు లెవ్వరైన నిట్లు నన్ను గర్వంబునఁ దూలనాడి నా భయంకర బాణములతో జంపఁబడక యుందురా?

వి శే :—విధము (ప్ర) వితము (వి)

43. అతిక్రమించి=దాఁటి, అభిముఖుండయి=ఎదురు మొగమైనవాడై;

44. కేశవ=కృష్ణా ('కే' అని కేశ, శవ అని సంబో ధన-నిందార్థము) అవమాన్యున్=అవమానింపఁ దగిన వానిని; మాన్యుఁడు+అని=పూజింప దగినవాడని; సౌహార్దంబునన్=

స్నేహభావముచే; కౌరవ+స్థవిర ప్రేరణన్ = కౌరవులలో ముసలి వాడగు భీష్ముని ప్రోత్సాహముచే; పాండుతనయుల్ = పాండు రాజు కుమారులు; తప్పంగన్ = చెడుబుద్ధిచే; అవివేక+అస్ప దులు = అజ్ఞానమునకు చోటైనవారు; మోహ+అంధుండున్ = అజ్ఞానముచేత గ్రుడ్డివాడు; సంగ్రామ రంగంబునన్ = యుద్ధ భూమిలో; కడంగుడు = సిద్ధపడుడు;

తా. కేశవా! ముసలివాడగు భీష్ముని ప్రోద్బలముచే పూజార్హత లేని నిన్ను స్నేహభావమున పాండవులు పూజించిరి. వివేకము లేని పాండవులు, అజ్ఞానాంధుడగు భీష్ముడు, నీవు కూడ నాకు యుద్ధభూమిలో నెదురై నిలబడుడు.

వి శే :—నాల్గవచరణమున 'కే' యని కేశ 'శవ! నీవుం గడంగుడు' అనినింద పలుకు బడిలోనే యర్థవిశేషము. శిశుపాల కథాఘట్టమెల్ల శబ్దార్థగాంభీర్యకలితమై రసోత్తరమై యున్నది.

45. అఖిలరాజచక్రంబు = సమస్తరాజులసమూహము; చక్రధరుండు = కృష్ణుండు;

వి శే:—చక్రధరుండు—బహువ్రీహి. గర్వము (ప్ర) గరువము (వి)

46. ఏము + పోయినన్ = మేముదండెత్తివెళ్ళగా; అన్యాయవృత్తిన్ = అధర్మవ్యాపారముచేత; బాలవృద్ధులకు = పిల్లలకుముసలివారికి; రాజన్యులు = రాజులు; పొలతులతోడన్ = స్త్రీలతో; రైవతక+ అద్రిన్ = రైవతకమనుపర్వతమందు; క్రీడ+అభిరతిన్ = కేళియందుఆసక్తితో; ప్రమత్తులై = మిక్కిలి

మత్తుగొన్నవారై; అదయుఁడు+ఐ=దయలేనివాఁడై; వధియిం చెన్=చంపెను; దేవ+అభుఁడు = దేవతలప్రకాశమువంటి ప్రకాశముగలవాఁడు; అభి+అర్చితంబు + ఐన = చక్కఁగా పూజింపబడిన; హయమున్=గుఱ్ఱమును; అపహరించి=దొంగిలించి;

తా. మేము భగదత్తునిపై దండెత్తినప్పుడు అది సమయముగాచూచుకొని యీ దుర్మార్గుఁడు భయంకరముగా ద్వారకాపురిం గాల్చెను. భోజవంశరాజులు స్త్రీలతోకూడి రైవతకాద్రిపైనుండగా ఆకస్మికముగాపోయి వారినివధించెను. వసుదేవునియజ్ఞాశ్వమును అపహరించెను. బభ్రుభార్య నపహరించి తనభార్యగాఁ జేసికొనెను.

47. వాక్+విషయంబులు=మాటలరూపములు; ఈ+దురాత్ముండు=ఈ దుర్మార్గుఁడు; అపరాధశతంబున్=తప్పుల నూటిఁటిని; అకారణవ్యతిక్రమంబు= నిష్కారణమైనహాని; ఉపక్రమించి=ప్రారంభించి; అతిపరుషవచనుండు = మిక్కిలి కఠినమైన మాటలుగలవాఁడు;

48. దుర్గుణప్రియ=చెడ్డగుణములయందిష్టమైనవాఁడా! నీకూర్మియున్ = నీయనుగ్రహము; నీ అలుక= నీఆగ్రహము; అవి+ఏమిటికి=నాకెందుకు; మొదలన్=మొట్టమొదట; ఆ+కన్యకన్=ఆకన్యయగురుక్మిణిని; చేకొని=గ్రహించి;

తా. దుర్గుణుఁడా! నీయాగ్రహముతో, నీయనుగ్రహముతో నాకేమిపని? నాకిచ్చుటకు నిశ్చయింపబడిన రుక్మిణిని పెండ్లాడిన నీవింకను సిగ్గులేక మాటాడుచున్నావా?

విశే:—ఆ+కస్య=అక్క-స్య – త్రిక సంధి;

49. ఒండొకటన్ = ఒకదాని వెంటనొకటి; అప్రియములు = అయిష్టపు మాటలు (నిందలు) అనలశిఖ+ఆలి=అగ్ని జ్వాలల సమూహము; తూలన్ = చలింపగా; దనుజ+అంతక చక్రము=రాక్షస సంహారియగు కృష్ణునిసుదర్శనచక్రము; రాజ చక్రము+ఎల్లన్ = రాజుల సమూహమంతయు; చేదినందను+ తనువున్ = శిశుపాలుని శరీరమునుండి; బృహత్ +రుధిరధా రలు = పెద్ద నెత్తురు ప్రవాహములు; ఘోరసన్ = పెద్దధ్వని చేయునట్లుగా; మూర్ధవికలంబుగఁ చేసెన్ = తలబ్రద్దలగు నట్లు చేసెను.

తా. అనరానిమాటలను యన్న శిశుపాలునిపై కృష్ణుడు కోపించెను. రాజులెల్లరు నగ్నిజ్వాలవలె మండుట చూచిరి. రాజులందరు భయపడునట్లు శిశుపాలునిశరీరమునుండి రక్తము ప్రవాహమై ప్రవహించునట్లు సుదర్శనచక్రమును ప్రయోగించి వాని తలనుఖండించెను.

50. ప్రల్లదము+ఏది=పరుష వచనముపోయి; వజ్ర+ హత+అద్రితుల్యుడు+ఐ=వజ్రాయుధము చే నఱుకబడిన కొండతో సమానుండై; త్రెళ్ళుచున్ = కూలగా; పృథు దేహమున్ = పెద్దశరీరమునుండి; తేజము = కాంతి; వెల్వడి = బయలు దేరి; అంబరంబు+ఎల్లన్ = ఆకాశ మంతయు; భూపతులున్+ ఎల్లన్ = రాజులందరు; విస్మయ+ఉత్ఫుల్ల విశాల నేత్రులు+ అయి = వింతచేత; వికసించిన పెద్దకన్నులు గలవారై; దేహము+చొచ్చెన్ = శరీరమునందు ప్రవేశించెను;

తా. వజ్రాయుధముచే నఱుకబడిన కొండతో సమానుడైన శిశుపాలుడు పడిపోగా వాని శరీరమునుండి దివ్యతేజస్సొకటి బయల్వెడలి కృష్ణుని శరీరములో ప్రవేశించెను. రాజులందర రాశ్చర్యపడిరి.

శిశుపాలుడు ౹తెళ్ళుడు తేజమంబరంబెల్ల —

జయవిజయు లనువారు వైకుంఠ ద్వారపాలకులు. ఒకనాడు సనకసనందనులను మునులు శిశురూపధరులై రాగా వారిని ద్వారపాలకు లడ్డగించి లోనికి పోనీయరైరి. వారు కోపించి యా ద్వారపాలకులను శపించిరి. ఆ శాప ఫలముగా వారు భూలోకంబున మూడు మారులు జన్మంబులెత్తి అన్ని మారులు విష్ణువుచే సంహరింపబడిరి. మొదటి జన్మమందు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టిరి. వరాహ నారసింహావతారము లెత్తి విష్ణువు వారిని సంహరించెను. రెండవ జన్మమందు రావణ కుంభకర్ణులై పుట్టి శ్రీరామచంద్రునిచే సంహరింప బడిరి. మూడవజన్మమున శిశుపాల దంతవక్త్రులై పుట్టి శ్రీ కృష్ణుని చేతిలోఁ జచ్చిరి.

ప్రశ్నోత్తరములు:—

1\. మీ పాఠ్యభాగము శిశుపాలవధ యే గ్రంథములోనిది? దానిని రచించినకవిని, కాలమును బిరుదములను, ఇతర గ్రంథములను, సమకాలిక కవులను పేర్కొనుము.

శిశుపాలవధ భారతము సభాపర్వము ద్వితీయాశ్వాసము లోనిది. దానిని నన్నయభట్టు రచించెను. అతడు

క్రీ. శ. 1022 మొదలు 1068 వఱకు నున్నవాఁడు (11 వ శతాబ్దము) వానికి ఆదికవి, వాగనుశాసనుడు అను బిరుదులు గలవు. ఆంధ్రశబ్ద చింతామణి, ఇంద్రవిజయము, చాముండీ కా విలాసము, రాఘవాభ్యుదయము మొదలైన గ్రంథములను రచించెను. గణితశాస్త్రమును పద్యకావ్యముగా వ్రాసిన పావులూరి మల్లనయు, అష్టభాషా విశారదుడైన నారాయణ భట్టు వాని సమకాలిక కవులు.

2. భారతభాగముల కేమనిపేరు? అట్లనసేల? భారతమున కేమని ప్రసిద్ధి? అది యే జాతి గ్రంథము? కవిత్రయమువా రెవరు? ఎవరెవ రేయే భాగములు రచించిరి?

భారత భాగములకు పర్వము లనిపేరు. భారత మొక చెఱకుకఱ్ఱతో పోల్చబడినది. పర్వమనగా చెఱకు కఱ్ఱలోని గనుపని యర్థము. గనుపు గనుపునందు రసము చిప్పిలునట్లు భారతము ప్రతి భాగమునందు రసము చిప్పిలు చుండును. కనుక పర్వము సార్థకనామము. భారతమునకు పంచమ వేద మని ప్రసిద్ధి. అది యితిహాసము. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ–ముగ్గురకు కవిత్రయ మనిపేరు. నన్నయ భారతములో ఆది, సభాపర్వములను అరణ్యపర్వములో నాల్గవ యాశ్వాసములో మూడువంతులు రచించెను. తిక్కన విరాటపర్వము మొదలు స్వర్గారోహణ పర్వము చివఱవఱకు 15 పర్వములు రచించెను. ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వ శేషమును రచించెను.

3. మహాభారతమునకు పేరు దానికేల వచ్చెను? నన్నయ కవిత యెట్టిది?

గొప్పదియగు భరతవంశ రాజుల చరిత్రమును వర్ణించునది యగుటచే మహాభారత మనుపేరు వచ్చెను. నన్నయ కవిత్వము ప్రసన్నకథా కవితార్థ యుక్తము. అక్షర రమ్యత గలిగి సకలజనుల కానంద కరముగా నుండును. తత్సమ పదములతో నింపినదయ్యు శైలిసరళమై శరత్కాల గౌతమి వలె నిర్మలమై యుండును.

4. * శిశుపాలుఁడు కృష్ణు నాక్షేపించుచు ధర్మరాజున కేమనెను?

"ధర్మరాజా! రాజాధిరాజు లనేకులుండగా, శిష్టాచార పరాయణులు, పూజార్హులగు బ్రాహ్మణశ్రేష్ఠు లనేకు లుండగా భీష్ముని దుర్బోధవిని దుర్మార్గుడగు కృష్ణుని పూజించి యింత మంది మహారాజులలో నీ యవివేకమును వెల్లడించు కొంటివి దాశార్హుడు పూజార్హుడు కాడు. ధర్మ సూక్ష్మమును తెలిసి కొనుట చాల కష్టము. ఎందరో ఉత్తమోత్తము లుండగా ముసలివాడగు భీష్ముడు మూర్ఖుడై జడుడగు కృష్ణుని పూజింపు మని చెప్పినంత మాత్రమున నీవు చేయవచ్చునా? వృద్ధుల బుద్ధులు సంచలించు చుండునని యెఱుఁగవా? కృష్ణు డనిన నంత యిష్టమున్నచో ధనమీయ వచ్చును, ఇంకను నేకోరిక లున్నను తీర్పవచ్చును. అంతేకాని రాజాధిరాజు లున్న సభలో బ్రాహ్మణశ్రేష్ఠులున్న యీసభలో ననర్హుడై నవాని నర్హుడని

పొగడి పూజించి యర్ఘ్య మీయవచ్చునా? వసుదేవుడుండగా కృష్ణుని పెద్దవాడని పూజించితివా? వ్యాసుడుండగా కృష్ణుని ఋత్విజుడని పూజించితివా? ద్రోణ కృపాచార్యు లుండగా కృష్ణుడాచార్యుడని పూజించితివా? పోనీ! రాజనుకొందువా? యాదవులు రాజులుగారే! ఇంక పూజనీయుడైన కారణమో కృష్ణుడెవ్వ డయ్యెను? భీష్ముని మాటలు విని మూర్ఖుడవై తెలిసి ధర్మరాజు ప్రసిద్ధుడైనవాడు మంచివాడు వాని యజ్ఞమునకు తప్పక పోవలయునని రాజులందరు తలంచి ఆహ్వానమున రాగా నందఱి నీ విధముగా నవమానించుట తగునా? పోనీ నీవు తెలియక యిచ్చినది తన విషయమే యనినైన తలంపక సిగ్గులేక కృష్ణుడు గ్రహింప వచ్చునా? పేడికి పెండ్లి, చెవిటికి సంగీతము, గ్రుడ్డికి నద్దము చూపుటవలన నేమి ప్రయోజనమో కృష్ణుని పూజించుట అంతే ప్రయోజనము. అధర్మకార్య మాచరించి ధర్మరాజను పేరు పాడుచేసి కొంటివి. నీవు చేసినపని కీ రాజులందరు నవ్వుచున్నారు" అని శిశుపాలుడు నిందించెను.

5. శిశుపాలుడు సపుత్రబలుండై సభలోనుండి పోవుచుండ ధర్మరాజు వాని పిఱుందనపోయి యేమని యనునయించెను?

ధర్మరాజు శిశుపాలుని వెంటం జని వాని ననునయించుచు "రాజా! నీవంటిగుణవంతులగు రాజులకు పరుషవాక్యము లాడుట తగునా? అది విషముకంటె, నగ్నికంటె దారుణ

మైనది. బ్రాహ్మణ శ్రేష్ఠు వృద్ధకు మాన్యుఁ డైన వాసుదే వేదాది సమస్త విద్యలయందు కీర్తియందు బలమునందును, త్రిలోక పూజితుడు నని రాజసూయమున భీష్ముడు కృష్ణుఁ జెప్పెను. అది యుక్తమే. కృష్ణు డజ్ఞానాంధకారమును పోగొట్టువాడు. అత డచ్యుతుడు. కృష్ణుని తత్త్వమొక్క భీష్ముడే యెఱుఁగును. పెద్దల చరిత్ర లల్పులెల్లా తెలిసికొనఁ గలరు. సకలలోక గురు డని, సమస్త లోకోత్తరుడని కృష్ణునెల్లవారు పూజించు చుండగా నీవు కాదనవచ్చునా?'' అని పలికెను.

6. శిశుపాలుంబట్టు వఱుచుచున్న ధర్మరాజునకు భీష్ముం డేమనెను?

''ధర్మజా! శిశుపాలుండు నీతి లేనివాడు మూర్ఖుడు. అట్టి వానిని శాంతింపజేయుటకు యత్నింపనేల? ఇతడు రాగద్వేష పూరితుడు. అల్పరాజ్యలక్ష్మి మదాంధుడు. నిర్హేతుకముగా వాదించు స్వభావము గలవాడు. పెద్దలను నిందించువాడు. అట్టివాడు ధర్మ మెట్లు తెలిసికొనఁ గలడు''అని భీష్ముడు ధర్మ రాజుతో పలికెను.

7. * ధర్మరాజును వారించి శిశుపాలుం జూచి భీష్ముఁ డే మనెను?

''శిశుపాలా! కృష్ణున కర్ఘ్య మీయరాదని పలుకు నీవెంత మూర్ఖుడవు. ఈ సభలో నున్న రాజు లందరీ కృష్ణుని దయవలన పరిముక్తులు. అతనిచే జయింప బడిన వారును, అందరును వానిని శరణు పొందిన వారేగాని యితరు డొక్క

డను లేడు. బాలుడయ్యును నుత్తమ జ్ఞానిదైన యెడల, బ్రాహ్మణుడు పూజ్యుడు. పరాక్రమముచేత క్షత్రియుడు పూజ్యుడు. అందుచే కృష్ణుడు పూజార్హుడు. మనకేకాదు ముల్లోకముల వారికిని పూజార్హుడు. అతడే లోకముల కాధారభూతుడు వయస్సున పెద్దలొక లక్షమంది యున్నను లెక్కకురారు. ఎవడు బుద్ధిమంతుడో వాడు పూజార్హుడు, ఇతడు గుణవృద్ధని పూజించితిమి. ఇతరులు జనులు పూజింపబడినవారొక్కరే తృప్తులగుదురు. ఒక్క కృష్ణుని పూజించినచో ముల్లోకములవారు తృప్తులగుదురు. బుద్ధి, మనస్సు ప్రకృతి, పురుషుడు; ఆకాశము, భూమి, సూర్య చంద్రులు, అగ్ని, వాయువు, దిక్కులు, కాలములు, సమస్త చరాచర ప్రపంచమును తన శక్తిచే ధరించిన సర్వాత్ముని, సకల భూతేశుని, సర్వవంద్యుని యోగనిష్ఠగల మహర్షులొక్కరే తెలిసికొనగలరుగాని నీ వంటివారు తెలిసికొనలేరు'' అని భీష్ముడు పల్కెను.

8. ఈ రెండు కారణములు మురారాతియ యర్ఘ్యమున
కర్హుడు—ఈ రెండు కారణము లెవ్వి?

సభలోనున్న రాజులెల్లరు కృష్ణుని దయచేత పరిముక్తులు, అందఱు నతనిచే జయింప బడినవారే. వానిని శరణుపొందనివా డొక్కడు నా సభయందు లేడు.

వయసున చిన్నవైనను నుత్తమజ్ఞాన వృద్ధైనచో బ్రాహ్మణుడు పూజ్యుడు అమిత విక్రముడైనచో రాజులలో

* క్షత్రియుఁడు పూజ్యుఁడు. ఈ రెండు కారణములచేత మురారాతియ యర్ఘ్యమునకు పూజ్యుడు.

9. * భీష్మపలుకు లవి కర్ణశూలంబులైన-ఆ కర్ణశూలంబు లగు భీష్మ పలుకు లెవ్వి?

"ధర్మరాజా! నీ యజ్ఞమున కెవ్వరు విఘ్నము చేయ గలరు? జితదైత్యుఁడు, యజ్ఞపురుషుఁడు, నజేయ పరాక్రమ డగు కృష్ణుఁడే దీనిని రక్షించుచుండ విఘ్నమేల కల్గును? కృష్ణుడు కోపించి చూచినా శిశుపాలుని కొఱకు యుద్ధసన్నద్ధులైన రాజులందఱు చత్తురు శిశుపాలుని గర్వ మిప్పుడే యణగి పోఁగలదు. కృష్ణుడు సింహపరాక్రముడు. మదించిన యేన్గుల కుంభస్థలములను చీల్చుటయందు పటిష్ఠమైన గోళ్లుగల సింహమును జూచి యెన్ని కుక్కలు మొఱిగి యేమిచేయఁ గలవు? కృష్ణునిశక్తి నెవ్వ రెఱుంగ లే కున్నవారు" అను భీష్ముని పల్కులు శిశుపాలునకు కర్ణశూలంబు లయ్యెను.

10. ఎట్టివారిని వధించుట మహాపాతకం బని పెద్దలు చెప్పుదురు?

స్త్రీలను, గోవులను, బ్రాహ్మణులను, కూడుపెట్టు వారిని, విశ్వసించిన వారిని వధించుట మహాపాతకంబని పెద్దలు చెప్పుదురు.

* 11. కర్ణశూలంబులైన భీష్ముని పలుకులువిని శిశుపాలుఁ డల్కతో నేమని పల్కెను?

శిశుపాలుఁ డల్కతో "ఈ ముదిపెట్టె యగు భీష్ముఁడు కృష్ణుని పరమేశ్వరుఁడని కొనియాడు చున్నాఁడు. పాండవులు

తానేకాని ధర్మము తెలిసికొనలేఁడు. ఓడతోఁగట్టిన యోడ వోలె ధర్మరాజు నిన్నాధారముగాఁ జేసికొని యుదివఱకున్న గౌరవముకూడఁ బోగొట్టుకొనినాఁడు. భీష్మా! నీ వెంత దుర్మార్గుఁడవు? నీ మాటలచే నీ రాజులను బెదరించితివి. వీరంత పిరికివా రనుకొంటివా? కృష్ణుఁడు సింహపరాక్ర ముఁడా? పూతనను చంపుట, ప్రాణములేని బండిని కాలితో తన్నుట, పూచిన చెట్లను విఱచుట, చీమపుట్టంత పర్వతము నెత్తుట, వృషభమును వధించుట యివన్నియు పరాక్రమ కార్యములా? ఇట్టి పలుకులు పలుకు నీ నాలుక నూఱు చీలిక లైన బాగుండెడిదే! అప్పుడు కృష్ణుని నూఱురెట్లు పొగడ నగుదు. ఇతని పరాక్రమము నే నెఱుఁగనా? స్త్రీలను, గో బ్రాహ్మణులను, అన్నమిడు వారిని, నమ్మినవారిని చంపుట మహాపాతకము. అట్టి కృష్ణుఁడు స్త్రీహత్య, గోహత్యకూడ చేసినాఁడు. సాల్వుని వరించిన యంబను నపహరించి తెచ్చిన నీ తమ్ముఁడు విచిత్రవీర్యుఁడు ధర్మమెఱిఁగి విడిచి పెట్టినాఁడు. ఆ పాటి ధర్మమైన నీ వెఱుంగవైతివి. నీ యందనపత్యత యను మహాదోష మున్నది. అట్టి పాపాత్ముని యాజ్ఞను జనులు పాటింపరాదు. కృష్ణుని పరాక్రమమును ధర్మరాజు పొగడినట్లు పొగడుచున్నావు. నీకు కాలక్షేపము కానియెడల గుణవంతు లైన కర్ణశల్యాదులను పొగడుము. పరస్తుతి పరనింద, ఆత్మస్తుతి, ఆత్మనింద పనికిరావని పెద్దలు చెప్పుదురు'' అని పల్కెను.

12. శిశుపాల నిర్యాలనాభీల సంరంభంబుననున్న భీమసేను వారించి భీష్ముండే మని చెప్పెను ?

వీనితల్లి తొల్లి జగద్వల్లభుండైన జనార్దనుం బ్రార్థించి వాని యనుగ్రహమునుపొందుటచే శతాపరాధంబులు నిండు నంతకు వీడన్యులచేత నప్రతిహతుండు కృష్ణునిచేతనిహతుండు. అందుచేతనే వీడిట్లు కాఱులుకూసినను నేనూఱుకొనవలసి వచ్చినది. ఈవిధముగా నన్నితవులు పల్కినవారిని ప్రాణములతో పోనిచ్చెడివాడనా ? అని భీష్ముడు చెప్పెను.

13. శిశుపాలుండు గర్వించి పలుకగా విని చక్రధరుడు సకల రాజచక్రంబు విన నేమనెను ?

కృష్ణుఁడు రాజులెల్లరువినుచుండగా "ప్రాగ్జ్యోతిష మున భగదత్తునిపై మేముదండెత్తఁగాఁజూచి యీశిశు పాలుఁడుదొంగచాటుగా ద్వారకకుఁబోయి ద్వారకకు నిప్పం టించినాఁడు. వీరులైనభోజవంశరాజులు రైవతకాద్రిపై స్త్రీలతో విహరించుచుండగా ప్రమత్తులైయున్న వారిని నిర్ద యుడై చంపెను. వసుదేవుడశ్వమేధయాగము చేయుచుండగా నీ దురాత్ముడా యాగాశ్వమునపహరించెను. బభ్రునిభార్య నెత్తుకొనివచ్చి తనభార్యగాఁ జేసికొనెను. అవిగాక వాగ్విష యంబులైన యుపకారములకు మేరయే లేదు. మాయత్త సాత్వతి నన్నుప్రార్థించుటచేత నీదురాత్ముడుచేసిన నూఱు

తప్పులు క్షమించితిని. ఆహద్దుమీఱినది. నిష్కారణముగా నాకుహానికలుగ జేసి నాకు పరమశత్రుడయ్యె" నని పలికెను.

14.

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| తేజము | తేజు | కుక్కురము | కుక్క |
| విషము | విసము | వీరము | బీరము |
| దోషము | దోసము | శల్యుఁడు | సెల్లుఁడు |
| బ్రధ్న | ప్రొద్దు | అద్భుతము | అబ్బురము |
| కారణము | కతము | తరంగము | తరఁగ |
| వృద్ధ | పెద్ద | మత్స్యము | మచ్చెము |
| శాస్త్రము | చట్టము | స్త్రీ | ఇంతి |
| విప్రుడు | పాఱుఁడు | మతి | మది |
| గుణము | గోనము | యజ్ఞము | జన్నము |
| పరుషము | పరుసము | కార్యము | కర్జము |
| పుణ్యము | పున్నెము | విధము | వితము |
| కలహము | కయ్యము | లక్ష్మి | లచ్చి |
| విస్మయము | విసుమానము | హృదయము | ఎద |
| సింహము | సింగము | కన్య | కన్నె |
| ధర్మము | దమ్మము | బుద్ధి | బుద్ది |
| బ్రహ్మ | బమ్మ | మూర్ఖుఁడు | మొఱకు |

14.

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| బ్రాహ్మణుఁడు | బాపఁడు | భక్తి | బత్తి |
| చంద్రుఁడు | చందురుఁడు | శక్తి | సత్తి |
| పుష్పము | పూవు | మృగము | మెకము |
| బంధుఁడు | బందుగు | రోషము | రోసము |
| తురంగము | తురికి | గౌరవము | గారాము |
| అక్షరము | అక్కరము | | |

15. వ్యాకరణాంశములు :—

(1) చెర+చెర=చెచ్చెర—సూ. అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు.

(2) ఎఱింగించితి—ఎఱింగించితివి—సూ. లిఙ్లోట్టుల వకారంబునకు లోపంబువిభాషనగు.

(3) అను+జడుడు=అన్జడుడు—సూ. అను, కొనులో నగుధాతుజ విశేషణముల అంత్యోకారమునకు హల్లుపరంబగునపుడు లోపంబువైకల్పికంబు.

(4) వెడఁగు+తనము=వెడఁగుదనము (a)సూ. ఉదంత స్త్రీసమంబులకును, పుంపులకు, అదంతగుణవాచకంబులకు 'తనము' పరంబగునపుడు నుగాగమంబగు=వెడఁగు+న్+తనము, (b) ద్రుతప్రకృతికములమీఁది పరుషములకు సరళము లగు=వెడఁగు+న్+దనము (c) ఆదేశసరళములకుముందున్న

ద్రుతమునకు బిందు, సంశ్లేష, స్వాత్వరూపంబులు విభాషనగు. వెడఁగుఁదనము.

(5) ఇచ్చు+దు+రు=ఇత్తురు-సూ. చువర్ణంబుతోఁడి దుగ్ధకారంబునకు తకారంబగు.

(6) మనుచు+దు+రు= మంతురు.

(a) చువర్ణంబు......తకారంబగు = మను+తు+రు.

(b) చువర్ణకంబు పరంబగునప్పుడు అన్వాదు లనుస్థానంబున సున్నయగు=మంతురు.

(7) ఈ+విధము=ఇవ్విధము. (ఇద్దరణీశులు – ఇమ్మది వెఱ్ఱి-అక్క-న్య) త్రికంబుమీఁది ఊష్మరేఫేతర అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ద్విరుక్తంబగు హల్లు పరంబగు నపుడు ఆచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

(8) ధర్మువు-సూ. అర్ధాదులకడ అచ్చున కుత్వంబును మీఁద వు వర్ణకంబును వైకల్పికంబుగా నగు.

(9) అల్క-అలుక-సూ. ఆచ్చికంబులం బదమధ్యంబుల వ, ల, డ, ర, ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.

(10) అచ్యుతు+అర్చన=అచ్యుతునర్చన-సూ. షష్ఠీ సమాసమందు ఉకార ఋకారములకు అచ్చుపరంబగు నపుడు నుగాగమంబగు.

11. మూర్ఖు+వు = మూర్ఖ వు-సూ. ప్రథమాంతంబు లగు యుష్మదస్మ ద్విశేషణంబులకు ఏకత్వంబున వు, ములను బహుత్వంబున రు, ములను అంతాగమంబులు ప్రాయికం బుగా నగు. అగుచో ఉత్వంబునకు అత్వంబగు.

12. ఒనర్పుము+ఏ = ఒనర్పవే - సూ. ఎడాదులను ప్రయుక్తంబు లగునపుడు మధ్యమునకు వుఁజీ రుఁజీ యగు-అగుచో ధాతువు ఉత్వంబునకు అత్వంబగు.

13. అవలంబము+చేసి=అవలంబము సేసి-సూ. ప్రథమ మీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు.

16. వ్యుత్పత్త్యర్థములు :—

గాంగేయుఁడు—గంగకుమారుఁడు (భీష్ముడు)

ద్వైపాయనుఁడు— ద్వీపమే స్థానముగాఁగల వాఁడు (వ్యాసుఁడు)

వసుమతి—ధనము దీనియందు కలదు (భూమి)

యుధిష్ఠిరుఁడు—యుద్ధమందు స్థిరముగా నిలుచువాఁడు (ధర్మరాజు)

గోవిందుఁడు—భూమినిగాని, గోవునుగాని, స్వర్గమును గాని వేదమునుగాని పొందెడువాడు (విష్ణువు)

తురంగము=వేగిరముగాఁ బోవునది (గుఱ్ఱము)

నారాయణుడు=నారమనగా జలము. అదిస్థానము గాగల వాడు (విష్ణువు)

దామోదరుడు—తులసిధామము నుదరమందుఁ గలవాఁ (విష్ణువు)

నారదుఁడు—జ్ఞానము నిచ్చువాఁడు (నారదముని)

ప్రాగ్జ్యోతిషము—పూర్వము ప్రకాశముగలది (నరకు రాజధాని)

ఆపగాతనూజుఁడు—(గంగ) నదీకుమారుఁడు(భీష్ముఁడు

త్రివిక్రముఁడు—బలిబంధన కాలమున మూడులోకమ లను మూడడుగులచేఁ గప్పినవాఁడు (విష్ణుఁడు)

అచ్యుతుఁడు—తనచోటునుండి భ్రంశము నొందనివాఁడ (విష్ణువు)

17. నానార్థములు :—

ధర్మము=న్యాయము, విల్లు, పుణ్యము, యజ్ఞము.

గుణము=స్వభావము; అల్లెత్రాడు; తామరకాడలోఁ దారము.

విషయము=సంగతి, దేశము.

భూరి=బంగారము, విస్తారము.

లోకము=ప్రపంచము, సమూహము, ప్రజలు,

దోషము=తప్పు, చీకటి

అంబరము=ఆకాశము, వస్త్రము.

8. సంస్కృత సంధులు :—

సవర్ణదీర్ఘసంధి :—విశిష్ట +ఆరాధ్యులు = విశిష్టారాధ్యులు; పూజ+అర్హుఁడు = పూజార్హుఁడు; సుర+అరాతి= సురారాతి; ఘోర+ఆహవము =ఘోరాహవము; వసుమతి+ఈశ =వసుమతీశ.

గుణసంధి :—గుణ + ఉన్నతులు = గుణోన్నతులు; లోక+ఉత్తరుఁడు=లోకోత్తరుఁడు; నర+ఈశ్వరుఁడు=నరేశ్వరుఁడు.

యణాదేశసంధి : —అతి+అనుపమ=అత్యనుపమ;

అనునాసికసంధి :—వాక్ +మయము=వాఙ్మయము.

జశ్త్వసంధి :—జగత్ +ఆధారుఁడు= జగదాధారుఁడు.

9. సమాసపదములను విడదీయుట:—

| సమాసపదము | విడదీయుట | విగ్రహము | సమాసము పేరు |
|---|---|---|---|
| 1. అశక్యము | —న + శక్యము— | శక్యము కానిది | నఞ్ తత్పురుషము. |
| 2. గుణాళి— | గుణ + ఆళి— | గుణములయొక్క సమూహము— | షష్ఠీతత్పురుషము |
| 3. మధురగీతి— | మధుర+గీతి– | మధురమైనగీతి — | విశేషణపూర్వపదకర్మధారయము. |

4. గుణోన్నతుఁడు — గుణ + ఉన్నతుఁడు — గుణముచేత ఉన్నతుఁడు — తృతీయాతత్పురుషము.

5. రాజ్యలక్ష్మీలలన — రాజ్య + లక్ష్మీ + లలన — రాజ్యలక్ష్మియనెడుస్త్రీ — రూపకము.

6. చక్రధరుఁడు — చక్ర + ధరుఁడు — చక్రముచేతియందు ధరించినవాఁడు — బహువ్రీహి.

7. కర్ణశల్యులు — కర్ణ + శల్యులు — కర్ణుఁడుశల్యుఁడును — ద్వంద్వసమాసము.

8. శతాపరాధంబులు — శత + అపరాధంబులు — శతమైన తప్పులు — ద్విగుసమాసము.

9. క్రీడాభిరతి — క్రీడ + అభిరతి — క్రీడయందభిరతి — సప్తమీ తత్పురుషము.

10. అద్రితుల్యుఁడు — అద్రి + తుల్యుఁడు — అద్రితో సమానమైనవాఁడు — తృతీయాతత్పురుషము.

20. కఠినపదములకర్థములు :—

దుర్వ్యవసాయము = చెడ్డప్రయత్నము; మఖము = యజ్ఞము; చీఁకు = గ్రుడ్డివాఁడు; అనునయించు = బుజ్జగించు; ఆహవజితులు = యుద్ధమునందు జయింపబడినవారు; మస్తకము = తల; బిభీషికలు = బెదరింపులు; పూచుమ్రాఁకులు = నిస్సారమైనచెట్లు; ప్రబ్బికోలు = నింద; మార్గణము = బాణము; స్థవిరుడు = ముసలివాఁడు;

౯౬. ఈ క్రింది పద్యభాగములకు దండాన్వయమును వ్రాయుము :

(a) చలితపుష్యమణుడు........మహాత్పరివాదశీలికిన్

(b) రయవిచలత్తురంగము.........క్షణంబునన్

(c) ప్రకటితకోపవేగమున.........కచ్ఛటన్

(d) అవమానిత్వన్ సభలోన.......సంగ్రామరంగంబునన్.

(a) ధర్మరాజు, పెంపబడిన యవినీతిగలవాడగు శిశుపాలుడు, మూర్ఖుడు, సీకిట్టివాని శాంతింపజేయుట యెందులకు? అను రాగము చేతను, కోపము చేతను, తిరస్కరింపబడిన మనస్సుగలవానికి, కొద్దిపాటి ప్రభుత్వసంపదయను స్త్రీచే గ్రహింపజేయబడిన మనస్సుగలవానికి, నిష్కారణముగా గొప్పవారినిందించు స్వభావముగల వానికి, ఈ శిశుపాలునకు ఇంకను న్యాయము తెలిసికొనశక్యమా? (కాదు)

(b) వేగముచే, మిక్కిలి చలించుచున్న గుఱ్ఱములనెడు కెరటముల చేతను, మదించిన యేనుగులనెడు మొసళ్ళ సమూహము చేతను, మిక్కిలి చలించుచున్న తీవ్రమైన సేనా సమూహములనెడు చేపల చేతను, భయంకరమైనయదు, వృష్ణి భోజ, కుకుర, అంధక సంఘజాలనెడు సముద్రము, క్షణములో, మిక్కిలి దయలేని కోపమనెడు గాలిచేత, ఎడతెగక, మిక్కిలి త్రోయబడినదై; కలతపొందెను.

(c) యమునియొక్క ఆకారమును పొందిన భీమునకు, ప్రసిద్ధమైన కోపముయొక్క తీవ్రతచే, తామర రేకులవలె విశాల

హైనకన్నులు, ఎఱ్ఱని కాంతిచేత, మిక్కిలి భయంకరమైనరీతిని ధరించెను. నొసటిప్రదేశమందు, బొమముడి, పైకెత్తబడినదై, త్రికూటపర్వతముయొక్క, గంగానదిని అనుకరించిన రీతిగా, మూడు రేఖలతో, ప్రకాశించెను.

(d) కేశవా! అవమానింపదగినవానిని, పూజింపదగిన వాడని, స్నేహభావముచే, కౌరవులలో ముసలివాడగు భీష్ముని ప్రోత్సాహముచే, పాండవులు, చెడుబుద్ధిచే, నిన్ను పూజించిరి. అజ్ఞానమునకు చోటైనవారు పాండవులు, అజ్ఞానముచే గ్రుడ్డివాడగు భీష్ముడు, నీవు, యుద్ధభూమిలో, నాకెదురై సిద్ధపడుడు.



# 2. ఉత్తరకుమార ప్రజ్ఞలు

ఈ పాఠ్యభాగము విరాటపర్వమునందలి చతుర్థాశ్వాసములోనిది. దీనిని కవిత్రయమున రెండవ వాడగు తిక్కన రచించెను. ఇతడు నెల్లూరు మండలమును పరిపాలించిన మనుమసిద్ధి యాస్థానకవి. క్రీ. శ. 1260 సంవత్సర ప్రాంతమున నున్నవాడు (13 వ శతాబ్దము) నిర్వచనోత్తర రామాయణమును వ్రాసి మనుమసిద్ధి కంకిత మిచ్చెను. భారతమును హరిహరనాథున కంకితము చేసెను. ఇతడు కృష్ణశతకము, విజయసేనము, కవివాగ్బంధ మను గ్రంథములను గూడ వ్రాసె నందురు.

దశకుమార చరిత్ర తెనిగించిన కేతనయు, మార్కండేయ పురాణమును తెనిగించిన మారనయు నితనికి సమకాలిక కవులు. కేతన తన కృతిని తిక్కనకే యంకితము చేసెను. తిక్కనకు ఉభయకవి మిత్రుడనియు, కవిబ్రహ్మ యనియు, బిరుదములు.

కావ్యమును శిల్పముగా తీర్చి దిద్దినవాడు తిక్కన. కొలది మాటలలో గొప్పయర్థ మిమిడ్చి చెప్పగల నేర్పితని కొక్కనికే కలదు. పాత్రల మనస్తత్వమును చక్కగా వ్యక్తీకరించుటలో నతని కతడే సాటి. ఇతని కవిత్వమందు రెండు వంతులు తెనుగు పదములు నొకవంతు సంస్కృత పదము

లుండును. పాత్రల సంభాషణ లెంతో సహజముగా నుండును. సన్నివేశము లత్యద్భుతములు, [illegible] యోగించును,

## కథాసంగ్రహము

భీష్మద్రోణకర్ణాది యోధులతోఁ గూడిన సుయోధనుని సైన్య మొకనాటి సూర్యోదయ సమయమున బయలు దేరెను. ఆ సైన్యము విరాటుని నగరమగు మత్స్యనగరమున కుత్తరమున నున్న పశువులను పట్టుకొనెను. అదివఱకే దక్షిణదిశను సుశర్మతో యుద్ధము చేయుటకై విరాటుడు తన సకల సైన్యములను తీసికొని పోయెను. కంకుభట్టు రూపమున నున్న ధర్మరాజు, వలలుని రూపమున నున్న భీముఁడు, దామగ్రంథి యను పేరుతోనున్న నకులుడు, తంత్రీపాలుడను పేరుతోనున్న గోరక్షకుడు సహదేవుడు కూడ విరాటునితో వెళ్ళిరి. బృహన్నల పేరఁబరగు అర్జునుఁడు మత్స్యనగరము ననే యుండెను. విరాటుని కుమారుఁడు ఉత్తరుఁడు యుద్ధము నకు పోలేదు. మహాయోధులతో కౌరవ సైన్యమువచ్చి ఉత్తర దిశనున్న గోవులను ముట్టడించెనని గోపాలుఁడు వచ్చి యంతఃపురమున నున్న యుత్తరునితో "రాజకుమారా! భూమండలము చలించునట్లుగా కౌరవసైన్యము వచ్చి గోవులను పట్టుకొనెను. నీవు నీ బాణములతో వైరులను చెండాడుము, ఆయుధములను సమకూర్చి రథము తెప్పింపుము; నా కుమా

డును భుజబలపరాక్రమములు గలవాఁడను. శౌర్యశాలి, వంశ
మున నైశ్వర్యము గూర్చినవాఁడను, నావంటి పరాక్రమశాలి మరి
మా తండ్రి మించి కూర్చి పోరు సలుపుచుండెడువాఁడు. మీ రిపుడు
దానికి తగినట్లు పరాక్రమమును చూపవలయు" వని స్త్రీ
సమూహములలోఁ బొంగ జెను. ఉత్తరుఁడా పలుకులు చెప్పి
పోయి "కౌరవుల నెదిరించి ఉత్సాహముచే గెల్చి జయించెదను.
నిమిషములో గోవులను మరలింతును. కాని నా రథము
నడుపువాఁడు సమర్థుఁ డెవ్వఁడును లేకపోవుటచే విచారము గల్గు
చున్నది. నే నయ్యో! ఉత్తరునకు రథము తోలగలవాఁడొ
కను మొనగాఁడీ పురమున నెవ్వఁడైనఁ గలఁడా? తగిన సారథి
దొరకిన మొదల శత్రువులను జయించు టెంతపని? సారథి
యొకఁడైన నున్నచో వెంటనే వెదకుడు. ఆ దుర్యోధనుఁడు,
ఆ భీష్మ ద్రోణ కర్ణాది వీరులు నా యుద్ధనైపుణ్యము చూచి
'యితఁ డర్జునుఁడా యేమి'యని సందేహ పడునట్లుగా వారిని
కలఁచెదను. యుద్ధమున నోర్చి యావులను మరలింపకున్న
నా తండ్రి, నా స్నేహితులు, నా పరివారము నన్ను మెచ్చు
కొందురా?" యని డాబులు పల్కు సమయంబున నచ్చట
సైరంధ్రి రూపమున నున్న ద్రౌపది విని వెళ్ళి యర్జునునితోఁ
జెప్పెను. అజ్ఞాతవాస సంవత్సరము నాటితో సమాప్తమగుట అర్జు
నుడు నిరూపించుకొని బృహన్నలకు సారథ్య మొనర్చు నేర్పు
గలదనియు, బృహన్నల సహాయమున నే పూర్వ మర్జునుఁడు

ఖాండవవనమును దహింపగల్గెననియు, దానివలన మిక్కిలి మెప్పు పొందినాఁడనియు, వానిసహాయమున కురుసైన్యంబుల నిప్పుడు జయింప వచ్చుననియు నచ్చచెప్పి తనను ఉత్తరుఁడు పిలిపించునట్లు చేయుమనియు బృహన్నల సైరంధ్రికి చెప్పి పంపెను.

సైరంధ్రి తిన్నగా ఉత్తరయున్నచోటికిఁ బోయి "ఓకాంతా! తెలిసినసంగతి చెప్పకున్నచో దోషముగదా! నీ యన్నయుత్తరుఁడు తగినసారథికోసము వెదకుచున్నాఁడట. సారథ్యమునందలి నైపుణ్యమూ, భుజబలమూ మనబృహన్నలకుఁగలదు. పూర్వ మర్జునునకు ఖాండవవనదహన సమయమున జయముగలిగిన దీబృహన్నలవలననేసుమా! మనము పోయి యీసంగతి యుత్తరునకు నివేదింతము" అని చెప్పగా ఉత్తర అంగీకరించెను. వారిరువురు వెళ్లి యుత్తరునకుఁజెప్పిరి. ఉత్తరుఁడామాటలకు పక్కున నవ్వి "సైరంధ్రీ! నన్నిట్లపహాస్యము చేయఁదగునా? ఆపేడివాడేమి? ఈ మహాశూరుఁడగు ఉత్తరునకు రథమునడుపుటేమి? చాలు. చాలు. నేను పేడివాని ముఖము చూడ రోయుదు. వచ్చినది కౌరవసైన్యమా! గోవులను మరలించుటకు పోవునది బాహుబలపరాక్రమవంతుడనగు నేనా! అట్టి నారథమునకు బృహన్నల సారథియైనచో విన్నవారు, కన్నవారు నవ్వరా! ఈపురమున రథసారథులకింత కఱవువచ్చినదా?" యని పల్కెను.

సైరంధ్రి "రాకుమారా! కౌరవసేనయొక్క టేకాదు, ముల్లోకము లొక్కపెట్టునెత్తివచ్చినను రథము బృహన్నల వశముననున్నచో గెలుపవచ్చును. అతనిపరాక్రమము నాకు బాగుగా తెలియును. ఒకానొక కారణముచే శరీరమునందు వికారముగల్గినంతమాత్రమున నాధిక్యత యెక్కడికిపోవును" అని సమాధానపఱుపగా నప్పటి కితరులెవ్వరును సారథులు లేకపోవుటచేతను, మనస్సు నిలతపొంది యుండుటచేతను దానికుత్తరుఁ డంగీకరించెను. ఉత్తరతానే తనగురువగు బృహన్నలను తోడ్కొనివచ్చెదనని నాట్యశాలలోనికిఁబోయి బృహన్నలను ప్రార్థించి యచ్చట నొకయుద్ధమున తనయున్న రథసారథి మరణించెననియు, తగినసారథి దొరకకపోవుటచే నతఁడప్పటినుండి యెవ్వరిని నియోగింపలేదనియు, కౌరవులు గోవులనుపట్టుకొని పోవుచుండుటచే నతఁడు యుద్ధసన్నద్ధుఁడై సారథిలేడని విచారించుచుండఁగా సైరంధ్రి తనసంగతిచెప్పుటచే నతనిని సారథిగా తీసికొనిపోవ వచ్చితిననియు, తనమాట పాటించి తన్నుమన్నింపుమనియు వేడుకోగా బృహన్నల యామెముద్దుపలుకులకు ముద్దుచేసి "రాకుమారీ! నాకు సారథ్యమునం దేమినేర్పుగలదు? కాని నీమాటదాటుటకు వెఱతును. నీప్రార్థనచే నెంతదుష్కరకార్యములైనను చేసెదను" అని మదగజమువలె నడుగులోనడుగు వేసికొనుచు వచ్చుచున్న బృహన్నల నుత్తరుఁడుచూచి "బృహన్నలా! నాకు కౌరవులతో కయ్యముకల్గెను. నీవునాకు సారథివి

కావలయును. రమ్ము. వేగముగా కవచముతొడిగి రథ మెక్కుము. నీవీరత్వము, శౌర్యత్వము, బలము, ఉపాయము నాకు సైరంధ్రి చెప్పినది. నీకుతప్ప" దని పలుకగా బృహన్నల "రాకుమారా! ఆటపాటల యవసరమువచ్చినపుడు నన్ను పిలిపించుట తగునుగాని నన్ను యుద్ధమునకు రమ్మనుట న్యాయమా! బలాఢ్యుడైన వేఱొకనిని నియమింపుము." అనెను. "ఖాండవదహనసమయమున నర్జునునకు రథసారథివై చూపిన నీపరాక్రమము, నీవండితనము నిపుడెచ్చటికిపోయెను నాయెడ స్నేహము చూపి సారథ్యము నంగీకరింపు"మని యుత్తరుండు బృహన్నలను వేడెను.

రాకుమారుని మాట [illegible] నటించు బృహన్నల అల్లనఅంగీకరించెను. ఉత్తరుండు బృహన్నలకొక కవచము నిప్పించి తొడుగుకొనుమనెను. కవచము తొడుగుకొనుట చేతకానివానివలె నటించి, తారుమారుగాతొడుగుకొని యచ్చటియాడువారిని బృహన్నలనవ్వించెను. ఉత్తరుండే వానికి కవచమును సరిగాతొడిగి, తానును కవచముధరించి పశువులనుమరలించు తమకమ్మున బృహన్నలనుచూచి "రథమునకు గుఱ్ఱములనుగట్టుము. పతాకమెత్తుము. మన మిప్పుడేపోయి యావులను మరలింపవలయును" ననిన "నీవేమి చెప్పిననది చేయవలయును నీవుపోయినదెసకు పోవలయును. నాశక్తి తెలిసికొని యాజ్ఞాపించి నావలనపనిగొని శత్రువులను జయింపు"మనిపల్కుచు బృహన్నల లోలోనానందించుచు

రథమునకు జవనాశ్వములనుపూన్చి సింహధ్వజమెత్తెను. అత్యుత్సాహముతోనున్న సారథినిఁజూచి యుత్తరయు చెలులును కురువీరులనుగెలిచి వారితలపాగలోని రంగురంగుల వస్త్రములను బొమ్మపొత్తికలకు తెమ్మనికోరిరి. 'రాజకుమారుడు జయలక్ష్మిని చేకొనివచ్చునట! చీరలుతెచ్చుట యొక గొప్పకాదు, లెప్పక తెచ్చెద'నని బృహన్నల పరిహాసముగాఁ బల్కి సకలాయుధములను రథముపై నిడెను. పురములోని పుణ్యాంగనలు, భూసురులుదీవించి రాజకుమారునిపై సేసలు చల్లుచుండగా పరాక్రమనిధియగు నర్జునుఁడు రథమును గోవులున్న దెసకు నడిపించుచుండెను.

కౌరవసేనలు నేల గోడిపడునట్లు నడచుచుండెను. ఉత్తరుఁడా సైన్యమును దూరమునుండి చూచి మేను గగుర్పొడువ, మనస్సు చలింప, మూపు మొద్దుబారి తొట్రుపడుచు, దిగులుపడి యా బృహన్నలతో "బృహన్నలా! ఈ సైన్యము భీష్మ ద్రోణ కృపాశ్వత్థామాది యోధులచే భయంకరమైనది దుర్యోధనుఁ డనెడు వేసవిసూర్యుని ప్రతాపముచే నిండినది. శస్త్రాస్త్రములచే తీవ్రమైనది. చతురంగ బలములచే భయంకరమైనది. పతాకలనెడు పిద్దమంటలచే కూడిన యీ సైన్యమును నేనుసమీపించుటకుకూడ శక్తుడను గాను. నేనస్త్రవిద్య నెఱుగనివాఁడను. బాలుడను. విలువిద్యా విశారదులైన యీశకుని, సైంధవ, దుర్ముఖ, వికర్ణ, కర్ణాది యోధులకు ఎదుట నిలబడఁ గలనా? యుద్ధమనిన నిట్లుండు

నని తెలియక వచ్చితిని. ఇపుడు మన గతియేమి? వారందరును మిక్కిలి కఠినులు. నాకు వారి నెదుర్కొనుశక్తి లేదు. నాకు వణకు పుట్టుచున్నది. మనస్సుతో సహా శరీరము కంపింపదొడగినది. నీవదే పనిగా రథము తోలుకొని పోవుచుంటివి. ఇది నీకు తగునా! రథము వెనుకకు మరల్పుము. ప్రాణములు తీపియను సామెత వినలేదా" యని పల్కగా బృహన్నల చిరునవ్వు నవ్వి "రాజనందనా! అసమాన యోధులగు వీరి మీఁదికి పోవుటకు నేనింత వెఱ్ఱివాఁడనా? గోవులను మరలింతము. శత్రువులీ విధముగ పశువులను తోలుకొని పోవుచుండ చూచుచు నూరకుండ నగునా? పట్టణములోని యాడువారందరు సంతోషించునట్లు పశువులను మరలించుకొని వచ్చెదనని ప్రజ్ఞావాక్యములు పల్కి వీరునివలె రథమెక్కి వచ్చి యిచ్చట ఏనుగులను, గుఱ్ఱములను, మనుష్యులను చూచి భయపడిపోవుట నీవంటి రాజనందనునకుఁ దగునా?" యని బృహన్నల పల్కెను

"బృహన్నలా! పశువులమాట దేవుఁడెఱుఁగును. నాకు పడతుల సంతోషమేల? నేను యుద్ధమునకు చాల"నని యుత్తరుడు బదులు పల్కెను.

అర్జును డుత్తరునితో "రాకుమారా! తన భుజబలమును, శత్రువుల భుజబలమును చక్కగా నిర్ణయము చేసి చూచి జయ మెవరికి కల్గునో చెప్పుటకు శక్యము కానప్పుడు యుద్ధరంగమునుండి పాఱిపోవుటది లోకమర్యాద, దానినై

నను శూరులైతే మెచ్చుకోరు. ఇంతగా కౌరవసైన్యము నీ దెసకు తేఱి చూడనైన లేదు. నీ భయమునకు కారణ మేమి? భయంకర శంఖధ్వనులకు భయపడక చతురంగ బలములను చూచి భీతిల్లక యుద్ధములోని యుపద్రవములను సహించి నిలబడిననేకదా మంచికీర్తి కల్గును. ఈ విధముగా పాఱిపోయినచో ప్రజలు నినుచూచి నవ్వరా" యని పలికెను.

"బృహన్నలా! దక్షిణదిశను సుశర్మ గోవులను బట్టగా నా తండ్రి పురమునం గల సమస్తసేనను దొరలించుకొని పోయెను. మనకు పురమున సైన్యసహాయ మేమియు లేదు. ఈ కురుసేనను నే నొంటరిగా నెదుర్కొనగలనా? ఈ వ్యర్థ ప్రసంగము లేల? వారు మనలను చూడకముందే రథము మరలించుకొని పురములోనికిం బోవుట రాజనీతి!" యని యుత్తరుండు వానిని తొందరించెను.

బృహన్నల యా పలుకులు విని "రాజకుమారా! భయపడి యిట్లు పలుకనగునా? శత్రువులకు లోకువ కాదా? పురజనులు మనలను తిట్టిపోయరా? సైరంధ్రి గొప్పగా చెప్పి నన్ను తోడ్కొని వచ్చినది. నీకు సహాయము చేయుమని నన్ను తీసికొని వచ్చితివి. వచ్చునప్పుడు పౌరులు చక్కగా దీవించిరి. మహావీరునివలె బయలుదేరి వచ్చితిమి. కౌరవులు గోవులను తోలుకొని పోవుచుండగా కనులార చూచి నే నూరక పోవుదునా? నీ కెందుకింత భయము? కొంచెము ధైర్యము వహింపుము. కౌరవులందఱ రాశ్చర్యపడు నట్లుగా నిప్పుడే

యావులను మరలించుకొని పోవుడము" అని బృహన్నల రథము తోలుకొని పోవుచుండ నుత్తరుని ముఖము వెల వెల పోయెను. గుండెలు తట తట కొట్టుకొనెను ఉత్తరుడు దిగులుతో "బృహన్నలా! పాఱిపోయినచో పోటులు సవ్వుదువురా! చాలు చాలు. నన్నాపకుము. నీ క్రొవ్వారగ జేసి పోయి యెదుర్కొనుము" అని గజగజ వణకుచు బిల్లమ్ములా రథముపై విడిచిపెట్టి భూమిమీద కదికి పురమువైపునకు పాఱిపోఁజొచ్చెను. అర్జునుఁడా రాకుమారుని పని కసహ్యించుకొని రథమునుండి భూమిపై కుఱికి యాతని వెంబడించి పట్టుకొనెను.

కౌరవ బలంబులు బృహన్నలను జూచి యూ నడక, ఆ బాహుబల ఛాయయు చూచిన నర్జునునివలెఁ గన్పట్టు చున్నాఁడనియు, విరాట నగరమున పేడిరూపమున నున్న వాడర్జునుఁడే యనియు, కానిచో కౌరవవీరుల నెదుర్కొన వచ్చుటకు మఱెవ్వరికి శక్తి గలదనియు, విరటుడు దక్షిణంబునకు యుద్ధమునకుఁ బోగా పురములో నింకవీరులు లేకుండుటచే, తనకు సారథి లేకపోవుటచే ఉత్తరు డతనిని తోడని తీసికొని యుండవచ్చు ననియు, పిన్నవాఁడు గాన ఉత్తరుఁడు యుద్ధరంగము చూచి పాఱిపోవు చున్నాడనియు, పాపమా యర్జునుని పరాక్రమసంపద వానికేమి తెలియు ననియు నిశ్చయము చేసికొనిరి.

అర్జునుఁడు ఉత్తరునిఁ బట్టుకొనెను. ఉత్తరుని ముఖము వెలవెలపోయెను. పెదవులెండిపోయెను. కనుఁగుటలుగ్రమ్మెను. కాలుసేతులు వణకసాగెను. గుండెలు కొట్టుకొనుచుండెను. అతఁ డేడ్చుచు "బృహన్నలా! నన్ను విడిచిపెట్టుము నేనూరిలోనికి వెళ్ళినతోడనే నీకు నూఱునాణెములు, బంగారము, రత్నములు, ఏనుగులు వేయేల? ఒకయూరునీకు బహుమానమిచ్చెదను. నాప్రియమైనతల్లి నాకై యెదురు చూచుచుండును" అని యనేకవిధములఁ బ్రార్థించెను.

బృహన్నల నవ్వుచు నుత్తరుని రథముదగ్గరకు తీసికొని వచ్చి "నాయనా! భయపడకుము. నీవు యుద్ధము చేయఁజాలవేని మానివేయుము. నీవు రథము తోలుము. నేను యుద్ధము చేసెదను. శాత్రవులపీచమడంచెదను. సైన్యమును పాఱఁద్రోలెదను. రాజుధైర్యమును కూల్చెదను. ఆవులమరలించెదను" అని చెప్పుచు నుత్తరున కంగీకారము కాకున్నను వానిని రథముపైఁ గూర్చుండఁబెట్టి యర్జునుఁడు శమీవృక్షము సమీపించెను.

ప్రతిపదార్థములు—భావములు.

1. దుర్యోధనుబలము= దుర్యోధనుని సైన్యము (చతురంగబలము) సూర్య+ఉదయ+అవసరమునన్ = సూర్యుడుదయించుసమయమున; భీష్మ+ఆచార్య+రవిసుత+ఆది= భీష్ముఁడు ద్రోణుఁడు, సూర్యకుమారుడగు కర్ణుఁడు మొదలగు; యోధసంఘ + ఉద్భటము+ఐ = వీరులసమూహముచేత ప్రకాశమై

ప్రబల+దోః+బల+లీలా+కుద్మకరిన్ = అధికమైన, భుజబలము యొక్క, విలాసము, చేత, కార్యరీతిగా ; ... చెన్ = ప్రయాణించెను.

తా. భీష్మద్రోణకర్ణాదివీరులతో కూడిన దుర్యోధనుని సైన్యము దయకాలమున భుజబలవిలాసముతో ప్రాగ్బయలు దేరెను.

వి శే:— సూర్య+ఉదయ = సూర్యోదయ; సంఘ+ఉద్భట = సంఘోద్భట—గుణసంధి; ఉదయ+అవసరము = ఉదయావసరము; సుత+ఆడ = సుతాడ—సవర్ణదీర్ఘసంధి; దోః+బల = దోర్బల—విసర్గసంధి; సూర్యుండు (వ్యు) వ్యాపారములయందు ప్రవేశించువాండు; దుర్యోధనుండు (వ్యు) (దుఃఖేన యోద్ధుం శక్యతే ఇతి) దుఃఖముచేత యుద్ధము చేయుబడువాండు; యోధు (ప్ర) జోదు (వి)

2. మత్స్యనగరంబునకు = విరాటునినగరమగు మత్స్యపురమునకు; అనతిదూరంబునన్ = దగ్గరనే; పశుగణంబులన్ = ఆవులసమూహములను; పొదివెన్ = చుట్టంబెట్టెను; అట్టి+ఎడన్ = అట్టిసమయమందు; ముక్కిడిమూంకలు = అల్పసైన్యములు; చని = వెళ్ళి; తలపడినన్+ఎదిరింపగా; ప్రముఖ = మొదలైన; రథికజనంబులు = రథము నెక్కియుద్ధము చేయు వీరులసమూహములు; గోపాలవర్గంబున్ = పశువులకాపరుల సమూహమును; అనర్గళ+ప్రసారంబు+అగు = అడ్డులేనివ్యాప్తిగల; శర+ఆసారంబునన్ = బాణవర్షము చేత; బెగ్గలించి=

విహ్వాలించి (భయపడి) గో+అధ్యక్షుండు=గవాధ్యక్షుండు=గోవులకుఅధ్యక్షుఁడు; ఆక్రోశించుచున్ =బిగ్గరగాఁ అఱచుచు; పురంబునకు+అరుగుదెంచి= ఊరు లోనికివచ్చి; రాజమందిర ద్వారంబు=రాజభవనము వాకిట; చొచ్చి=ప్రవేశించి; రథ+అవతరణంబుచేసి= రథమునుండిదిగి; భూమింజయున్ =ఉత్తరుని; ఆ+సంభ్రమంబుగాన్ =తొందరపాటుతోకూడునట్లుగా;

విశే:—న+అతిదూరము= అనతిదూరము; న+అర్గళము= అనర్గళము—నఞ్ తత్పురుషము; దూరము (ప్ర) దవ్వు (వి) పశువు (ప్ర) పసువు (వి) శ్లో॥ ఏకాదశసహస్రాణాం యోధయేద్యస్తు ధన్వినాం। శస్త్రశాస్త్రప్రవీణస్తు మహారథ ఇతిస్మృతః॥ అమితాన్ యోధయేద్యస్తు సంప్రోక్తోఽతిరథస్తుసః। సమత్వేకేన యో యోద్ధాతస్యోద్ధోఽన్యోఽర్ధరథోమతః॥ రథము (ప్ర) అరదము (వి) పురము (ప్ర) ప్రోలు (వి) అంతఃపురము (ప్ర) అంతిపురము (వి) ద్వారము (ప్ర) దువారము (వి) గో+అధ్యక్షుఁడు =గవాధ్యక్షుఁడు—అవజాదేశసంధి సూ. పదాంతమైన గోశబ్దముయొక్క ఓకారమున కచ్చుపరమైనచో ఓకారమునకు అవజాదేశము వైకల్పికము.

3 ధరణీచక్రము=భూమండలము; సంచలింపగన్ =మిక్కిలికదలునట్లుగా; సమ్+ఉద్ధాతంబులు+ఐ = మిక్కిలి అణపబడినవై; గ్రక్కునన్ =శీఘ్రముగా; ముట్టికొనియెన్ =ముట్టడించెను (ఆక్రమించెను) వేగమైన్ =వేగముతో (శీఘ్రముగా) గోవర్గమున్ = ఆవులసమూహమును; కడంగుము=

ప్రయత్నింపుము; భుజ+ఉత్సాహంబు=బాహువిజృంభణము; శోభిల్లగన్ =ప్రకాశించునట్లుగా; రిపుక్ష్మాపాలలోకంబున్ = శత్రురాజులసమూహమును; శరజాలంబులు= బాణసమూహములు.

తా. భూమండలము చలించునట్లుగా కౌరవసైన్యములువచ్చి ఆలమందలనాక్రమించెను. నీ బాహుబలము మెఱయశత్రువులను నీ బాణములకెరచేసి గోవులను శీఘ్రముగా మరలించి తెచ్చుటకు ప్రయత్నింపుము.

4. అతిరయమునన్ = మిక్కిలి వేగముగా; తేరున్ పూన్పన్ పంపుము=రథమునుసిద్ధముచేయపంపుము; దృఢతనుత్రాణము=గట్టికవచము; ఉగ్ర=భయంకరమగు; చాప, బాణ, పూర్ణ=విండ్లు, అమ్ములతోనిండిన; తూణ=అమ్ములపొదులు; ఘనగద=గొప్పగదలు; అసి=ఖడ్గములు; తోమర=చిల్లకోలలు చక్ర+ఆదులు=చక్రకములు మొదలగునవి; అనువుగాన్+ఒనర్పుము=తగునట్లుసిద్ధపఱపుము;

తా. రథము సిద్ధముచేయింపుము. కవచము, విల్లమ్ములు, అమ్ములపొదులు ఖడ్గతోమరాదిసాధనములు శీఘ్రముగా సిద్ధపఱపుము.

విశే:—తూణము (ప్ర) దొన (వి)

5. పదవేవురముందటన్ = పదివేలమంది యెదుట అనగా అందరియెదుట; బాహువిస్ఫూర్తుఁడు=భుజబలముచేత మిక్కిలిఅధికమైనవాఁడు; శౌర్యశాలి=శౌర్యముచేత ఒప్పు

వాఁడు; కులభూతివిశేషవిభాసితుండు = వంశైశ్వర్యవిశేషమును కూర్చువాఁడు; భూభరణవిశారదుండు = భూమియొక్క బరువును మోయుటయందు నేర్పరి; జన+భవ్య+తపఃఫలసంభవుండు = ప్రజల, యోగ్యమైన, తపస్సుయొక్క, ఫలమువలన పుట్టినవాఁడు; కాతరపరిరక్షకుండు = భయపడినవారిని (పిరికివారిని) చక్కఁగా కాపాడువాఁడు; ఈ+తఱిన్ = ఈసమయమందు; దానికిన్+ఈడుగన్ = ఆ చెప్పినదానికి తగినట్లుగా;

తా. నీవు భుజబలముగలవాఁడవని, శౌర్యవంతుఁడవని, నిజవంశమున కైశ్వర్యముకూర్చువాఁడవని, భూమండలమును చక్కఁగా పరిపాలింపగలవని, ప్రజలతపఃఫలముగా పుట్టిన యోగ్యుఁడవని, పిరికివారిని రక్షింపనేర్తువని నీతండ్రి యెప్పుడును నిన్నుగూర్చి యందఱిలో చెప్పెడివాఁడు. నీవిపుడు దానికితగినట్లు సంచరింపవలయును.

విశే:—శౌర్యశాలి—తృతీయాతత్పురుషము; ఈ+తఱి=ఇత్తఱి—త్రికసంధి

6. కాంతాజనములలోనన్ = స్త్రీలసమూహములందు తనున్ = ఉత్తరుని, అగ్గించుటయున్ = పొగడుటయు; పొంగి = ఉబ్బిపోయి; తనమనమునన్ = తనమనస్సునందు; సంగరకౌతుకంబు = యుద్ధమందలిసంతోషము; ముడివడుచుండన్ = పెనగొనుచుండగా (అతిశయించుచుండగా) దర్ప+ఉద్ధతిన్ = గర్వముయొక్క విజృంభణచే;

తా. గవాక్షములనుండి స్త్రీలమధ్య నుత్తరునట్లు పొగడుటచే సంతసించిపోయి తనమనస్సున యుద్ధోత్సాహము కలుగగా గర్వంబున నిట్లనెను.

7. ఎదుర్కొని+వివిన్ =ఎదుర్కొని వెడల; ఎత్తువన్ కొందున్ =ఉపాయము చేతివశపఱచుకొందును;ముహూర్తమాత్రమునన్ = క్షణమాత్రములో; తేరికిన్ సారథి లేమిన్ చేసి= రథము నడుపువాడు లేకపోవుటచే; నాచిత్తమునన్ = నామనస్సునందు; విచారదశ+ చెందెడున్ = దుఃఖస్థితికలుగుచున్నది; నాకు+ఈతఱిన్ =నాకీసమయమందు; రథంబు+నేన్ కదా+ఎంతయున్ + కడపన్+నేర్తున్ = నేనేనిశ్చయముగా రథము నెంతయు నడపగల్గుదును (కదా—నిశ్చయార్థకమును సూచించుఅవ్యయము) అనన్ =అనునట్లుగా; పురిన్ ఎవ్వఁడు+కల్గును + ఒకొ = పట్టణమందెవ్వడున్నాడో!—ఎవడైన నుండునా (ఒకొ—సందేహమునుసూచించును)

తా. ఎదిర్చినచో కౌరవులనందఱను ఉపాయమున జయించి క్షణములో గోవులను తెచ్చెదను. కాని నాకు రథసారథి లేకపోవుటచే మనస్సు విచారదశయందున్నది. నేనును మారథము తోల నేర్చరి యని చెప్పెడివా డిప్పుడీ పురమున నెవ్వడైనఁ గలడా ?

వి.శే —తెచ్చు+దు+ను= తెత్తును– సూ. చవర్ణంబు తోడి దుగ్ధకారంబునకు తకారంబగు; ముహూర్తము (ప్ర) మూర్తము (వి)

8. దొరకొనినన్ = లభించిన యెడల; పగతురన్ = శత్రువులను; భంజించుట = చీల్చుట; కదుపులన్ = ఆవుల మందలను; దవ్వుగన్ = దూరముగా; ఎందున్ = ఎంతయు; సూతున్ = రథము తోలువానిని; అరయుఁడు = వెదకుఁడు;

తా. మనకు తగిన సారథి దొరకినచో శత్రువులను చీల్చి చెండాడు టెంతపని! శత్రువు లాలమందలను దూరముగా తోలుకొని పోఁగలరా? నాకు సారథి యున్నచో నిట్లగునా? తగిన సారథిని అంతట వెదకుడు.

9. కురుపతి = దుర్యోధనుఁడు; కుంభజ = ద్రోణుఁడు; ముఖ్యులు = మొదలైనవారు; మత్+సమ్+ఉద్యమ+స్ఫురణము = నా, మంచి ప్రయత్నము యొక్క, తోఁచుట అనగా ప్రదర్శనము; పార్థుఁడు+అను+బుద్ధిన్ = అర్జునుఁడను, మతిచే; అనగా సాక్షాత్తు అర్జునుఁడేవచ్చి యుద్ధము చేయుచున్నాఁడా యను ఊహచే; కలంగగన్ = క్షోభింపగా; బెట్టు+కెట్టి = మిక్కిలి సమీపించి (ఎక్కువగా తాకి) సంగరమునన్+ఓర్చి = యుద్ధమందు జయించి; ఏన్ = నేను; పసులన్+క్రమ్మఱన్+తేక+ఉన్నన్ = ఆవులను మరలించి తీసికొని రాకున్నచో; భూవరుఁడున్ = రాజును; సుహృత్+జనంబున్ = స్నేహితుల సమూహమున్ను; చిత్తములు+అందున్ = మనస్సులందు; మెత్తురు+ఏ = మెచ్చుకొందురా? మెచ్చరు.

తా. దుర్యోధన భీష్మ కర్ణ ద్రోణాదులు నా యుద్ధమును చూచి యీతఁ డర్జునుఁడా యేమియని మనంబుల

క్షోభించునట్లుగా చేసి వారి నెదుర్కొని జయించి పశువులను మరలించుకొని రానిచో నన్ను నాతండ్రి, స్నేహితులు, పరివారము మెచ్చుకోరు.

విశే:—పార్థుఁడు (వ్యు) పృథకుమారుఁడు (అర్జునుఁడు) సుహృత్+జనంబు=సుహృజ్జనంబు- శ్చుత్వసంధి;

10. తత్+ప్రదేశంబునన్=ఆచోట; ఉనికిన్+చేసి= ఉండుటచే; అను+అప్పుడు = అనునప్పుడు - సూ. ఉదంత తద్ధర్మార్థక విశేషణములకు అచ్చు పరంబగు నపుడు నుగాగమంబగు.

11. ద్రుపద ధరణిపతి నందన = ద్రుపద మహారాజు కూతురు ద్రౌపది; స+అమర్ష+అపహాస+తరళ+హృదయ+ ఐ=ఓర్వలేని తనముతో కూడిన, నవ్వును, చలించు మనస్సు కలదై (సర్వసమర్థుడైన యర్జును డుండగా ఉత్తరకుమారుని ప్రజ్ఞకు అమర్షము-అతిసమర్థ ప్రజ్ఞ, అసమర్థత తెలియుట వలన అపహాసము-ఈసందర్భమున అర్జునుని బహిరంగపఱచుట యుక్తమగునా కాదా యని హృదయాందోళనము) తత్ వృత్తాంతము=ఆ సమాచారము; ఇంద్రతనయుని తోడన్= అర్జునునితో;

తా. ద్రౌపది యప్పుడక్కడ ఉండుటచే ఆమాటలు వినికి యర్జునుని దగ్గరకు పోయి యా సమాచారమును చెప్పెను.

౧౩. అతీతంబు+అగుట=దాటుట; నిరూపించి=విశదఁ జెప్పి; పాంచాలికిన్=ద్రౌపదికి; సారథ్యంబుచేయు=రథము తోలు; సామర్థ్యము=శక్తి; ఖాండవదహనమునన్=ఖాండవ వనమును (అగ్ని) కాల్చువేళ: పాండవ మధ్యమునకున్=అర్జునునకు: (ధర్మజ, భీమార్జునులు కుంతిబిడ్డలు మువ్వురిలో భీముఁడు మధ్యవాడు. ధర్మజ, భీమార్జున నకుల సహదేవులు పంచపాండవులలో మధ్యవాఁ డర్జునుడు. కనుక భీమునకు, అర్జునునకు కూడ పాండవ మధ్యముఁడని భారత ప్రయోగ ములు గలవు. కావున సందర్భమును బట్టి అర్థము చూచుకో వలెను) చిత్తంబుపడసెన్=అనుగ్రహము సంపాదించెను; పెక్కు+ఎడలన్=అనేక సమయములందు; తదీయంబు+అగు రథంబు=వాని రథమును; కడపట=సదుపుటకు; తాను+అ+ఐ=అతడేయై; తత్+సహాయ్యంబునన్=వాని తోడ్పాటుతో; సంశయంబు+వలవదు=సందేహమువద్దు; తగన్+ఆడి=చక్క గాపలికి; తెలుంగు+గావింపుము=పద్ధతిచేయుము; సైరంధ్రి= విచ్చలవిడియై యొకరి యిండ్లనుండి శృంగారించుటలోనగు పనులు చేయునట్టి సత్ప్రవర్తనగల స్త్రీ—ద్రౌపది సైరంధ్రీ రూపమున విరాటుని నగరమం దున్నది.

విశే:— నీవు+పోయి=నీవువోయి — గసడదవాదేశ సంధి.

## ఐతిహ్యము (Allusion)

ఖాండవదహనము:—ఖాండవవనము ఓషధుల కునికిపట్టు. భూలోకముననున్నది. కాని యది దేవేంద్రునిది. ఒకసమయమున అగ్ని అజీర్ణరోగ పీడితుండై బ్రహ్మతో మొఱపెట్టుకొనగా నతఁడు ఖాండవవనమునుదహించినచో రోగముపోవునని చెప్పెను. అగ్ని దహింపఁబోగా నింద్రుఁడు వర్షించుటయు, నగ్నికోరిక నెఱవేరకుండుటయు జరుగుచుండగా కృష్ణార్జునులా దెసకు విహారమునకు రాఁగా అగ్ని వారిని శరణుజొచ్చెను. ఖాండవవనమంతమేర బాణములతో పైకప్పు నిర్మించి యింద్రుని వర్షపాతమునుండి తప్పించుటకు అర్జునుడు తన కోదండ పాండిత్యము పరాక్రమము ప్రకటించి అగ్నిదేవుని రక్షించెను.

సాహాయ్యము· (ప్ర) సాయము (వి)

13. అంబుజ+ఆననా=పద్మమువంటి ముఖము గలదానా (స్త్రీ); జనపతి నందనుండు=రాజకుమారుడు; ఆరయుచున్నవాడు=వెదకుచున్నాఁడు; క్రీడి=అర్జునుఁడు; భుజశక్తి=బాహుబలము; రూఢికిన్+ఎక్కిన=ప్రసిద్ధికెక్కిన; సూతవృత్తిమైన్=సారథ్యముతో; అనిన్=యుద్ధమునందు; నడినన్న+ఏడైజు=అనింద్యమైన పరాక్రమము;

తా. ఉత్తరా! ఉత్తరకుమారుడు తగిన సారథికొరకు వెదకుచున్నాఁడు. తెలిసిన విషయము చెప్పవలయునుగదా! అర్జునుఁడు మెచ్చుకొను నంతటి నేర్పు, భుజబలము గలిగి;

చక్కగా రథముతోలంగల యకుంఠిత పరాక్రమము మన బృహన్నలకుం గలదు.

విశే:—క్రీడి (వి) కిరీటి (ప్ర), భుజము (ప్ర) బుజము(వి) శక్తి (ప్ర) సత్తి (వి), రూఢి (ప్ర) రూడి (వి), అంబుజము (వ్యు) నీటినుండి పుట్టినది (పద్మము)

14. ఉవిద=ఓస్త్రీ; ఖాండవదహన+ఆదులు+ఐనవిక్రమములు=ఖాండవవనమును కాల్చుట మొదలగు పరాక్రమములందు; వెరవు=ఉపాయము; లావు+కాదు+ఎ=బలమేకదా

తా. మన బృహన్నల ఉపాయము, బలము చేతనే కదా మునుపు అర్జునుఁడు ఖాండవవన దహనము మొదలగు పరాక్రమ కార్యములందు జయమొందెను. దీని నుత్తరునకు తెలియపఱుతము.

విశే:— విక్రమములు=పరాక్రమములందు — సూ. ఒక్కొకచో జడంబు సత్తువికిం బ్రథమయగు; ఉవిద (వి) యువతి (ప్ర)

15. ఆ+ముదితయుక్=ఆ స్త్రీ యగు ఉత్తరయు; సముచితముగన్=తగునట్లుగా; ఆ+కుమారవరుడు=ఆ శ్రేష్ఠుడైన రాజకుమారుఁడు; అల్లనన్ నగుచున్=మెల్లగానవ్వుచు (చిరునవ్వుతో)

తా. ఉత్తరయు, సైరంధ్రియు వెళ్ళి యుత్తరునకు శాసించి చెప్పగా రాకుమారుఁడు నవ్వుచు సైరంధ్రితో నిట్లనియె.

వి శే:—ఆ+ముదిత=అమ్ముదిత; ఆ+కుమారుఁడు= అక్కుమారుఁడు— త్రికసంధి; ముదిత (ప్ర) ముద్దియ (వి) కుమారుఁడు (ప్ర) కొమరుఁడు (వి)

16 అలిగొనగన్ + ఏల = పరిహాసము చేయనేల? (తక్కువపఱుచు) ఏను=నేను; కనువిచ్చి=కన్నువిప్పి; పేడిన్ = నపుంసకుని (గడ్డము మీసము లేని పురుషుఁడు) చూడన్ రోయుదున్=చూచుట కసహ్యించుకొందును; రణమునన్= యుద్ధమునందు; సూతకృత్య భరమున్ = రథముతోలు పని యొక్క బరువును; తాల్చుటకు=ధరించుటకు; ఏ+మెయిన్= ఏ విధముగా; పనుచువాఁడన్=నియోగించు వాఁడను;

తా. సైరంధ్రీ! నన్నేల కించపఱచెదవు, పేడివాని ముఖమును నేనుచూడ రోయుదును, అట్టియెడ యుద్ధము నందు సారథ్యమున కెట్లు నియోగింపగలను?

వి శే:—భరము (ప్ర) బరువు (వి) ఏ+మెయి= ఏమ్మెయి—త్రికసంధి;

18. బిట్టుఅక్ పట్టన్=శీఘ్రముగా పట్టుకొనుటకు; పరిగొని=చుట్టుముట్టి; శౌర్యసంపదయున్=పరాక్రమ సమృద్ధియు బాహుబలంబున్ = భుజశక్తియు; ఏన్=నేను; అరిగెదను+అట=వెళ్ళెదనట; తేరికిన్=రథమునకు; పురిలోనన్=ఊరిలో రథచోదకులు=రథము తోలువారు (సారథులు)

తా. గోవులను పట్టుకొనుటకు దండెత్తి వచ్చినది కౌరవ బలమట! శౌర్యము, బాహు పరాక్రమము ప్రకటిం

చుటకు పోవునది నేటు! అట్టినాకు బృహన్నల సారథియైన చిన్నవాఁ డెవ్వఁడైన నవ్వఁగా? ఈ యూరింత గొడ్డువోయి నదా? సారథు లెవ్వరును లేరా?

20. పృథివీవరనందన = రాజకుమారా! కౌరవసేన కాదు = ఒక్క కౌరవసైన్యమే కాదు; త్రిజగంబులున్ = మూఁడు లోకములును; ఒక్కటన్ = ఒకేపర్యాయము; బృహన్నలా వశగతిన్ = బృహన్నలయొక్క స్వాధీనముచేత; చరించిన = సంచరించిన యెడల; తత్ + వీరగుణంబు సొంపు = వాని పరాక్రమ గుణముయొక్క సమృద్ధి; మున్న + ఎఱుంగుదున్ = ఇంతకు మునుపే నాకు తెలియును; కారణజన్మము + ఐ = ఒకానొక కారణమువలన పుట్టుకగలదై; తను వికారము = శరీరమునందలి వికృతి; వచ్చినన్; పెంపు + తప్పును + ఏ = ఆధిక్యత పోవునా? (ఊర్వశీ శాపగాథ యిచ్చట ననుసంధేయము)

తా. రాజకుమారా! ఒక్క కౌరవసేనయే కాదు, ముల్లోకము లొక్కమాటు దండెత్తి వచ్చినను బృహన్నల రథసారథియైనచో గెలువవచ్చును. వాని పరాక్రమాదులు నే నెఱుంగుదును కనుక చెప్పుచుంటిని. ఒకానొక కారణము చేత శరీరమునందు వికృతి కలిగినంత మాత్రమున సహజ పరాక్రమ గుణాధిక్యత యెక్కడికి పోవును ?

వి శే : త్రిజగంబులు–ద్విగు సమాసము; వశము (ప్ర) వసము (వి) పృథివి (ప్ర) పుడమి (వి)

21. అనవుడున్ = అని పల్కగా,

22. మనము = మనస్సు; ఉరియాడుచున్ ఉండన్ కన్ = ఊగులాడుచుండగా; ఒరులు = ఇతరులు; అప్పటికి లేమిన్ = ఆసమయమునకు లేకపోవుటచేతను; ధరణి+ఈశ్వర+నందనుఁడు=రాజకుమారుడగు ఉత్తరుఁడు; పిలువన్ పనుచుటకు=పిలువ బంపుటకు; ఒడబడిన పలుకు=ఒప్పుకొనినమాట; తగన్=ఒప్పునట్లు;

తా. మనస్సుయ్యాలవలె నూగులాడుచుండుటచేతను, అప్పటికి సారథి యెవ్వడును లేకపోవుట చేతను ఉత్తరుడు బృహన్నలను పిలువబంపుట కంగీకరించెను.

23. తనదెస=తనవైపు; తోడ్కొనివచ్చెదన్ = తీసికొనివచ్చెదను;

24. ఇంతి=స్త్రీయగు ఉత్తర; మెఱుగు=మెఱపుతీగ; మొగిలు+చొచ్చు తెఱగునన్ = మేఘమునందు ప్రవేశించు రీతిగా; తనదు=తనయొక్క; అరిగి=వెళ్ళి; ప్రార్థన = వేడుకోలు; వినయము=అణకువ; సంభ్రమము = వేగిరపాటు; పెనగొనంగ=చుట్టుకొనగా; నెమ్మిన్=సంతోషముతో;

తా. మెఱపుతీగ మేఘమునందు ప్రవేశించునట్లుగా ఉత్తర నాట్యమందిరములో ప్రవేశించి గురువగు బృహన్నల దగ్గరకుపోయి ప్రార్థన, వినయము, వేగిరపాటు పెనగొన సంతోషముతో వాని కిట్లనెను.

వి శే:—మొగిలు (వి) మేఘము (ప్ర) ఇంతి (వి) స్త్రీ (ప్ర) తనదు—సూ. యుష్మదస్మదాత్మార్థకంబులకు ఉత్తర పదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు.

25. మదీయ+అగ్రజన్మసారథి=నా సోదరుని రథము తోలువాడు; ఒక కయ్యంబునన్ = ఒక యుద్ధములో; ఈక్రియ కున్ = ఈ సారథ్యపు పనికి; ఒండొరునిన్ = మరియొకని; అచ్చుపడుపడు+అయ్యెన్ = ఏర్పాటు చేయడమయ్యెను.

తా. నా అన్నగారి సారథి మునుపొక యుద్ధములో చనిపోయినాడు. అది మొదలుకొని తగిన సారథి యొక్కడను దొరకకపోవుటచే నిం కెవ్వరిని ఆపనికి నియోగింపలేదు.

విశే:— కయ్యము (వి) కలహము (ప్ర) ఏ+చో‌ట— త్రికసంధి;

26 కూయి వచ్చినన్ = మొఱ్ఱవినఁబడగా; సన్నద్ధుండై = సిద్ధపడినవాఁడై; వెనుకన్ తగులన్ = ఎదుర్కొనుటకు; సమకట్టి = ప్రయత్నించి; లేమికిన్ = లేకపోవుటకు; విషాదంబున్+ఒందినన్ = విచారపడగా; నీ+కఁదువ = నీ నేర్పు (కౌశలము) ప్రియంబు+అంది = సంతోషించి; తోడ్తేరన్ = తీసికొనివచ్చుటకు; పనిచెన్ = పంపెను; చనవు = పరిచయము (చెల్లుబడి) కుఱుచ చేయక = తక్కువ పఱుపక (అగౌరవ పఱచక అనగా ఆదరించి) ఎల్లవిధంబులన్ = అన్ని విధముల అనగా తప్పకుండ; పెంపు = ఆధిక్యము; ప్రకటంబుగాన్ = వెల్లడియగునట్లు; కడపన్ = నడుపుటకు; ఇయ్యకొని = అంగీకరించి; తలఁగవలయున్ = తొలగింపవలయును; తక్కుట = మానుట; వాత్సల్యంబు = ప్రేమ; కొఱంతపఱచుట = తక్కువచేయుట; ముద్దియ పలుకులు = స్త్రీ మాటలు; ముద్దుచేసి = ఆదరించి;

27. నగుచున్ = నవ్వుచు; జగతి+ఈశ్వర+పుత్రి = రాజకుమారీ, మిగులన్+కాన్ = అతిక్రమించుటకు; వెఱతున్=భయపడుదును; పొదము=పోవుపనము; మీఁద+అట్లు+ఉండెన్=అటుపై నేమియైన కానిమ్ము;

విశే:—పొదము—సూ. పోవుటకు నాజుపరంబగు నపుడు పొదా దేశంబగు;

తా. రాజకుమారీ! నాకు సారథ్యముచేయు నేర్పు కలదా? కాని నీమాట దాఁటుటకు జంకుదును ముందేమైనఁ గానిమ్ము. అటులే పోదము.

28. అంబుజవదనా! పద్మమువంటి ముఖముగల దానా! (స్త్రీ)సారథ్య విధంబు+ఒకఁడు+అనన్+కల+ఏల= రథము నడుపురీతి ఒక్కటే, అననేల?; భవదీయ ప్రార్థన చేన్=నీవేడికోలుచే; తివిరి=ప్రయత్నించి; పరమ దుష్కరములు=మిక్కిలి కష్టమైన పనులైనను; తీర్చి=చేసి; ఉత్సవము+ఒనరించెదన్=సంతోషము కలుగఁజేసెదను;

తా. కాంతా! ఒక్కసారథ్యమన్న మాటేమి నీవు వేడుటచే నెంత దుష్కరమైన పనులైనను నెఱవేర్చి నీకు సంతోషమును కలుగఁ జేసెదను.

29. సంగీత నిలయంబు = నాట్యమందిరము నుండి; వెలువడి=బయటికివచ్చి; సలీలబుగాక=విలాసముతో కూడు నట్లుగా; మెత్తమెత్తన=మెల్లమెల్లగా; నడతెంచు = పోవు; మత్తశుండాలంబునున్ పోలెన్=మదించిన యేనుఁగువలె.

30. ఉరుగుదెంచు బృహన్నలన్ = వచ్చుచున్న బృహన్నలను; అంతన్ అంతన్+కని = కొంతదూరము నుండి చూచి; నృపాలసుతుండు = రాజకుమారుడు; కడగి = ప్రయత్నించి; ఈవు = నీవు; కడపవలయున్ = నడుప వలయును;

తా. వచ్చుచున్న బృహన్నలను ఉత్తరుడంత దూరమున జూచి గౌరవముతోఁ నాకు కౌరవులతో పోరాటము వచ్చినది. నేడు నీవు నా రథము నడుపవలయును.

31. వే = శీఘ్రముగా; మైమఱువున్ = కవచమును; తొడి = తొడిగి; తేరు+ఎక్కుము = రథమెక్కుము; నీకున్ + తప్పక్ + క్రుంగన్ + జేయను = నీకు, అతిక్రమించుటకు, ఒప్పదు (నీవు మాట దాటరాదు) వీరమ్మైన పెంపు = పరాక్రమము నందు ఆధిక్యము; లావు = సామర్థ్యము, వెరవు = ఉపాయము;

తా. వేగముగా రమ్ము కవచము తొడుగుకొని రథ మెక్కుము. నీవు నామాట దాటరాదు. నీ పరాక్ర మాతిశయము, నీనేర్పు, నీబలము మాకు సైరంధ్రి చెప్పినదిలే!

విశే:—వీరమ్మైన పెంపు—సూ. కొన్ని యెడల సప్తమీతత్పురుషమునందు న వర్ణకంబునగు;

32. రాజనందనా! రాజకుమారా! ఆటపాట కల అప్పటికిన్ = నాట్యము, సంగీతము ఇవి వచ్చిన ఆ సమయము నకు; తగున్ కాక = ఒప్పును కాక; సంగరంబు చేయఁగన్ = యుద్ధము చేయుటకు; ఉచితంబు+ఎ = తగునా? ఎల్లఎడలన్ అరసి = అంతటను వెదకి; బాహు+బల+అధ్యుండు+ఐన = భుజబలము

తోఁగూడినవాఁడైన; ఏడ్తెఱన్ = సామర్థ్యముతో; కడప
గాన్ = నడుపుటకు; నియమింపుమా = ఏర్పాటుచేయుము;

తా. రాజకుమారా! నాట్యము, సంగీతము మొదల
లగు విషయములు వచ్చినప్పుడు నన్ను పిలువఁదగును గాని
యుద్ధము చేయుటకు సారథిని కమ్ము. రమ్మని పిలువ
న్యాయమా? బలపరాక్రమములు గల వానిని మఱొక్క
నెవ్వనినైన వెదకి రథము తోలుటకు నియోగించుము.

33. వైరాటి = విరాటుని కుమారుఁ డుత్తరుఁడు; కిరీటి =
అర్జునుడు.

34. ఖాండవము + ఏర్చు + అప్పుడు = ఖాండవ వనము ను
దహించునప్పుడు; తగన్ = ఒప్పునట్లుగా, రథచోదక వృత్తి
సల్పి = రథము తోలుపని చేసి; ఆఖండల సూతికిన్ = ఇంద్రుని
కుమారుడగు అర్జునునకు; జయము + కల్గన్ ఒనర్చిన అట్టి =
జయము కల్గుటకు చేసినట్టి; దండితనంబున్ = శౌర్యమును; నీ
ఎడన = నీయందు; తక్కెను + ఎ = తప్పిపోయెనా (లేదా) నా
దెసన్ = నాయెడల; మైత్రి పెన్పుము = స్నేహము పెంపు
చేయుము; ఒండొకమాట = మఱియొకమాట; తక్కుము =
విడువుము; గక్కునన్ = శీఘ్రముగా; రణ + ఉత్సాహనంబు +
ఒనరింపుము = యుద్ధప్రయత్నము చేయుము;

తా. ఖాండవవన దహన సమయమున అర్జునుని రథ
ముతోలి వానికి జయము చేకూర్చిన నీ పరాక్రమము, నీ
నేర్పు, ఇప్పుడే మైనవి. నాయెడ స్నేహభావము చూపుము.
మాఱుమాటాడకుము. వెంటనే యుద్ధప్రయత్నము చేయుము.

విశే:—ఆ ఖండలుఁడు (వ్యు) శత్రువులను ఖండించు వాడు (ఇంద్రుఁడు) రణ+ఉత్సాహనము = రణోత్సాహనము— గుణసంధి; ఒనరింపు—సూ. మధ్యమ పురుషమువర్ణకంబునకు హాలవసానంబులు పరంబులగు నపుడు లోపము విభాషనగు.

35. అడ్డము ఆడన్=వ్యతిరేకము చెప్పుటకు; వెఱచి నట్టి తెఱంగు=భయపడినట్టి రీతి; భావించి=నటించి; అల్లన్ ఇయ్యకొనుటయు=మెల్లగా అంగీకరించుటయు; ఆ+మనుజ+ ఇంద్ర+సుతుఁడు=ఆరాజకుమారుఁడు; దృఢ+తనుత్రాణము= గట్టికవచము; తేరకన్=తెచ్చుటకు; పనిచెన్=ఆజ్ఞాపించెను;

తా. రాజకుమారుని మాట కడ్డు చెప్పరా దనునట్లు నటించి బృహన్నల మెల్లగా నంగీకరించెను. ఉత్తరుఁడు బృహన్నల కొఱకు కవచమును తెప్పించెను.

36. ఈవు=నీవు, ఒప్పించినన్=ఈయగా; ఒఱపలు+ కాన్=వ్యత్యస్తములగునట్లు(తారుమారుగా) మైన్+శరీరము నందు; అబలాజనమున్=స్త్రీసమూహమును; నగఁపించెన్ = నవ్వించెను;

తా. ఉత్తరుఁడు కవచమును తెప్పించి తొడుగుకొను మని బృహన్నలకీయగా నతఁడు చేతగానివలె తల్లక్రిందుగా తొడుగుకొని యచటిస్త్రీలను నవ్వించెను.

37. సత్వరంబుగన్= వేగముగా; తత్ తనువునన్= ఆబృహన్నలశరీరమునకు; మఱువు+తొడిగి=కవచముతొడిగి

హృద్య=ఉదాత్తము+అగు=మిక్కిలి ప్రియమైన; కంకటము+ఇడి=కవచముతొడుగుకొని; పసిన్=ఆవులను; క్రమ్మఱింపన్=మరలించుటకై; చిత్తము+చిడిముడిపడగన్= మనస్సుతొందర పడగా;

తా. ఉత్తరుండు బృహన్నలకు కవచము సరిగాతొడిగి తనకిష్టమైనకవచమును తానుతొడుగుకొని గోవులను మరల లించుటకు మనస్సు తొందరపాటునొందగా

38. అవలోకించి=చూచి;

39. హయములన్+పూన్పుము=గుఱ్ఱములనుకట్టుము; రయమునన్=వేగముగా; సిడము+ఎత్తుము=జండాయెత్తుము; గో+చయమున్ + కొని = ఆవులసమూహమును తీసికొని; ఇపుడు+అ=ఇప్పుడే; అస్మదీయవిజయము= నాయొక్క విజయమును; అభినందింపన్=పొగడగా;

తా. రథమునకు గుఱ్ఱములనుకట్టుము, ధ్వజమును వేగముగా నెత్తుము. నాయొక్కవిజయమును పౌరులుపొగడి వన్నెదుర్కొని గౌరవించునట్లు ఆవులను మరళించుకొని రావలయును.

40. పనిచినన్ = ఆజ్ఞాపించినను; అట్లు+అ=అట్లే; ఎడన్=చోట; నీవుచన్న దెసన్=నీవు వెళ్ళినవైపున; పనిగొని= నియోగించి; కడిమిమైన్ = పరాక్రమముతో; పగఱన్ = శత్రువులను; గెలువము=గెలువుము;

తా. నీవేపని చేయుమనిన నది చేయవలయును. నీవున్న యెడల నుండవలయును, నీవు వెళ్ళినచోటికి వెళ్ళవలయును. సరే! నాశక్తి తెలిసికొని నాకుపనినియోగించి పరాక్రమము ప్రకటించి శత్రువులను గెలువుము.

విశే:—గెలువుము—గెలుచు—సూ. పిలుచు మొ లగువానికి ముపర్ణముపరంబగునపుడు నడ్రవాయి బహుళం బుగా లోపించును.

41. ముదంబు+ఎదవగ్ = సంతోషముకల్గగా; ధనం జయుండు=అర్జునుఁడు (రాజసూయమున దిక్కులరాజులను గెలిచి ధనమునుగొనివచ్చినవాఁడు)

42. కాంచన+జాల+అలంకృత = బంగారుమయమైన గొలుసులచే అలంకరింపబడి; చంచత్+తనులీల=ప్రకాశ మానమైన శరీరవిలాసము; మెఱయన్=ప్రకాశింపగా; జవన+ అశ్వములన్=వడిగలగుఱ్ఱములను; పూంచి=కట్టి, బంధుర భంగిన్=ఒప్పిదమైనరీతిగా (చక్కగా) మణిమయ=రత్నమయ మైన; పంచానన కేతువు+ఎత్తెన్=సింహధ్వజమునెత్తెను.

తా. అర్జునుఁడు బంగారుగొలుసులచే నలంకరింపబడిన వడిగలగుఱ్ఱములనుగట్టిన రథమున రత్నమయమైన సింహ పతాకమెత్తెను.

విశే:—మణి (ప్ర) మిన్న (వి) పంచాననము (వ్యు) విస్తీర్ణమైన ముఖముగలది (సింహము)

43. సన్నాహంబు=ప్రయత్నము;

44. కురువీరులన్=కౌరవవీరులను; తత్+అంబరము లలోన్=వారి వస్త్రములలో (తలపాగ గుడ్డలలో) చిత్రవర్ణ భాసురములు+కాగ = విచిత్రమగు రంగులచే ప్రకాశించునవి యగు నట్లుగా; తరము+ఎఱిగి=ఆయా కురువీరుల శక్తి తెలిసి కొని; లోచన+ఉత్సవకరములు + కాన్=కన్నుల పండువగు నట్లుగా; బొమ్మపొత్తి కలకున్ = బొమ్మలకుకట్టు మెత్తని సన్నని చిన్నవస్త్రములకు; తెండు=ఈ=తీసికొనిరండి।

తా. కౌరవ వీరులగు భీష్మ ద్రోణాదుల తలపాగల లోని రంగు రంగుల గుడ్డలను తీసికొనిరండు. అవి యెంతో అందముగా నుండును. ఆ యా వీరులు రంగు రంగుల తలపా గలు ధరింతురు. ఆ గుడ్డ ముక్కలను బొమ్మలకు కట్టి అలంక రింతుము.

విశే:—తత్+అంబరము = తదంబరము-జశ్త్వసంధి; వర్ణము (ప్ర) వన్నె (వి) పొత్తిక (వి) పుత్రికా (ప్ర)

ఆ యా కురువీరులు ధరించినవి ఆ యా రంగు లనుట కును, 'తరమెఱిగి' యనుటకును ఈ క్రింది పద్యము ప్రమాణము :—

సీ. ఇక్కురు సైన్యంబు సొక్కు దక్కక మున్న
ప్రక్కనం జనుము; రారాజు, ద్రోణ
లేవయొండుఁజుట్టిన తలచుట్లు వల్లని
యవి; సూతపుత్రు శిరోంబరంబు

పచ్చని యది; కుంభభవకృపాచార్యుల
యుష్ణీషములు వెల్లలుఁగ సీత
తెమ్మింతవట్టును; దేవనదీ సూనుఁ
డియ్యస్త్రమునకు మాఱెఱుఁగఁగాన
గీ. నతఁడు దెలిసియుండు నాతని ద్రెస్సోఁక
మనిన మత్స్యరాజ తనయుఁ డెలమి
దోలక నొగలఁ బగ్గములఁ గట్టి చని వాని
నెల్లఁ దెచ్చి యరదమెక్కుటయును.

45. అనుడున్ = అని పల్కగా; జనపాలకనందనుండు = రాజకుమారుఁడు; జయలక్ష్మిన్ = విజయసంపదను; చేకొనునటె = తీసుకొని వచ్చునట; చీరలు తెచ్చుట = వస్త్రములు తెచ్చుట; పనియే = అదియొక ఘనకార్యమేనా?; ఎల్లభంగులన్ = అన్ని విధములచేత; తెత్తున్ = తీసికొనివత్తును.

తా. రాజకుమారుడగు ఉత్తరుడు విజయలక్ష్మిని చేపట్టి తెచ్చుచుండ బొమ్మ పాత్రికలకు గుడ్డలు తెచ్చుట యొక ఘనకార్యమా? తప్పక తెత్తును.

46. ధనుః+తూణీర+కృపాణ + ముద్గర+ఆది+వివిధ+సాధనంబులు = విల్లు, అమ్ములపొది, కత్తి, ఇనుపగుదియ మొదలగు పలురకముల ఉపకరణంబులు; ఇడి = ఉంచి; నొగలు+ఎక్కి = రథకూబర మెక్కి (కాడిమానికి ఆధారమైబండిరథము మొదలగువాని మొదటనుండెడు నిడుపాటి మ్రాను, నొగ — (The poles that connect the carriage with the

yoke) బ్రుక్కి = చిక్కి; చక్కంజేసెను = సరిజేసెను; పితృ వనంబువలను = శ్మశానమువైపు; రథ+ఆరోహణంబు చేసి = రథమెక్కి; పౌర+వృద్ధ+పుణ్య+అంగనా+భూసురసమూహం బులు = పట్టణములోని పెద్దలు, ముత్తైదువలు, బ్రాహ్మణ సమూహములు (పెద్దముత్తైదువలనియు చెప్పవచ్చును) తొల్లి = పూర్వము; నీకతంబునన్ = నీకారణమున; మాంగల్యంబు+ ఎట్టిది = శుభత్వమెట్టిదో (ఎట్టి మేలుకలిగెనో) అట్టిది+అ = అట్టిమేలే; భవత్+సాహాయ్యంబునన్ = నీ సహాయముచే; భూమిం జయునకు = ఉత్తరునకు; సేసలు = అక్షతలు; పురంబు నిర్గమించి = పట్టణమునుండి బయల్వెడలి; నిర్+అవగ్నిళపరాక్రముండు = అడ్డు లేని పరాక్రమముగలవాడు; ఫల్గుణు నైపుణంబునన్ = అర్జు నుని నేర్పువలన; వల్గత్+అశ్వంబు+అగు = ఉడాయించు గుఱ్ఱ ములు గల (ఆస్కందితం ధోరితకం రేచితం వల్గితం ప్లుతమ్ గతయోఽమూః పంచధారాః;—నిశ్చలమై అతివేగము నతి మందముగాక సమమైనగతి ఆస్కందితము. అంతకంటె నధిక మైనగతి చతురమైన గతి ధోరితకము. తాళగతితో పేర్మి ముగా తిరుగుట రేచితము. వేగముచేత విడువబడినదై మీఁదికి కాళ్ళు కదలించుట (ఉడాయించుట) వల్గితము. వేగమున నంతట సమముగా పోవుట ప్లుతము) రయంబున కున్ = వేగమునకు! పరేతనిలయ ప్రాంతప్రదేశంబు = శ్మశాన సమీపభూమి;

విశే:—ధనుః+తూణీరము—విసర్గసంధి; పగ్గము (వి) ప్రగ్రహము (ప్ర) అర్జునుఁడు (వ్య) అర్జునకర్మ అనగా

స్వేచ్ఛమైన కర్మచేయువాఁడు; అయ్యేడు + అని=అయ్యేడు మని—సూ. ఎడు, తల ప్రమతంబునకు అచ్చుపరంబగునపుడు మకారంబగు; ఫల్గునుఁడు (వ్యు) ఉత్తరఫల్గునీ నక్షత్రమున పుట్టినవాడు (అర్జునుఁడు) వల్గత్ + అశ్వంబు=వల్గదశ్వంబు— జశ్త్వసంధి; ప్రాంతము (ప్ర) పొంత (వి),

47. ధరాధూళి లలితవనము=భూమియందలి దుమ్ము అనెడు మనోజ్ఞమైన ఉద్యానవనము; దివికిన్=స్వర్గమునకు; నళిన్=అత్యంతము; కాఁపువోయెడు తెఱఁగున్ తాల్పన్= కాపురము చేయుటకు వెళ్ళుచున్నదా యను రీతిని ధరింపగా (కవి ఉత్ప్రేక్షించినాడు) గోగణము = ఆవులమంద; ముంగలి గన్=ముందుసడచునదిగా; నేలగోడిపడగన్=నేలక్రుంగునట్లు; అభినవ+జలధర+శ్యామంబులు+అగు+ఎడలు = క్రొత్తమేఘ ములవలె ఆకుపచ్చని రంగుగల చోటులు; ఆకు జొంపంబు లన్+అనుకరింపన్=పచ్చని ఆకు గుబురులను పోలియుండగా; సాంధ్యరాగ+ఉపమ+ఛాయంబులు+అగుపట్లు = సంజకెంజా యలను పోలిన రంగులు గల చోటులు; కిసలయ+ఉత్కరము లన్+చిగుళ్ళగుంపులను; క్రేణిచేయన్=పరిహాసము చేయగా అనగా అతిశయింపగా; రాజమరాళగౌరములు అగుచోటులు= రాజహంసలవలె తెల్లనగుచోట్లు; తఱచు+పూపొదల చందం బున్+ఒందన్=దట్టమైన పూవులతోడి పొదలరీతిని పొందగా; హారిద్రరుచిసమాన+ఆకృతులు+అగు తావులు=పసుపురంగు తోసమాన ఆకారములు గల చోటులు; అడరెడు + పుష్పా

డులు + అట్లు + మెఱయున్ = ప్రకాశించు పుష్పొడులవలె నుండగా; నడచు కౌరవ రాజసైన్యంబున్; కవిమెన్ = చూచెను.

తా. ఆవులను ముందుగా తోలుకొని నేల గ్రుంగిపోవు నట్లు నడచుచున్న కౌరవసేనను ఉత్తరుఁడు చూచెను. ఆ సేన నడచునపుడు నేలనుండి యధికముగా రేగిన ధూళి యెట్లున్నదో వర్ణించుచున్నాఁడు. ఆ సైన్యము పలురంగులు గల భూమిపై నడచిపోవుచున్నది. వర్షకాలపు మేఘముల వలె నున్న నల్లరేగడి నేలనుండి రేగిన దుమ్ము ఆకాశాంపము లను పోలియుండెను. సంజకెంజాయవంటి ఎఱ్ఱచెక్క నేలనుండి యెగసిన ధూళి చిగురుగుబురులను తిరస్కరించుచుండెను. రాజహంసల గుంపువలె తెల్లనగు నేలనుండి రేగిన ధూళి దట్టమగు పూలపొదలవలె నుండెను. పసుపువన్నె నేలనుండి రేగిన ధూళి పుష్పొడులవలె మెఱయుచుండెను. ఈపై రంగులు గల ధూళులన్నియు కలిసి పైకెగయుగా అందమైన పూల తోట యొకటి స్వర్గమునకు కాపురము లేచిపోవుచున్నదా యనునట్లుండెను.

వి శే:—జలధరము (వ్యు) నీటిని ధరించునది (మేఘము) అగు+ఎడలు=అగునెడలు—సూ. ఉదంతతద్ధర్మాదర్థక విశేష ణమునకు అచ్చు పరంబగు నపుడు నుగాగమంబగు; సంధ్య (త్స) సంజ (వి) ఉపమ+ ఛాయంబులు=ఉపమచ్ఛాయంబులు-

-ఛత్వసంధి; కిసలయ+ఉత్కరము = కిసలయోత్కరము-గుణ సంధి;

పూవు+పొద=పూఁబొద. సూ. ప్రాంతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబుల కెల్లలోపంబు బహుళంబుగా నగు= పూ+పొదలు (2)లుప్తశేషమునకుపరుషములుపరంబగునపుడు నుగాగమంబగు=పూ+న్+పొద (3) ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు=పూ+న్+బొద (4) ఆదేశ సరళ ములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేష స్వత్వరూపం బులు విభాషనగు=పూఁబొద; పువ్వు+పొడి = పుప్పొడి-సూ. క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషమునకు కొన్ని యెడల నుగాగ మంబును, కొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వంబునగు; ధరాధూళి లలితవనము—రూపకము.

48 గరుపాటిన మేనును = గగుర్పాటుపొందిన శరీర మున్ను; తలకు మనమున్ = చలించు మనస్సును; ఱిచ్చ+ పడిన చూపున్ = చేష్టలు దక్కిన చూపున్ను (మొద్దుబాఱిన చూపు) దిగులు+చొచ్చి=భయపడి;

తా. ఉత్తరుని శరీరము గగుర్పొడిచెను. మనస్సు చలించెను. చూపు జడమైపోయెను. తొట్రుపడుచు భయ ముతో బృహన్నలతో నిట్లనెను.

49. భీష్మ+ద్రోణ+కృప+ఆది=భీష్ముఁడు, ద్రోణుఁడు కృపుఁడు మొదలైన; ధ్వని నికర+అభీలంబున్ = విలుకాండ్ర నమూహముచే భయంకరమైనది; దుర్యోధన+గ్రీష్మ + అతి

త్వ=దుర్యోధనుఁ డనెడు వేసవికాలమందలి సూర్యునియొక్క-
పటు=సమర్థమైన; ప్రతాప+విసర+ఆకీర్ణంబుగా = పరాక్రమ
సమూహముచే (తేజస్సుయొక్క గుంపు) వ్యాప్తమైనది
యునుఁ శస్త్ర+అస్త్ర+జాల=శస్త్రములయు, అస్త్రములయు,
సమూహముయొక్క; ఊష్మ=వేడిచే; స్ఫార = అధికమైన
దియు; చతుః+ఉజ్జ్వల=నాలుగువిధములై ప్రకాశించు (చతు
రంగబలములచే) బల=బలముచే; అతి+ఉగ్రంబు= మిక్కిలి
తీవ్రమైనదియు; ఉదగ్ర+ధ్వజ=పొడవైన జండాలయొక్క;
అర్చిస్+ముత్త్వాకలితంబున్ = కాంతులతో కూడినదియునగు;
సైన్యము ఇది= ఈసైన్యమును; ఏఁ జేరన్ కన్ శక్తుండన్
ఏ= నేను సమీపించుటకు సామర్థ్యము గలవాఁడనా? కాను.

తా. భీష్మ ద్రోణకృపాది మహావీరులచే భయంకర
మైనదియును, దుర్యోధనుఁ డనెడు వేసవి సూర్యుని ప్రతాప
పుంజముచే వ్యాప్తమైనదియు, శస్త్రాస్త్రపరంపరల వేడిమిని
గ్రక్కుచున్నదియు చతురంగ బలములచే తీవ్రమైనదియు,
పెద్దపెద్ద జెండాల కాంతులతో కూడినదియు నగు నీసైన్య
మును నేను చేరజాలను.

విశే:—ఊష్మ (ప్ర) ఉష్మ (వి) అతి + ఉగ్రము=
అత్యుగ్రము—యణాదేశసంధి;

50. అకృత+అస్త్రుడన్ = చేయబడని అస్త్రములు
కలవాడను అనగా అస్త్రవిద్య నెఱుగనివాఁడను! కార్ముక
విద్యా ప్రౌఢిమైన్=విలువిద్య యందలి నేర్పుతో; నిరూఢులు

ఐన=ప్రసిద్ధులైన; జయద్రథ= సైంధవుండు; యోధవీరులకు= యుద్ధవీరులకు; ఎదురు+ఏ=ఎదురుగా నుండు నే! అనగా ఎదుర్కొనువాఁడనా? కాను.

తా. నేను చిన్నవాడను. విలువిద్య నెఱుంగనివాఁడను. విలువిద్యయందు మేటులైన యాశకుని, జరాసంధ, దుర్ముఖ, వికర్ణ, కర్ణాది వీరుల నెదుర్కొనగలనా?

51. ఇట్లు+అగుట+ఎఱుగక=ఈవిధముగా జరుగునని తెలియక; మనభంగి+ఎట్టు+ఒకో=మనరీతి యేవిధమో కదా! (ఏమగునో); కడున్ బెట్టిదులు=మిక్కిలి కఠినులు; మార్కొను+అట్టికోలది=ఎదుర్కొను శక్తి; కాదు=లేదు; తొట్రోన్=శీఘ్రముగా; భీతి+ఉడరెడున్=భయము కలుగుచున్నది;

తా. ఈ విధముగా జరుగునని తెలియక వచ్చితిమి. మనపని యేమగునో కదా! వీరందఱు కఠినాత్ములు. వీరి నెదుర్కొను శక్తి నాకు లేదు. నాకు మిక్కిలి భయము కలుగుచున్నది.

52. మనముతోఁ గూడన్=మనస్సుతోఁ కూడ; మేను=శరీరము పోవుచు+ఉన్కి=పోవుచుండుట; ఒప్పునె=తగునా; మార్కొనమి=ఎదుర్కొనక పోవుట; రయంబునన్=వేగముగా; ప్రాణములు+తీపు+అనన్=ప్రాణములు తియ్యనివనుమాట; మున్=పూర్వము.

తా. కౌరవ సేనలను చూచినతోడనే నా మనస్సుతో పాటు శరీరము కూడ కంపించుచున్నది. నీవు మాటాడక రథము తోలుకొనిపోవుట తగునా? ఇప్పటి నా స్థితిని చూచి నచో వీరి నెదిరింప లేకుండుట నిశ్చయము. అందుచే వేగ ముగా రథమును వెనుకకు మరలింపుము. బృహన్నలా! ప్రాణ ములు మిక్కిలి తియ్యనివని నా మాట నీవు వినవా? (ప్రాణం బెల్లం ముక్క అని సామెత)

53. దరహాసిత వదనుఁడు = చిఱునవ్వు ముఖము కల వాఁడు; శతముఖ తనయుండు = ఇంద్రుని కుమారుఁడగు అర్జు నుఁడు;

54. నర+ఇంద్ర+నందనా = రాజకుమారా!; అసదృశ లీలన్ = సాటిలేని విధముగా; పొల్చు = ప్రకాశించు; రథిక+ ఆవలిమీఁదన్ = రథికుల సమూహము పైకి; చనన్ ఈన్ = పోవు టకు; వెఱ్ఱివి+ఏ = పిచ్చివాఁడవా?; మసలక = ఆలస్యము చేయక; అమిషంబు+కొని = ఆశగొలుపు వస్తువుగ (గోసమూహమును) పట్టుకొని (అమిషము-Lovely object - Apte); మార్గము పట్టిన = దారిపట్టిన (వెడలిపోవుచున్న); తుచ్ఛసైన్యమున్ = చిన్న సైన్యమును; వెసన్ = శీఘ్రముగా; గోధనమున్ = ఆవు లనెడు ధనమును; మరల్తును కాక = తప్పక మరలింతును (కాక యనునది ప్రతిజ్ఞా నిశ్చయములను తెల్పును) ఈ+మెయిన్ = ఈవిధముగా; పాడియె = న్యాయమా!

తా. మహావీరులగు కౌరవులనెదుర్కొనుటకు నేనంత వాడ్తివాఁడనా? మనకు ముఖ్యమైన ప్రియమైన వస్తువగు గోధనమును దొంగిలించుకొని పోవుచున్న అల్ప సైన్యమును మొట్టడించి మన ధనమును మనము దెచ్చికొందము. అట్లు పశుసంపద పోవుచుండగా మరలిపోవుట నీవంటి రాజకుమారులకు తగునా?

55. అంతిపురంబులోసన్ = అంతఃపురములో; అంగనలు+ఎల్లన్ = స్త్రీలందరు; నెఱ+మనంబులన్ = నిండుమనస్సులందు; సంతసము+అందగాన్ = సంతోషింపగా; చయ్యనన్ = శీఘ్రముగా; పూని = ప్రయత్నించి; మేటివై = గొప్పవాడవై; అరదము+ఎక్కి = రథమెక్కి; రయంబునన్ = వేగముగా; దంతి+తురంగ+సద్భట+కదంబమున్ = ఏనుగులయొక్క, గుఱ్ఱములయొక్క, భటులయొక్క, సమూహమును; కలంగుట = భయపడుట; ఒప్పును+ఏ = తగునా?;

తా. పశువుల నిట్టే మరలించుకొని వచ్చెదనని అంతఃపురములోని ఆడువాండ్రను విని సంతోషించునట్లుగా పలికి మహావీరుని వలె రథమెక్కి వచ్చి యిప్పు డిక్కడ గుఱ్ఱములను, ఏనుగులను, మనుష్యులనుచూచి భయపడుట నీకు తగునా?

విశే:—అంతిపురము (వి) అంతఃపురము (ప్ర) నెఱ+మనము = నెమ్మనము—సూ. శ్రోత్రాదుల అద్యక్షర శేషమునకు కొన్ని యెడల ను గాగమంబగును. కొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వంబునగు; సంతసము (వి) సంతోషము (ప్ర); దంతి (వ్యు) దంతములుగలది (ఏనుగు); భటుడు (ప్ర) బంటు (వి)

56 ఎలుగు=కంఠధ్వని; వడిగాన్ = వడిగా; పస
లన్ దయ్యము+ఎలుగన్=పశువుల గతి నేర్పు జెలుగునట్లు
పడతుల=స్త్రీలయొక్క అదికిన్ = యుద్ధము చేత; నాన్=
శక్తి కలవాఁడనుగాను;

తా. ఉత్తరుఁడు బృహన్నలను చూచి గద్గదకంఠ
ముతో; పశువుల మాట దేవు డెఱుఁగును. స్త్రీల సంతాప
ముతో నాకు నిమిత్తము లేదు. నేను యుద్ధము చేయఁజాలను'
అని పలికెను.

57, అనవుడున్ =అని పల్కఁగా;

58. తన భుజశక్తియున్=తన బాహుబలమును; రిపుల
దర్పమున్=శత్రువుల గర్వమును; విస్పదన్=స్పష్టపడునట్లుగా,
చూచి చూచి = బాగుగా పరిశీలించి; ఎట్లును+తెగక+
ఉన్నన్ = ఏవిధముగాను తీర్పుకాకున్నచో (పరిష్కరింప
బడనిచో) పోక=మరలిపోవుట; ఇది+లోకము చక్కటి=
ఇట్లు వెళ్ళుట లోకమర్యాద, శూరులు+ఐన = వీరులయితే;
మదిన్=మనస్సునందు; దీనిని మెచ్చరు=అట్లు వెళ్ళిపోవుటను
మెచ్చుకోరు; (లోకమర్యాదయైనను అది వీరులు మెచ్చుకోను
పనిగాదని భావము) ఇంతకున్=ఇప్పటికింకను; ఈ బలము=
ఈ సైన్యము; తేటియున్ చూడము=కన్నెత్తియైనను చూడ
లేదు; మును=తొలుత; భయహేతువైన పిధమున్=భయము
నకు కారణమైనరీతిని, తగన్=చక్కఁగా;

తా. తన భుజబలము శత్రువుల బలము చక్కగా పరిశీలించి ఎవరి బలమెక్కువగా నున్నదో యెవరికి జయము గల్గునో నిర్ణయించుకొనలేని స్థితిలో నున్నచో యుద్ధభూమి నుండి పారిపోవుట లోకమర్యాద. అదెంత లోకమర్యాద యైనను యుద్ధనీతి తెలిసినవారు మెచ్చుకొనిన మెచ్చుకొన వచ్చును గాని శూరులైతే మెచ్చుకోనే మెచ్చుకోరు. ఇంతెను శత్రుసైన్యము నిన్ను కన్నెత్తియైనను చూడలేదు. నీకిప్పుడు కలిగిన భయమునకు కారణమేమి చెప్పుము.

59. దెసలు=దిక్కులు; బీటలువాఱన్=బ్రద్దలగునట్లు; శివురు=మాఱుమ్రోగు, ఢిండిమముల కోలాహలంబులకున్ = శంఖముల ధ్వనికి; కలంగబడక=కలతపొందక; ఉరవడిన్ = శీఘ్రముగా; తెరలన్=బయలుదేరగా; పైన్ తోతెంచు = పైకివచ్చు; పెల్లు అడరినన్=ఎక్కువ వ్యాపింపగా; తూలపోక=చలింపక; అతిసాంద్రతన్ = మిక్కిలి దట్టముగా; కవిసిన=ఎదుర్కొనిన; అగ్గలికమునకున్ = విజృంభణమునకు; బెగ్గడిలక=భయపడక; రథ్య=గుఱ్ఱములను; సారథి=రథము తోలువారిని; వర్మ=కవచములను; అంగతతి=దేహసమూహములన్; నాటుకలుచునన్=గ్రుచ్చుకొను సమ్మర్దమున; తల్లడిలక=భీతిల్లక; పగతురన్ = శత్రువులను; బరవసమునన్ = ధైర్యముతో; ఈ తెఱంగునన్ = ఈవిధముగ; క్రందు+ఎల్లన్ = ఉపద్రవమంతయు; ఓర్చి=సహించి; నెగడున్+కాక=వ్యాపించునుగాని; దవ్వుదవ్వులన్ ఇట్టు ఐనన్ = ఇట్లుదూర దూరమునకు పోయిన; ఎట్లు నవ్వరు=నవ్వకుందురా ?

తా. దిక్కులు బ్రద్దలగునట్లు మ్రోగు శంఖముల ధ్వనికి భయపడక, వడివడిగా సేనలు పైబడుచునప్పుడు గల్గు ధూళికి చలింపక, చతురంగ బలము లోకువగా చూడు రోకనిగను భయపడక, శస్త్రాస్త్రములు ఛత్రములను, సారథిని, కవచములను చీల్చి బాధ కలుగ జేసినను బెదరక శత్రువులను ధైర్యముతో నెదుర్కొని సకలాపదలను సహించి యుద్ధ భూమిని స్థిరముగా నిల్చి గెల్చిననే సత్కీర్తి కలుగును గాని యిట్లుదూర దూరము పాఱిపోయిన నవ్వకుందురా?

60. ఆ+మనుజ+ఈశ్వర+సూనుడు = ఆరాజకుమారుండు; దివిజ+ఇంద్ర+నందనునకు=అర్జునునకు; త్రిగర్తవాహినులు = త్రిగర్త దేశరాజగు సుశర్మ సైన్యములు; విక్రమసంపద=పరాక్రమ సమృద్ధి; సొంపుమీఱన్ =అతిశయించునట్లుగా; పతి=రాజగు విరాటుడు; ఉదగ్రతన్ =భయంకరముగా; సైన్యములు+ఎన్ని+అన్నియున్ = ఎన్ని సైన్యములున్నవో అన్ని సైన్యములను; కొని+అటుపోయెన్ =తీసికొని దక్షిణదిక్కునకుపోయెను; కానన్ =అందుచే; పురిన్ =పట్టణమందు; ఎవ్వరున్+బాసట+లేరు+అ=ఎవ్వరు సహాయము నకు లేనేలేరు;

తా. త్రిగర్త దేశాధీశ్వరుడగు సుశర్మసైన్యములు పరాక్రమించి దక్షిణదిశను మనగోవులను పట్టుకొనగా మా తండ్రి విరాటరాజు పురమందెన్ని సైన్యములున్నవో యన్ని

టిని తిరలించుకొని యుద్ధమునకు వెళ్ళినాను. కనుక నాకు పట్టణమునందు సైన్యసహాయము మేమియును లేదని యుత్తరుఁడు బృహన్నలతోఁబల్కెను.

61. ఒంటితలపడి = ఒంటరినై (అసహాయుఁడనై) ఏమార్కొనిః ఓర్చువాఁడను+ఏ = జయించువాఁడనా? వెడ మాటలు = వ్యర్థమైన మాటలు; అరుగుటయ = పోవుటయే; నీతి = న్యాయము (రాజనీతి)

తా. నే నొక్కఁడను కౌరవసైన్యమును జయింపఁగలనా? ఎందుకు పనికిమాలిన మాటలు మాట్లాడెదవు? వారు మనలను చూచకమునుపే రథము మరలించుకొని వేగముగా పురములోనికి పోవుటయే న్యాయము.

62. పార్థుండు = అర్జునుఁడు; పార్థివనందనునకు = రాజకుమారునకు;

63. వెగడు+ఒందె = తల్లడపడి; ప్రమోదము = సంతోషము; తెగడఁగాఁగాఁ = నిందింపగా; మగిడిపోక = మరలిపోవుట దీనత+కాదు+ఏ = నీచత్వము కాదా!

తా. భయపడి యిట్లు మాట్లాడవచ్చునా? శత్రువులు సంతోషించునట్లుగా పశువుల నిక్కడ విడిచిపెట్టిపోవుట నీచత్వము కాదా? పురజనులు తిట్టిపోయురా?

64. కడంగి = ప్రయత్నించి, పేరుకొనియెన్ = స్తోత్రము చేసెను (మిక్కిలి ఎక్కువగా పొగడెను) దానన్ = అందుచే; పెంపుమైన్ = గౌరవముతో; తోడు+అని = సహాయమని; బంటుతనము = శూరత్వము; అట్లుఅగ్గించి = ఆవిధముగాపొగడి

(46 వచనమున "తొల్లి ఖాండవ... సల్పన్") పౌర+ఆళి=పురజనుల సమూహము; తుదిన్=చివరకు; పోయి=బయలు దేరివచ్చి; ఏన్=నేను; క్రమ్మఱి=మరలి; రిత్త+పోవుదు+ఎ=వ్యర్థముగా వెళ్ళుదునా? భయ+ఉత్కంపంబు=భయమువలని వణకు;

తా. సైరంధ్రి నన్నెంతయో పొగడెను. అందుచే నీవు నన్నెంతో గౌరవముగా పిలిచి నీకు సహాయముగ తీసికొనివచ్చితివి. పురజనులెల్లరు శూరత్వమును పొగడుచుండగా వారందరి ముందు బయలుదేరివచ్చి కౌరవులు గోవులను పట్టుకొని పోవుచుండగా చూచి నేనూరక మరలిపోవుదునా? నీవేల భయపడెదవు?

విశే:—రిత్త (వి) రిక్త (ప్ర) భయ+ఉత్కంపము=భయోత్కంపము—గుణసంధి.

66. చిత్తవృత్తి=మనోవ్యాపారము; ఉక్కుంబట్టువడు=స్థిరముగా ఉంచుటను; వెఱగుపడన్=ఆశ్చర్యపడునట్లుగాఁ; కదుపున్+పెట్టించి+పోదము=ఆవులమందను వశపఱచుకొని పోదము; పెట్టించి అనగా వశపఱచుకొని.

తా. కొంచెము ధైర్యము వహింపుము. కౌరవసైనికులందరాశ్చర్యపడునట్లుగా మనబలము, ఉపాయము ప్రకటించి ఆవులను మరలించుకొని పోవుదము.

67 విశ్వచ్ఛందుడు=అర్జునుడు: ఆననంబు=ముఖము; పల్లటిల్లఁగా=ఎఱ్ఱబాఱఁగా; మానసంబు=మనస్సు; తల్లడిల్లన్=తొట్రుపడగా; భూవల్లభ కుమారుండు=రాజకుమారుడు;

విశే:—వివ్వచ్చుఁడు (వి) బీభత్సుఁడు (ప్ర)

68. దవ్వులన్ ఁటికిఁ = దూరముగా పోయిన యెడల; అగకు = ఆపకుము; తలపడుము = ఎదుర్కొనుము; ఎత్తిన భీతిన్ = కలిగినభయముతో.

తా. పాఱిపోయినచో పౌరులు నవ్వుదురట! నెబాన్ నవ్వనిమ్ము. నన్నాపకుము. క్షోగాఁగ దేని నీవుపోయి యెదుర్కొనుమని పలుకుచు భయముకలుగుటవలన,

69. శరములు = బాణములు; శరాసనమున్ = వింటిని; అ+అరదముపైన్ = అరథముపై; డిగ్గవిడిచి = దిగబెట్టి; అతిరభసమునన్ = మిక్కిలి వేగముగా; ధరణికిన్ లంఘించి = భూమిపై కుఱికి; వెసన్ = శీఘ్రముగా; లజ్జపీటిఁబోవన్ = సిగ్గునష్టమగునట్లునగా సిగ్గువిడిచి; పురిదెసకున్ పాఱెన్ = పట్టణమువైపునకు పరుగెత్తెను.

తా. విల్లమ్ములు రథముపై విడిచి తటాలున భూమిపై కుఱికి సిగ్గువిడిచి ఉత్తరుడు పురమువైపునకు చఱచఱ పరుగెత్తెను.

విశే: —శరాసనము (వ్యు) బాణములు దీనిచేత వేయబడును. (విల్లు)

70. బీభత్సుండు = అర్జునుఁడు; కుత్సించుచు = అసహ్యించుకొనుచు; యుగ్యంబులపగ్గంబులు = గుఱ్ఱములపగ్గములు; నొగలన్ ముడిచి = కూబరమునకు కట్టి; లంబకేశభారుండును = పొడవైన వెంట్రుకలబరువుగలవాఁడును; అందోళిత = కదలుచున్న;

రక్త+అంబర+యుగళ+అంచలుండున్ = ఎఱ్ఱని వస్త్రపుజంట యొక్క చివరలు కలవాఁడును;

విశే:—బీభత్సుఁడు (వ్యు) బీభత్సకర్మచేయనివాఁడు (అర్జునుఁడు) (I have never committed a hateful work in the field of battle and hence I am known as Bibhatsa amongst men and Celestials — యుద్ధమున అసహ్యకర్మ చేయనివాఁడు—వ్యాసభారతమున "నకుర్యాం కర్మబీభత్సం యుధ్యమానం కథంచన । తేన దేవ మనుష్యేషు బీభత్సురితివిశ్రుతః")

71. బాహులచ్ఛాయయున్ = చేతులతీరు; గమనభంగి యున్ = నటకరీతియు; అర్జును+అట్లు+అ = అర్జునునివలెనే; దీనన్ = ఇందులో; తేజము = పరాక్రమము; డాపగన్ = దాచు టకు; మత్స్యభూమిభృత్ = మత్స్యదేశపు రాజగు విరాటుని; గేహము+అందున్ = ఇంటిలో; పేడిఅనన్ = నపుంసకుడనునట్లు; కీడ్పడి = తక్కువపడి అనగా నీచపడి; కురుబ్యూహముతోడి కయ్యమునకు = కౌరవ సమూహముతో యుద్ధమునకు; ఒండు+ ఒకరుండు = మరొకడు; ఇటులు+ఒంటి+వచ్చును+ఏ = ఇట్లొ క్కడే రాఁగల్గునా?

తా. ఆ చేతులతీరు, ఆ నడకలతీరు, చూచిన తప్పక యీతేడర్జునుడనియే తోచుచున్నది. విరాటుని యింట పేడి రూపమున దాఁగియున్నాఁడు. అర్జునుడే కాకున్నచో నీ కౌరవ

సైన్యముతో యుద్ధముచేయుటకు మరొక చెప్పదగిన సిద్ధపక్ష గలదా?

వి శే:—సందేహము (ప్ర) సంశయము (వి) తేజము (ప్ర) తేజ (వి)

72. నిజ+ఆజికి+ఐ = తనయుద్ధమునకై; ఒంటరి + తేమిన్ చేసి=ఇతరులు లేకపోవుటచే; దొరకొనక+ఉన్నన్ = లభింపకపోగా;

తా. విరాటరాజు దక్షిణదిక్కున సుశర్మతో పోరుటకై యూరిలోని వీరులను, సారథులనందఱను తీసికొనిపోగా నింక నెవ్వరును లేకపోవుటచే ఉత్తరుడు పైపునకు రాదలంచి తన రథమును నడుపువారెవ్వరును లేకపోవుటచే బృహన్నలను తీసికొనివచ్చినాడు.

73 పరి=సైన్యము; (సైనికులు) చనుదెంచి=వచ్చి; పిన్నకానన్ = చిన్నవాడుగనుక; మీాదు + ఆరయక = ముందు రాబోవుదానిని తెలిసికొనక; అహంకృతిమైన్ = గర్వముతో; పఱతెంచి=వచ్చి; సైన్యవిస్ఫురణమున్ = సేనయొక్క తీవ్రతను; భీతిన్ = భయమువలన; బుద్ధి = మనస్సు; కలంగినన్ = క్షోభపొందగా; భూరిబలంబున్ = ఎక్కువ బలమును;

తా. కౌరవసైన్యమువచ్చి గోవులను పట్టెనన్నమాట విన్నతోడనే ఉత్తరుడు చిన్నతనముచే ముందువచ్చు ముప్పెఱుంగక అహంకారముతో వచ్చి మహాసైన్యమునుచూచి భయపడి పాఱిపోవఁ జూచినాడు. అంతియేకాని ఈ బృహన్నలబలమును శౌర్యమును నితని కేమి తెలియును.

74. నిశ్చయరహిత హృదయులు = నిర్ణయములు లేని మనస్సులుగలవారు; శరాల = ఏనుగు యొక్క; దయ = వేగము యొక్క; లీల = విలాసముతో; సమరేఖంబు అగు = సమానమగు రేకగల; గమనంబునన్ = నడకతో; పురుహూత పుత్రుండు = ఇంద్రుని కుమారుండగు అర్జునుండు; పదశతమాత్ర ప్రదేశ పలాయితుండు + అయిన = నూరుఅడుగులు మేరకు మాత్రమే పాఱిపోయిన; భూమింజయుఁడు = ఉత్తరుని; ఎయిది + పట్టుకొనినన్ = వెంబడించి పట్టుకోగా;

విశే: — పురుహూతుండు (వ్యు) యజ్ఞములయందు మిక్కిలి పిలువబడువాఁడు (ఇంద్రుఁడు)

75. వెలవెలన్ పాఱుచున్ = పాలిపోవుచు; వెగడు + ఒందున్ = తడబడును; తల్లడిల్లున్ = చలించును; అంగంబులు = అవయవంబులు; పదములుఁ గరములున్ = కాళ్లును చేతు లును; కుంచియఁగ = క్రుంగగా; వెలుకఁబున్ = విహ్వలించును (భయాదులచే అంగములు విలవిలపోవుట) దీనదృష్టులన్ = దైన్యపుచూపులతో; ఎలుగు గద్గదికన్ = కంఠధ్వనియొక్క ఎగుడుదిగుడుచే; కీడ్పాటు తోపన్ = తగ్గుదలకనిపింపగా; నిష్క శత = నూఱు రాణెములతోడి; శుద్ధహేమంబున్ = పదారు వన్నె బంగారమును; నిర్మల + ఉజ్జ్వల = స్వచ్ఛమై ప్రకాశించు; అష్టవైడూర్యములు = ఎనిమిది రత్నములు; తురగ + ఆఢ్య రథము = గుఱ్ఱముతో కూడిన రథము; కరటిదశకంబు = పది ఏనుఁగులు; ఆర్తుఁడు = దీనుఁడు (దుఃఖితుఁడు)

తా. ఉత్తరుడు వెలవెలఁబోయెను. పెదవు లెండి పోయెను. అవయవములు జల్లుమనెను. చెమటపట్టెను. చేతులు కాళ్ళు వణకెను. గుండె తటతట కొట్టుకొనెను. ఏడుపుచూపులతో బృహన్నలకేసి తేఱిచూచెను. గద్గద స్వరముతో తన్నువిడిచిపెట్టుమని యేడ్చెను. ఊరిలోనికి పోయినతోడనే బంగారు నాణెములు, రత్నములు, గజములు తురగములు, రథములు వేయేల? ఒకయూరు బహుమాన ముగా నిచ్చెద విడిచిపెట్టుమని వానిని ప్రార్థించెను.

76. విశుద్ధచరిత్రా=పవిత్రమైన నడవడిగలవాఁడా! ప్రేముడిన్=ప్రేమచేత, కడున్ ఆతుర+ఐ=మిక్కిలి బాధ పడునదై; అంబకున్=తల్లికి; చేతః+ప్రీతిగన్=మనస్సునకు సంతోషముగా; ఆయమన్ = ఆమెను; పొడసూతున్ = చూచెదను;

తా. నాయెడల ప్రేమచేత నాతల్లియెంతో ప్రీతితో నాకై యెదురు చూచుచుండును. నేనుపోయి మాతల్లిని చూడవలయును. నన్ను పోనిమ్ము.

వి శే:—చూచు+అంబ=చూచునంబ—సూ. ఉదంత తద్ధర్మార్థకవిశేషణమునకు అచ్చుపరంబగునపుడు నుగాగమం బగు.

77. దీన + ఆలాపములన్ = ఏడుపుమాటలచే; పార్థుండు = అర్జునుఁడు;

78. అన్న+నాయనా! వెఱవకుము = భయపడకుము; పోటు = యుద్ధము; అశక్యము+ పనిన్ = సాధ్యము కాని యెడల ఆ+తెఱఁగు = ఆవిధము; ఉరుము = మెఱుపు; చిచ్చుఱపిడుగు = అగ్నిమయమైన పిడుగు; అట్టు+అడరి = ఆవిధముగా విజృంభించి; నుగ్గుచేసెదన్ = పొడిచేసెదను; పఱపెదన్ = పాఱద్రోలెదను; రాజు ధృతిన్ = దుర్యోధనుని ధైర్యమును; పాపెదన్ = పోగొట్టెదను; క్రమ్మఱించెదన్ = మరలించెదను;

తా. నాయనా! భయపడకుము. నీవు కౌరవ వీరులతో యుద్ధము చేయఁజాలవేని మాని వేయుము. నాకు సారథివి కమ్ము. నేను పిడుగువలె కౌరవసేనమీఁదపడి భస్మము చేసెదను. దుర్యోధనుని ధైర్యము సడలించెదను. గోవులను మరలించెదను.

79. ఒడఁబాటు లేకున్నన్ = అంగీకారము లేకపోయినను; నడుకొనన్ = (ఉత్తరుడు) వణకుచుండఁగా; నొగలన్ ఇడి = కూబరముపై కూర్చుండఁబెట్టి; నరుఁడు తాను = అర్జునుడతడును; రథికుఁడయి = యుద్ధము చేయువాఁడై; సమ్మదలీలన్ = సంతోషముతో; జమ్మిచేరన్ చనియెన్ = జమ్మిచెట్టును సమీపింపఁబోయెను.

తా. ఉత్తరున కంగీకారము లేకున్నను వానిని రథకూబరమున కూర్చుండబెట్టి తాను రథమెక్కి యుద్ధము చేయువలయునని రథమును జమ్మిచెట్టు దగ్గరకు తీసికొని పోయెను.

విశే:—జమ్మి (వి) శమీ (ప్ర)

## ప్ర శ్నో త్త ర ము లు:—

1. మీ పాఠ్యభాగమగు ఉత్తర కుమార ప్రజ్ఞలు రచించిన కవిని, కాలమును, బిరుదములను, వాని యితర గ్రంథములను సమకాలిక కవులను వ్రాయుము.

ఈ పఠనీయభాగమును తిక్కన రచించెను. అతడు క్రీ. శ. 1250 సం॥ ర॥ ప్రాంతమువాఁడు. కవిబ్రహ్మ, ఉభయ కవి. మిత్రుడని వానికి బిరుదములు. నిర్వచనోత్తరరామాయణము విజయసేనము, కృష్ణశతకము, కవి వాగ్బంధము మొదలైన గ్రంథము లితడు రచించెను. అతని సమకాలిక కవులు కేతన, మారన.

2. గవాధ్యక్షుఁ డంతఃపురమునమున్న భూమింజయుం గాంచి యేమని పల్కెను ? (లేక) "అని కాంతాజనములలో నగ్గించుటయు"–ఎవరెవరి నేమని యగ్గించిరి?

గవాధ్యక్షుఁడు భూమింజయుం జూచి "భూమండలము సంచలించునట్లుగా కౌరవసైన్యములు వచ్చి యుత్తర దిక్కున నున్న గోవులను బట్టి తోలుకొనిపోవుచున్నవి. గోవులను మరలించుటకు శీఘ్రముగా యత్నింపుము. శత్రురాజులను నీ బాణముల కెరచేయుము, రథము సిద్ధపఱుపుము. కవచము, విల్లమ్ములు, తూణీరము, గద తోమరములు, ఖడ్గములు చక్రాద్యాయుధములు సిద్ధము చేయుము. విరటుఁడు నిన్ను పదిమందిలోను 'నా కుమారుఁడు బహువిస్ఫురితుడు, శౌర్య

శాలి, వంశైశ్వర్యకరుఁడు, భూభారమును చక్కఁగా వహించు వాఁడు, జనుల తపఃఫలమున జన్మించినవాఁడు. కాతర పరిరక్షకు' డని పొగడెడివాఁడు. దానికి తగినట్లుగా నీ విపుడు సంచరింపవలయును'' అని పల్కెను.

3\. గవాధ్యక్షుఁడు కాంతాజనములలో నుత్తరు నగ్గింపగా నతఁ డేమని సమాధాని మిచ్చెను ?

ఉత్తరుఁడు యుద్ధమునందు సంతోషముగలవాఁడై ''ఏమిరా ! ఎవరొక్కని లేని కౌరవులను ఉపాయము చేతనే జయింతును. గోవుల నొక్క క్షణములో మరలింతును. నా రథమునకు సారథి లేడుగాని యున్నచో, నిదియొక పనియా ! నాకు రథముతోలుటకు తగినవా డీపురమున నెవడైనఁ గలఁడా ? తగిన సారథి లభించినచో శత్రువులను చీల్చెంత ? సూతుని వెదకుడు. దుర్యోధన భీష్మద్రోణ కర్ణాది యోధులు నా యుద్ధనైపుణ్యమును చూచి యీతఁ డర్జునుడా యేమి యని సందియమంది కలఁగిపోవునట్లు చేసెదను. సంగరమున కౌరవులను జయించి యావులను మరలించెదను. లేకున్న నన్ను రాజు, మంత్రులు, పరివారము మెచ్చుకొందురా'' యని ప్రగల్భము లాడెను.

4\. ద్రౌపది అంతఃపురములోని మాటలు విని బృహన్నలతోఁ జెప్పగా బృహన్నల యామెతో నేమనెను?

''పాంచాలీ ! నీవుపోయి మన బృహన్నలకు సారథ్యము చేయ నేర్పుగలదు. పూర్వము ఖాండవవన దహన

సమయమున అర్జునునకు సారథియై యతని మెప్పించెను అది గాక చాలచోట్ల వాని రథమునకు సారథియై పేరు మోసి నాఁడు అది నేనెఱుంగుదును. వాని సాహాయ్యమున కురు సైన్యములను జయింపవచ్చును అని చెప్పుము. వారడ్డు చెప్పిన నెట్లో చక్కఁగా చెప్పి వారునన్ను పిలిపించునట్లు చేయు'' మని బృహన్నల ద్రౌపదితోఁ జెప్పెను.

5 సైరంధ్రి యుత్తర దగ్గరకుఁబోయి యేమని చెప్పెను?

సైరంధ్రి యుత్తరదగ్గరకుఁ బోయి ''రాకుమారీ! ఉత్తరుఁడు తగిన సారథికోసము వెదకుచున్నాఁడు. తెలిసిన సంగతి చెప్పకున్న దోషముకదా! మన బృహన్నలకు సారథ్యము చేయుటయందు దెక్కువ నేర్పుగలదు. అతని పరాక్రమము మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. పూర్వ మర్జునునే మెప్పించినది. ఆ బృహన్నల బలము, ఉపాయము అలనాడు అర్జునునకు ఖాండవ దహనసమయమున జయము కలిగించినవి. దీని నుత్తరునకు చెప్పుదము ర''మ్మనెను.

6. ఉత్తరతోఁగూడ సైరంధ్రి పోయి చెప్పగా నుత్తరుఁడామెతోఁ నేమనెను?

ఉత్తరుఁడు ''సైరంధ్రీ! నన్ను నీవిట్లు పరిహాసము చేయనగునా? నేను కన్నెత్తి పేడివానిని చూడ రోయుదును. అట్టియెడ యుద్ధసమయమున సూతకృత్యమున కెట్లు పనుచువాఁడను? అదియునుంగాక వచ్చినది కురుబలమా! యుద్ధమునకు బోవునది మహా పరాక్రమవంతుఁడగు నేనా! అట్టినాకు

పేడివాఁడు సారథియా! వహ్వా! ఇది చూచిన నెవరైన నవ్వరా? ఈ పురమున రథచోదకులింత కఱవై పోయిరా" యని పల్కెను.

7. సైరంధ్రి యుత్తరున కప్పుడేమి సమాధానము చెప్పి యొప్పించెను?

ఉత్తరుని మాటలు సైరంధ్రి విని "రాజనందనా! కౌరవసేన కాదు ముల్లోకము లొక్కమాటు దండెత్తి వచ్చి నను రథము బృహన్నల వశములో నున్నచో జయము తథ్యము. ఆ వీరత్వము, ఆ నేర్పు, నేను కనులార చూచితిని. ఏదో కారణముచే శరీరమునకు వికారము కలిగినంత మాత్ర మున సహజ పరాక్రమ సంపద యెక్కడికి పోవును?" అని సమాధానపఱచెను.

*8. "అమ్ముద్దియ పలుకులు ముద్దుసేసి"— ఆ ముద్దియ యెవరు? ఆ పలుకులెవ్వి?

ఆ ముద్దియ యుత్తర. ఆమె బృహన్నల దగ్గరకు పోయి ప్రార్థనా వినయ సంభ్రమములు పెనగొన "గురువరా నా యన్న సారథి నిచట నొక యుద్ధములో చనిపోయినాఁడు తగిన సారథి దొరకకపోవుటచే నప్పటినుండియు నెవరిని నియో గింపలేదు. నేడు కౌరవులు పశువులను పట్టుకొనిరని వినవ చ్చెను. అన్న యుద్ధ సన్నద్ధుడై సారథి లేకపోవుటచే విచా రించుచున్నాఁడు. ఈసంగతి నాకు సైరంధ్రి చెప్పిన విని మిక్కిలి సంతసించి నీపాల నాకు చనువు గలుగుటచేత తప్పక తీసికొనిఁ

వత్తుననిపనిఁబూని వచ్చితిని. నాపలుకులు నిర్లక్ష్యము చేయక నీ యాధిక్యము వెల్లడియగునట్లు మాయున్నది కథమునడుప నంగీకరించి యీ యాపదనుండి యుద్ధరింప వలయు. ఇందుల కంగీకరింపనిచో నావలని వాత్సల్యంబు కొఱంత పఱచుటయే సుమీ!'' యని ముద్దుగా చెప్పెను.

9. "నడచు కౌరవరాజ సైన్యంబు గనిరె.''— సైన్య మెట్లు నడచెను ?

కౌరవరాజ సైన్యము నేలక్రుంగిపోవునట్లు నడచుచుం డెను. వర్షాకాలపు మేఘము వలె నున్న నల్ల రేవడినేలనుండి రేగిన ధూళి ఆకుజొంపములను పోలియుండెను. సంజకెంజాయ వంటి యెఱ్ఱచెక్క నేలనుండి యెగసినధూళి చిగుళ్ళను పరి హసించుచుండెను. రాజహంసల గుంపువలె తెల్లనగు నేల నుండి రేగినధూళి పూఁబొదలవలె నుండెను. పసుపువన్నె నేలనుండి రేగిన ధూళి పుష్పాదుల వలె మెరయుచుండెను. ఈ పైరంగులు గల ధూళులన్నియు పైకెగయగా అందమైన యుద్యానవన మొకటి స్వర్గమునకు కాపురముసేయ బోవు చున్నదా యన్నట్లుండెను.

10. కౌరవసైన్యమునుగని యుత్తరుఁడు బృహన్నలతో నేమనెను ?

ఉత్తరుఁడు కౌరవసైన్యమునుచూచిభయపడి "బృహ న్నలా! ఈసైన్యము భీష్మద్రోణకృపాది మహావీరులచే భయంకరమైనది. దుర్యోధనుఁడనెడు గ్రీష్మాదిత్యప్రతాప

విసరముచే నిండిపోయినది. శస్త్రాస్త్రపరంపరల వేగిమిన్నుగప్పుచున్నది చతురంగబలములచే తీవ్రమైనది. గొప్పగొప్ప జెండాల కాంతులతో కూడినది. నేనీసైన్యమును సమీపింపగలనా? నేనస్త్రవిద్యనెఱుంగనివాడను శకుని, సైంధవుడు, దుర్ముఖుడు, వికర్ణుడు కర్ణుడు మొదలగు మహావీరులకెదురుగా నేను నిలువగలనా? యుద్ధమనిన నేమో యనుకొంటిని. ఇంత భయంకరముగానుండునని యెఱుంగక వచ్చితిని. ఇప్పుడు మన గతియేమి? వీరందఱును కడుబెట్టిదులు. మనము వీరినెదుర్కొనలేము. నాకు భయము గలుగుచున్నది. మనస్సు చలించుచున్నది. కౌరవసేన చూచుటకే నాగుండె గుభిల్లుమనుచున్నది. నీవు మాటాడక రథమును తోలుకొనిపోవుచుంటివి. ఇది తగునా? వీరిని నేనెదుర్కొనలేకపోవుట నిశ్చయము. రథము వెనుకకు మరల్పుము. బృహన్నలా! ప్రాణములు తీపన్న సామెత నీవు వినలేదా?" యని పల్కెను.

11. తేరు పురమునకు మరల్పుమని పల్కెనుత్తరుండు
బృహన్నలనగుచు నేమనెను?

"రాజనందనా! ఈ మహావీరులపైబడుటకు నేనంత మూర్ఖుడనా? మనగోధనమును పట్టిన తుచ్ఛసైన్యమును మార్కొని పశువులను మరలింతము పశువులను శత్రువులు తీసికొనిపోవుచుండగా నూరకుండుట న్యాయమా? పశువులను ముహూర్తమాత్రమున తెత్తునని అంతఃపురస్త్రీలమధ్య డంబములుపలికి పనివడియిచ్చటికివచ్చి పెద్ద మొనగానివలె యుద్ధ

భూమిచొచ్చి చీకటిలో గుఱ్ఱములను నేనుగుల భటులను చూచి భయపడినగునా" యని బృహన్నల యుత్తరునితో బల్కెను.

12. "ఇత్తెఱంగున గల్గు క్రందెల్లనోర్చి"—ఆక్రందెట్టిది?

దిక్కులు బ్రద్దలగునట్లు మ్రోగు శంఖముల ధ్వనికి భయపడుట, వడివడిగా సేసలు పైబడునపుడు గల్గు ధూళికి చలించుట, చతురంగ బలము లొక్క పెట్టనెత్తివచ్చినను భయపడుట, శస్త్రాస్త్రములు గుఱ్ఱములను చంపి, సారథిని చంపి కవచములను చీల్చి యవయవములందు దట్టముగా నాటుకొనిన తల్లడిలుట మొదలగునవి యుద్ధమునందు గలుగు నుపద్రవములు. ఈవిధమాగా గలుగు క్రందెల్ల నోర్వవలయును.

13. "దవ్వుదవ్వుల నిల్చినవ్వారెట్లు" అనిపల్కు దివిజేంద్ర నందనునకు మనుజేశ్వరసూనుడేమనెను?

"బృహన్నలా! త్రిగర్తదేశాధీశ్వరుడగు సుశర్మ దక్షిణదిక్కునను న్న గోవులను బట్టగా మాతండ్రి విరాటుడు పురములో నెన్ని సైన్యములున్నవో యన్నింటిని తీసికొని యటు వోయెను. పురిలో మనకొక్కడును సహాయుడు లేడు. నేనొక్కడ నీమహావీరుల నెట్లు జయింపగలను? ఎందుకీపనికిమాలిన మాటలు? వారు మనలను చూడకముందే రథము త్రోలుకొని వెళ్ళిపోవుట రాజనీతి" యని యుత్తరుడు పలికెను

14. బృహన్నల యాకారాదులను చూచి కౌరవబలంబు లందలి వారేమనిరి?

వీని బాహువుల తీరు, నడకతీరు అర్జునునివలెనే కన్పడుచున్నవియని, విరాటుని నగరమున మఱుగుపడియున్న యర్జునుడ

డేయునియు, తానున్న పరాక్రమవంతుడైన కౌరవులతో యుద్ధము నకు రాగలడా యనియు, విరటుఁడు దక్షిణాదిశకు యుద్ధమునకై పోవుచు సకలసైన్యములను తీసికొనిపోగా నుత్తరుడీ దిశకు వచ్చుచుండి వానిరథము తోలుట కెవ్వరును లేకపోవుటచే వానిని తీసికొనివచ్చినాడనియు, పిన్నవాడుగాన నహంకృతితో వచ్చి సైన్యమును చూచి భయపడినాడనియు నాపురుషుని శౌర్యసంపద యుత్తరున కేమి తెలియుననియును బలుక జొచ్చిరి.

*15. ఉత్తరకుమార ప్రజ్ఞలన నెట్టివో నిరూపింపుము

కౌరవులు గోవులను పట్టుకొనిరని వినినతోడనే గవాధ్యక్షుఁడుపోయి యంతఃపురములో స్త్రీలమధ్యనున్న యుత్తరుని నీవింతవాఁడ వంతవాఁడవని మీతండ్రి చెప్పెడివాఁడని పొగడెను. కౌరవుల నెదుర్కొని యుపాయమున గోవులను దెత్తునని యు సారథి లేకపోవుటచే విచారము గల్గుచున్న దనియు, సారథి దొరకినచో శత్రువులను చీల్చి చెండాడుదు ననియు తనపరాక్రమమును శత్రువులుచూచి యీతఁ డర్జునుఁడా యేమి యని యనుకొని పాఱిపోవునట్లుగా యుద్ధము చేయుదుననియు డంబములుపల్కెను. ఎట్లో బృహన్నలను సారథిగా నొప్పించి తానే బృహన్నలకు కవచముతొడిగి పెద్దమొనగానివలె యుద్ధభూమికి వచ్చి కౌరవసేనచూచి వాడలిపోయెను. మనస్సుతోకూడ శరీరము కంపించెను. ప్రాణములు బెల్లమువంటివి. బ్రతికియున్న శుభములు పడయు

వచ్చును తేరుమరల్పుమని బృహన్నలను ప్రార్థించెను. ఏనుగులు గుఱ్ఱములు, మొదలగు వానినిచూసి కలగిపోయెను. పశువులమాట దేవుడెఱుగును పడతుల సంతోషముజోలి నాకేలయని దీనాలాపము లాడెను. తానుయుద్ధము చేయలేననియు పురమునకు మరలిపోవుటయే రాజనీతియనియునీతులు బోధించెను. కిల్లమ్ముల రథమునవిడిచి రథమునుండిభూమిపై కుతికి ఊరివైపునకు పాఱిపోఁజొచ్చెను. బృహన్నల పట్టి తీసికొనిరాగా ఉత్తరునిమోము వెలవెలపోయెను. గుండెలు కొట్టుకొనెను. నోటమాటలేదు. ముచ్చెమటలు పోసెను. ఆధైర్యమంతయు నా ప్రజ్ఞావాక్యములన్నియు నడుగంటెను.

16.

| ప్రకృతులు | వికృతులు | ప్రకృతులు | వికృతులు. |
|---|---|---|---|
| భీరువు | పిఱికి | సంధ్య | సంజ |
| అంతఃపురము | అంతిపురము | ఊష్మ | ఉమ్మ |
| హృదయము | ఎద | యువతి | ఉవిద |
| కిరీటి | క్రీడి | ముదిత | ముద్దియ |
| రథము | అరదము | మేఘము | మొగులు |
| పురము | ప్రోలు | సంతోషము | సంతసము |
| స్త్రీ | ఇంతి | దైవము | దయ్యము |
| యోధుడు | జోదు | దిశ | దెస |
| దూరము | దవ్వు | ప్రవేశము | బరవసము |
| పశువు | పసువు | రిక్త | రిత్త |
| తూణము | దొన | బీభత్సుడు | విబ్బచ్చుడు. |

| ప్రకృతులు | వికృతులు | ప్రకృతులు | వికృతులు |
|---|---|---|---|
| కాంత | కాఁత | శమీ | జమ్మి |
| ముహూర్తము | మూరుతము | ద్వారము | దువారము |
| పరివారము | పరివారు | సాహాయ్యము | సాయము |
| కలహము | కయ్యము | రూఢి | రూడి |
| గౌరవము | గారవము | పృథివి | పుడమి |
| వీరము | బీరము | ప్రగ్రహము | పగ్గము |
| వర్ణము | వన్నె | భటుఁడు | బంటు |
| ప్రాంతము | పొంత | సందేహము | సందియము. |

17. వ్యాకరణాంశము:—

1 ఒసరింపు; మరల్పు; పంపు (ఒసరింపుము; మరల్పుము; పంపుము)

సూ. మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబగునపుడు లోపము విభాషనగు.

2. ఏ+మెయి=ఎమ్మెయి; ఈ+తటి=ఇత్తటి; ఆ+ముదిత=అమ్ముదిత.

సూ. త్రికంబులమీఁది ఊష్మరేఫేతర అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు ద్విరుక్తంబగు హల్లుపరంబగునపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు;

3. మెచ్చు+దు+రు+ఏ=మెత్తురే.

సూ. చువర్ణంబుతోడి దుగ్ధకారంబునకు తకారంబగు సంప్రార్థనంబున అదాదులు విభాషనను ప్రయుక్తంబగు.

(c) ప్రాతఃప్ర... సరళమగు = ప్రా+న్+బాద (d) ఆదేశ సరళము... బిందు సంశ్లేషస్వరూపంబులు— ప్రాఁ బాద.

10. పాదము—

సూ. పొవ్వునకు ము బు పరంబగునప్పుడు పాదాదేశం బగు

11. గో+[illegible]ఁడు = గ[illegible]ఁడు.

సూ. [illegible]ంతమైన గోశబ్దమునయొక్క ఓకారమునకు అచ్చు పరమైనచో ఓకారమునకు అవఙాదేశము వైకల్పికము.

12 వ్యుత్పత్త్యర్థములు:—

సూతుఁడు = [illegible]ము ప్రేరేపించువాఁడు.

దుర్యోధనుఁడు = దుఃఖముచేత యుద్ధము చేయబడువాఁడు.

తనుత్రాణము = శరీరమును రక్షించునది (కవచము)

పార్థుఁడు = పృథ (కుంతి) కుమారుఁడు (అర్జునుఁడు)

ఇంద్రుఁడు = పరమైశ్వర్యయుక్తుఁడు (దేవేంద్రుఁడు)

అంబుజము = నీటినుండి పుట్టునది (పద్మము)

అర్జునుఁడు = అర్జునకర్మ యనగా స్వచ్ఛమైనకర్మ— అది చేయువాఁడు.

శుండాలము = తొండముతో ఉదకమును గ్రహించునది (ఏనుఁగు)

వైరాటి = విరాటుని కుమారుఁడు (ఉత్తరుఁడు)

కిరీటి = ఇంద్రదత్తమైన కిరీటము తలపై గలవాఁడు (అర్జునుఁడు)

ఆఖండలుఁడు=శత్రువులను ఖండించువాఁడు (ఇంద్రుఁడు)

కంటకము=వక్షస్సును కప్పునది (కవచము)

హయము=శీఘ్రముగాఁ బోవునది (గుఱ్ఱము)

ధనంజయుఁడు=రాజసూయమున దిక్కుల రాజులను గెల్చి ధనమును గొని వచ్చినవాఁడు (అర్జునుఁడు)

పంచాననము=విస్తీర్ణమైన ముఖముగలది (సింహము)

ఫల్గునుఁడు=ఉత్తర ఫల్గుని నక్షత్రమున పుట్టినవాఁడు (అర్జునుఁడు)

మరాళము=మరణమును నివారించునది (హంస)

శతమఖుడు=నూఱు యాగములుగలవాడు (ఇంద్రుడు)

వివ్వచ్చుడు=బీభత్సకర్మ యుద్ధమందు చేయనివాడు (అర్జునుడు)

శరాసనము = బాణములు దీనిచేత వేయబడును (విల్లు)

పురుహూతుడు = యజ్ఞములయందు మిక్కిలి పిలువ బడువాడు (ఇంద్రుడు)

19. నానార్థములు:—

అవసరము=సమయము; అక్కఱ;

మూఁక=సమూహము; సేన;

కౌతుకము=సంతోషము; కోరిక; పెండ్లిలో చేతికి కట్టు తోరము;

నెమ్మి=ప్రేమ; నెమలి; క్షేమము; సంతోషము.

కందువ=జాడ, ఏకాంతము; సామర్థ్యము;

కాంచనము = బంగారము; ఉమ్మెత్త; సంపెంగ

ఆమిషము = మాంసము; లంచము; లాభము; భోగ్య వస్తువు.

వాహిని = నది; సేన.

20. సంస్కృతసంధులు:—

సవర్ణదీర్ఘసంధి:—సుర+ఆది = సురాది; ఉదయ + అవసరము = ఉదయావసరము; శర+ఆసారము = శరాసారము; రథ+అవతరణము = రథావతరణము.

గుణసంధి:— సూర్య+ఉదయము = సూర్యోదయము; సంఘ+ఉద్ఘటము = సంఘోద్ఘటము; భుజ+ఉత్సాహము = భుజోత్సాహము; దర్ప+ఉద్ధతి = దర్పోద్ధతి; కిసలయ+ఉత్కరము = కిసలయోత్కరము; భయ + ఉత్కంపము = భయోత్కంపము;

శ్చుత్వసంధి: —సుహృత్ +జనము = సుహృజ్జనము.

జశ్త్వసంధి:—తత్ + అంబరము = తదంబరము; వల్గత్ +అశ్వము = వల్గదశ్వము.

ఛత్వసంధి:-రాగోపమ+ఛాయ = రాగోపమచ్ఛాయ;

అవాజాదేశసంధి:—గో+అర్ఘ్యతుండు = గవార్ఘ్యతుండు.

విసర్గసంధి:—దోః బలము = దోర్బలము.

21. సమాసములను విడదీయుట :—

| వ. నెం. | సమాసపదము | విడదీయుట | విగ్రహము | సమాసము పేరు |
|---|---|---|---|---|
| 1. | గోవర్గము—గో + వర్గము | —గోవుల యొక్క | వర్గము—షష్ఠీ తత్పురుషము. | |

2. శౌర్యశాలి–శౌర్య+శాలి–శౌర్యముచేత నొప్పువాఁడు తృతీయాతత్పురుషము.

3. త్రిజగములు–త్రి+జగములు–మూడయినలోకములు – ద్విగువు.

4. నాట్యమందిరము–నాట్య+మందిరము–నాట్యముకొరకు మందిరము–చతుర్థీతత్పురుషము.

5. అంబుజవదన–అంబుజ+వదన + అంబుజమునంటి వదనము గలది–బహువ్రీహి.

6. మత్తశుండాలము–మత్త = శుండాలము – మత్తమైన శుండాలము–విశేషణపూర్వపదకర్మధారయము.

7. ఆటపాటలు–ఆట + పాట – ఆటయు + పాటయు – ద్వంద్వము.

8. దృఢతనుత్రాణము–దృఢ+తనుత్రాణము – దృఢమైన తనుత్రాణము–విశేషణపూర్వపద కర్మధారయ.

9. ధరాధూళిలలితవనము–ధరా+ధూళి+లలిత+వనము – ధరాధూళియనెడు లలితవనము–రూపకము.

10. అశక్యము – న + శక్యము – శక్యముకానిది – నఞ్ తత్పురుష.

22. కఠినపదముల కర్థములు:—

అని = యుద్ధము; ఏడ్తెఱ = పరాక్రమము; సడిసన్న = అనింద్యమైన (ప్రసిద్ధిగల) కంటకము = కవచము; కిసలయము =

పిరికి; బీరదనము=శౌర్యము; బాసట = సహాయకుఁడు; మై[illegible]
ఉపు=కవచము; దరహాసితము=చిఱునవ్వు;

23. ఈ క్రిందిపద్యములకు దండాన్వయములు వ్రాయుము:-

ధరణీచక్రము సంచలింపగ............

(a) భూమండలము, మిక్కిలి కదలునట్లుగా, మిక్కిలి అణపబడినవై, కఠినమైనస్వనములు, శీఘ్రముగావచ్చి ఆవుల సమూహమును మళ్లించెను. మరలించుటకు ప్రయత్నింపుము; బాహువిజృంభణము, ప్రకాశించునట్లుగా, శత్రు రాజుల సమూహమును నీ బాణసమూహముల పాలు చేయుము.

విరటుడు నిన్ను నెప్డు...............

(b) విరటుడు, నిన్ను పదివేలమందియెదుట, భుజబలముచేత మిక్కిలి అధికమైనవాఁడు, శౌర్యముచేత ఒప్పువాఁడు, వంశైశ్వర్యవిశేషమును గూర్చువాఁడు, భూమియొక్క బరువును మోయుటయందు నేర్పరి, ప్రజల యోగ్యమైన, తపస్సుయొక్క ఫలమువలనపుట్టినవాఁడు. భయపడినవారిని కాపాడువాడనుచు, చెప్పెడివాఁడు, ఇప్పుడు దానికి తగినట్లు చేయుము.

(c) భీష్మ ద్రోణ కృపాదిధన్వి.........

భీష్ముడు ద్రోణుడు కృపుడు మొదలైన విలుకాండ్ర సమూహముచే భయంకరమైనది.యు, దుర్యోధనుడనెడు వేసవికాలమందలి సూర్యునియొక్క, సమర్థమైన పరాక్రమ

సమూహములచే వ్యాప్తమైనదియు, శస్త్రములును అస్త్రములును సమూహములయొక్క, వేడిచే బాధ హైనదియు, నాల్గు విధములై ప్రకాశించు బలములచే, మిక్కిలి తీవ్రమైనదియు, పొడవైన జండాలయొక్క కాంతులతో కూడినదియు నగు సైన్యమిది, నేను చేయుటకు శక్తిగలవాడనా ?

(d) బాహులచాయయున్ గమనభంగియు.........

చేతులతీరు, నడకతీరు, అర్జునునివలెనే, ఇంకలో సందేహము లేదు; నేను పర్వాక్రమమును చూచుచుంటి, విరటుని యింట, పేడియునునట్లు నివసించియున్నవాడు. కాబట్టో, కౌరవ సమూహముతో యుద్ధమునకు మరొకడైన నిల్చొనగ్గడే రాగల్గు:



# 3. గజేంద్రమోక్షము

సంస్కృతమున భాగవతమును వేదవ్యాసుడు రచించెను. భగవంతుడగు శ్రీకృష్ణుని మహిమలను వర్ణించుచు వ్రాయబడినది గాన భాగవతమను పేరువచ్చెను. ఇది పురాణము. పురాణ మనగా పూర్వము సంస్కృతములో సర్గ, ప్రతిసర్గ, వంశము, మన్వంతరము, వంశానుచరితమను పంచ లక్షణములతో మహర్షులచే వ్రాయబడిన గ్రంథము. పురాణములు పదునెనిమిది. అందు భాగవత మొకటి.

భాగవతమున పండ్రెండు స్కంధములు గలవు. భాగవత భాగములకు స్కంధములని పేరు. "లలిత స్కంధము కృష్ణ మూలము" అని పోతన వచించెను. భాగవతము కల్పవృక్షముతో పోల్చబడినది. స్కంధమనగా చెట్టు బోదెయని యర్థము. అది కల్పవృక్షము గనుక దానిలోని భాగములకు 'స్కంధము'లని సార్థక నామము.

సంస్కృత భాగవతమును పోతన తెనిగించెను. అతని నివాస స్థలము ఏకశిలా నగరము. దీనికిప్పుడు వరంగల్ అని పేరు. అతడు 15 వ శతాబ్దివాడు. సర్వజ్ఞసింగ భూపాలుని కాలము. శ్రీనాథు డితని బావమరది యని చెప్పుదురు. వీరభద్ర విజయము, భోగినీ దండకము వీని యితర గ్రంథములు. ఇతనికి సహజపాండిత్యుడను బిరుదుగలదు. శ్రీరామచంద్రు డతనికి కలలో కనిపించి భాగవతమును తెనిగించి తన కంకిత

మిమ్ముని కోరెను. అతడట్లే చేసెను. ఏకారణము చేతనో భాగవతభాగములు శిథిలము కాగా వెలిగందల నారయ, ఏర్చూరి సింగన, గంగన యనువారు పూరించిరి. శ్రీనాథుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడును వీనిసమకాలికకవులు. ఇతడు దారిద్ర్యభారమున కృంగిపోవుచుండినను రాజుల నాశ్రయించి ధనము సంపాదింపలేదు. ఇతనివలె భక్తిరసమును గురిపించినకవి మరియొకడు లేడు. ఇది భాగవతము అష్టమ స్కంధములోనిది. భాగవతమును పరీక్షిన్మహారాజునకు శుకమహార్షి చెప్పెను.

## కథాసంగ్రహము

పాలకడలియందు త్రికూటంబను పర్వతము కలదు. ఆ పర్వతమందలి యడవులలో కొన్ని యేనుగులు తమగుంపులతో నచ్చటి గుహలలో సంచరించుచుండెను. ఒక గజేంద్రుడు దారితప్పి మిక్కిలి దప్పిగొని నీరు త్రాగుటకై యొక చెఱువులో దిగి విహరించు సమయంబున నందలి పెద్దమొసలి యేనుగు కాలొడిసి పట్టుకొని విడువలేదు. ఏనుగు మొసలిని పైకీడ్వ జొచ్చెను. మొసలి యేనుగును లోనికీడ్వజొచ్చెను.

ఈ రీతిగా గజేంద్రుడు అలసట పొందక విసుగులేక మొసలితో వేయేండ్లు పోరాడెను. చివరకు బలము నశించి నిరాశచెంది పూర్వ పుణ్యఫలమున దివ్యజ్ఞానమును పొంది యిట్లని చింతించెను. "ఈ మొసలి నెట్లు జయింతును? యే దైవమును ధ్యానింతును? ఎవని సహాయము చేయుమని

కోరుదును? దీని నెవ్వ రడ్డగింపఁగలరు? దిక్కులేని నాహృదయ
వేదన నాలింతురు? పెక్కునూగు గున్నలు గొలువంగ విహరించిన
ద్రుమవనముల నీడలలో స్వేచ్ఛగా సంచరించు నాకీ పాడు దుర్దశ
యేల కలిగెను? ఈ చెలువులో దిగి యీ యాపద తెచ్చు
కొంటిని. ఏ భగవంతునిచే లోకములు పుట్టి, పెరిగి నశించు
చున్నవో, ఎవ్వడన్నింటికి ప్రభువో, ఎవడు మూలకారణుడో,
ఎవ డాదిమధ్యాంత రహితుడో, ఎవడు సర్వాత్మ స్వరూ
పుడో యట్టి యీశ్వరునే శరణంబు వేడెదను"

ఈశ్వరా! నా బలముడిగినది. ధైర్యము పోయినది
ప్రాణములు పోవుచున్నవి. శరీరము డస్సినది. మూర్ఛవచ్చు
చున్నది. ఇక నేను దీనితో పోరలేను. నీవే తప్ప నన్ను
రక్షింపువారు లేరు. నేను చేసిన తప్పులను మన్నించి నా
దగ్గరకు వచ్చి నా బాధ తొలగించి రక్షింపుము. ఆపన్నుల
మాటలు విందువట. భక్తులు పిలచిన 'ఓ' యందువట.
అన్నియు చూచుచుందువట. ఏమో? అది సందేహమే.
అన్నియు చూచువానికి నా బాధయగుపించదా? కమలాక్ష!
వరద! మునివంద్య! శరణుపొందిన నన్ను రక్షింపుము అని
మొఱపెట్టెను. ఆసమయమున వాని మొఱ బ్రహ్మాదులువినియు
నూరకుండిరి. సర్వవ్యాపకుడు, సర్వేశ్వరుడు భక్తరక్షకుడగు
హరి వానిని రక్షింపఁదలఁచి వైకుంఠముతో నంతఃపురమున
కల్పవృక్షముల యుద్యానవనమునందు అమృతసరస్సు తీరమున
చంద్రకాంతమణులు చెక్కబడి కలువపూలు పఱచిన పాన్పు

నంతః లక్ష్మీదేవితోఁ గూడి విహరించుచుండెను. ఆ పన్నజన శరణ్యుడు శ్రీమన్నారాయణుండు గజరాజు మొఱలను విని తత్తఱపడి లేచి లక్ష్మితోఁ జెప్పక, ఆయుధములనైనను చేతఁ బట్టక, పరివారంబును పిలువక, గరుడుని రమ్మనక, లక్ష్మితో వాదులాడుచుండి చేతఁ కై పట్టిన యామె పైటకొంగును కూడ విడువక గజరాజు రక్షణార్థము బయలుదేరి వచ్చుచుండెను. అట్లాయన రివ్వున వచ్చునప్పుడు లక్ష్మి వెంబడించెను, ఆమె వెంట నంతఃపురస్త్రీలు, వారి వెనుక గరుడుడు, వాని వెంబడి శంఖచక్ర గదాద్యాయుధములు, వాని వెంబడి నారదుడు. విష్వక్సేనుడు వైకుంఠములోని వారందఱు వెంటబడిరి. తానెక్కడకు పోవుచున్నాడో చెప్పడు. ద్రౌపది మొదలగు భక్తస్త్రీలు రక్షింపుమని కేక వేసిరో? సోమకాది రాక్షసులు వేదములను దొంగిలించిరో, రాక్షసులు స్వర్గముపై దండెత్తిరో, దుర్మార్గులెవరైన విష్ణువేడి చూపుమని భక్తులను బాధించుచుండిరో, యనిలక్ష్మి మనమున వితర్కించుకొనుచుండెను. లక్ష్మి తాటంకములు సర్దుకొనక, వీడినకొప్పు చక్కచేసికొనక, పైటసర్దుకొనక, జాఱుచున్న యొడ్డాణమును బిగించుకొనక కోటిచంద్రుల కాంతిని తిరస్కరించు కాంతిగల మోముతో, తన పైటచెఱగు తన భర్త చేతిలో లాగికొని పోవుచుండగా వంగిన నడుముగలదై ఎక్కడికని యడిగిన చెప్పునో లేదో యనియును గుటమాని నిలచిపోయెను

ఆమెమోము పద్మమువలెనుండెను. ముంగురులు తుమ్మెదలవలె నల్లనై యుండెను. పెదవి దొండపండువలె నుండెను. చేపలవంటి కన్నులు, మెఱపువంటి శరీరచ్ఛాయ, తీగవంటిశరీరముగల లక్ష్మీదేవి విష్ణువును వెంబడించెను. దయాసముద్రుండును దీనజనావనుడగు విష్ణువు ఆకాశమునపరు గెత్తి పోవుచుండగా దేవతలుచూచి పొగడి నమస్కరించిరి. వారిమాటలు చెవినిబెట్టకే విష్ణువుతిన్నగా చెఱువునుసమీపించి సూర్యకాంతులను మించుమిణుగురులను రాల్చునట్టి సర్వ లోకరక్షకమైన చక్రమును మొసలిపై ప్రయోగించెను. ఆచక్రము చెఱువులోచొచ్చి యా మొసలి శిరస్సును ఖండించెను. వెంటనే యొక మకరము రాశిచక్రమును చేరెను. మరొకటి కుబేరుని దగ్గరకు పోయెను. తక్కిన మకరములు కూర్మావతారమెత్తిన విష్ణువు చుఱుగున చేరెను.

రాహువుచే విడువబడిన చంద్రునివలె సంసారము విడిచిన విరాగివలె గజేంద్రుండా మొసలి పట్టునుండి తప్పించుకొని మిక్కిలి ప్రకాశించెను. విష్ణువు పాంచజన్యమును పూరించెను. దేవతలు దుందుభులు మ్రోసి పూలవాన కురిసిరి. అచ్చరలాడిరి. విష్ణువు తన నిడుదకరముతో గజేంద్రుని మడుగునుండి బయటికి లాగి దాని భయము తొలగించి రక్షించెను.

(మొసలి పూర్వవృత్తాంతము—హూహూవు అనుగంధర్వుండొకనాడు ప్రియురాండ్రతో మాలినీనదియందు జలక్రీడలాడుచుండ దేవలుడగు ముని స్నానమునకు వచ్చెను. తన జల

క్రీడలకు విఘ్నముగా నాముని వచ్చినాడని యాముసీంద్రుని కాలుపట్టి యీడ్చెను. ముని వాని పనికి కోపించి గంధర్వుని మొసలికమ్మని శపించెను గంధర్వుడు తన తప్పు మన్నింపు మని మునిని వేడగా కొన్ని యేండ్లకు పిదప శ్రీవిష్ణువువలన శాపవిమోచనమగునని ముని యనుగ్రహించెను. హూహూ గంధర్వుడే మొసలియయ్యెను. ఏనుగు పూర్వ వృత్తాంతము—ద్రవిడ దేశమునకు ఇంద్రద్యుమ్నుడు రాజు. అతడు మహాభక్తుడు అడ డొకనాడు భగవంతుని ధ్యానించుండగా నచ్చటికి అగస్త్యముని వచ్చెను. రాజు వాని కతిథిసత్కారము చేయలేదు. అగస్త్యుడు కోపించి వానిని గజవంశమున పుట్టుమని శపించెను. ఇంద్రద్యుమ్నుడు గజేంద్రుడై పుట్టెను. మహాభక్తుడగుటచే పూర్వ దివ్యజ్ఞానము గలిగి పిదప తరించెను )

ప్రతిపదార్థములు:—

1. కరి=ఏనుగు; అలయక=శ్రమనొందక;సొలయక= మూర్ఛనొందక; వేసట+ఒలయక = విసుగునుపొందక; రాత్రులు+సంధ్యలు+దివసంబులు= రేయింబవళ్ళు, సంధ్యా కాలములందును; మకరితోఁడన్ = మొసలితో; ఉద్దండతన్ = గర్వముతో; పోరుసల్పెన్=దెబ్బలాడెను.

తా. గజేంద్రుడు అలసటపొందక, విసుగులేక వేయి సంవత్సరము లహోరాత్రములు మొసలితో పోరాడెను.

విశే:—రాత్రి (ప్ర) రాత్రి (వి) సంధ్య (ప్ర) సంజ (వి) మకరము (వ్యు) ప్రాణులను కబళించునట్టిదు ముఖ మును విదలించునది (మొసలి)

2. గజము=ఏనుగు; పృథుశక్తిన్=ఎక్కువ బలముతో ఆజలగ్రహముతోన్ = ఆ మొసలితో; పెక్కు + ఏండ్లు+ పోరాడి=చాలసంవత్సరములు దెబ్బలాడి; సంశిథిలంబు+ఐ= అవయవసంధులు మిక్కిలివదలినదై; తనలావున్=తన బల మును; వైరిబలమున్=శత్రుబలమును; చింతించి=విచారించి; దీనిగెల్వన్=దీనిజయించుట; మిథ్యామనోరథము=వట్టికోరిక (దీనినిగెలుతుననుటవట్టిది) సరిపోరన్= దీనితోసమానముగా యుద్ధముచేయుటకు; చాలరాదు=శక్తిలేదు; అవ్యథము+ఐ= విచారము (బాధ) లేనిదై; పూర్వపుణ్య=పూర్వజన్మమందలి పుణ్యముయొక్క; ఫల=ప్రయోజనమైన; దివ్యజ్ఞానసంపత్తి తోన్ =శ్రేష్ఠమగుజ్ఞానసంపదతో; ఇట్లుఅనున్;

తా. గజేంద్రుడు మొసలితో పెక్కేండ్లుపోరి యవ యవములు శిథిలముకాగా నికదానితో పోరాడలేనని నిశ్చ యముచేసికొని, పూర్వపుణ్యఫలము పరిపక్వమగుటచే దివ్య జ్ఞానమునుపొంది విచారమునుమాని యీప్రకారముగా విచారింపజొచ్చెను.

విశే:— మిథ్యామనోరథము —వి పూ. కర్మధార యము; న+వ్యథ=అవ్యథ—నఞ్ తత్పురుషము; వ్యథ (ప్ర) వెత (వి) పుణ్యము (ప్ర) పున్నెము (వి)

3. ఏరూపంబునన్ = ఏరీతిగా; ఏ వేల్పున్ = ఏ దేవతను; చింతింతున్ = ధ్యానము చేయుదును; ఎవ్వారిన్ చీరుదున్ = ఎవ్వరినిపిల్తును; ఎవ్వరు+అడ్డము = నాకెవరడ్డుపడుదురు ? ఈ+వారిప్రచార+ఉత్తమున్ = ఈ మొసలిశ్రేష్ఠమును; వారింపన్ తగువారలు = అడ్డగింపదగినవారు; అఖిలవ్యాపారపారాయణుల్ = అందరపనులు చేయుటయందాసక్తిగలవారు (న+ఖిల = అఖిల = ఖిలముగాని; వ్యాపార = పనులయందు — శాశ్వతోపకారములు ఖిలముగానిపనులు — వానియందాసక్తిగలవారు — (పరోపకారపారీణులు) దిక్కుమాలిన మొర + ఆలింపన్ = రక్షణలేని నా మొఱ్ఱవినుటకు; ప్రపుణ్య+ఆత్మకుల్ + లేరు + ఏ = మిక్కిలిపవిత్రమైన మనస్సుగలవారు లేరా ? (ప్రపుణ్య+ఆత్మకుల్ = ఓమిక్కిలిపుణ్యాత్ములారా ? మీకుమ్రొక్కెదను అని సంబోధనమైన చేయవచ్చును — ప్రభులు పండితులైనవారు......ఓప్రభువులారాయని యర్థము —)

తా. దీనిని నేనెట్లుజయింతును ? ఎవ్వరినిధ్యానింతును? ఎవ్వరినిపిల్తును. ఈ మొసలినడ్డగింపజాలిన వారెవ్వరున్నారు? దిక్కులేని నాదీనాలాపములువిని నన్ను కాపాడునట్టి పరోపకార పరాయణులగు పుణ్యాత్ములు లేరా? వారికిమ్రొక్కెదను.

4. ఈశ్వరా! నానా+అనేకప+యూధముల్ = పెక్కుఏనుగులగుంపులు; వనములోనన్ = అడవియందు; పెద్దకాలంబు = చాల కాలము; సన్మానింపన్ = గౌరవించుచుండగా;

దశలక్షకోటిశరిణీనాథుండను+ఐ=పదిలక్షలకోట్ల ఆడుయేను గులకు ప్రియుడనై (అనేకమనిభావము) మత్=నాయొక్క; దానఅంభః=దానమను మదజలముచే; పరిపుష్ట=చక్కగా పెంపబడిన; చందన=మంచిగంధపుచెట్లయొక్కయు; లతా= తీగలయొక్కయు; అంతచ్ఛాయలు+అందున్=మధ్యయందలి నీడలందు; ఈనీరు+ఆశన్=నీటియందలిఆశచే; ఇటు+ఏలవచ్చి తిని=ఇక్కడకెందుకువచ్చితిని; భయంబు+ఎట్లు+ఓసరద+ఏ= ఈ యాపద యెట్లుతొలగునోకదా?

తా. ఈశ్వరా! పెక్కేనుగుగున్నలు నన్ను గౌరవించుచు నాతోడవచ్చుచుండగా ఆడేనుగులతోఁగూడి నామద జలముచే తడుపబడి పెంపబడుచున్న మంచిగంధపువృక్షములయు పొదరిండ్లయు లోపలినీడలలో హాయిగా తిరుగుచుంటిని అట్టినాకు దప్పికయేలకలుగవలెను? ఏల యీచెఱువునకు రావలయును? నా ఆపద తొలగుటెట్లోకదా!

విశే:—అనేకపము (వ్యు) తొండము, నోరుఅను నీరెండింటిచేతను పానముచేయునది (ఏనుఁగు) అష్టమదోదకములు:—దానం కపోలయో, స్నేధురక్ష్ణో, శ్రుతో్యస్తు సాగరః। కరాగ్రేశీకర, స్సిక్యం స్తనాగ్రే, మేహనేమదః। హృదయేఘర్మసలిలం, మేఘస్తుచరణవ్రజే। సంజ్ఞయాష్ట మదాహ్యేతేజాయంతె భద్రదంతినాం॥

5. జగము = ప్రపంచము; ఎవ్వనిచేఁ జనించున్ = ఎవనిమూలమునపుట్టునో; ఎవ్వనిలోపలన్=ఎవనిబొజ్జయందు;

ఉండఁ న్ = ఉండునో; లీనమై = వశించి; డిందున్ = అణగియుం డునో; పరమ+ఈశ్వరుఁడు+ఎవ్వఁడు = చరాచరాత్మకప్రపం చమునకంతకు ఎవ్వఁడు ప్రభువో; మూలకారణంబు+ఎవ్వఁడు= ప్రధానమైన కారణముగువాఁడెవఁడో; అనాది, మధ్య, లయుడు+ ఎవ్వఁడు=పుట్టుట, స్థితి, నాశనముఅనునవి లేనివాఁడెవ్వఁడో; సర్వమున్ = అంతయు; తాను+ఆ+ అయినవాఁడు = అతఁడేయైన వాఁడు; ఆత్మభవున్ = తనంతటతానేపుట్టినవాఁడను; ఈశ్వ రున్; శరణంబువేఁడెదన్;

తా. సృష్టి స్థితిలయములకే భగవంతుఁడు కారణ భూతుఁడో, సమస్తమున కెవ్వఁడు ప్రభువో, ఎవఁడన్ని వస్తు వులకు ప్రధానకారణ భూతుఁడో ఎవఁడాది మధ్యాంత రహి తుఁడో యెవఁడు సర్వాత్మ స్వరూపుఁడో యట్టి భగవంతుని రక్షింపవేఁడుచున్నాను.

6. మనంబునన్ = మనస్సునందు; ఆ+గజ+ఇంద్రుండు = ఆగజరాజు; ఈశ్వరసన్నిధానంబు + కల్పించుకొని = భగ వంతుఁడు తనయెదుట దగ్గరనున్నట్లు భావించి వానితో మాట్లాడుచున్నట్లు పలుకుచుండెను.

7. లావు+ఒక్క+ఇంకయున్ లేదు = బలము కొంచె మైనను లేదు; విలోలంబు + అయ్యెన్ = చలించిపోయినది; ఠావుల్+తప్పెన్ = తమతమ స్థానములనుండితప్పినవి; మూర్ఛ= మైమఱపు; తనువున్ డస్సెన్ = శరీరముకూడ బడలెను; నీవు+ ఎ+తప్పన్ = నిన్నుతప్ప; ఇతఃపరంబు ఎఱుఁగన్ = ఇంతకంటె

వేఱొక్క-దాని నెఱుగను; దీనుసికి = దుఃఖమునందున్న వానిసి; వరద = వరముల నిచ్చువాఁడా! భద్ర+ ఆత్మకా= మేలైన ఆత్మ లవాఁడా! రక్షింపుము.

తా. బలమునశించినది. ధైర్యము చెడినది ప్రాణములుగతులుతప్పినవి. మైకముపుకల్గుచున్నది. శరీరమలసిపోయినది. నిన్నుతప్పనితరు నెఱుంగను. నన్నుమన్నింపుము. నాదగ్గరకువచ్చి నాబాధతొలగింపుము.

8. కరుణావార్ధీ=దయకుసముద్రుఁడైన వాఁడా ?జీవుల మాటలు వినుచు+అట=ప్రాణులమొఱలుఆలకింతువట; చనరానిచోట్లకు+ చనుదు+అట = పోరానిచోట్లకుపోవుదువట; పిలిచినకా; శరణ+అర్థులకున్= శరణుకోరినవారికి; ఓఅనుదువు+అట=ఇదిగో? వచ్చుచున్నానని పలుకుదువట: సర్వమున్ కనుదు+అట=అంతయుచూచుచుందువట;సందేహము+ అయ్యెన్=అంతయుచూచుచుందువనుట యిప్పుడుసందేహమే అయినది.

తా. దయాసముద్రుడా! ఆపదలోనున్నవారిని ఆదరింతువనియు, పోరానిచోట్లకుకూడ పోదువనియు, భక్తులు పిలిచిన ఓయనిపలుకుదువనియు వినియున్నాను. నేనెంతో సేపటినుండి పిలుచుచున్నాను. పలుకకున్నందున పైమాటలన్నియు నిజమోకాదోయని సందేహముకల్గుచున్నది.

9. కమల+అక్ష=పద్మములవంటి కన్నులుగలవాడా! వరద = వరములనిచ్చువాడా! ప్రతిపక్ష విపక్ష+దూర=

శత్రువులకు మిత్రులకు దూరమైనవాడా (అనగా శత్రుమిత్రు లను విభేదములేనివాడు)! కవి+యోగి+ వంద్య+సుగుణ+ ఉత్తమ=కవులచేతను, మునులచేతను, పొగడదగిన, శ్రేష్ఠమైన సద్గుణములుగలవాడా! శరణ+ఆగత+ అమర+అనోకహా=శరణుచొచ్చినవారికి కల్పవృక్షమైనవాఁడా! ముని+ ఈశ్వర+మనః+హార = మునీంద్రులమనస్సులను హరించు వాఁడా! విమలప్రభావ = స్వచ్ఛమైనమహిమగలవాడా! రమ్ము+ఏ=రావే; కరుణింపుము+ ఏ=కరుణింపవే = దయ చూపుమా! తలపుము+ఏ=జ్ఞప్తికి తెచ్చుకొనుమా! శరణ+ అర్థిన్=శరణుకోరినవాడను; కావుము+ఏ=రక్షింపుమా!

తా. పద్మములనుబోలు కన్నులుగలవాడవు, భక్తుల కోరికలను దీర్చువాడవు, శత్రువులను హతమార్చువాడవు, పండితులచేతను మునుల చేతను సదా పొగడబడువాడవు, శరణార్థులకు కల్పవృక్షమువంటివాఁడవు, మునుల మనస్సులను హరించువాడవు మహామహిమగలవాడవగు నో దేవా! నా మొఱాలించి నాకష్టములను తొలగించి రక్షింపుము.

10. అరక్షితరక్షకుండు = దిక్కులేనివారిని కాపాడు వాఁడు; ఆపన్నుండు=ఆపదనొందినవాఁడు; నింగి=ఆకాశము వైపు; నిక్కి =అతిశయించి; నిడు+ఊర్పులు నిగుడించుచు= ఉస్సురనుచు; బయలు + ఆలకించుచు=ఆకాశమువైపు చెవి యొగ్గి వినుచు:

విశే:—నిడు+ఊర్పు=నిట్టూర్పు-సూ. కఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల అచ్చుల కచ్చుపరంబగునపుడు ద్విరుక్త టకారంబగు;

11. అంబుజాసన+ఆదులు=పద్మముపీఠముగాగలవాఁడు బ్రహ్మ మొదలగువారు; వినియున్=గజేంద్రుని మొఱవినియు; విశ్వమయతలేమిన్=ప్రపంచమందంతటను నిండియుండు తన ము లేకపోవుటచే; అడ్డము + పడక=అడ్డమురాక (రక్షింపక) ఊరక ఉండిరి; విశ్వమయుఁడు = ప్రపంచమందంతటను నిండియుండినవాఁడుగనుక; విభుఁడు = అంతకు ప్రభువైనవాఁడు; జిష్ణుఁడు=జయశీలుఁడైనవాఁడు; విష్ణుండు=అంతట వ్యాపించిన వాఁడునగు భగవంతుఁడు; భక్తియుతునకున్=భక్తితోకూడిన గజరాజునకు; అడ్డపడన్ తలంచెన్=సహాయపడనెంచెను.

తా. గజేంద్రుని మొఱ బ్రహ్మాది దేవతలు వినియు శక్తి లేకపోవుటచే రక్షింపరాకుండిరి. విష్ణువు విశ్వరూపుఁను, జయశీలుఁడు, సకలలోకప్రభువు సర్వశక్తుఁడు గనుక భక్తుని మొఱాలించి రక్షింపఁదలంచెను.

12. అలవైకుంఠపురంబులోన్=ప్రసిద్ధమైన వైకుంఠ పట్టణమందు; నగరి=పట్టణము; నగరు=అంతఃపురము-ఇట నగరులో అని యుండుటలెస్స) నగరులోన్=అంతఃపురమందు; ఆ మూలసౌధంబు దాపలన్ = ఆ మూలయందుండు మేడ సమీపమున; మందార=కల్పవృక్షములయొక్క; వనఅంతర= వనములో; అమృతసరః=మంచినీటి చెఱువుయొక్క; ప్రాంత=

సమీపమందు; ఇందు కాంత ఉపల = చంద్రకాంతపుఱాల మీద; ఉత్పలపర్యంక=కలువలపాన్పునందు; రమా = లక్ష్మీ దేవితో; వినోది= వేడుకగా విహరించువాడు; అగు + ఆపన్న ప్రసన్నుండు=ఐన ఆపదనొందినవారిని కరుణించువాడు అగు విష్ణువు; విహ్వాలనాగ+ఇంద్రము=మిక్కిలి బాధపడిన గజ రాజు; పాహిపాహిఅనన్ = కాపాడుము, కాపాడుమని యొఱ వగా; కుయ్యి ఆలించి= మొఱవిని) సంరంభి+ఐ = వేగిరపాటు గలవాడై ;

తా. వైకుంఠమున నంతఃపురములో నొకమూల మేడ దగ్గర కల్పవృక్షముల యుద్యానవనముగలదు. అందమృత సరోవరముగలదు. దానితీరమున చంద్రకాంతమణులు చెక్కిన కలువపూవులు పఱచిన పాన్పునందు లక్ష్మీదేవితోఁ గూడి యుండెను. ఆపదయందున్న వారికి ప్రసన్నుడగు ఆ శ్రీమన్నా రాయణునకు తనభక్తుడగు గజేంద్రుడు బాధపడి రక్షింపుము రక్షింపుమని మొఱపెట్టుకొనగా నా మొఱ విన్నవాఁడై తత్తఱ పడి లేచెను

వి శే:—వన+అంతర = వనాంతర – సవర్ణదీర్ఘసంధి; ఉపల+ఉత్పల=ఉపలోత్పల–గుణసంధి; పర్యంకము (ప్ర) పరి యంకము (వి)

1౩. గజ+ప్రాణ+అవన+ఉత్సాహి+ఐ = గజేంద్రుని ప్రాణములను కాపాడుటయందు అభిలాషగలవాడై ; సిరికిన్ చెప్పడు = లక్ష్మీదేవితో చెప్పలేదు; చేదోయిన్ = రెండు

చేతులయందు; శంఖ + చక్రయుగమున్ = పాంచజన్య మను శంఖముయొక్క, సుదర్శనమను చక్రముయొక్క జంటను; సంధింపడు=ధరింపడు; ఏపరివారంబున్ చీరఁడు = పనివారి నెవ్వరిని పిలువఁడు; అభ్రగపతిన్=గరుత్మంతుని; పన్నింపడు= సిద్ధముచేయింపడు; ఆ+కర్ణిక+అంతర=చెవులవఱకు మేరయైన (వ్యాపించిన) ధమ్మిల్లమున్ = శిరోజముల ముడి; చక్కన్ ఒత్తడు=సరిదిద్దఁడు; వివాద= ప్రణయకలహమందు; ప్ర+ ఉత్థిత=పైకెగసిన; శ్రీ=లక్ష్మియొక్క; కుచ= స్తనముల యందలి; చేల+అంచలము + ఐనన్ =పైటకొంగునైనను; వీడఁడు+విడువడు

తా. భక్తుని మొఱ వినునప్పటికి భగవంతునకొడలు తెలియలేదు. భక్తుని రక్షించును త్సాహములో లక్ష్మీదేవితో చెప్పలేదు. శంఖచక్రములను ధరింపలేదు ఏపనివారిని పిలువ లేదు. గరుత్మంతుని రమ్మనలేదు వీడిన శిరోజములు ముడివేసి కొనడు. లక్ష్మీదేవితో వాదులాడుచుండి ప్రణయకలహమున లాగిన యాపైటకొంగునుకూడ విడువక యట్టె బయలుదేరి పోవుచుండెను.

వి శే:—సిరి (వి) శ్రీ (ప్ర) శంఖము (ప్ర) సంకు(వి) దోయి (వి) ద్వయము (ప్ర) చేదోయి—షష్ఠీతత్పురుషము; అభ్రగము (వ్యు) ఆకాశమందుపోవునది (పక్షి)

14. భక్తజనపాలనపరాయణుండు = భక్తసమూహ మును రక్షించుటయందాసక్తిగలవాఁడు; నిఖిలజంతు=సమస్త

ప్రాణులయొక్క; హృదయ+అరవింద = పద్మమువంటిమన
స్సనెడు; సదన=ఇంటియందు; సంస్థితుండు=చక్కగానుండు
వాఁడు; కరికుల+ఇంద్ర+విజ్ఞాపిత= గజరాజుచేత; విన్నపము
చేయబడిన; నానావిధ = అనేకవిధములగు; దీన+ఆలాపం
బులు=జాలిగొలుపుమాటలు; ఆకర్ణించి=విని; లక్ష్మీకాంతా
వినోదంబులన్ = లక్ష్మీదేవితోడి క్రీడలయందలి; తగులు+
చాలించి=ఆసక్తివిడిచి; సంభ్రమించి= తొందరపడి; దిశలు
నిరీక్షించి=దిక్కులుచూచి: గజ+ఇంద్రరక్షాపరత్వంబుగా=
గజేంద్రుని కాపాడుటయే ముఖ్యముగుటను; అంగీకరించి=ఒప్పు
కొని; మరలన్=తిరిగి; నిజపరికరంబున్ = తనవివేకమును;
అవధరించి=తాల్చి; గగనంబునకు=ఆకాశమునకు; ఉద్గమించి
=ఎగిరి; వేంచేయు+అప్పుడు=బయలుదేరునపుడు;

15. తనవెంటన్ సిరి=తనవెనుకలక్ష్మీదేవి, లచ్చివెం
టన్=లక్ష్మీదేవివెనుక; అవరోధవ్రాతమున్ = అంతఃపుర
స్త్రీసమూహమును; పక్షి+ఇంద్రుడున్=గరుత్మంతుఁడును;
పొంతన్+సమీపమున; ధనుః=శార్ఙ్గమనువిల్లు; కౌమోదకీ=
కౌమోదకియనుగదయు; శంఖ = పాంచజన్యమనుశంఖము;
చక్ర=సుదర్శనమనుచక్రము; నికాయంబున్=వీనిసమూహ
మును; ధ్వజినీకాంతుండున్=విష్వక్సేనుఁడు(సేనానాయకుడు)
రాన్=రాగా; వైకుంఠపురంబునన్ కలుగువారు=వైకుంఠ
మునఉన్నవారు; ఆ+బాల+గోపాలమున్ =పిల్లలుమొదలు
గొల్లలువఱకు (అందఱు) ఒయ్యనన్ వచ్చిరి=తిన్నగావచ్చిరి.

తా. లక్ష్మి శ్రీమన్నారాయణుని వెంటవచ్చెను. ఆమె వెనుక నంతఃపురస్త్రీలు, వారివెంటగరుత్మంతుడు, పిమ్మట శంఖచక్రగదాది సకలసాధనములు, వెనుకనారదుడు, సేనానాయకుడగు విష్వక్సేనుడు వేయేల ? వైకుంఠముననున్న వారందఱువచ్చిరి.

విశే:—పక్షి (ప్ర) పక్కి (వి)

16. తత్ అనంతరంబు + అ=పిమ్మటనే; ముఖ+అరవింద=ముఖమనెడు పద్మముయొక్క; మకరంద= తేనెయొక్క; బిందుసందోహ= బిందువులసమూహముయొక్క! పరిష్యందమాన=అంతటకాఱుటచేత; ఆనందత్ =సంతోషపడుచున్న; ఇందిందిర=తుమ్మెదలుగలది; అగు ఆఇందిరాదేవి=ఐనఆలక్ష్మిదేవి; గోవింద=విష్ణువుయొక్క; కర+అరవింద= పద్మమువంటి చేతితో; సమ్+ఆకృష్యమాణ=చక్కగాపట్టుకొనబడుచున్న; సంవ్యానచేల=పైటకొంగుయొక్క; అంచల+అయి = కొనగలదై;

17. తనవేంచేయుపదంబున్ =తానువెళ్లెడుచోటును; పేర్కొనడు=చెప్పడు; అనాథస్త్రీజన+ ఆలాపముల్ =దిక్కులేని యాడువారియొక్క మొఱ్ఱలను; ఖలులు=దుర్మార్గులైన; ప్రముచ్చులు=దొంగలు; వేదప్రపంచంబులన్ =వేదములసమూహమును; ప్రముచ్చిలించిరి+ఓ=దొంగిలించినారో; దేవతానగరిపైన్ = స్వర్గముమీఁదికి; దనుజ+అనీకము=రాక్షససైన్యము; దండెత్తెను+ఓ=దాడిచేసినదో; దుర్జనుల్; చక్ర+

ఆయుధుడు + ఏడీ = విష్ణువెక్కడ; ధిక్కారించిరి+ఓ = బెదరించిరో;

తా. విష్ణువు తానెక్కడికిపోవుచున్నాడో చెప్పడు. ద్రౌపది మొదలగు స్త్రీలెవరైన రక్షింపుమని ప్రార్థించిరో, సోమకాసురుడు మొదలగు రాక్షసులు వేదములను దొంగిలించిరో, రాక్షసులు స్వర్గముపై దండెత్తిరో, దుర్మార్గులెవరైన భక్తులను బాధించి విష్ణువేడీ చూపుమనిదండించిరో ఏభక్తునకే యాపదవచ్చిన తొలగించుటకు పోవుచున్నాడో యని లక్ష్మి వితర్కించుకొనుచుండెను.

వి శే:—చక్రాయుధుడు—బహువ్రీహి;

19. తాటంకా + చలనమ్ముతోన్ = చెవియాభరణములయొక్క కదలికతో; భుజ=భుజములయందు; నటత్ = తిరుగుచున్న; ధమ్మిల్ల బంధంబుతోన్ = కొప్పుముడితో; శాటీముక్త=పైటతొలగిన; కుచంబుతోన్; అదృశ్య=వదులైనందున; చంచత్ = కదలుచున్న; కాంచితోన్ = ఒడ్డాణముతో; శీర్ణ = చెఱిగిపోయిన; లాలాట+ఆవేపముతోన్ = ముఖసంబంధమైన అనగానొసటియందలిబొట్టుతో; మనోహర+అందమైన: కర = చేతియందు; ఆలగ్న ఉత్తరీయంబుతోన్ = చిక్కకొన్న పైటతో; కోటి+ఇందుప్రభతోన్ = కోటిచంద్రుల కాంతినిబోలుకాంతితో; ఉరోజభర = స్తనములబరువుచే; సంకోచత్ = మిక్కిలిముడుచుకొనిన (విలఘ్నముపోరపాటువలగ్నము) వలగ్నంబుతోన్ = నడుముతో;

తా. లక్ష్మి చెవికమ్మ లూగులాడుచుండెను. కొప్పు ముడి భుజములయందు నటించుచుండెను పైటచెరగు తొలంగెను, మొలనూలు జారిపోవుచుండెను; నొసటిబొట్టు చెదరి పోయెను. తన పైటచెఱగును ప్రాణనాథుడు లాగుకొని పోవుచుండెను. ఆమె ముఖము కోటిచంద్రుల కాంతినిమించియుండెను. నడుము వంగియుండెను.

20. అడిగెదన్ = భర్త యెక్కడికి వెళ్లుచున్నాడో అడిగెదను; కడువడిన్ = మిక్కిలి వేగముగాఁ చనున్ = పోవును; మగుడన్ = తిరిగి; నుడువదు = జవాబు చెప్పదు; నడవుడుగున్ = వెనుకడుగు వేయును; వెడవెడన్ = మెల్లమెల్లగా; చిడిముడి తడబడన్ = తొట్రుపాటు కలుగుచుండగా; అడుగు ఇడుఎడలన్ = అడుగు పెట్టునప్పుడు; జడిమన్ = జడత్వముచేత; అడుగు ఇడదు = కాలు పెట్టదు;

తా. లక్ష్మి ముందరకుపోయి భర్త యెక్కడి కేగుచున్నాడో యడిగెదనని తలంచును. ముందునకు పోవును. అడుగబోయి చెప్పునో చెప్పడోయని సందేహించి యూరకొనును. ముందడుగు వేయబోయి మరల మానివేయును.

21. మెలఁత = స్త్రీ యగు లక్ష్మి; మొగిలు పిరఁది మెఱుఁగు+తీవయున్+పోలెన్ = మేఘము వెనుక నుండెడి మెఱపు తీగెవలె; జలదవర్ణు వెనుకన్ = కారుమేఘము వంటి రంగుగల విష్ణుని వెనుక; చనెడు+అపుడు = పోవునప్పుడు; నిటల+అలకములు = నొసటియందలి ముంగురులు; అంటన్ నివు

రన్ =అఱుగునట్లు చక్కఁ జేయఁగా; తేంట్లు=తుమ్మెదలు; ముఖ సరోజము నిండన్ =ముఖమనెడు పద్మము నిండునట్లు; ముస రఁగ =మూఁగును; అళులన్ =తుమ్మెదలను; చోపఁగన్ =తోలఁగా; అల్లనల్లన్ = మెల్ల మెల్లగా; ఓష్ఠ బింబద్యుతులు= పెదవులనెడు దొండపండు యొక్క కాంతులు; ఒసియన్+ ఉఱుకున్ =పీల్చుకొనుట కురుకును; శుకములన్ తోలన్= చిలుకలను తోలఁగా; చక్షుః+మీనములకున్ =కన్నులనెడు చేపలకై; మందాకినీ పాఠీనలోకము=గంగానదిలోని చేపల గుంపు; ఎసఁగున్ =చుట్టుకొనును; మీనపంక్తులన్ =చేపల సమూహమును; దాఁటన్ =దాఁటఁగా; మెయి+తీఁగతోన్+ రాయన్ =శరీరమనెడుతీఁగతో ఒరసికొనుటకు; శంపాలతలు= మెఱపు తీఁగలు; మింటన్=ఆకాశమందు; సరణి కట్టున్ = పంక్తులు దీరును; శంపలను జయింపన్ =మెఱపులనుగెల్వఁగా; చక్రవాకంబులు=జక్కవ పిట్టలు; కుచ యుగంబున్ = స్తనముల జంటను; తాఁకి=ఎదిరించి; గ్రొవ్వుచూపున్ =గర్వమును చూపెను.

తా. శ్రీమహాలక్ష్మి మేఘమువెంట మెఱపుపోవునట్లు నీలమేఘచ్ఛాయగల విష్ణువువెంట పోవుచుండగా నామెనొసట యందలి ముంగురులను చూచి వాని కాంతి మీఱుటకై తుమ్మెదలు ఆమె ముఖపద్మమున ముసరెను. తుమ్మెదలను తోలునప్పటికి నామె పెదవియను దొండపండును పొడుచుటకై చిలుకలు వ్రాలెను. చిలుకలను తోలగా మందాకి

సీనది యందలి పెద్దచేపలు ఆమె కన్నులనెడు చేపలను తిన టకై వ్యాపించెను, చేపలను తోలివేయగా శరీరమును తీగతో నోరయుటకై మెఱపులాకసమున బారులు గట్టెను. మెఱపు లను గెల్చునప్పటికి చక్రవాకములు కుచముల నెదిరించెను. అనగా లక్ష్మీదేవి ముఖము పద్మమువలెను, ముంగురులు తుమ్మెదలవలెను, పెదవి దొండపండువలెను, కన్నులు చేపల వలెను, శరీరకాంతి మెఱపువలెను, కుచములు చక్రవాకముల వలెను నుండెనని భావము.

విశే:—శుకము (ప్ర) చిలుక (వి); చక్షుః+మీనము = చక్షుర్మీనము - విసర్గసంధి; చక్రవాకము (ప్ర) జక్కవ (వి) మొగిలు (వి) మేఘము (ప్ర): మెఱుగు+తీవ = మెఱుగుందీవ సూ.ఉదంతస్త్రీసమంబులకు... నుగాగమంబగు = మెఱుగు+ న్+తీవ (b) ద్రుతప్రకృతికము.....పరశములగు = మెఱుగు న్ = దీవ(c)ఆదేశ+సరళమునకు.....స్వాత్వరూపంబులువిభావ నగు = మెఱుగుందీవ.

౨౩. వినువీథిన్ = ఆకాశమార్గమందు; చనుదేరన్ = బయలుదేరగా; అమరుల్ = దేవతలు; సుర+అరాతి = దేవత లకు శత్రువులగు రాక్షసులయొక్క; జీవన సంపత్తి=బతుకుట యను సంపదను; నిరాకరిష్ణున్ = పోగొట్టుటయే స్వభావముగా గల వానిని; కరుణావర్ధిష్ణున్ = దయను వృద్ధిపొందించు వానిని; యోగీంద్రహృత్ = మునిశ్రేష్ఠులయొక్క మనస్సనెడు; వన = అరణ్యమందు; వర్తిష్ణున్ = సంచరించు వానిని; సహిష్ణున్ =

ఓర్పుగల వానిని; భక్తజనబృంద = భక్తజనుల సమూహము యొక్క; ప్రాఘన=ప్రభుస్వభావుడును; అలంకరిష్ణున్ = అలంకరించువానిని, నవ+ఊఢ=క్రొత్తపెండ్లికూతురువలె; ఉల్లసత్ = ప్రకాశించుచుండు; ఇందిరా=లక్ష్మీదేవి; పరిచరిష్ణున్=పని కత్తెగా గలవానిని; జిష్ణున్=జయశీలుని; రోచిష్ణున్ = ప్రకాశించువానిని; విష్ణున్ =సర్వవ్యాపకుఁడైన నారాయణుని; కాంచిరి=చూచిరి.

రాక్షసుల ప్రాణములను హరించువాడును, దయాసముద్రుడును, మునీశ్వరుల మనస్సులందు విహరించువాడును భక్తులకు మహిమప్రసాదించువాడును, సహనశక్తిగలవాడును క్రొత్తపెండ్లికూతురువలె సదా వెలుంగుచుండు లక్ష్మిచే సేవింబడు చుండువాడును, జయస్వభావము, నిరంతరము ప్రకాశించు స్వభావముగల యా నారాయణమూర్తి యాకాశము నందు పోవుచుండగా దేవతలు చూచిరి.

విశే :—వృద్వనము - రూపకము - పద్యములో అలంకారము వృత్త్యనుప్రాసము.

23. పొడగని=చూచి;

24. అల్లవాఁడె = అడుగో; ఘనుఁడు = గొప్పవాఁడు; హరిపజ్జన్ = విష్ణువు వెంబడినే; కంటిరి+ఏ = చూచితిరా ! శంఖనినాదము=శంఖధ్వని; భుజంగ ధ్వంసియున్ =గరుత్మంతుడును; క్రన్ననన్+ఏతెంచెన్ = వెంబడినేవచ్చెను; వేల్పులు= దేవతలు; నారాయణాయ=నారాయణుని కొఱకు; నమః =

నమస్కారము; ఇతి+ నిస్వనులు+ఐ = ఇట్లను ధ్వనులుగల వారై; వింటన్=ఆకాశమందు; హస్తి = ఏనుగుయొక్క; దుర్ అవస్థావక్రికిన్=కష్టదశను పోగొట్టుటకు; పూనినవానికిఁ చక్రికిన్=చక్రము చేతియందు గలవానికి; మ్రొక్కిరి;

తా॥ వేల్పులందరుగూడి 'అదుగో! విష్ణువు వచ్చు చున్నాడు. వాని వెనుకనే లక్ష్మి వచ్చుచున్నది. అదె పాంచ జన్యధ్వని, అదేచక్రము. అతడే గరుత్మంతుఁడు. అని పలు కుచు నారాయణునకు నమస్కారము అని ధ్వనులు చేయుచు గజేంద్రుని రక్షింపబూనిన విష్ణువునకు మ్రొక్కిరి.

విశే:—పజ్జ (వి) పశ్చాత్ (ప్ర) భుజంగము (వ్యు) కుటిలముగా పోవునది (పాము)

౭౫. ఆ+అవసరంబునన్=ఆసమయమందు; కుంజర+ ఇంద్ర+పాలన+పారవశ్యంబునన్=గజరాజుయొక్క రక్షణము నందలి మైమఱపుచే; మనస్+సమాన+సంచారుండు+ఐ = మనోవేగముతో సమానమగు సంచారముగలవాఁడై; శింశు మారచక్రంబునుఁ బోలెన్=చెఱువు పరముగా అర్థము— గురు+మకర=గొప్ప మొసళ్లయొక్కయు; కుళీర = ఎండ్ర కాయలయొక్కయు; మీన=చేపలయొక్కయు; మిథునంబు+ ఐ=దంపతులుకలదై;—శింశుమారచక్ర పరముగా అర్థము— గురు=బృహస్పతి!మకర=మకరరాశి; కుళీర = కర్కటరాశి; మీన=మీనరాశి; మిథునంబు+ఐ =మిథునరాశియుగలదై కనుక ఆ చెఱువు శింశుమారచక్రమువలెనున్నదని భావము.

(2) కిన్నర+ఇంద్రుని భాండాగారంబుఁబోలెన్ — చెఱువు పరముగా — కిన్నరులకు ప్రభువగు కుబేరునిధివలె — స్వచ్ఛ వరకచ్ఛపంబు+ఐ = తెల్లని, శ్రేష్ఠమగు తాబేళ్ళుకలదై — భాండాగారపరముగా; స్వచ్ఛవరకచ్ఛపంబు = మిక్కిలి మేలైన వరము, కచ్ఛపము అనుపేళ్ళుగల నిధులుగలదై (కుబేరుని నవనిధుల పేర్లు:— (1) మహాపద్మము (2) పద్మము (3) శంఖము (4) మకరము (5) కచ్ఛపము (6) ముకుందము (7) కుందము (8) నీలము (9) వరము) భాగ్యవంతుని భాగధేయంబునున్ బోలెన్ = ధనవంతుని యదృష్టమువలె — చెఱువు పరముగా పర్ణము — పరాగ = పుష్పాదితోఁ గూడిన; జీవనంబు+ఐ = నీరు గలదై; భాగ్యవంతుని పరముగా:— పరాగ+జీవనంబు = శ్రేష్ఠమైన జీవనముగలవాఁడు; వైకుంఠపురంబునున్ బోలెన్ = వైకుంఠపట్టణమువలె; చెఱువుపరము:— శంఖములు, చక్రవాకములు; కమల = పద్మములు; వీనిచే అలంకృతంబు = అలంకరింపబడినది; వైకుంఠపట్టణపరము:— శంఖ = పాంచజన్యమను శంఖము; చక్ర = సుదర్శనమను చక్రము; కమల = లక్ష్మీదేవిచే; అలంకృతంబు = అలంకరింపబడినది; సంసారచక్రంబునున్ బోలెన్ = సంసారమను చక్రమువలె; చెఱువుపరము:— ద్వంద్వ = ఏనుగు, మొసలి యీ రెండింటిపోరునందు; సంకుల = దట్టమైన; పంక = బురదతో; సంకీర్ణంబు+ఐ = వ్యాపించినదై; సంసారపరము;— ద్వంద్వ = సుఖదుఃఖములను జంటతో; సంకుల = దట్టమైన; పంక = పాపముతో; సంకీర్ణము+ఐ = వ్యాపిం

చినదై; ఒప్పు=ప్రకాశించు; ఆ+పంకజాకరంబున్=ఆ చెఱువును; పొడగని=చూచి;

తా. చెఱువును విష్ణువుచూచినాడు. అదెట్లున్నదనగా శింశుమారచక్రమునగురుమకుచు, మకర, కర్కాటక, మీన, మిథు రాసులు గలవు. చెరువులో పెద్ద పెద్ద మకరములు, కర్కాటకములు, మీనములు, ఈ దంపతులు రాసులు రాసులుగ గల వందుచే చెఱువు శింశుమార చక్రము వలె నున్నది కుబేరుని నవ నిధులలో వరము, కచ్ఛపము అను నిధుల గలవు. చెఱువులో శ్రేష్ఠమైన కచ్ఛపములుగల వందుచే చెఱువు కిన్నరేంద్రుని నిధివలె నున్నది. ధనవంతుని అదృష్టము శ్రేష్ఠమైన జీవనము గలది. చెఱువులోని జీవనము పరాగముతో కూడినది. కనుక చెఱువు భాగ్యవంతుని అదృష్టము వలె నున్నది. వైకుంఠము, శంఖచక్రములు కమలచే నలంకృతమైనది. చెఱువు శంఖములు చక్రవాకములు కమలచేత నలంకృతమైనది. కనుక వైకుంఠమువలె నున్నది. సంసారము సుఖదుఃఖములనెడు ద్వంద్వముతో నిండియున్నది చెఱువు కరిమకర ద్వంద్వముచే పంకముతో సంకీర్ణమైయున్నది.

విశే:— శ్లేషార్థములు:- గురు అనగా పెద్ద, బృహస్పతి; మకరము=మొసలి, మకర రాశి; కుళీరము=ఎండ్రి, కర్కాటక రాశి; మీనము=చేప, మీనరాశి; మిథునము=దంపతులు, మిథునరాశి; వర=శ్రేష్ఠమైన, వరమను పేరుగలనిధి

కచ్ఛపము = తాబేలు, కచ్ఛపమను పేరుగల నిధి; పరాగ=పుప్పొడి, ప్రసిద్ధితో కూడిన; జీవనము=నీరు, బ్రతుకు శంఖ=శంఖము, పాంచజన్యము; చక్ర=చక్రవాకము, సుదర్శన చక్రము; కమల=పద్మము, లక్ష్మి; ద్వంద్వ=జంట, సుఖదుఃఖములు; పంకము=బురద, పాపము; ఇందలంకారము శ్లేషానుప్రాణిత అభేదాధ్యవసాయము

26. కరుణాసింధుడు=దయా సముద్రుడు, శౌరి=విష్ణువు; నారిచరమున్ = మొసలిని; ఖండింపగాన్ = చంపుటకు; సత్వరిత+ఆకంపిత+భూమిచక్రమున్ = వేగముతో కూడినది కనుకనే అంతటా అదరునట్లు చేయబడిన భూమండలము గలదియు; మహా+ఉద్యత్ =గొప్పగా ఎగురునట్టి; విస్ఫులింగ=మిణుగురుల యొక్క; ఛటా=సమూహముచే; పరిభూత=తిరస్కరింప బడిన; అంబర=ఆకాశమునందలి; శుక్రమున్ =నక్షత్రము గలదియు; బహువిధ=అనేక విధములైన; బ్రహ్మాండ భాండ+ఛటా+అంతర=బ్రహ్మాండమనెడు కుండల సమూహముల యొక్క సందులందు; నిర్వక్రమున్ =ఆటంకము లేనిదియు; పాలిత=రక్షింబడిన; అఖిల=సమస్తమైన; సుధా+అంధః=అమృతమే ఆహారముగా గల దేవతల యొక్క; చక్రమున్ =సమూహము గలదియు నగు; చక్రమున్ =సుదర్శన చక్రమును పంపెను.

తా. దయా సముద్రుడగు విష్ణువు మొసలిని చంపనెంచి వేగముచే భూమండలము నంతయు, కదలించునదియు

అగ్నికణములను గ్రక్కు-చున్నదియు, పదునాలుగు లోకములం దడ్డములేక సంచరించుచున్నదియు, దేవతలందఱును శత్రువుల నుండి కాపాడునదియు నగు, సుదర్శన చక్రమును పంపెను.

విశే:—శూరుని వంశమున పుట్టినవాడు శౌరి-గోత్రా పత్యము. శుక్రుడు (ప్ర) చుక్క- (వి) సుధాందసులు (వృష్టి యమృత మే ఆహారముగా గలవారు (దేవతలు)

27. పంచినన్ = పంపగా;

28. అంభోజ+ఆకర = తామరకొలనుయొక్క-; మధ్యన్ = నడుమ; నూతన నళినీ = క్రొత్త తామరతీగయొక్క-; ఆలింగన = కౌగిలించుకొనుట; క్రీడన = నీటవిహరించుటయను నీ రెండింటియందు; ఆరంభుండు+ఐన = ప్రారంభముగలవాడైన; వెలుంగు తేని = సూర్యునియొక్క-; చెలువు+ఆనన్ = ఆకారమునిండునట్లుగా అనగా సూర్యుడో యనునట్లుగా; వచ్చి; నీటన్ = నీటియందు; గభుల్ గు భ ధ్వానముతోన్ = గుభుల్లని శబ్దించుధ్వనితో;కొలంకువు = చెఱువుకలంకన్ పొందన్ కాన్ = కలతపొందునట్లుగా; చొచ్చి = ప్రవేశించి; దుష్ట అంభోవర్తి = దుష్టమైన మొసలి; వసించు చక్క-టికిన్ = ఉండుప్రదేశమునకు; డాయన్ పోయి = సమీపించబోయి; హృత్ వేగము+ఐ = మనో వేగంబునుబోలు వేగము గలదై;

తా. శ్రీ మహావిష్ణువు చక్రము ప్రయోగించిన వెంటనే చెఱువులోనుండు నళినియను స్త్రీని కౌగిలించుకొని జలక్రీడల నిల్పుటకై వచ్చిన వెలుగులకు ప్రభువగు సూర్యుడో యను

నట్లుగా సుదర్శనచక్రము భుగ్గుభుగ్గుమనెడు జ్వాలలతో వచ్చి యా చేతివంతయు కలచివైచి యా మొసలియున్న చోటునకు పోయి, మనోవేగమును మించిన వేగముకలదై.

వి శే:—అంభోజము (వ్యు) నీటినుండి పుట్టునది (పద్మము) నళినీయనుటచే స్త్రీలింగస్వారస్యము. ఒక స్త్రీ యని ద్యోతకమగుచున్నది. ఖేదము అను పదసారస్యమువలన ఒక రాజు అనియు ద్యోతకమగుచున్నది. కొలకువు - రూపాంతరము; అంభోవర్తి (వ్యు)నీటసంచరించునది (మొసలి)

29. చక్రము = సుదర్శనము; హేమక్ష్మాధర దేహమున్ = మేరుపర్వతమువంటి శరీరముగలదియు; చకిత=భయపెట్టబడిన; వన్య=అడవిసంబంధమైన; ఇభ+ఇంద్ర=శ్రేష్ఠమైన యేనుగులయొక్క; సందోహమున్ =గుంపుగలదియు; కామక్రోధన గేహమున్ = కామమునకు, కోపమునకు ఉనికిపట్టైనదియు; కరటి=ఏనుగులయొక్క; రక్తస్రావ = రక్తప్రవాహమందు; గాహంబుల్ = స్నానముచేయుటకలదియును; నిస్సీమ+ఉత్సాహమున్=హద్దులేని పూనికగలదియు; వీతదాహమున్ =పోయినదప్పిగలదియు;జయశ్రీమోహమున్ = జయలక్ష్మిని పొందుటయందు పట్టుదలగలదియు; అగు; గ్రాహమున్ = మొసలిని; భీమంబు+ఐ=భయంకరమై; తలన్ త్రుంచి=శిరస్సుఖండించి; ఆశుక్రియన్ = వేగముగా; ప్రాణములన్ బాపెన్ = చంపెను.

తా. మేరుపర్వతమువంటి శరీరము గలదానిని, అడవిలోని యేనుగులన్నింటికి భయముగలిగించుదానిని, కామక్రోధములుగలదానిని, ఏనుఁగురక్తము క్రొత్తగుటవలని ప్రవాహమున మునిగినదానిని; దప్పికలేనిదానిని, గజమును చంపి జయలక్ష్మిని చేపట్టవలయునని పట్టుపట్టిన దానిని, మొసలిని చక్రము ఖండించెను.

30. నిమిషస్పర్శనంబునన్ = ఒకనిమిషకాలము తాకుటతోనే (వెంటనే) మకరికలన్ మొసలితలను;

31 మకరము+ఒకటి = మకరమను రాశియొకటి; రవిన్ చొచ్చెన్ = సూర్యుని ప్రవేశించెను; మకరము మరియొకటి = మకరమనునిధి మరియొకటి; ధనదుమాటునన్ = కుబేరుని మఱుగున; డాగెన్ = దాగెను; మకర ఆలయమునన్ = మొసళ్ళకు చోటగు ఆ చెఱువులో; తిరిగెడు మకరంబులు = సంచరించు మొసళ్ళు; కూర్మరాజు మఱువునకు = కూర్మావతారమెత్తిన విష్ణువు చాటునకు; అరిగెన్ = వెళ్ళెను.

తా. చక్రము మకరమును చంపగానే ఒక మకరము రాశిచక్రమునకుపోయి చేరెను. మరియొక మకరము కుబేరుని నవనిధులలోనికిపోయి చేరెను. ఆ చెఱువులోని తక్కిన మకరములు విష్ణుమూర్తి మఱుగున చేరెను

విశే:—రాసులలో ఒక రాశికిమకరమని పేరు కుబేరుని నిధులలో ఒకనిధికి మకరమని పేరు. చక్రప్రయోగమయిన తోడనే మకరము చచ్చినతోడనే తక్కినమకరములు పాఱి

పోయినవి. కవి యిచట ఉత్ప్రేక్షించినాడు. ఒకమకరము భయపడి పారిపోయినదా యనునట్లుగా పోయి రాహువులో చేరెను. అట్లే రెండవది

34. తమముక్త పాసినరోహిణీభుక్తియన్ = రాహువుచేత విడువబడిన చంద్రునివలె (తమస్తు రాహుస్స్వర్భానుస్సైంహికేయో విధుంతుదః—అని అమరము) దర్పించి = గర్వించి; సంసార చక్రకము = సంసారమనెడు సుడిగుండమును; వీడ్కొన్న = విడిచిన; విరక్తచిత్తువిగతిన్ = విరక్తిపొందిన మనస్సుగలవాడనగా వైరాగ్యవంతునివలె; గ్రాహంబు = మొసలి; పట్టు+ఊడ్చి = పట్టునుండి తొలంగి; పాదములుఅల్లార్చెన్ = కాళ్ళుజాడించెను; కరేణుకావిభుడు = గజేంద్రుడు; సంభ్రమత్ = త్వరపడుచున్న; ఆశాకరిణీ = దిగ్గజముల భార్యలయొక్క; కర = తొండములచే; ఉజ్ఝిత = విడువబడిన; సుధా అంభః = అమృతజలమందు; స్నాన = స్నానముచేయుటచే; విశ్రాంతుడు+ఐ = అలసటతీర్చుకొన్నవాడై; సౌందర్యముతోన్ ఒప్పెన్ = అందముతో ప్రకాశించెను.

తా. రాహువుచే మ్రింగబడి మరలవిడువబడిన చంద్రునివలెను, సంసారమును విడిచిన విరాగివలెను. ఆగజరాజు మొసలిపట్టు తప్పించుకొని మిక్కిలి ప్రకాశించెను. దిగ్గజేంద్రముల రాణులు తమతొండములతో చల్లిన నీటియందు తడియుటచే నలసట తీర్చుకొన్నవాడై మిక్కిలి యందముగా నుండెను.

విశే:—రోహిణీవిభుడు (వ్యు) రోహిణీనక్షత్రమునకు పతి (చంద్రుడు) ఆశ (ప్ర) ఆగ (వి) స్నానము (ప్ర) తానము (వి)

౭౭. హరి=విష్ణువు; కృప+అంభః+రాశి + సౌజన్యమున్ = దయాసముద్రము యొక్క సుజనత్వముగలది; భూరిధ్వాన=గొప్పధ్వనిచేత; చలాచలీకృత=మిక్కిలి ఊగులాడునట్లుగా చేయబడిన; మహాభూత =గొప్పభూతములయొక్క; ప్రచైతన్యమున్=బుద్ధిగలదియు; సార=బలిమిచేత; ఉదార=గొప్పదైన; సితప్రభా=తెల్లనికాంతిచేత; చకిత=భయపెట్టబడిన; పర్జన్య+ఆది=ఇంద్రుడు మొదలగు; రాజన్యమున్=రాజులుగలదియు; దూరీభూత=దూరముగా చేయబడిన; విపన్న=ఆర్తులైనవారియొక్క, దైన్యమున్=దుఃఖము గలదియు; నిర్ధూత=ఎగురగొట్టబడిన; ద్విషత్+సైన్యమున్=శత్రువులయొక్క సైన్యములుగలదియు అగు; పాంచజన్యమున్=పాంచజన్యమను శంఖమును; పూరించెన్=ఊదెను;

తా. విష్ణువు దయానిధియైన, తనగొప్పధ్వనిచే సమస్తభూతములను కదలించునట్టి. తెల్లనికాంతిచే దేవేంద్రాదులనుకూడ వెఱపించునట్టియు, భక్తులయాపదలను పోగొట్టునట్టియు, శత్రుసేనలను తఱుముశక్తిగలట్టి పాంచజన్యమును ఊదెను.

విశే:—కృపాంభోరాశి సౌజన్యము అని పాఠ్యభాగములో నున్నది. మూలమున "సుధాంభోరాశి సౌజన్యము" అనియున్నది. పాలసముద్రమందలి పుట్టుకగలదియనియర్థము;

టీకా. నిర్జరదుందుభుల్ = దేవదుందుభులు; మొరసెన్ = మ్రోగెను; జలరుహ+ఆమోదంబులు+ఐ = పద్మములవాసన గలవై; వాయువుల్ వీచెన్ = గాలులు వీచెను; ప్రసూనవాన జల్లు = పుష్పములయొక్క జడి; దేవ+అంగనా+లాస్యముల్ = దేవతాస్త్రీలయొక్క, నాట్యములు; పరగెన్ = ఒప్పెను; జీవజయశబ్దధ్వానముల్ = సారవంతమైన జయజయ శబ్దముల చప్పుడులు; సాగరము = సముద్రము; తరంగ = కెరటములచేత; చుంబిత = తాకబడిన; నభఃగంగా = ఆకాశగంగానది యను స్త్రీయొక్క; ముఖ+అంభోజము+ఐ = పద్మమువంటిముఖము గలదై; ఉప్పొంగెన్;

తా. దేవతలు దుందుభులు మ్రోగించిరి, కమ్మని సువాసనలుగల వాయువులు వీచెను. పూలవాన కురిసెను. దేవతాస్త్రీలాడిరి, దిక్కులయందు జయజయ ధ్వనులు పిక్కటిల్లెను. సముద్రములుపొంగి మిన్నుముట్టెను.

విశే:—నిర్జరులు (వ్యు) జరలేనివారు (దేవతలు) ఆమోదము (నానా) సంతోషము, సువాసన;

35. ఉర్వీనాథా = ఓ పరీక్షిన్మహారాజా! నిడుద+అగు కేలన్ = పొడవైన చేతితో; గజమును = ఏనుగును; మడువున్ వెడలన్+కన్+తివిచి = చెఱువునుండి బయటకి వచ్చునట్లుగా లాగి; మదజలరేఖల్ = మదోదక ధారలను; పుడుకుచున్ = చేతితో నిమురుచు; ఉడిపెన్ = పోగొట్టెను.

తా. విష్ణువు తనపొడవైన చేతితో గజేంద్రుని చెఱువు నుండి బయటకు లాగి దాని మదోదక ధారలను తుడుచుచు,

మెల్లగా దాని శరీరమును నిమురుచు దాని దుఃఖమును పోగొ ట్టెను.

విశే:—విష్ణుఁడు (ప్ర) వెన్నుఁడు (వి); రేఖ (ప్ర) రేక (వి); మనువు (రూ) మడుగు; ఉర్వీనాథుఁడు (వ్యు) భూమికి ప్రభువు (రాజు);

ప్రశ్నోత్తరములు:—

1. గజేంద్రమోక్షమను మీ పాఠ్యభాగ మే గ్రంథము లోనిది? దానిని రచించిన కవిని, కాలమును, వాని యితర గ్రంథములను, బిరుదమును, సమకాలిక కవు లను దెల్పుము?

గజేంద్ర మోక్షము భాగవతము అష్టమస్కంధము లోనిది. దానిని బమ్మెర పోతన రచించెను. అతడు పదునైదవ శతాబ్దమువాఁడు. అతఁడు వీరభద్రవిజయమును భోగినీదండ కమును గూడ రచించెను. అతనికి సహజ పాండిత్యుడను బిరుదు గలదు శ్రీనాథుఁడు, పిల్లలమఱ్ఱిపినవీరభద్రుఁడు వాని సమకాలిక కవులు.

2. భాగవతమను పేరు దానికేల వచ్చెను? సంస్కృతమున నెవరు రచించిరి? భాగవతభాగముల కేమనిపేరు? అట్లననేల? ఆంధ్రభాగవత శైథిల్యముల నెవరు పూరించిరి?

అందలి విషయములు భగవంతునకుసంబంధించిన వగు టచే దానికి భాగవతమను పేరువచ్చెను. సంస్కృతమున

దానిని వ్యాసమహర్షి రచించెను. భాగవత భాగములకు స్కంధములని పేరు. స్కంధ మనఁగా చెట్టుబోదె భక్తుల కోరికలు తీర్చుటలో భాగవతము కల్పవృక్షము వంటిది అను భావము స్ఫురించు నట్లు దలి భాగములకు స్కంధము లని పేరు పెట్టబడెను. ఆంధ్రభాగవతభాగములు కొన్ని శిథిలము కాగా వానిని వెలిగందల నారయ, ఏర్చూరి సింగన, గంగన యను వారు పూరించిరి.

౫౦. గజేంద్రుఁడు దివ్యజ్ఞాన సంపత్తితోఁ బరమేశ్వరు నేమని స్తుతించెను ?

"నే నేయూపంబున మొసలిని జయింతును ? ఎవరిని ధ్యానింతును ? ఎవ్వానిని రక్షింపుమని పిల్తును నా యాపద కెవ్వరడ్డుపడుదురు. ఈ మొసలిని వారింపదగు వారెవ్వరు ? పరోపకార పరాయణు లగు పుణ్యాత్ములు లేరా ? దిక్కు మాలిన మొఱాలింపుమని వేడుకొందును. పెక్కేన్గులు నన్ను గారవించుచునాతోఁ వచ్చుచుండఁగా లక్షలకొలది యాడేన్గులతో గూడి నామదోదకధారలచే పెంపబడుచున్న చందనవృక్షము లయు చందనలతలయు నీడలలో హాయిగా సంచరించునాకు పాడు దాహామేల కల్గెను ! కలిగెనుబో ఏల యీ చెఱువు దగ్గరకు రావలయును ? నా యీ యాపద తొలగుటెట్లో కదా ! ఈ జగ మెవ్వనిచే జనించునో, ఎవ్వని లోపల నుండునో, ఎవ్వని యందు డిందునో, అన్నిటి మూలకారణుం డగు వాడెవ్వఁడో, ఎవ్వఁడాది మధ్యాంతరహితుఁడో, ఎల్లెడల

దానవైన వాడెవ్వడో యా పరమేశ్వరుని శరణంబు వేడెదను” అని గజేంద్రుడు స్తుతించెను ?

*4. గజేంద్రుఁ డీశ్వరసన్నిధానంబు కల్పించుకొని యేమని స్తుతించెను ?

గజేంద్రుఁ డీశ్వర సన్నిధానము కల్పించుకొని యిట్లనెను. నాకు బలము కొంచెమైనను లేదు, ధైర్యము విలోలంబైనది, ప్రాణములు ఠావులు దప్పినవి, శరీరము డస్సెను, మూర్ఛ వచ్చెను. నీవే తప్ప ఇతఃపరం బెఱుగను, ఈదీనుని రక్షింపుము. ఈశ్వర! వరద! భద్రాత్మకా! కాపాడుము. ప్రాణుల మాటలు నీవు వినుదువట! ఎట్టిచోటులకైనను భక్తులను రక్షింపఁ బోవుదువట! పిలిచిన ‘ఓ’యని ప్రత్యుత్తర మిత్తువట! అన్నింటిని చూచు చుందువట! ఏమో? ఇది సందేహమే! అన్నిటిని చూచువాడవు నా బాధను చూడవేమి? ఓకమలాక్షా! ఓవరద! ఓప్రతిపక్ష విపక్షదూర! కవియోగివంద్య సుగుణోత్తమ! ఓశరణాగత కల్పవృక్షమా! ఓ మునీశ్వర మనస్సంచారా? ఓ విమల ప్రభావా! నన్ను రక్షింపుము.

5. గజప్రాణావనోత్సాహియై విష్ణువెట్లు బయలుదేరెను ?

అల వైకుంఠపురములో నంతఃపురములో మూల సౌధ సమీపమున మందారవనాంత సరస్సమీపమున చంద్రకాంతోపల వేదికపై కలువల పాన్పుపై లక్ష్మీదేవితో వినోదించు చున్న విష్ణుడు గజేంద్రుని మొఱవిని లక్ష్మితో చెప్పక,

శంఖచక్రాద్యాయుధములను ధరింపక, దేవ పరివారికి పిలువక, గరుత్మంతునిరా నాజ్ఞాపి పక, చెవ్రువలయ ప్రేలాడు శిరోజములను చక్కచేసికొనక లక్ష్మీదేవితో వాదులాడు చుండునపుడు ప్రణయకలహమున లాగిన యా పైటకొంగును కూడ విడువక మైకుంఠ మిచి గజప్రాణావనోత్సాహియై విష్ణువు బయలు దేరెను.

6. విష్ణుని వెంబడించి పోవుచున్న లక్ష్మి యేమని వితర్కించుకొనెను ?

విష్ణుని వెంబడించి పోవుచున్న లక్ష్మి ''విష్ణువు నెక్కడికి పోవుచున్నాడో చెప్పడు. దిక్కులేని స్త్రీ లెవరైన రక్షింపుమని ప్రార్థింపగా వారి మొఱ విని వారిని రక్షింపం బోవుచున్నాడేమో ? ఏదు ర్మార్గులైన వేదములను దొంగిలించిరో ? లేక క్రూరులగు రాక్షసులు స్వర్గముపై దండెత్తగా నింద్రుని రక్షింపంబోవుచున్నాడో ? లేక దుర్మార్గులెవరైన భక్తులను బాధించి 'ఏడీ ! విష్ణువు ! చూపు' మని బాధ పెట్టుచుండగా వారిని రక్షింపంబోవుచున్నాడో ?'' యని వితర్కించుకొనుచుండెను.

7. శ్రీమహావిష్ణువుచూచిన పంకజాకర మెట్లుండెను ?

శ్రీమహావిష్ణువు చూచిన పంకజాకరము శింశుమార చక్రమునుబోలె గ్రాహ మకర కుళీర మీన మిథునంబై, కిన్నరేంద్రుని నిధివలె స్వచ్ఛవర కచ్ఛపంబై, భాగ్యవంతుని యదృష్టమువలె పరాగజీవనంబై, వైకుంఠమునుంబోలె శంఖ

చక్రకమలాలంకృతంబై, సంసార చక్రంబు... ద్వంద్వ సంకుల పంక సంకీర్ణంబై యుండెను.

8. ప్రకృతులు వికృతులు

| ప్రకృతులు | వికృతులు | ప్రకృతులు | వికృతులు |
|---|---|---|---|
| రాత్రి | రాతిరి | సంధ్య | సంజ |
| వ్యథ | వెత | విష్ణుండు | వెన్నుడు |
| శ్రీ | సిరి | శంఖము | సంకు |
| ద్వయము | దోయి | చక్రవాకము | జక్కవ |
| పంక్తి | బంతి | శుకము | చిలుక |
| మేఘము | మొగిలు | పశ్చాత్ | పజ్జ |
| శుక్రుడు | చుక్క | ఆశ | ఆస |
| స్నానము | తానము | శబ్దము | సద్దు |
| పర్యంకము | పరియంకము | పక్షి | పక్కి |

9. వ్యాకరణాంశములు:

(a) నిడు+ఊర్పు=నిట్టూర్పు —

సూ. కఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల ఱడలకు అచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు.

(b) అడ్డము+పడు=అడ్డపడు.

సూ. పడ్వాదులు పరంబగు నపుడు మువర్ణకంబునకు లోప పూర్ణ బిందువులు విభాషనగు.

(c) మొఱుగు+తీవ=మొఱుగుఁ దీవ.

(1) సూ. సమాసంబులందు ఉదంతంబగు స్త్రీసమంబులకు పుంప్వులకు పరుష సరళములు పరంబగు నపుడు నుగాగమంబగు = మెఱుఁగు+న్+తీవ (2) ద్రుత ప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు = మెఱుఁగు+న్+దీవ (3) ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషస్వత్వాంబులు విభాషనగు.

10. వ్యుత్పత్త్యర్థములు:—

అనేకపము = తొండము, నోరు అను నీ రెండింటి చేతను పానముచేయునది (ఏనుఁగు)

అంబుజాసనుఁడు = పద్మము ఆసనము గాగలవాఁడు (బ్రహ్మ)

అభ్రగము = ఆకాశమున పోవునది (పక్షి)

భుజంగము = కుటిలముగా పోవునది (పాము)

శౌరి = శూరుఁడను రాజవంశమున పుట్టినవాఁడు (విష్ణువు)

నిర్జరులు = జర లేనివారు ( దేవతలు)

మకరము — ప్రాణులను కబళించునప్పుడు ముఖమును విదలించునది. (మొసలి)

సుధాంధసులు = అమృతమే ఆహారముగా గలవారు (దేవతలు)

అంభోజము = నీటినుండి పుట్టునది (పద్మము)

11. నానార్థములు :—

పరికరము = సాధనము; వివేకము.

బింబము=ప్రతిబింబము; దొండపండు.
గురు=పెద్ద; బృహస్పతి.
కచ్ఛపము=తాబేలు; కుబేరుని నిధులలో నొకటి
జీవనము=బ్రతుకు; నీరు.
కమల=లక్ష్మి; పద్మము.
పంకము=బురద; పాపము.

12. సంస్కృత సంధులు:—

సవర్ణదీర్ఘసంధి:—భద్ర+ఆత్మకా = భద్రాత్మకా; శరణ+అర్థి=శరణార్థి; అమర+అనోకహము = అమరానోకహము.

గుణసంధి:—పరమ+ఈశ్వరుడు = పరమేశ్వరుడు; ఉపల+ఉత్పల=ఉపలోత్పల; సుగుణ+ఉత్తరుడు = సుగుణోత్తరుడు; వన్య+ఇభ=వన్యేభ.

విసర్గసంధి:—చతుః + విమానము = చతుర్విమానము; అంభః + స్నానము = అంభస్స్నానము; అంభః + రాశి = అంభోరాశి.

జశ్త్వసంధి:—పటత్+ధమ్మిల్లము; పటద్ధమ్మిల్లము; హృత్+వేగము=హృద్వేగము; సంకోచత్+వలగ్నము = సంకోచద్వలగ్నము.

తుగాగమసంధి:—విస్ఫులింగ+ఛట=విస్ఫులింగచ్ఛట; భాండ+ఛట=భాండచ్ఛట.

13. సమాసపదములను విడదీయుట :—

| వ. నెం. | సమాసపదము | విడదీయుట | విగ్రహము | సమాసముపేరు |
| --- | --- | --- | --- | --- |

1. మిథ్యామనోరథము–మిథ్యా+మనోరథము–మిథ్యయైన మనోరథము–విశేషణపూర్వపదకర్మధారయము.

2. అన్యర్థ–న+వ్యర్థ–వ్యర్థ లేని–నఞ్ తత్పురుషము.

3. ముఖారవిందము–ముఖ+అరవిందము – అరవిందము వంటి ముఖము–ఉపమానోత్తరపదకర్మధారయము.

4. ముఖసరోజము–ముఖ + సరోజము – ముఖమనెడు పద్మము–రూపకము.

5. చక్రాయుధుఁడు–చక్ర+ఆయుధుఁడు–చక్రము ఆయుధముగాఁగలవాఁడు–బహువ్రీహి.

6. హృద్వనము–హృత్ + వనము – హృదయమనెడు వనము–రూపకము.

14. ఈ క్రిందిపద్యములకు దండాన్వయము వ్రాయుము:–

19, 22, 26, 29, 33 పద్యములకు దండాన్వయము.

19. తాటంకాచలనంబుతో......వలగ్నంబుతోన్.

చెవికమ్మలయొక్క కదలికతో, భుజములయందు తిరుగుచున్న కొప్పుముడితో, పైటతొలగిన స్తనములతో, వదులైనందున కదలుచున్న వడ్డాణముతో, చెమటగిన నొసటఁ బెట్టుకొన్న బొట్టుతో, అందమైన చేతియందు చిక్కుకొన్న పైటతో, కోటిచంద్రులను బోలు కాంతితో, కుచముల బరువుచేత మిక్కిలి ముడుచుకొన్న నడుముతో;

22. వినువీధింజను దేర......జిష్ణుకో విష్ణునిన్.

ఆకాశమార్గమునందు, బయలుదేరగా, దేవతలు, రాక్షసులయొక్క, బ్రతుకటయను భాగ్యమును పోగొట్టుటయే స్వభావముగాగలవానిని, శ్రేష్ఠులైన మునులయొక్క మనస్సనెడు ఆరణ్యమునందు సంచరించువానిని, ఓర్పుగలవానిని, ఆశ్రితుల సమూహముయొక్క ప్రభుత్వమును అలంకరించువానిని, క్రొత్తపెండ్లికూతురువలె వెలుంగుచుండు లక్ష్మీదేవి పని కర్తగాగలవానిని, జయించు స్వభావముగలవానిని, ప్రకాశించు స్వభావముగలవానిని, విష్ణుమూర్తిని, చూచిరి.

26. కరుణాసింధుఁడు శౌరి......జక్రమున్.

దయాసముద్రుడగు విష్ణువు, మొసలిని త్రుంచుటకై, వేగముతో కూడినది గనుకనే అదరునట్లుచేయబడిన భూమండలముగలదియు, మిక్కిలిఎగురు మిణుగురులయొక్క గుంపుచే తిరస్కరింపబడిన ఆకాశమందలి చుక్కలుగలదియు, అనేకవిధములైన బ్రహ్మాండములనెడు కుండల సమూహముయొక్క సందులందు ఆటంకములేనిదియు, ధరింపబడిన వేల్పుల యొక్క సమూహముగలదియునగు సుదర్శన చక్రమును ప్రయోగించెను.

29. సువర్ణవచక్రము, బంగారుకొండవంటి శరీరము గలదియు, భయపెట్టబడిన అడవియందుపుట్టిన శ్రేష్ఠమైన యేనుగుల సమూహముగలదియు, కామక్రోధములకిల్లైనదియు, ఏనుగుయొక్క రక్తప్రవాహము

నందుస్నానముచేయుటకలదియు, హద్దులేని ప్రాణిక గలదియు విజయలక్ష్మిని పొందుటయందు మిక్కిలి పట్టుదల గలదియునైన మొసలిని, భయంకరముగా తలద్రుంచి, వేగముతో, ప్రాణములను తీసెను.

విష్ణువు, పాలసముద్రమునందు పుట్టుకగలదియు, గొప్ప ధ్వనిచేత మిక్కిలి ఊపబడిన గొప్పభూతములయొక్క బుద్ధిగలదియు, బలముచే గొప్పదైన తెల్లనైన కాంతిచేత భయపెట్టబడిన దేవేంద్రుడు మొదలగు రాజుల సమూహముగలదియుదూరముగాచేయబడిన, నొచ్చిన వారి దుఃఖము గలదియు, ఎగురగొట్టబడిన శత్రువుల యొక్క సేనలుగలదియునైన పాంచజన్యమను శంఖమును ఊదెను.



# నీతి పద్యములు

సంస్కృతమునసుభాషితరత్నావళి యను గ్రంథము భర్తృహరి యను కవీశ్వరుడు రచించెను దానికే సుభాషిత త్రిశతి యనియు పేరు. అందు మూడు శతకములుగలవు నీతి శృంగార, వైరాగ్య శతకములని వానికి పేర్లు ఈ గ్రంథమును ఎలకూచి బాలసరస్వతి, ఏనుగు లక్ష్మణకవి, పుష్పగిరి తిమ్మన అనువారు వేఱు వేఱుగా తెనిగించిరి అందు లక్ష్మణకవి మనపాఠ్యభాగకర్త. అతడు పదునెనిమిదవ శతాబ్దమున నున్నవాడు. ఇతడు రామేశ్వరమాహాత్మ్యము రామవిలాసము, గీర్వాణసూర్యశతకము, జాహ్నవీమాహాత్మ్యము మొదలగు గ్రంథములను కూడ రచించెను కూచిమంచి తిమ్మకవి, అడిదము సూరకవి వీని సమకాలిక కవులు.

శతక మనగా నూఱుపద్యముల గ్రంథము. నీతి శతకములో 1. మూర్ఖపద్ధతి, 2. విద్వత్పద్ధతి, 3. శౌర్యపద్ధతి 4. అర్థపద్ధతి, 5. దుర్జన పద్ధతి, 6. సుజన పద్ధతి, 7. పరోపకారపద్ధతి 8. ధైర్యపద్ధతి, 9. దైవపద్ధతి, 10. కర్మపద్ధతి యని పది పద్ధతులు గలవు.

## ప్రతిపదార్థములు

1. మకర ముఖ+అంతర+స్థము = మొసలి యొక్క నోటిలో నున్న; మానికమున్ = మణిని; పెకలింపన్ వచ్చున్ =

ఊడఁదీయ వచ్చును; పాయక=విడువక; చలత్+కదలుచున్న (ప్రకాశించు చున్న); ఊర్మికా నికరము+ఐన = కెరటముల యొక్క సమూహముగలదైన; మహా+ఉదధిన్ = గొప్పసముద్రమును; దాటవచ్చున్; మస్తకమునన్ = తలపై; సర్పమున్+ఐనన్ = పామునైనను; పూవుదండవలెన్=పూలమాలవలె; ధరింపవచ్చున్ = తాల్పవచ్చును; మచ్చిక+ఘటియించి= ఆసక్తిచూపి; మూర్ఖజనచిత్తమున్ = తెలిసి తెలియని వారి యొక్క మనస్సునకు; తెల్పన్ = తెలియునట్లు చెప్పుట; ఏరికిన్ = ఎంతటివారికైనను అసాధ్యము=శక్యము గాదు;

తా. తెలిసినవానికి చెప్పవచ్చును. తెలియనివానికి చెప్పవచ్చును తెలిసియు తెలియనివాఁడు మూర్ఖుఁడు. మొసలి యొక్క నోటిలోనున్న రత్నమునూడఁబెఱుకవచ్చును. ఆకాశము నంటు కెరటములతో కూడిన మహాసముద్రమునైనను దాటవచ్చును. మచ్చిక చేసికొని మహాసర్పమునైనను తలపై పూలమాలవలె ధరింపవచ్చును. కాని మూర్ఖునకు తెలియఁజెప్పుటకు బ్రహ్మకైనను శక్యముగాదు.

విశే:—ముఖ+అంతర = ముఖాంతర – సవర్ణదీర్ఘ సంధి; మానికము (వి) మాణిక్యము (ప్ర); చలత్+ఊర్మికా= చలదూర్మికా – జశ్త్వసంధి; సర్పము (ప్ర) సప్పము (వి); మూర్ఖుఁడు (ప్ర) మొఱకు (వి); న+సాధ్యము=అసాధ్యము – నఞ్ తత్పురుషము.

2. గంగాకూలంకష = గంగానది; ఆకాశంబునన్ ఉండి=స్వర్గమునుండి; శంభునిశిరంబున్ = శివునియొక్క శిర స్సును; అందు+ఉండి=శివునితలపై నుండి; శీత+అద్రిన్=హిమ వత్పర్వతమును; సు+శ్లోకంబు+ఐన = ప్రసిద్ధమైన; హిమ+ అద్రిన్ ఉండి = హిమవత్పర్వతమునుండి; భువిన్ = భూమిని; అస్తోక = అల్పముగాని అనగా అధికమైన; అంబోధిన్ = సముద్రమును; పయోధిన్ ఉండి=సముద్రము నుండి; పవన+ అంధః+లోకమున్ = గాలి ఆహారముగాగలవి పాములు; పాముల లోకము నాగలోకము (పాతాళము) చేరెన్; వివేక భ్రష్టసంపాతముల్=వివేకముచేత జాఱిన వారియొక్క (తెలివి మాలినవారు) పాట్లు; పెక్కు-భంగులు = అనేక విధములై యున్నవి.

తా. గంగానది స్వర్గలోకమునుండి శివుని శిరస్సు పైకి, అక్కడ నుండి మంచుకొండ మీదికి, హిమవత్పర్వ తము నుండి భూలోకమునకు, భూమి నుండి సముద్రమునకు, సముద్రము నుండి పాతాళలోకమునకు పోయెను. ఉచ్ఛస్థితి నుండి అధోగతిపాలయ్యెను. తెలివిమాలినవారు క్రమక్రమ ముగా పొందుపాటు లిట్టివేకదా!

విశే:—శీత+అద్రి=శీతాద్రి - సవర్ణదీర్ఘసంధి; శం భుఁడు (వ్యు) సుఖమిచ్చువాఁడు; శివుఁడు; ద్రేయమున వలన కలుగును (శివుఁడు); శ్లోకము - సంస్కృతశ్లోకము; కీర్తి; అంభోధి=నీటికి చోటు (సముద్రము); పవనాంధసులు (వ్యు) గాలి ఆహారముగా గల

వారు (నాగులు); కూలంకష (వృ) ఒడ్డును ఒఱయునది(నది) వివేకభ్రష్టసంపాతములు వెక్కు-భంగులు—

3. అగ్నిన్=నిప్పును; జలములన్=నీటిచేత; చక్కన్ చేయన్ అగున్ = సరిపఱచుటకు వీలగును (ఆర్పవచ్చును) చండ మయూఖునిన్ = తీక్ష్ణ కిరణములు గలవానిని అనగా సూర్యుని; ఛత్రమునన్ = గొడుగుచే (చక్కఁజేయ నగున్) వృషగార్ధభంబులన్=ఎద్దును గాడిదను; దండతాడనంబులన్= కఱ్ఱదెబ్బలచేతను (చక్కఁ జేయనగు); పొల్పు+అగు+మత్త కరి+ఇంద్రమున్=ఒప్పైన మదపుటేనుగును; సృణిన్= అంకుశముచేతను (చక్కఁజేయనగు); పెలగెడు రోగము = వృద్ధి పొందుచున్న రోగమును; ఔషధముచేన్=మందుచే (చక్క-జేయనగు) విషమున్ = విషమును; తగుమంత్ర యుక్తిన్ = తగిన మంత్ర ప్రయోగము చేతను; ఇమ్ములన్ = చక్కగా (చక్కఁజేయనగు) కాని; మూర్ఖుని మూర్ఖతన్ మాన్పన్ వచ్చును+ఏ=మూర్ఖుని తెలివి తక్కువ తనమును మాన్ప శక్యముగాదు.

తా. నిప్పును నీటిచేతను, సూర్యతాపమును గొడుగు చేతను, ఎద్దును గాడిదను కఱ్ఱదెబ్బలచేతను, మదించిన యేను గును అంకుశము చేతను, వృద్ధిపొందుచున్న రోగమును మందు చేతను, విషమును మంత్ర తంత్రముల చేతను వారింపవచ్చును గాని మూర్ఖుని మూర్ఖత నెవ్వరును మాన్పలేరు. ప్రపంచ ములో దేనికైనను మాన్ప నుపాయమున్నది కాని దీనికి మాత్రము లేదని భావము.

విశే:—అగ్ని (ప్ర) అగ్గి(వి); విషము (ప్ర) విసము(వి).

4. గురుముఖ్యుల్ = బృహస్పతి మొదలగువారు; ఏవురు+ఆర్వురు = అయిదారుగురు; శుభ+అంగుల్ = మేలైన శరీరములు గలవారు; ఖేచరుల్ = ఆకాశమందు సంచరించు వారు (శుక్రుఁడు, శని, అంగారకుఁడు, బుధుఁడు, బృహస్పతి మొదలగువారు) కలరుఁ వరవిక్రాంతివిహారి=శ్రేష్ఠమైన పరాక్రమము నందు విహరించు వాడు (మహా పరాక్రమశాలి) వైరంబు+ చేయండు = విరోధింపడు; మస్తకశేషమూర్తి + అగు+ఆ దైత్యుండు=తలమాత్రమే మిగతగాగల ఆకారము గల ఆ రాక్షసుడు (రాహువు); తత్పరత = ఆశక్తితో, భాస్వరులన్ = ప్రకాశమానులైన; భాస్కర యామినీచరులను+ఏ=సూర్య చంద్రులనే; బాధించు చున్నాఁడు

తా. ఆకాశమునందు బృహస్పతి మొదలైన గ్రహము లైదారున్నను పరాక్రమశాలి యగు రాహువు, తనకు తల లేకపోయినను ఆ గ్రహముల జోలికిపోడు. మిక్కిలి ప్రకాశ మానులైన సూర్యచంద్రులనే పట్టుకొని పర్వదినము లందు బాధించు చున్నాడు. మానశౌర్యవంతుడు శక్తి యుడిగియు కూడ గొప్పకార్యములనే చేయునని భావము

విశే:—శుభ+అంగుల్ = శుభాంగుల్ – సవర్ణదీర్ఘ సంధి; ఖేచరులు (వ్యు) ఆకాశమందు సంచరించువారు (దేవతలు); వైరము (ప్ర) వేరము (వి); భాస్కరుడు (వ్యు) కాం

తిని గలుగఁ జేయువాఁడు (సూర్యుఁడు) యామినీచరుఁడు (వ్యు) రాత్రి సంచరించువాఁడు (చంద్రుఁడు).

5. ఒకండు=ఒకానొక మనుష్యుఁడు; చేరి=సమీపించి నెవ్వన్ పడి= దారిద్ర్యము నందుపడి! చిక్కుచున్ = కృశించుచు; చేర+ఎడు=చేరెడు; శాలిధాన్యము+ఏ = యవలనే; కోరుఁ;అతండు=అతఁడే: పిమ్మటన్ అఖంతధన+ఉన్నతుఁడు+ఐ=స్థిరమైన ధనముచేత గొప్పవాఁడై; వసుంధరన్=భూమిని; పూరికిన్ సాటిగాన్ తలచున్ = గడ్డిపరకతో సమానముగా తలచును; భూరిధన+ఆఢ్యుల+చొప్పు = విశేష ధనముతో కూడిన వారిరీతి (మహాధనవంతులు); అనేకము+ఐ=పెక్కువిధములుగలదై; వస్తువులందున్; ఎల్లెడఁ = అంతటను; గౌరవముఁ = గొప్పతనమును (ఆధిక్యమును); లఘుత్వమున్=తేలికదనమును (అల్పత్వమును); కైకొనున్=గ్రహించును.

తా. ఒకానొక మనుష్యుఁడు పేదవడినవాఁడై కృశించి గుప్పెడు యవలను మాత్రమేకోరును. చేరెడు యవ లేవానికి బంగారము. పిమ్మట దారిద్ర్యముపోయి వాడే మహాధనవంతుడైనచో బంగారము నిచ్చు భూమిని కూడ గడ్డిపరకగా చూచును. ఆవిధముగా కలిమిలేములం బట్టి వస్తువుల యందు గౌరవాగౌరవము లేర్పడుచుండును.

వి శే:—న+కుంఠ=అకుంఠ–నఞ్ తత్పురుషము; ధన+ఉన్నతుఁడు=ధనోన్నతుఁడు–గుణసంధి;వసుంధర (వ్యు) బంగా

రమును ధరించునది (భూమి) ధన+ఆఢ్యులు = ధనాఢ్యులు-సవర్ణదీర్ఘసంధి; గౌరవము (ప్ర) గారవము (వి) చేర+ఎడు= చేరెడు-సూ. పరిమాణార్థకంబు నందు 'ఎడు' వర్ణకంబగు. భూరి (నానా) విస్తారము, బంగారము.

6. పరహింసా+అభావంబున్ = ఇతరప్రాణులను హింసించుటయందు కోరిక లేకపోవుట; (2) పరకీయ+విత్తహరణ+అభావంబున్ = ఇతరులధనము నపహరించుటయందు కోరిక లేకపోవుట; (3) సత్యవ్రత+ఆదరమున్ = నిజముచెప్పుట యందు ప్రీతియు (4) దానపరత్వము = దానమునం దాసక్తి (5) అన్యవనిత+ఉదంత+ఉక్తి+మూకత్వమున్=ఇతర స్త్రీల యొక్క, వృత్తాంతములయొక్క, చెప్పుటయందు, మూగతనము వహించుట అనగా పరస్త్రీల ప్రసంగము చేయకుండుట (6) పరతృష్ణా=మిక్కిలి ధనాశయనెడు; ఝర=సెలయేటిని; భంజనంబున్ = నాశనము చేయుటయు అనగా దురాశ లేకుండుట (7) గురుసమ్రత్వంబున్ = గురువులయెడ (పెద్దలయెడ) వినయమును, (8) ప్రాణభృత్ = ప్రాణులయందు; కరుణా= దయగల్గియుండుటతోడి; శాస్త్రసమస్తసత్ విధులు = అన్ని శాస్త్రములందు సమభావముగల మంచిఅనుష్ఠానములు అనగా సర్వశాస్త్రములందు నంగీకరింపబడిన విషయములు; (ఇవి) భద్రప్రాప్తికిన్ మార్గములు = శ్రేయస్సు పొందుటకు మంచి దారులు.

తా. ప్రాణిహింస చేయకుండుట, పరధనముల నపహరింపకుండుట; నిజము పలుకుట, దానమునం దాసక్తి గల్గియుండుట, పరస్త్రీలనుగూర్చి మాట్లాడకుండుట, దురాశ లేకుండుట, గురువులయెడ వినయముగల్గియుండుట; సకలభూతములందు దయ యివి భద్రప్రాప్తికి మార్గములు. ఇవి అన్ని శాస్త్రములంగీకరించిన విషయములే.

వి శే:—వనిత+ఉదంత=వనితోదంత+ఉక్తి = వనితోదంతోక్తి—గుణసంధి; శాస్త్రము (ప్ర) చట్టము (వి) శాస్త్ర సమస్త సద్విధులన్నదొక విషయముగా కలిపిచెప్పుదురు. అట్లు చెప్పరాదు. మూలములో "సామాన్యం సర్వశాస్త్రే ష్వనుపహతవిధిః శ్రేయసామేవ పంథాః" అని యున్నది. పైఁజెప్పిన 6 విషయములు భద్రప్రాప్తికి మార్గములు—ఈ విషయములు అన్ని శాస్త్రములు అంగీకరించునని భావము.

7. తమకార్యంబున్ =తమపనిని; పరిత్యజించియున్ = విడిచిపెట్టియు; పర+అర్థ+ప్రాపకుల్ =ఇతరుల పనులకు ఆధారమగువారు (చేయువారు) సజ్జనుల్ =సత్పురుషులై యున్నారు, ఘటించుచున్ =సమకూర్చుచు (చేసికొనుచు) పర + హిత + అర్థ వ్యాపృతుల్ =ఇతరుల యిష్టమైన పనులను చేయువారు; మధ్యముల్ = రెండవరకము మనుష్యులు; తమకు+ఐ=తమ పనులు నెఱవేఱుటకు; అన్య+హిత+అర్థ + ఘాతుకజనుల్ = ఇతరులయొక్క—ఇష్టమైన పనులను నాశనము చేయు మనుష్యులు; దైత్యుల్ = రాక్షసులు; వృథ+అన్య+అర్థ+భంగము+కావిం

చేయు వారలు = తమకు ప్రయోజనము లేక యితరులకు ప్రయోజనములేక యితరుల కార్యములను నాశనము చేసెడివారు; ఎవ్వరు+ఒ+ఎఱుంగన్ = ఏతరగతికి చెందినవారో తెలిసికొనుటకు; ఏరికిన్ శక్యము+ఏ = ఎవరికైనను తరమా! కాదు.

తా॥ తమ పనులను విడిచిపెట్టి కేవలము పరులకార్యములను సాధించు వారుత్తములు. తమ పనులను నెఱవేర్చుకొనుచు నితరులు పనులుకూడ నెఱవేర్చువారు మధ్యములు. తను పనులు నెఱవేఱుట కితరుల పనులను పాడు చేయువారు అధములు. తమకు ప్రయోజనము లేక యితరులకు ప్రయోజనము లేక యితరుల కార్యములను నాశనముచేయు వారినే తరగతిలో చేర్చవచ్చునో తెలియుట బ్రహ్మకైనను శక్యముగాదు. అనగా వారధమాధములు.

విశే:—కార్యము (ప్ర) కర్జము (వి); సత్+జనులు = సజ్జనులు – శ్చుత్వసంధి – భంగము (ప్ర) బన్నము (వి).

8. హృదయ+వచః+శరీరములన్ = మనస్సు, మాట, శరీరము అనెడు త్రికరణములందును; ఎంతయున్ = మిక్కిలి; పుణ్యసుధా ప్రపూర్ణులు+ఐ = పుణ్యమనెడు అమృతముచేత నిండినవారై అనగా త్రికరణశుద్ధిగా మంచి పనులే చేయుటయందాసక్తిగలవారై; బహుఉపకారములన్ అనేకవిధముల ఉపకారముల చేయుటచే; మూడుజగంబులకున్ = (స్వర్గ, మర్త్య, పాతాళములు) మూడులోకములకు; ముదమున్ = సంతోషమును కూర్చుచు; పదలక = విడువక; సాధు+సద్గుణా

లవంబులు = సజ్జనుల యొక్క మంచి గుణముల యొక్క లేశములు; కొండలు చేసి = కొండలు అంత పెద్దవిగాఁ జేసి; ఉప్పొంగు చున్ = పొంగుచు; మదిని = మనస్సునందు; వికాశయుక్తులు = సంతోషముతో కూడినవారు; అగుమాన్యులు = ఐన సజ్జనులు (పూజ్యులు); ఈ+ధరన్ = ఈభూమి యందు; కొందఱు+ పొల్తురు = కొలదిమంది మాత్రమే యుండెదరు.

తా. త్రికరణశుద్ధిగా సత్కర్మలనే యాచరించుట యందాసక్తి గలవారై, ముల్లోకముల వారిని నిరంతరము పెక్కు ప్రకారములతో సంతోష పెట్టుచు నితరుల గోరంతలు గుణములను కొండంతలుగాఁ జేసి వర్ణించి సంతోషించువారు నగు సత్పురుషులు ప్రపంచములో కొద్దిమంది మాత్రమే యుందురు.

విశే:—హృదయము (ప్ర) ఎద (వి); వచస్+శరీ రము = వచశ్శరీరము - శ్చుత్వసంధి; బహు+ఉపకారము = బహూపకారము - సవర్ణదీర్ఘసంధి; కొందఱు+పొల్తురు = కొందఱువొల్తురు - గసడదవాదేశసంధి; ఈ+ధర = ఇద్ధర - త్రికసంధి; గుణము (ప్ర) గొనము (వి); మూడుజగములు ద్విగుసమాసము;

9. ధరన్ = భూమియందు; ఖర్వాటుఁడు = బట్టతలగల వాఁడు; ఒకండు; సూర్యకర = సూర్యుని కిరణములచేత; సం తప్త = బాగుగా కాల్చబడిన; ప్రధాన+అంగుఁడు + ఐ = తల గలవాఁడై; త్వరతోడన్ = తొందరగా; వడువెత్తి; తాళద్రుమ

+ఛాయన్ = తాటిచెట్టునీడను; చేరెన్; పడి తానున్; కబ్బారావంబుగాన్ = మ్రోతతో కూడినట్లు; తత్ఫలపాతవేగమునన్ = ఆ పండు పడుటవలని వేగముచేత; తత్+శిరమున్ = వాని తలయును; విచ్చెన్ = పగిలెను; ప్రాయిన్ = ప్రాయశముగా (తప్పకుండ) దైవ+ఉపహతుండు = దైవముచే కొట్టబడినవాడు; పోవు కడకున్ = పోవు చోటికి; ఆపదల్ పోవున్ కదా!

తా. ఒకబట్టతలవాఁడు ఎండచే కాలిన తలగలవాఁడై తాటిచెట్టునీడను చేరెను. వెంటనే తాటిపండు పడి వాని తల పగిలెను. దైవబలముచాలనివాఁడెక్కడికిపోయినను ఆపదలు వానివెంటనే పోవుచుండును కదా!

విశే:— ద్రుమ+ఛాయ = ద్రుమచ్ఛాయ - తుగాగమ సంధి; తత్+శిరము = తచ్ఛిరము - ఛత్వసంధి;

10. ఇమ్ములన్ = చక్కఁగా; కర్మక్షితిన్ = కర్మభూమి యైన భారతభూమిలో; పుట్టి; అప్రాజ్ఞతన్ = తెలివితక్కువదనముచే (మందభాగ్యతచే) ఎవ్వఁడు+తపంబుల్ చేయఁడు = ఏమనుష్యుఁడు తపస్సు చేయఁడో; అతఁడు = ఆ మనుష్యుఁడు; చెలువు+ఔ = అందమైన; రత్నఘటంబునన్ = రత్నములతో చేయబడిన కుండయందు; తిలపిణ్యాకమున్ = తెలికపిండిని; సుశ్రీఖండ+ఖండంబులన్ = మంచిమంచి గంధపు కట్టెలతో; వండెన్ (వండువానితో సమానమని భావము—అంత మూర్ఖుఁడన్న మాట) అర్థిన్ = కోరికతో, ఆయగలకు = ఆళ్ళచేఁకి (ఆళ్లు అల్పమైన ధాన్యవిశేషము) సప్తస్కన్న+ఆప్తతుల్ = ఏడాపుల

కప్పురపుటరటిచెట్ల ఆవరణలు (చుట్టుకంచెలు) నిలిపెన్ = నిలుపు మూర్ఖునితో సమానమని భావము. పైడి నాగే ళ్ళన్ = బంగారునాగళ్ళతో; పుడమిదున్నెన్ = భూమి దున్ను మూర్ఖునితో సమానమని భావము.

తా. శాస్త్రమునందు చెప్పబడిన కర్మలకు ఫలమిచ్చు నట్టి కర్మభూమి యైన మన భారతభూమిలో పుట్టి యెవడు తపస్సు చేయడో ఆ మందభాగ్యు డెట్టివాడనగా; రత్నాల కుండలో మంచిగంధపు కట్టెలతో తెలకపిండి వండుకొనునట్టి మూర్ఖునితో సమానుడు. ఆళ్ళచేనికి చుట్టు ఏడాకుల కప్పు రపు టరటిచెట్లను కంచెగా నుపయోగించునంతటిమూర్ఖుడు. జిల్లేడు దూదికొఱకు బంగారు నాగళ్ళతో భూమిని దున్ను నంతటి మూర్ఖుడు. అనగా ఉత్తమ ఫలసాధనమును నీచ ఫలార్థ ముపయోగించుకొను నంతటి మూర్ఖుడు.

వి శే:— రత్నము (ప్ర) రతనము (వి) ఘటము (ప్ర) కడవ (వి).

ప్ర శ్నో త్త ర ము లు:—

1. భర్తృహరి సుభాషితములను తెనిగించిన ముగ్గురు కవులను పేర్కొనుము?

ఎలకూచి బాలసరస్వతి, ఏనుగు లక్ష్మణకవి, పుష్ప గిరి తిమ్మన యను ముగ్గురు కవులు తెనిగించిరి.

2. శతకమననేమి? సుభాషిత త్రిశతిలో గల శతకము లెవ్వి?

శతక మనగా నూఱు పద్యముల గ్రంథము. సుభాషిత త్రిశతిలో నీతి, శృంగార, వైరాగ్య శతకములు గలవు.

3. మీ పాఠ్యభాగమగు నీతిపద్యములు రచించిన కవిని, కాలమును, వాని యితర గ్రంథములను, సమకాలిక కవులను దెల్పుము.

నీతిపద్యములను ఏనుగు లక్ష్మణకవి రచించెను. అతడు పదునెనిమిదవ శతాబ్దమువాడు. రామేశ్వర మహాత్మ్యము, జాహ్నవీ మాహాత్మ్యము, రామవిలాసము మొదలగునవి వాని యితర గ్రంథములు. కూచిమంచి తిమ్మకవి అడిదము సూరకవి వాని సమకాలిక కవులు.

4. "పెక్కు భంగులు వివేకభ్రష్ట సంపాతముల్"—వివేకభ్రష్ట సంపాతము లెట్టివి?

ఆకాశ గంగానది స్వర్గమునుండి శంభుని శిరస్సు మీదికి, శంభుని శిరస్సునుండి మంచుకొండ మీఁదికి, హిమాద్రినుండి భూలోకమునకు, భూలోకమునుండి సముద్రమునకు, సముద్రమునుండి పాతాళ లోకమునకు పోయెను. వివేకము లేనివారి పాట్లిట్టివి.

5. దేనిని దేనిచే చక్కఁజేయనగును? దేనిని చక్కఁజేయరాదు?

నీటిచే నిప్పును, గొడుగుచే నెండను, కఱ్ఱదెబ్బలచే వృషభగార్దభంబులను, అంకుశముచే నేనుఁగును, ఔషధముచే చెలరేగుచున్న రోగమును, మంత్రముచే విషమును చక్కఁజేయ వగును, కాని మూర్ఖుని మూర్ఖతను చక్కఁజేయరాదు.

6. భద్రప్రాప్తి కేవి మార్గములు?

పరులను హింసింప కుండుట (2) పరుల విత్తమును హారింప కుండుట (3) సత్యవ్రతాదరము (4) దానమునందాసక్తి, (5) అన్య స్త్రీప్రసంగము చేయకుండుట (6) దురాశ లేకుండుట (7) గురువుల యెడ వినయము (8) సమస్త ప్రాణులయందు దయ భద్రప్రాప్తికి మార్గములు.

7. సజ్జనులు, మధ్యములు, దైత్యులు, అధమాధములు— ఎట్టివారు?

తమ పనులను విడిచిపెట్టి కేవలము పరుల కార్యములనే చేయువారు సజ్జనులు. తమ పనులు చేసికొనుచు నితరుల కార్యములను నెఱవేర్చువారు మధ్యములు. తమపనులు నెఱవేయుటకు పరుల పనులను నాశనము చేయువారు దైత్యులు. తమకు ప్రయోజనము లేక యితరులకు ప్రయోజనము లేక యితరుల కార్యములను నాశనము చేయువారధమాధములు

8. "కొందఱు వోల్తు రిద్ధరన్"—ఎట్టివారు కొందఱు పోల్తురు?

మనోవాక్కాయములచే మంచికార్యములనే యాచరించుటయందు దాసక్తిగలవారై, ముల్లోకములవారిని పెక్కుపకారములతో సంతోషపెట్టుచు నితరుల గోరంత గుణంబులు కొండంతలుగా చేసి సంతోషించు సత్పురుషులీ ధరను కొందఱు మాత్రమే పోల్తురు.

9. “పోరి దైవోపహతుండు పోవు కడకుం బోవుంగదా యాపదల్”—దీనిని సమర్థింపుము.

బట్టతలగలవాడొకడు ఎండచే కాలిన తలగలవాడై తాటిచెట్టు నీడను చేరెను. వెంటనే తాటిపండు వాని నెత్తిమీద పడి తలపగిలెను. కనుక దైవబలము లేనివాడెక్కడకు పోయినను ఆపదలు వాని వెంటనే పోవును.

10. ఈ కర్మభూమిలో పుట్టి తపంబు చేయనివాడెట్టి వాడు?

ఈ కర్మభూమిలో పుట్టి తపంబుచేయనివాడు మంచి గంధపు కట్టెలతో రత్నఘటమున తెలికపిండి వండునట్టి వాడు, ఆకలిచేతికి ఏడాకుల కప్పురపుటరటిచెట్లను కంచెలుగా నుపయోగించువాడు. జిల్లేడు దూదికై బంగారు నాగళ్ళతో భూమిని దున్నినట్టివాడు.

11. ప్రకృతులు వికృతులు :—

| ప్రకృతులు | వికృతులు | ప్రకృతులు | వికృతులు |
|---|---|---|---|
| మాణిక్యము | మానికము | సర్పము | సప్పము |
| అగ్ని | అగ్గి | విషము | విసము |
| వైరము | వేరము | గర్వము | గరువము |
| కార్యము | కర్జము | భంగము | బన్నము |
| దైవము | దయ్యము | ఘటము | కడవ |

12. వ్యుత్పత్త్యర్థములు :—

కూలంకష=ఒడ్డును ఒరయునది (నది)

ఖేచరులు=ఆకాశమందు సంచరించువారు (దేవతలు)

శంభుఁడు=సుఖము ఎవానివలన కలుగును (శివుఁడు)

పవనాశనులు = గాలియే ఆహారముగా గలవారు (నాగులు)

వసుంధర=బంగారమును ధరించునది (భూమి)

13. సంస్కృత సంధులు :—

సవర్ణదీర్ఘ సంధి:— ముఖ+అంతరము= ముఖాంతరము; శీత+అద్రి=శీతాద్రి; బహు+ఉపకారములు = బహూపకారములు; కరి+ఇంద్రము=కరీంద్రము.

గుణసంధి :— మహా+ఉదధి=మహోదధి; ధన+ఉన్నతుఁడు = ధనోన్నతుఁడు; దైవ+ఉపహతుఁడు = దైవోపహతుఁడు.

జశ్త్వసంధి :— చలత్+ఊర్మిక=చలదూర్మిక.
తుగాగమసంధి:— ద్రుమ+ఛాయ=ద్రుమచ్ఛాయ.
శ్చుత్వసంధి :— సత్+జనులు=సజ్జనులు.
ఛత్వసంధి— తత్+శిరము=తచ్ఛిరము.

14. సమాసపదము విడదీయుట :—

| వ. నెం | సమాసపదము | విడదీయుట | విగ్రహము | సమాసము పేరు |
|---|---|---|---|---|

1. అసాధ్యము—న+సాధ్యము—సాధ్యము కానిది—నఞ్ తత్పురుషము.

2. మత్తకరి—మత్త+కరి—మత్తమైనకరి — విశేషణ పూర్వపదకర్మధారయము.

3. భాస్కరయామినీచరులు — భాస్కర+యామినీచరులు — భాస్కరుఁడును, యామినీచరుఁడును—ద్వంద్వ సమాసము.

4. దైవోపహతుఁడు—దైవ+ఉపహతుఁడు— దైవముచే కొట్టబడినవాఁడు...తృతీయాతత్పురుషము.



## పుస్తక పరిచయము

ఈ పాఠ్యభాగము 'కథలు–గాథలు' అను గ్రంథము లోనిది. దీనిని వేలూరి శివరామశాస్త్రిగారు రచించిరి. రవీంద్రుడు వంగభాషలో రచించిన 'కథా' అను గ్రంథమునకు ఇది తెనుఁగుసేత.

శాస్త్రిగారు సంస్కృతాంధ్రములందు మహాపండితులు. ముక్తాలత యను ప్రబంధమును, మాధవవర్మ యను నాటకమును రచించిరి. పెక్కు కథలు, వ్యాసములు వ్రాసిరి. వీరు శతావధానులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ప్రియ శిష్యులు

## కథాసంగ్రహము

కోసల దేశాధీశ్వరునకు భూమండలములో సమానుఁడైన రాజెవ్వఁడును లేఁడు. అతఁడు దరిద్రులకు పెన్నిధి. ప్రజలందఱకు తండ్రివంటివాఁడు. కాశీరాజతనిఁగూర్చి వినుచు నసూయపడి తనకంటె నెక్కుడువానిగా వానిని లోకులు నుతించువారా యని యభిమానముతో నుడికిపోవుచుండువాఁడు. అతఁడు నాకంటె తక్కువ. అతఁడు మహాదాతయట. అదంతయు కపటపుదానము. అతఁడు దయాహీనుఁడు. ఈ దాతృత్వమంతయు కల్ల. అభిమానముచే ప్రజలు పలుకుదురంతేయని యసూయపడి సైన్యాధిపతిని పిలిచి "ఓయీ!

కోసలుడు దానకర్ణుడట! సైన్యము సిద్ధము చేయుము కత్తిచే బూనుము,''అని యాజ్ఞాపించెను.

కోసలుడు యుద్ధములో ఓడిపోయెను. రాజ్యమువీడి యడవుల పాలయ్యెను. కాశిరాజు సింహాసనమెక్కి యెవడు రాజ్యలక్ష్మిని కాపాడుకోగలడో వాడే రాజయని సభ్యులతో పలికి పరిహాసము చేసినాడు. రాజుమాటలువిని తండ్రివంటి కోసల రాజునుకోల్పోతిమనియు లక్ష్మి బలవంతునే వరించున నియు రాహువు చంద్రునిగూడ మ్రింగునవియు. లక్ష్మి ధర్మాత్ముల ముఖము చూడదనియు మొదలగు పలుకులను ప్రజలు పలుకఁ జొచ్చిరి

కాశీరాజా మాటలువిని కోపించి 'కోసలుం డోడి పోయియు నన్ను కీర్తిలో గెలుచుచున్నాడు. శత్రుశేషముంచ రాదని పెద్దలు చెప్పుదురు. మంత్రివర్యా! ఎవడు కోసలుని పట్టియిచ్చునో వానికి మూడు వేల మాడలు బహుమానమియ్య బడునని చాటింపించు'మని యాజ్ఞాపించెను. రాజదూతలట్లే చాటింపించిరి.

ఒక నాడొక బాటసారి మాసినబట్టతో, రోతగలిగించు వేసముతో నడవులలోఁ ద్రిమ్మరుకోసల దేశనాయకుని సమీపించి "ఓయీ! నాకు కోసలదేశమునకు దారి చూపుమా"యని యడిగెను కోసలపతి వానిమాటలువిని యాపాడు దేశమునకుఁ బోవుటకు నీకేమిపనియని యడిగెను. "నేను కోమటిని వర్తకమునకై దూరదేశమునకుపోగా నా

మోము మాసిపోయినది. నాకనేక బాధలుగల్గినవి. ఏదుఃఖము పెట్టుకొని నేను వాడవాడల ముష్టియెత్తఁగలను? కోసలనాయకుఁడు మహాదాతయని వింటిని.'' అని బాటసారిబడుగు చెప్పెను. ఆపలుకులు కోసలుఁడువిని కన్నీటి నాపుకొని ''పాంథా! చాల దూరమునుండి కష్టములపాలయి వచ్చితివి. నీకోరిక నెఱవేఱు మార్గము చెప్పెదను రమ్ము'' అని వానిని సమాధానపఱచెను.

అది కాశీరాజు సభ. జడలు ధరించినవాఁడు, మాసిన బట్టలవాఁడు, కోల నూఁతగొనుచువాఁ డొకఁడు సభలోనికి రాఁగా రాజు వానినిఁజూచి ''నీదే దేశము? ఎందులకు వచ్చితివి'' అని యడిగెను. అతఁడు ''నేను కోసలదేశనాయకుఁడను నన్ను పట్టుకొని యిచ్చువానికి మూఁడువేల మాడలిచ్చెదనని చాటింపించిరట. ఈకోమటి కడుదీనుఁడు దుఃఖములోనున్నాఁడు. ఆధనము నీకోమటి కిప్పింపు''డని కోరెను.

సభయంతయు నాశ్చర్యపడెను. అందఱికన్నులనుండి బాష్పములు ప్రవహించెను. కాశీరాజు నోటినుండి కొంత సేపటివఱకు మాటరాలేదు. చిట్టచివరకతఁడు నవ్వుచు ''కోసల దేశ నాయకా! నీవు నాకు ఓడిపోయి వచ్చినవానితో సమానుఁడవయ్యు నన్ను గెలువఁగల్గితివి. నిన్ను దానమున జయింప నెంచితిని. కాని నేటియుద్ధములో నేనే చచ్చితిని. నీ సచ్చరిత్రము దేశదేశముల చాటింపించెద. నీ దాతృత్వగుణమునకు మెచ్చితి. సంతోషపూర్వకముగా నీరాజ్యము నీకిచ్చితిని ఏలుకొనుము'' అని వానిని దగ్గరకు తీసికొని సింహాసనముపై

కూర్చుండఁబెట్టి తనచేతితో వానిమస్తకముపై కిరీటముం చెను. ప్రజలంద రానందమున నోలలాడిరి.

ప్రతిపదార్థములు—:

కుంతలంబు లోపలన్ = భూమండలము లో; కోసల+అధిపతికిన్ = కోసలదేశ నాయకునకు; సాటియన్నమాట = సమానమన్న సంగతి; నీటిమూట = వట్టిది; ఇల్లుముల్లె = ఇంటిలోని ధనము (ము. గిటిపాతు)

తా. భూమండలములో కోసలదేశాధిపతితో నెవరును సాటిరారు. అతడు పిన్నవారిని తలిదండ్రులు చూచినట్లు ప్రేమతో చూచును. దరిద్రుల కతడు పెన్నిధి.

2 కాశీపతి = కాశీరాజు; వించున్ = వినుచు; లోకుల్ = ప్రజలు; కోసలున్ = కోసలరాజును; నన్ను మించువానిగన్ = నన్నతిశయించు వానిగ; నుతించువారు+అట+ఏ = పొగడుదురట; మతిన్ = మనసునందు; అభిమానము = ధనాదులచే గలిగెడు గర్వము.

తా. కాశీపతి కోసలరాజు సంగతి వినుచు ఈర్ష్యాపరుడై లోకులు వానిని నుతించుట విని మండిపడును.

వి శే:—కథ (ప్ర) కత (వి) మతి (ప్ర) మది (వి)

3 ఎవ్వని గద్దె = ఎవని సింహాసనము; దయదబ్బర = దయలేదు; ఈవి బొంకు = దానము కల్ల; మనంబునన్ కనిన = మనస్సులో తలఁచుకొనినచో; ఇది+ఎల్లన్ = యిదియం

తయు; కల్ల=అబద్ధము; పేను+అనఁగన్=నాపేరు చెప్పినదరికి; హృదయంబునన్=మనస్సునందు; మచ్చరంబు+సూ=ద్వేషమే సుమా!

తా. అతడు నా సామంతరాజు నాక్రింది వాడు. వాని కంత దానగుణమున్నదా! దయలేదు. దానము లేదు వానికి. అతని పనులన్నియు ఆలోచింపగా నాయెడ గల ద్వేషముచే నట్లు చేయుచుండ వలయును సుమా!

వి శే:—హృదయము (ప్ర) ఎద (వి) మచ్చరము (వి) మాత్సర్యము (ప్ర)

4. కృపాణముల్ పూనుము=కత్తి పట్టుము; పూంచుము=సిద్ధము చేయుము; బళిరే=వహ్వా! దానకర్ణుడు తాను ఆయెన్=అతడు దానకర్ణుడై నాడేమి? వాత్సల్యంబు+ఓ=ప్రేమయో (Ironical expression - నిందా స్తుతి)

తా. సేనాపతీ; కత్తిచేబట్టుము. సైన్యములను సిద్ధపరపుము అతడు దానకర్ణుడైనాడు ఇదంతయు నాపై ప్రేమచేత కాబోలు అనగా నాయెడ ద్వేషముచే నన్నేదో వంచింపవలెనని కాబోలు నీదానము చేయుట.

5. కోల్పడి=హింసించబడి; వీడనాడి=విడిచి; ఆవాసమున్=నివాసమును; పాసి=విడచి; పేరు+అడవి=పెద్దఅడవి; అరసి=చూచి; కాచుకోన్=రక్షించుకొనుటకు; వాసికలాడు+ఓ=ప్రసిద్ధి గలవాడో; దాత్రుతకు=దానమునకు; తగువాడు=అర్హుడు;

తా. కోసలరాజు యుద్ధములో నోడిపోయెను. రాజ్యమును విడిచి యూరు విడిచి యడవుల పాలై పోయెను. కాశీ రాజు వాసిసింహాసన మెక్కి సభ్యులతో నెవడు లక్ష్మిని రక్షించుకో గలడో వాడె దానము చేయుటకు తగినవాడని పరిహాసముగా పలికెను.

వి శే:—పేరు + అడవి = పేరడవి – సూ. కర్మధారయంబునందు పేర్వాది శబ్దములకు అచ్చు పరంబగు నపుడు టుగాగమంబు విభాషనగు. లక్ష్మి (ప్ర) లచ్చి (వి);

6. జేనిమాట = రాజుమాట; దారుణ రాహువు = భయంకరుడైన రాహువు; చందురున్ = చంద్రుని; సిరి = లక్ష్మి; చాలబలియుని = మిక్కిలి బలముగలవాని; బాహువు = భుజము; ధర్మువు మోమున్ = న్యాయముయొక్క ముఖమును కనన్ పోవదు = చూడబోదు; మేము; ఇటు, ఇందు అందులన్; కోల్పడితిమి = పోగొట్టుకొంటిమి; ఒక్క పెట్టునన్ = ఒక్క మాటుగా; ఘోషిలిరి = మొఱపెట్టిరి;

తా. రాజుమాట విని ప్రజలు "రాహువు చంద్రుని గూడ మ్రింగును. లక్ష్మి బలవంతునే యాశ్రయించును. లక్ష్మికి న్యాయము లేదు. మేము తండ్రివంటిరాజును పోగొట్టు కొంటిమి," ఘోషపెట్టిరి.

వి శే:—చందురుఁడు (వి) చంద్రుఁడు (ప్ర).

7. అవ్వారికిన్ = ఆబలియురకు; ఆ అధర్ములకు; ఎరు జగత్ బంధువులు = ఎవరులోక బంధువులో; రిపులు+ఓ =

శత్రువులో; వదనంబు = ముఖము; అరయుచోన్ రాదు = చూడరాదు; బోరన = శీఘ్రముగ; పదిదెసలున్ కూడఁగ = పది దిక్కులయందును; ఘోరు కలంగెన్ = మ్రోగెను.

తా. ఆ అర్థ ప్రదులకు ఎవరుమిత్రులో ఎవరు శత్రువులో వారల ముఖమేచూడరాదని పలుకులు దిక్కులయందు మారుమ్రోగెను.

8. వించున్ = వినుచు; వెసన్ = శీఘ్రముగా;

తా. కాశీరాజు ప్రజలమాటలు విని కోపమును చెందెను ఊరిలో వతనిని గూర్చియే యింతవిచారమేల ? అంత కంటె గొప్పవాడను నేనులేనా ?

9. గెలుచును+ఓటు=గెలుచును కాబోలు (ఓటు - ప్రశ్నమును దెల్పు అవ్యయము); అమాత్యవర్య = మంత్రి శ్రేష్ఠుడా !; శత్రు సేవముల్ = శత్రువులను మిగుల్చుటలు; కూడవు=పనికిరావు; ఘోషిలున్ = మ్రోతవెట్టును; మాడ = అరవరా (బంగారునాణెము)

తా. కోసలరాజు నాచేతిలో నోడిపోయియు కీర్తిలో గెలుచు చున్నాడు. శత్రు సేవ ముంచరాదని శాస్త్రములు ఘోషించు చున్నవి. 'మంత్రిశేఖరా! ఎవరు కోసలాధిపుని పట్టి యిచ్చునో వానికి మూడు వేల మాడలు బహుమానమని చాటింపుము'- అని కాశీరాజాజ్ఞాపించెను.

10. రాట్దూతలు = రాజదూతలు; వేనవేల్గ్రద్ద = వేలకొలది పర్యాయములు.

తా. కోసలాధిపతిని పట్టుకొన్న వానికి మూడు వేల మాడలని పెక్కుసారులు రాజమాత్యులు చాటించిరి.

11. మాసిన చీరతోడన్=మాసినవస్త్రముతో; కసుమాలము+వేసము తోడన్ = రోత కలిగించు వేషముతో; కానన+ఆవాసము అందున్=అరణ్యప్రదేశమునందు; క్రుమ్మరిలు=సంచరించు; డాసి=సమీపించి; వనవాసీ= అరణ్యకుడా (అడవి యందు నివసించువాడా); వచింపుము+ఏ=చెప్పుమా!

తా. ఒకనాడొక బాటసారి మాసినబట్టతో రోత కలిగించు వేషముతో నున్న కోసలరాజును సమీపించి నాకు కోసల పట్టణమునకు దారి చూపుమా' యని యడిగెను.

విశే:— కసుమాలము+వేసము=కసుమాలపు వేసము సూ. కర్మధారయమందు మువర్ణకంబునకు పుంపులగు; కసుమాలము (వి); కశ్మలము (ప్ర); వేసము (వి) వేషము (ప్ర) కాననము (ప్ర) కాన (వి).

12. కోసల జనపతీ=కోసలరాజు; అనఘా=పాపరహితుడా!; పొసగినది=కలిగినది;

తా. కోసలరాజు, అది పాడు దేశము. అక్కడికి పోవ నీకేమి పనిగలిగినది యని యడిగెను.

13. వారిధిన్ =సముద్రమునందు; బాములన్ =దుఃఖములందు (కష్టములు) వాడవాడన్=ఊరూర; కోసలస్వామి = కోసలరాజు; మహావదాన్యుడు=గొప్పదాత;

తా. నేమకోమటిని. వ ర్తకమునకై దూర దేశమునకు సము ద్రముపై ప్రయాణము చేయుచుండ నా నౌకా మునిగి పోయినది. చాల కష్టములు పడినాను. సమ స్తముపోయినది. నే నేమొుగము పెట్టుకొని యూహూర ముష్టియెత్తుదును ? కోసలరాజు మహాదాత యని యింటింట చెప్పుకొనగా విని నిది, అందుచే నక్కడకు పోవనుంటిని.

14 రాకొమరుండు=రాజకుమారుడు; చిరునగవు = చిరునవ్వు; ఒదరగన్ =ప్రకాశింపగా; అంగి=ఆపుకొని; నిట్టూర్చుచున్ =నిట్టూర్పువిడుచుచు;

తా. కోసలరాజకుమారుడు మందహాసముచేసి పొరలి వచ్చు కన్నీటినాపుకొని మనస్సులోనేదో ఆలోచించుకొని నిట్టూర్పువిడిచి యతనితో నిట్లనెను.

వి శే:—కొమరుడు (వి) కుమారుడు (ప్ర) నిడు + ఊర్పు=నిట్టూర్పు–సూ. కు, అు, రు....ద్విరు క్త టకారంబగు.

15. శోకంబు=విచారము; క్రమ్ముకొనగాన్ = చుట్టవేయగా; వ్యాకులము+పడి=కలతపొంది, పాంథా=బాటసారీ; దవ్వునన్ వుండి = దూరమునుండి; నిక్కముగాన్ = నిజముగా; దానిదారి=కోరిక నెఱవేఱుమార్గము.

వి శే:—వ్యాకులము+పడి=వ్యాకులపడి–పడ్వాదిసంధి; దవు (రూ) దవ్వు;

16. సభ+అంతరాళమునన్ = సభలో; పొల్చెన్ = ప్రకాశించెను; జటారాశిన్ = జడలసమూహమును; ఱేఁడు = రాజు; ఏ+అది = ఏది; అధీశుండన్ = ప్రభువును; అల్ల బేహారికిన్ = ఈకోమటికి;

తా. జడలుధరించిన వనవాసి యొకఁడు కాశీరాజు సభలోనికి వచ్చెను. నీవెవరవు? ఏ దేశము? ఏలవచ్చితివని కాశీరాజా వనవాసినడిగెను. వనవాసి వానినిదీవించి నేను కోసలరాజును, నన్ను పట్టుకొనుటకు నిచ్చెదనని చాటింపించిన మాటను నేలమాడలీ కోమటి కిప్పింపుమని కాశీరాజునుకోరెను.

విశే:— సభ+అంతరాళము = సభాంతరాళము - సవర్ణదీర్ఘసంధి; రాశి (ప్ర) రాసి (వి); బేహారి (వి) వ్యవహారి(ప్ర)

17. అంగజాలెల+కన్నులన్ = అంగరక్షకులు (లేక) రాజభటుల కన్నులనుండి; అశ్రులు = కన్నీరు; ఉబికెన్ = పొంగెను; ఎట్టకేలకున్ = చిట్టచివరకు.

తా. అందఱకు పరమాశ్చర్య మయ్యెను. రాజభటుల కన్నుల నుండి నీరుకాఱెను. కాశీరాజు నోటినుండి మాట రాలేదు. చిట్టచివరకు కాశీరాజు నవ్వుచు వానితో నిట్లనెను.

18. సత్ చరితంబు = మంచిప్రవర్తన; చాతురిన్ = నేర్పును; నేటి ఆజిలోన్ = నేటి యుద్ధములో (దానము నందతనిని గెలువ వలయునని యుద్ధముచేసినాఁడు. కాశీరాజు గెలువలేక పోయినాఁడు. నేటిది దానయుద్ధము); యశము = కీర్తి; క్రమ్మరన్ = తిరిగి; మనస్సు ఇచ్చితిని = ప్రేమించితిని;

తా॥ నీసచ్చరిత్రము నన్ను జయించినది. నీవోడిపోయినను నన్ను గెలిచితివి నీకీర్తి నల్దెసల వ్యాపించెను. నేటి దానయుద్ధమునందు నే నోడిపోయితిని. నీదాతృత్వమునకు మెచ్చితిని. నీరాజ్యము నీకిచ్చితిని. ఇక రాజ్యమేలు కొమ్ము కోసలరాజా ?

విశే:—యశము (ప్ర) జసము (వి)

13. చినుగుపాతలవసనాసిన్ = చినిగిపోయినబట్టలు కట్టుకొనినమునిని; ముత్యాలగద్దె = రత్నాలసింహాసనము; మలినశిరమునన్ = మురికియైనకోసలరాజుతలపై; తనచేతన్ = అతనిచేతితో; ముకుటము + ఉంచెన్ = కిరీటము పెట్టెను; ధన్యవాదములు = కృతజ్ఞతనుసూచించుమాటలు; బోరుకలగెన్ = మారుమ్రోగెను;

తా॥ చినిగినబట్టలు, మాసినశరీరమునుగల ఆకోసల రాజును కాశీరాజు రత్నసింహాసనమునకూర్చుండబెట్టి వాని తలపై తనసొంతచేతితో కిరీటమును పెట్టెను. పురజనులు ధన్యవాదములుపలికిరి.

విశే:—పాత (వి) వస్త్రము (ప్ర) ముత్యము+లు= ముత్యాలు—సూ॥ లు, ల నలుపరంబగునపుడు ఒకానొకచో మువర్ణమునకు లోపంబును, తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు, ముత్యము (వి) ముక్తా (ప్ర)

## ప్రశ్నోత్తరములు:—

1. కోసలరాజెట్టివాఁడు ?

భూమండలములో కోసలరాజునకు దానమునం దెవ్వరు సాటిరారు. ప్రజలను తలిదండ్రులవలె పోషించును. దరిద్రుల కతఁడు పెన్నిధి దయకుచోటు. ఎన్నడబద్ధమాడడు అతఁడు దానకర్ణుఁడు.

2. కోసలరాజునెడ మాత్సర్యమున కాశీరాజేమిచేసెను ?

కోసలరాజు మంచిగుణములను ప్రజలు పొగడగా వాని సహింపలేక ఆకస్మికముగా నాతనిపై దండెత్తెను వానిని యుద్ధమునవోడించెను. కట్టుబట్టలతో నడవులపాలుచేసెను. అతని దానగుణమును పరిహసించెను అదిచాలక శత్రుశేష ముంచకూడదని వానిని పట్టియిచ్చువానికి మూఁడువేల మాడలు బహుమానమిచ్చెదనని యూరూరఁ జాటించెను.

3. కోసలరాజు దాతృత్వమెట్టిది ?

కాశీరాజు కోసలరాజుపై దండెత్తి వానినోడించి యడవులకుఁ దఱిమెను. మాసినబట్టలతో కసుమాలపు వేసముతో కోసలరాజు వనవాసియై కాలక్షేపము చేయుచుండెను. అట్లైనను కాశీరాజు వానిపై గలద్వేషముచే శత్రుశేషముంచరాదని కోసలునిపట్టియిచ్చినవానికి మూఁడువేల మాడలు బహుమానమిచ్చెదనని కాశీరాజు చాటింపించెను ఆసంగతి కోసలునకు తెలిసినది కాని యతడు స్థిరప్రజ్ఞుఁడై యుండెను.

ఒకకోమటి యోడవర్తకము చేసి కాలవశమున వాని యోడ సముద్రములో మునిగిపోగా పలుబాములుపడి కోసలున్న వనములోనుండి పోవుచు మహాదాతయగు కోసలునాశ్రయింపి తన దారిద్ర్యమును పోగొట్టుకొనదలంచి వనవాసిగానున్న కోసలునే కోసలదేశమునకు దారియేదియని యడిగెను. నీవా యూరికి వెళ్ళుటకు కారణమేమియని యడుగగా కోమటి తన వృత్తాంతము నావనవాసితో చెప్పెను. వనవాసి తనస్థితికి విచారించి తటాలున కాశీరాజు చాటింపు జ్ఞప్తికి తెచ్చుకొని వానికోరిక నెఱవేఱుదారి చెప్పెదను రమ్మని కోమటిని కాశీరాజుసభలోనికి తీసికొనిపోయి "అయ్యా! నేను కోసలాధీశుడను. నన్ను పట్టుకొన్నవారికి మూడువేలమాడలిచ్చెదనని చాటించితిరట. ఆధన మీకోమటికిం"డని పలికెను. కోసలుని దాతృత్వమునకందరాశ్చర్యపడిరి.

4.

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| కథ | కత | మతి | మది |
| మాత్సర్యము | మచ్చరము | దిశ | దెస |
| శాస్త్రము | చట్టము | కశ్మలము | కసుమాలము |
| వేషము | వేసము | వ్యవహారి | బేహారి |
| ఆశ్చర్యము | అచ్చెరువు | యశము | అసము |
| వస్త్రము | పాత | ముక్తా | ముత్యము |

౯. వ్యాకరణాంశములు: —

(a) పేరు + అడవి = పేరుటడవి — సూ. కర్మధారయంబునందు పేరాదిశబ్దముల ఉకారమునకు అచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు.

(b) కసుమాలము + వేసము = కసుమాలపు వేసము సూ. కర్మధారయమునందు మువర్ణకమునకు పుంపులగు

(c) నిడు + ఊర్పు = నిట్టూర్పు సూ. కఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల అడలకు అచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు.

(d) వ్యాకులము + పడు = వ్యాకులపడు — సూ. పడ్వాదులు పరంబగునపుడు మువర్ణమునకు లోపపూర్ణబిందువులు విభాషనగు.

(e) ముత్యము + లు = ముత్యాలు — సూ. లు, ల, నలు పరంబగునపుడు మువర్ణమునకు లోపంబును తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు

6. సభ + అంతరాళము = సభాంతరాళము — సవర్ణదీర్ఘసంధి; జగత్ + బాంధుడు = జగద్బాంధుడు; రాట్ + దూత = రాడ్దూత — జశ్త్వసంధి;

రాడ్దూత ... షష్ఠీతత్పురుషము; మహావదాన్యుడు — విశేషణ పూర్వపదకర్మధారయము;

[27]

# భరతుడు రాముని ప్రార్థించుట

కంబనుకవి తమిళభాషలో రామాయణమును రచించెను వాల్మీకి సంస్కృతములో రామాయణమును వ్రాసెను, కంబుడు వాల్మీకి రామాయణములోని కథను మాత్రమే తీసికొని స్వతంత్ర కావ్యముగా వ్రాసెను ఇది తమిళములో చాల ప్రసిద్ధి కెక్కినది కంబుడు రాజరాజనరేంద్రుని మనుమడగు మానవకులోత్తుంగ చోళుని యాస్థానమున నుండెనని చెప్పెదరు.

కంబరామాయణమును పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారాంధ్రీకరించిరి వీరు చిత్తూరుమండలవాసులు కాళిదాసు కుమారసంభవమును కూడ తెనిగించిరి. అనేకగ్రంథము లింకను తెనిగించిరి. తమిళము, ఆంధ్రము, సంస్కృతమునందు మూడుభాషల యందు గొప్ప పండితులు.

## కథాసంగ్రహము

భరతుండు మునివేషధరుండై రాజులు, రాజబంధువులు మునులుబలసి కొలువగా శ్రీరామచంద్రుని నయోధ్యకురమ్మని ప్రార్థింప వచ్చెను. రాముడు భరతుని జూచి "వత్స! తండ్రి స్వర్గస్థుడైనాడు. వారి యాజ్ఞానుసారముగ రాజ్యము నీదె కిరీటము ధరించి రాజ్యమేలక యిట్లు తాపసి వేషము పూన న్యాయమా?" అని పల్కెను

భరతుఁ డామాటలు విని "అన్నా! నీవరణ్యములో నుండగా పురములో ధర్మాత్ము లెవ రున్నారు? ధర్మదేవత నీతోడనే వచ్చి వేసినది. నిన్ను తీసికొని పోవుటకే వచ్చితిని నా కిష్టములేని వరమడిగి భర్తనుచంపిన పాపిష్ఠురాలగు కైక కుమారుడనైన నాకీ వేషమే తగినది. పాపాత్ముడను గను కనే చత్తమన్నను తెగింపులేదు. ప్రాణములందు తీపిపోలేదు తపస్సుచేసి నిందపోగొట్టుకొన యత్నింతును. వంశ మర్యాద తప్పిన స్త్రీగుణము, ఓర్పులేని తపము, దయలేని ధర్మము, పూర్వవంశపద్ధతులను విడిచిన పరిపాలనము వీనివలన ప్రయోజనమేమి? రాజ్యము నీసొంతము. నీజన్మంపుహక్కు సనాతన కులధర్మము విడువరాదు, విడిచి యడవులలో నుండెదనని నీ వందువేని నీతమ్ముడనైన నేను అధర్మముగా నన్యాయముగా రాజ్య మేలుదునా? ప్రియమైన తండ్రిమరణింప, నీవు కాఱడవుల సంచరింప నీ రాజ్యము నపహరించి సుఖముగా నేలుకొనుటకు నేను నీకంతగర్భ శత్రువనా? తండ్రిచేసిన తప్పిదము, తల్లిచేసిన కీడు లోకములో వ్యాప్తి పొందకుండ వచ్చి రాజ్యమేలుకొ"మ్మని ప్రార్థించెను.

రాముడు భరతుని మాటలు విని "తమ్ముడా! ధర్మమతి సూక్ష్మమైనది. శీలము, సత్యము, న్యాయము, స్నేహము నీతి, గౌరవము మొదలగునవి రాజులశాసనంబులకు కట్టుబడి యుండును. మంచిశాస్త్రములు వినుటకు మంచిబుద్ధి గడించుటకు మంచిశీల మలవఱచు కొనుటకు, మంచిపనులు చేయు

టకు, భగవంతుని ప్రార్థించుటకు ఈ మొదలగు మంచి పను లకు పెద్దతే కదా! మార్గదర్శకులు. ఆ మహాత్ము లెవరో కాను తలిదండ్రులే. అట్టి తలిదండ్రుల యాజ్ఞ తీసికొని వంశ మర్యాదతో దానిని సమ్మతించి యడవులకు వచ్చితివి నీవు రమ్మని ప్రార్థించి నంతమాత్రమున వచ్చుట ధర్మ మగునా? కొడుకులు తలిదండ్రులకు కీర్తిసంపాదించి పెట్టుటకా పాపము ఘటించి వారిని నిందలపాలు చేయుటకా! నీవే చెప్పుము. దురాశచేత నేను రాజ్యమును స్వీకరించితినేని తండ్రిని అసత్య వాదిగా చేసినవాడను కానా! అసత్యవాది రౌరవాదినరకము లలో పడఁడా? తండ్రి నరకబాధ లనుభవించుచుండ కొడుకు ఇహలోక సుఖము లనుభవించుచుండ నగునా? ఇహలోక సౌఖ్యములు స్థిరములు కావు గదా! తండ్రి యాజ్ఞప్రకారము రాజ్యమునీదే యగుచు. నీకును రాజ్యము చేయు శక్తియున్నది కనుక మారుమాటాడక భేదబుద్ధిలేక జనులు సంతసించు నట్లుగా రాజ్య మేలుకొను"మని సమాధాన పఱచెను.

1. కడవఁగాన్ = అతిక్రమింపగా; అవనీపతులు = రాజులు; బలసియుండఁగన్ = చుట్టియుండగా; చెంతనె = సమీప మునసె; వత్స = నాయనా!; జనకుడు = తండ్రి; అవ్యయపదంబు నకు = నశింపని స్థానమునకు అనగా స్వర్గమునకు; మకుటంబు = కిరీటము; మహిన్ = భూమిని; ఈలీలన్ = ఈవిధముగా, ఊనన్ తగును+ఎ = ధరింప న్యాయమా?; అనుడున్ = అనిపల్కగా; కాఱు+అడవులఁ = దట్టమైన అడవులలో; పాడి = న్యాయము,

పడసి = పొంది; కొంపోవంగన్ = తీసికొని పోవుటకు; పూని నాడన్ = ప్రయత్నించినాడను;

తా. రాజులు, రాజబంధువులు, మునులుసేవించి యుండగా భరతుండు మునివేషమున శ్రీరామచంద్రునిదగ్గరకు వచ్చెను రాముడు వానినిచూచి "ఇంద్రిస్వర్గమునకేగినాడు. వారియాజ్ఞానుసారముగా రాజ్యమునీదె కిరీటము ధరించి నీవురాజ్యమేలుము నీకిట్టిమునివేషముతాల్పరా" దని పలికెను దానికి భరతుడు "నీవు కాఉడవులనుండగా పురములో ధర్మమనుమాటయేలేదు. ధర్మదేవత నీకంటెముందె యీ వనముచేరినది. నిన్ను పట్టణములోనికి తీసికొనిపోవుటకే వచ్చితి"నని పలికెను

విశే:— ఆజ్ఞ (ప్ర) ఆన (వి) తపసి (ప్ర) తబిసి (వి)

2. మనసుసమ్మతింపని = ఇష్టములేని; పట్టిన్ = కుమారుడను; ఉచితము = తగినది; అన్యంబు = ఇతరము;

తా. నా కిష్టములేనివరమడిగి, నిన్ను తగనిస్థితిలో పెట్టి, భరతునుచంపినట్టి కైకేయికుమారుడనగు నాకీవేషమే కాని మరియొకవేషముతగదు.

3. జగములు = లోకములు; సంతపింపన్ = మిక్కిలి బాధపడగా; బలుజాలినిన్ = ఎక్కువదుఃఖమును; ఇంబుగన్ = చక్కగా; జనియించు = పుట్టు; పూర్ణుండన్ = నిండినవాడను; తెగువయున్ = సాహసమును; ఒడలితీపియున్ = శరీరమునందలి తియ్యదనము (ప్రాణములతీపి) తెగడిక = నిందనుండి; కడతేఱదన్ = కృతార్థుడనయ్యెదను;

తా. లోకములన్నింటికి దుఃఖమును కలిగించు పాపాత్మురాలగు కైకకు పుట్టినమహాపాపిని. చత్తునన్న సాహసము లేదు. ప్రాణములవిడిచిపోలేను. తపముచేసినిందనుండితప్పించుకొని కృతార్థుడనయ్యెద అందులకే యీతపసివేషము. నన్ననుగ్రహింపుము.

విశే:— దుష్ట+ఆలు= దుష్టురాలు — సూ. కర్మధారయమునందు తత్సమంబులకు ఆలుశబ్దము పరంబగునపుడు అత్వంబునకు ఉత్వంబును, రుగాగమంబునగు.

4. కొలముపాడి=వంశమర్యాద; సతి=స్త్రీ; పరగక ఉండు=ప్రకాశింపకుండు; కరుణవిడిచిన=దయవిడిచిన; ఏఁగు పాలనము = నశించుపరిపాలన; మేలుఅయిప్రకాలున్ ఏమి= మంచివై ప్రకాశించునా ? మంచివికావనిభావము

తా. వంశమర్యాదవిడిచిన స్త్రీగుణము, ఓర్పులేని తపస్సు, దయలేనిధర్మము, పూర్వవంశపద్ధతులను పాటింపని పరిపాలనమంచివికావు.

విశే:— కొలము (వి) కులము (ప్ర) వంశము (ప్ర) వంగడము (వి)

5. జననముతోడన్=పుట్టుకతోడనే; స్వామ్యము= సొంతహక్కు; సనాతనకులధర్మము=శాశ్వతమైనవంశధర్మము అను+ఎడన్=అనునప్పుడు అనగా అనియందు లేనియనిభావము నయము+ఆఱిచి=నీతినశింపజేసి; వరించి=కోరి;

తా. రాజ్యము సేయుట నీసొంతహక్కు. పెద్దవాడు రాజ్యమేలుటయే సనాతనధర్మము పూర్వధర్మమువిడిచి మునివేషమేలవేసితివని యడుగుదువేని నీకుతమ్ముడనైన నేను నీతిదాలంగి ధర్మమునునాశనముచేసి రాజ్యమును క్రూరులవారివలె నేను చరించుటన్యాయమా ?

6 మేర+ఇడన్ కన్ రాని = హద్దుపెట్టరాని; పెనుమేలిమి=మిక్కిలి గౌరవముగల; కూరిమి=ప్రియమైన; మెక్కుచున్=తినుచు; వేఱిమి=భేదముతో; వంచనము=మోసము; ధరాస్థలిన్=భూప్రదేశమును; కవ్వికొంటకున్=అపహరించుటకు (కబళించుటకు); పేరిమి=గౌరవము: పేరిచి=విజృంభించి; అంచుకొనంగన్=అపహరించుటకు; వైరిని+ఏ=శత్రువునా!;

తా. గౌరవనీయుడు ప్రేమాస్పదుడగు తండ్రి మరణింపగా, అడవులలోపడి నీవు కందమూలఫలములు తినుచు కాలక్షేపము చేయు చుండగా నీ రాజ్యమును నేను కబళించి రాజ్యము చేయుటకు నేను నీపరమ శత్రువనా ?

7. భువన+అధీశ్వర=రాజా!; ఘోరపున్+ఘోరామి = భేదపు టిక్కట్టు; లోకాలకున్ = ప్రజలకు (లోకములకు); తవులన్ చేసిన=కలిగించిన, భువిన్ చెందన్ రాక=లోకమున వ్యాపింపకుండ; ప్రాభవ సామ్రాజ్యమున్ = దొరతనపు రాజ్యము; భవ్యంబులన్ = శుభములను; భవబంధంబులు = సంసారబంధములు; డిందన్=అణగునట్లు;

తా. రాజా! లోకములకు మేలుకలుగునట్లుగా; మా సంసారబంధము లణగునట్లుగా, రాజ్యమునేలి తండ్రి చేసిన ఛేదము, కైకచేసిన కీడులోకములందు వ్యాపింపకుండ చేసి రక్షింపుము.

వి శే:—లోకము+లు=లోకాలు - సూ. లు, ల, న, లు......విభాషగను;

8. ఈక్షించి=చూచి; ఒండు=ఒకటి; ధర్మసూక్ష్మము =సూక్ష్మమైన ధర్మము;

తా. రాముడు భరతునితో "నాయనా! ధర్మ సూక్ష్మము తెలిసికొనుము" అని పలికెను.

9. సద్గుణ+ఆకరా=మంచిగుణములకుచోటైనవాడా!; శీలమున్=స్వభావము; తగవు=న్యాయము; చెల్మియున్ = స్నేహము; వాంఛ నీయము+ఔ+మేలిమియున్= కోరదగిన గౌరవమును; మున్నుగాన్ =మొదలుగా; సత్ పథవృత్తులు+ ఎల్లన్=మంచి మార్గపు వ్యాపారము లన్నియు; భూపాలుర శాసనంబులకున్=రాజుల ఆజ్ఞలకు; బద్ధములు+ఐ=కట్టుబడి నవై; లీలన్=విధమును; పరిలించి=భద్రపఱచి;

తా. శీలము, సత్యము, తగవు, చెలిమి, నీతి, గౌరవము మొదలగు మంచి పద్ధతులు రాజుల శాసనంబులకు కట్టుబడి యుండునని నీ మనస్సులో దలంపుము.

10. చిత్తము=మనస్సు; సత్తమ=శ్రేష్ఠమైన;

తా. మంచిశాస్త్రములు వినుటకు, మంచిబుద్ధి సంపాదించుటకు, మంచిశీల మలవఱచు కొనుటకు, మంచి పనులు

చేయుటకు, భగవంతుని ధ్యానించుటకు పెద్దలే కదా! మార్గ దర్శకులు.

11 ఆమహాత్ములు =ఆ ఆదర్శక పురుషులు (గొప్ప ఆత్మగలవారు) అడుగన్ + వలతు+ఎ=అడుగగోరదవేని; ధరణీ=భూమి;

తా. స్వచ్ఛమైననడవడిగలవాడా! ఆ ఆదర్శకపురుష లెవరోకాదు తల్లిదండ్రులే.

వి శే:—విధము (ప్ర) వితము (వి) తల్లి+తండ్రి=తల్లి దండ్రులు—సూ. ద్వంద్వంబునం బదంబుపై పరుషములకు గ, స, డ, ద, వలగు;

12. వైశారద్యమున్ =పాండిత్యమును (నేర్పు) పావన చారిత్రక=పవిత్రమైననడవడి గలవాఁడా! సంభావ్య=పొగడ దగిన; అన్వయ=వంశముయొక్క; ఔచిత్యభావనతోన్= ఉచితత్వము తెలిసికొను అభిప్రాయముతో; మదిన్=మనస్సు నందు; పాటింపఁగన్ లేదే=లెక్కింపవలదా ?

తా. సమస్తశాస్త్రములలోని మర్మములను తెలిసిన సత్ప్రవర్తకుడవునీవు. తండ్రియాజ్ఞ తీసికొని మనవంశమర్యాద పాటించి నే నీ యడవులకువచ్చితిని. నీవు వేడిజివికదా యని యీ ధర్మమునువిడిచిన మంచిదగునా? నీవే మనస్సులో ఆలో చించుకొనుము.

వి శే:—అభ్యాసము (ప్ర) అబ్బెసము (వి)

13. సుజనసన్నుతచరితా= సజ్జనులచే పొగడదగిన నడవడికలవాఁడా! జనియించినఫలము= పుట్టినందుకుప్రయో

జనము; తనయులు=కొమాళ్ళు; అఘంబులగు = పాపమును గూర్చు; పెరుచుటకున్+ఒ=పెంపుచేయుటకో; నీవు+అ=నీవే;

తా॥ కొడుకులుపుట్టినందుకు ఫలము తలిదండ్రులకు కీర్తి తెచ్చుటకో పాపమునాపాదించుటకో నీవే చెప్పుము,

14. ఏను=నేను; దురాశచేన్=పేరాసచే; ఈభవమందునన్=ఈజన్మమున; కల్లరిగాన్ పూనిచి=అబద్ధమాడు వానిగా చేసి; కుభిల్లునన్=తటాలున; రౌరవంబునన్ద్రోచి=రౌరవమనునరకమునద్రోసి; వినోద, సౌఖ్య, సంధానక, రాజ్యభోగములన్ = వేడుకలను, సుఖములను, కూర్పు, రాజ్యమువలనిభోగములను; తాల్మిని=ఓర్పుతో; రహింపన్ నేర్తును+ఏ= ప్రకాశింపగలనా? ఇహమాత్రసుఖంబులు= ఈలోకపు కొలదిసౌఖ్యములు; (తుచ్ఛసుఖములనిభావము) సుస్థిరంబులు+ఏ=మిక్కిలి శాశ్వతములుగానుండునవియా! కావు.

తా॥ రాజ్యకాంక్షచే తండ్రివాక్యమును పాలింపక ఆమహాత్ముని అసత్యవాదిగాచేసి రౌరవాదినరకముల పాల్పఱచి నేను రాజ్యభోగములలో నోలలాడుదునా? ఈలోకములోని సుఖములు అస్థిరములేకదా!

విశే:—సుఖము (ప్ర) సుకము (వి) స్థిరము (ప్ర) తిరము (వి)

15. ధరిత్రి=భూమి; సత్త్వమున్ = బలమును; పొరసిన=పొందిన; ప్రభుత్వము+అర్హత = పరిపాలించుటకు యోగ్యత; అరమరలు=సందేహములు;

తా. సత్యవాక్య ధురంధరుడైన తండ్రి ఆజ్ఞచేతను రాజ్యమునీదె, పరిపాలించుటకు తగిన బలము నీ కున్నది, ఆకారణముచేతను రాజ్యమునీదె కనుక సందేహింపక ప్రజలకు సంతోషము కలుగునట్లుగా రాజ్యమేలుము.

విశే:—సత్యము (ప్ర) సత్తు (వి) ప్రభుత్వము+అర్హిత=ప్రభుత్వపుటర్హత — సూ. కర్మధారయమునందు మువర్ణమునకు పుంపులగు = ప్రభుత్వపు+అర్హత (2) కర్మధారయములందు ఉకారమునకు అచ్చుపరంబగునపుడు టుగాగమంబగు.

## ప్రశ్నోత్తరములు

1. ''ఈహితము వినుము''—రాముఁడు భరతునకుఁ జెప్పిన హితమేమి?

''వత్స! నేను జెప్పు హితము వినుము. తండ్రి స్వర్గమున కేగె. అతని యాజ్ఞానుసారముగా రాజ్యము నీదె. కిరీటము ధరించి భూమండలమును చక్కగా పరిపాలింపక యీరీతి తపసి వేషము తాల్ప న్యాయముకాదు.'' అని రాముడు హితము పలికెను.

*2. తపసి వేషము పూన తగునె యని హితము పలుకు రామునకు భరతుఁ డేమనెను?

''నీవు కాఱడవులనుండగా, పురములో ధర్మమను మాటయే లేదు. నీ కంటె ముందె ధర్మదేవత అడవులకు

వచ్చినది. ధర్మముపూని నిన్నును తీసికొని పోవుటకు వచ్చినాడను. నా కిష్టములేని వరముఁగోరి నిన్నడవులకంపి భర్తను చంపినది నాతల్లి కైకేయి. అట్టి యామె కుమారునకు నాకు ఈ వేషముచితమైనదే. లోకములకు బాధకలిగించిన పాపాత్మురాలగు కైకకు పుట్టిన కారణమున నేను మహాపాపాత్ముడను. నేను చనిపోవుదమన్నను నాకు తెగింపులేదు. ఒడలితీసి పోలేదు. తపస్సుచేసి నిందపోగొట్టుకొన యత్నించెను. కులమర్యాద విడిచిన సతి గుణము, ఓర్పులేని తపస్సు, దయాశూన్యమైన ధర్మము. పూర్వవంశపద్ధతులు లేని పాలన ప్రకాశింపవు నీకు ప్రభుత్వము పుట్టుకతో పుట్టినదే. అది విడరాని సనాతన ధర్మము. ధర్మము విడిచి తపస్సుచేయుదువా యని యడిగెదవేని, అది నాకధర్మమైన యెడల నీతి విడిచి నీ రాజ్యమును నేను పాలించుట ధర్మమా? ప్రియమైన తండ్రి మరణింప, కందమూల ఫలములు తినుచు నీ వడవుల నుండగా పరమ శత్రువులవలె నిన్ను వంచించి నీ రాజ్యమపహరించి పరిపాలింతునా? నా తలిదండ్రులు లొనర్చిన పని వలన కలిగెడు అపకీర్తి లోకమునందు వ్యాప్తముకాకుండ నీ రాజ్యము నీ వేలుకొని రక్షింపుము. నాజన్మ సార్థకమగునట్లు చేయుము.'' అని స్పష్టముగా భరతుడు పల్కెను.

*౩. రాముడు భరతుని పలుకులు విని వానిభావ మెఱిగి యేమని సమాధాన మిచ్చెను.

రాముఁడు "వత్సా! భరతా! ధర్మ సూక్ష్మము తెలుసుకొనుటచాలకష్టము. శీలము, సత్యము, తగవు, స్నేహము నీతి, గౌరవము మొదలైన మంచిప్రవర్తనలు రాజశాసనంబులకు కట్టుబడి యుండును. ఉత్తమ శాస్త్రములు వినుట, ఉత్తమ బుద్ధి గడించుట, ఉత్తమ శీల మలవఱచికొనుట, ఉత్తమ వ్యాపారములుచేయుట, చిత్తము భగవదాయత్తము చేయుట వీనికి పెద్దలే మార్గదర్శకులు. అట్టి మార్గదర్శకులెవరో కాదు, తలిదండ్రులే. వారికంటె నెక్కువ వారెవ్వరును లేరు. నీవు శాస్త్రరహస్య పారంగతుడవు. తండ్రి మాట జవదాటక వంశ మర్యాద కాపాడుచునే నీయరణ్యావాసమున కంగీకరించితిని. మరల నీ ప్రార్థన మంగీకరించి పితృవాక్య ముల్లంఘించుట నీతియగునేమో నీవే మనసులో నాలోచింపుము. కొడుకులు తండ్రుల కీర్తి నిలబెట్టుటకా వారికి పాపము కలిగించుటకా? రాజ్యమందాశచే నేనంగీకరింతునేని తండ్రి నసత్యవాదిగా చేయుట కాదా! అతడు రౌరవమునబడడా? ఇహలోక సుఖములన్నియు నస్థిరములు. రెండు కారణములచే నీవు రాజ్యముసేయ నర్హుడవు. తండ్రి మాట పాటించుట చేత నీ రాజ్య పాలనా యోగ్యమైన సత్త్వము చేత సందేహింపక నీవు రాజ్యమేలుకొనుము." అని భరతునకు సమాధాన మిచ్చెను.

4. ప్రకృతులు వికృతులు.

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| ఆజ్ఞ | ఆన | తపసి | తబిసి |
| కులము | కొలము | వంశము | వంగడము |
| విధము | వితము | అభ్యాసము | అబ్బెసము |
| స్థిరము | తిరము | సుఖము | సుకము |

5. వ్యాకరణాంశములు :—

(a) దుష్ట+ఆలు=దుష్టురాలు

సూ. కర్మధారయమునందు తత్సమ శబ్దంబుల ఆలు శబ్దము పరంబగునపుడు అత్వంబున కుత్వంబును రు గాగమంబునగు.

(b) లోకము+లు=లోకాలు

సూ. లు, ల, న,లు పరంబగునపుడు ముపర్ణకమునకు లోపంబును తత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబునగు.

(c) తల్లి +తండ్రి=తల్లిదండ్రులు

సూ. ద్వంద్వంబునం బదంబుపై పరుషములకు గ స డ ద వ లగు.

(d) ప్రభుత్వము+అర్హత=ప్రభుత్వపుటర్హత

సూ. కర్మధారయమందు ముపర్ణమునకు పు ంపులగు= ప్రభుత్వపు+అర్హత 2. కర్మధారయంబులందు ఉకారమునకు అచ్చు పరంబగునపుడు టు గాగమంబగు



## మిత్రభేదము - గద్యానువాదము

మిత్రభేద మను నీపాఠ్యభాగము నీతిచంద్రికలోనిది. నీతిచంద్రిక యనగా నీతికి వెన్నెలవంటిది. వెన్నెలలో సమస్త వస్తు సమూహము యెట్లు స్పష్టముగా కన్పట్టునో యట్లే యీ గ్రంథమునందు పెక్కు నీతులు స్పష్టముగా కన్పట్టును. మరియు వెన్నెల చీకటిని పోగొట్టునట్లే యిందలి నీతు లజ్ఞానమును పోగొట్టుననియు భావము. నీతిచంద్రికలో మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహము అను నాలుగుతంత్రములు గలవు. మొదటి రెండు తంత్రములను పరవస్తుచిన్నయసూరి రచించెను. తరువాతి రెండు తంత్రములను కందుకూరి వీరేశలింగము పంతులుగారును, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారును వ్రాసిరి.

చిన్నయసూరి క్రీ. శ. 1806 లో జన్మించి 1862 వరకు జీవించెను. చెన్నపురము ప్రెసిడెన్సీ కాలేజిలో నితడు ప్రధానాంధ్ర పండితుడుగా నుండెను. బాలవ్యాకరణము, ఆంధ్రపదకోశము, అక్షరగుచ్ఛము, సూత్రాంధ్రవ్యాకరణము మొదలగు గ్రంథములను రచించెను. నీతిచంద్రికకు మూల గ్రంథములు సంస్కృతములోని పంచతంత్ర, హితోపదేశములు. పంచతంత్రములోని తంత్రములను సుదర్శనరాజు కుమారులకు విష్ణుశర్మయను పండితుడు చెప్పెను. మిత్రభేదమనగా నిరువురు స్నేహితులకు భేదము (విరోధము) గల్గిం

చుట, మిత్రులుగా నుండిన పింగళక సంజీవకములను సింహ వృషభములకు కరటకదమనకులను జంబుకములచే భేదము కల్పింపబడినది.

## కథాసంగ్రహము

మిత్రలాభము వినిన తరువాత రాజపుత్రులు విష్ణుశర్మను మిత్రభేదము చెప్పుమని కోరిరి. విష్ణుశర్మ వారికిట్లు చెప్పఁదొడగెను. ఒక వనములో సింహావృషభములు మిక్కిలి మైత్రితో నుండెను. ఒక నక్క యారెండింటికి ద్వేషము పుట్టించి సింహముచే వృషభమును చంపించెను. ఆ కథ చెప్పెదను.

దక్షిణాపథమున రత్నావతి యను పట్టణము గలదు. అందు వర్ధమానుఁడను వైశ్యుఁడు గలడు. అతడు తన బంధుగులకంటె నెక్కువ ధనము సంపాదింప నెంచి, ధన సంపాదనకు వర్తకమే యుత్తమమైనదని యెంచి తన దేశమందలి మేలి సరకులను బండ్లపై వేయించెను. ఒక బండికి సంజీవకము నందకమను యెద్దులను కట్టి నిండుగా సరకులు వేసి తోలుకొని యుత్తరదేశమునకు బయలుదేరెను. సంజీవకము బండి లాగలేక అడవిలో నొకచోట కాలుజారి మోకాలు విరిగి నేలపైఁబడెను. ఆ వర్తకుఁడు చేయునది లేక యా యెద్దు నచ్చట విడిచి మరొక యెద్దును కొనితెచ్చి బండికి కట్టుకొని ప్రయాణమై వెళ్ళిపోయెను.

అదృష్టవశమున నాసంజీవకము తేఱుకొని వనమందు పచ్చికమేసి యొకనాడు గుహాలుమాఱుమ్రోగునట్లు అంకె వేసెను. ఆవనమున పింగళకమనుసింహముగలదు. అదినీరు త్రాగుటకు యమునానదికిపోవుచు నీభయంకరధ్వనివిని యట్టె రాపడి నిలిచెను. ఆయడవిలోనున్న కరటకదమనకులను నక్కలు ఆధ్వనివిని భయపడియు తరువాత పూర్వవృత్తాంతము జ్ఞప్తికి తెచ్చుకొని ధైర్యము తెచ్చుకొని మృగరాజు కూడ నట్లగుట కాశ్చర్యపడెను. పిమ్మట దమనకుడు తాము మృగరాజుకొలువున నుద్యోగముసంపాదించుట కదిమంచి సమయమని పలుక కరటకుడాతనితో జోలిమాలినపనిని పయిఁబెట్టుకొన్నవాఁడు మేకునుబెఱికిన కోఁతివలె ముప్పు చెందునని యాకథ యుదాహరణగాఁజెప్పెను.

[29]

# మేకును బెఱికిన కోఁతికథ

మగధదేశమందు అరిమర్ధ్గమను పట్టణముగలదు. శుభ దత్తుడను వైశ్యుఁడాపురమున కాపురముండెను. అతనికి సంతానములేక, తనధనము ధర్మకార్యములకు వెచ్చింప నెంచి యాపట్టణములో నొకదేవాలయము పాడుపడియుండగా దానిని బాగుచేయింపనెంచి వడ్రంగులచే చేవదూలము లను కోయించుచుండెను అంపముతో కోయువారుకోత తేలికగానుండుటకు దూలముమధ్య కఱ్ఱమేకులుదిగగొట్టి మధ్యాహ్నభోజనమునకు వెళ్ళిరి. ఆ దేవాలయసమీపమున నున్న కోఁతులు తమసహజచాపలమున వికారచేష్టలు చేయుచు నందందు తిరుగుచుండెను. అందొకముసలికోఁతి వచ్చి యామేకులుకొట్టిన చేవదూలమెక్కి దానివాలము వ్రేలంగూర్చుండి అందుబిగియఁగొట్టిన కొయ్యమేకును రెండు చేతులతోగట్టిగాపట్టి బలిమితోనూడబెఱికెను. ఆనెఱియలో తోకపడి నలిగిపోవుటచే నదిబాధపడి మరణించెను. కనుక జోలిమాలినపనికిపోరాదు.

ప్రభువు హితాహితములను పరికింపవలసినవాఁడు వాని సేవకులుగాని మనముకాదనియు పరాధికారముపై పెట్టు కొనువాఁడు ఓండ్రపెట్టి మోమపడిచచ్చిన గాడిదవలె నాశ నముపొందుననియు నాకథను కరటకుడు తార్కాణముగా చెప్పెను.

# ఖరశ్వానముల కథ

వారణాసియందు ధావకమల్లుడను చాకలివాడుగలడు. ఒకనాఁడు వాఁడు బట్టలుదికి శ్రమపడి బడలికచే గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచుండెను. అర్ధరాత్రి వాని యింట ప్రవేశించిరి. ఆ యింటి కావలి కుక్క దాపున నుండి చూచుచు నూఱకుండెను. మొఱుగలేదు. సమీపముననే యా చాకలివాని పెంపుడు గాడిద కట్టబడి యుండెను. అది దొంగలను చూచి కుక్క మొఱుగకుండుట నెఱిగి కోపించి "మన దొర యిల్లు దొంగలు దోచుకొనుచుండఁ జూచి యేల మొఱగవు" అని కుక్కనడిగెను. కుక్క "నాపని సంగతి నీకెందుకు? నా వలన లాభ మెఱుగక దొర నాయందు దయలేక కమికెడన్న మైన పెట్టడు. కష్టమెఱుగని దొరను సేవించుట కంటె మిన్న కుండుట మే"లని సమాధానమిచ్చెను.

గాడిద యా మాటలకు కోపించి యొక యాపదవచ్చి నప్పుడు ప్రభువు తప్పులు వెదకి కార్యముపేక్షించుట సేవకుని ధర్మము కాదనియు, తానుకృతఘ్నత చూపలేననియు పల్కి యాపని తానే చేయనిశ్చయించుకొని గట్టిగా నోండ్ర పెట్టెను. చాకలి మేలుకొని తనకు నిద్రాభంగము చేసిన గాడిదను బడియతో మోదెను. ఆదెబ్బ ఆయువుపట్టునతగిలి గాడిద చచ్చెను. కనుక పరాధికారముపైఁ బెట్టుకొనరాదు.

దమనకుడు వానిమాటలు విని యా రాజునాశ్రయించిన పుత్రామిత్రుల కుపకారాపకారములు చేయవచ్చుననియు, పరులకు మేలుచేయు వాని జన్మమే జన్మమనియు నీతులు బోధించెను. కరటకుడు వాని మాటల నన్నింటిని ప్రతిఘాతము చెసెను కరటక దమనకులు చాలకాలము వాదోపవాదములు సల్పిరి. తుదకు దమనునకు తన వాక్చాతుర్యముచే కరటకునినొప్పించెను. కరటకు డెట్టకేలకు వానిమాటల కంగీకరించి "యదె రాజు తన యిరవునకు పోవుచున్నాడు, పోయి రమ్మ"ని యాశీర్వదించి పంపెను.

అర్థాదులు:—

47 వ పుట:—అనంతరము = (మిత్రలాభమువిన్న) తరువాత; రాజపుత్రులు = రాజకుమారులు; అనుగ్రహము = దయ; వనములోన్ = అడవిలో; వృషభము = ఎద్దు; చెలిమి కలిగి = స్నేహముగానుండి; మాయావి = జిత్తులమారి; గోమాయువు = నక్క; విద్వేషము = విరోధము;

విశే:—రాజపుత్రులు—షష్ఠీతత్పురుషము; సింహము (ప్ర) సింగము (వి) సింహము (వ్యు) ఏనుగులు మొదలైన మృగములను హింసించునది; గోమాయువు (వ్యు) గోవులను పోఁదోలునది (నక్క) స్వామి (ప్ర) సామి (వి) పుత్రుఁడు (వ్యు) పుత్తను నరకమునుండి దాటించువాఁడు;

48. సవిస్తరముగాన్ = విపులముగా; దక్షిణాపథము = దక్షిణహిందూస్థానము (ఉత్తరహిందూస్థానమునకు ఆర్యా

వ_ర్తమునిచ్చెను) సార్థవాహుఁడు = వ_ర్తకుఁడు; సంపన్నుఁడు = సంపదతో కూడినవాడు; అర్థము = ధనము; పురుషార్థముల లోన = చతుర్విధపురుషార్థములలో (ధర్మము, అర్థము, కామము, మోక్షము - నాల్గువిధములైన పురుషార్థములు; ఉ_త్తమము=శ్రేష్ఠము; అర్థవంతునకున్ = ధనవంతునకు; అసాధ్యము=సాధ్యముకానిది; ద్రవ్యము=ధనము; తనియరాదు= తృ_ప్తిపడరాదు; జరా+మరణములు=ముసలితనము, చావు; ధన+అర్జనమునకు=డబ్బుసంపాదనకు; సాధనములు=ఉపకరణములు (ఉపాయములు) వాణిజ్యము=వ_ర్తకము; సర్వప్రకారములన్ = అన్నివిధముల చేత; మేలుసరకులు=మంచివస్తువులు; సేకరించుకొని=ప్రోగుచేసికొని; వేసడములు=కంచరగాడిదలు; భారవాహులను=కావటివాండ్రను; కంచరము = బండి; నట్టిలన్ =ఎద్దులను; పూన్చి=కట్టి; సముచితపరివారము = తగిన సేవకులు;పయనమాయెను=ప్రయాణమయ్యెను; కాంతారమందున్ =అడవిలో; కంచరము+ఎద్దు=కంచరపుటెద్దు=బండెద్దు; ఈ పాటిది= ఈమాత్రము శ_క్తిగలది; చికిత్స= వైద్యము;

విశే:— పట్టణము (ప్ర) పట్నము (లేక) పట్టము (వి) సార్థవాహుఁడు (వ్యు) బేరులమూకను దేశాంతరము చేర్చువాఁడు వ_ర్తకుడు) జరామరణములు-విద్యాధనములు-ద్వంద్వసమాసము; కంచరము (వి) చంకురము (ప్ర) పయనము (వి) ప్రయాణము (ప్ర) కంచరము+ఎద్దు=కంచరపుటెద్దు - సూ. కర్మధారయమందు మువర్ణమునకు పుంపులగు=కంచరపు+

వెష్టు (వి) కర్మధారయమందు ఉకారమునకు అచ్చుపరంబగు
నప్పుడు టుగాగమంబగు;

49. పౌరుషము = పురుషప్రయత్నము; విపరీతము =
వ్యతిరేకము; కీడో మేలో = మంచో చెడ్డో; ఇమ్ముదప్పు = ఆపద
(యిక్కట్టు) వెనుబడరాదు = దుఃఖపడరాదు; వెనుబడితిమిపో =
దుఃఖబడినయెడల; బళికరము + ఉంచి = కావలియుంచి; పోత
రించి = మదించి; లావు = బలము; విలిచి తెచ్చి = (వెలయిచ్చి)
కొని తెచ్చి; కాటియుండున్ = అడవియందు; భాగ్యము =
అదృష్టము; క్రూరసత్వములు = భయంకరమైన మృగములు;
జారికి = హింసకు; నడయాడసాగెను = సంచరింపజొచ్చెను;
మృత్యువు = మరణదేవత; వాతన్ = నోటియందు; చొచ్చి
అయినన్ = ప్రవేశించియైనను; వేల్పులు = దేవతలు; కాలము =
మరణము; విచ్చలవిడిగాన్ = స్వేచ్ఛగా; నాడు + నాడు =
నానాడు = ఆరోజు కారోజు; మాఱుచెలగన్ = ప్రతిధ్వనించు
నట్లు; పుండరీకములన్ = పులులను; సలుగులన్ = ఏదుపందు
లను; నలుగులన్ పడన్ చేయుచున్ = బాధించుచు; కాసరము
లన్ = కారెనుబోతులను; మీసరము = శ్రేష్ఠము అనగా మిక్కి
లిగా; గాసించుచున్ = బాధించుచు; ఋక్షములన్ = ఎలుగు
బంట్లను; క్రముక్కడిమృగములన్ = అల్పజంతువులను; లెక్కిం
పక = లక్ష్యము చేయక; విహరించుచు = తిరుగుచు; డప్పిపడి =
శ్రమపడి; పిపాసితము + ఐ = దాహమునందు కోరికగలదై ; యము
నాకచ్ఛమునకున్ = యమునానది యొడ్డునకు; ప్రళయసమయు;

పర్జన్య, గర్జఅనుకారి=ప్రళయకాలమందలి మేఘమురొక్క, ఉఱుమును పోలునట్టి; భీషణ ఘోషణము = భయంకరమైన ధ్వని; వెఱగుచేన్ = భయముచే; రాపడి = చేష్టలు లేక;

విశే:—పరివారము (ప్ర) పరివారు (వి) భాగ్యము (ప్ర) బాగెము (వి) సత్త్వము (నానా) బలము, జంతువు, సత్త్వగుణము; మృత్యువు (ప్ర) మిత్తి (వి)విడి+విడి=విచ్చలి విడి—సూ. అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు; నాఁడు+నాఁడు=నానాఁడు—సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు, ఇంచుకనాఁడు ఇత్యాదులందు బహుళగ్రహణముచేత అంతిమాక్షరలోపంబగు; పుండరీకము (నానా) పద్మము, పులి, తెల్లగొడుగు; ఋక్షము (నానా) ఎలుగుబంటు, నక్షత్రము; మృగము (ప్ర) మెకము (వి) యమున (ప్ర) జమున (వి)

50. జంబుకము = నక్క; రావము = ధ్వని; కొంతవడికి = కొంతసేపటికి; సంబళించుకొని = తేఱుకొని; ఆవలనికిన్ = ఆవైపునకు; క్రేవ+కంటిచూపు = కడగంటిచూపు; నిగిడించి = వ్యాపింపఁజేసి; ఆలించి = విని; సద్దు = ధ్వని; బెట్టిదము+మ్రోఁత = కఠినధ్వని; బెట్టిదము+ఉలివు = కఠినధ్వని; కొంచెపాటిదిగా = చిన్నదిగా; నిన్నమాపో = నిన్న సాయంకాలమో; నేఁడో రేపో = ఈరోజు ఉదయమో; ఇడుమపాటు = ఆపద; మాన్య క్షేత్రము = పెద్దలు సంపాదించిన పన్నుబందులులేని విడిచిపెట్ట

రానిపాలము; లాఁతిచోటికిన్ = మఱియొకచోటికి; అభిజనము=పుట్టినచోటు; దుస్త్యజమే=విడువరానిదే; వలస తీయుట=రాజోపద్రవ, దేశోపద్రవములవలన జన్మభూమి విడిచి మఱియొక దేశమునకు పోవుట; ఇడుమ=ఆపద; క్షుద్ర జంతువు=అల్పజంతువు; కర్తవ్యము = చేయదగినపని; పిట్ట కొంచెము కూఁతఘనము=పిట్టచిన్నదియైనను కూఁతగొప్పది అనగా వస్తువు పరిమాణము చిన్నదైనను దానివలన గలుగు పనులు గొప్పవని భావము;

విశే:—జంబుకము (వ్యు) మాంసమును భక్షించునది (నక్క—) క్రేవ+కన్ను = క్రేఁగన్ను—సూ. సమాసంబున ప్రాఁతాముల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు=క్రే+కన్ను (2) లుప్తశేషమునకు పరుష ములు పరంబగునపుడు నుగాగమంబగు=క్రే+న్+కన్ను (3) ద్రుతప్రకృతికముమీఁది......సరళములగు=క్రే+న్+ గన్ను (4) ఆదేశసరళము......విభాషనగు క్రేఁగన్ను; బెట్టిదము+కూఁత—సూ. కర్మధారయంబున......పుంపులగు = బెట్టిదపు+కూఁత (2) సమాసంబుల ఉదంత......నుగాగ మంబగు=బెట్టిదపు+న్+కూఁత (3) ద్రుతప్ర......=బెట్టిదపు+న్+గూఁత (4) ఆదేశసరళ......విభాషనగు = బెట్టిదపుఁగూఁత; సయితము (వి) సహితము (ప్ర)

51. కలగుండుపడిన=కలతపొందిన; క్షోభము=కలత; అలబలము=కలకలధ్వని! ఆకళింతకురాలేదు=జ్ఞప్తికిరాలేదు;

స్మరణకువచ్చినది=జ్ఞప్తికి వచ్చినది; ఈమువంజాలక = లాగ లేక; ఈడిగిలబడు=చతికిలబడు; ప్రయాణత్వర = ప్రయాణ మందలి తొందర; బియ్యన్ పట్టె=కండపట్టె; అట్టాడగాన్= తిరుగుచుండగా; ఒప్పరికింపరాదు = ఉపేక్షచేయరాదు డాయన్ పోయి=సమీపింపంబోయి; భీతి =భయము; మాని తము=పోగొట్టుదము; నెపము=వంక; తొంటినిగ్రహము: పూర్వము పెట్టిన బాధ; పాటింపరాదు=లెక్కింపరాదు; తత్ అను గ్రహసంపాదనము=వానిదయగడించుకొనుట; మోహా దనము=మూర్ఖత్వము; సగతి=విషయము; ఎత్తువారిచే బిడ్డ=ఎత్తుకొందుమని యెవ్వరు పిలిచిన వారిచేతులలో పోవు చంటిబిడ్డవంటివాడు అనగా ఎవరేమిచెప్పిన నదివిన వాడు; తెన్ను=దారి; ఉదరపోషణమునకు = పొట్టపోసికొ టకు; హేయము=నీచము; పర+ఆయత్తవర్తనుడు =ఇత లకు స్వాధీనమైన నడవడిగలవాడు; మృతకల్పుడు=చచ్చి వానితో సమానుడు; స్వకృత్యములు=తనపనులు;

విశే :—ఆడు+ఆడు=అట్టాడు — అందదుకు ప్ర తులు—సందేహము (ప్ర) సందియము (వి) ఒప్పరికించు ( ఉపేక్షించు (ప్ర) నెపము (వి) నిభము (ప్ర)

౭౨ నిస్తరించుము=తొలగుము; ఉపేక్షితుడు=ఒ కింపబడినవాడు; పరాభూతుడు=అవమానింపబడినవా పాయసము = పరమాన్నము; స్వచ్ఛందవృత్తి = స్వేచ్ఛ గనించు వ్యాపారము; ప్రాప్తలాభము=పొందబడిన లాభ

జోలి=సంబంధము; జోలిమాలినపని = సంబంధములేనిపని; ముప్పు=ఆపద; వైశ్యుడు=కోమటి; ఆరామ తటాక ఆది ప్రతిష్ఠలన్=తోటలు. చెఱువులు, మొదలగువానిని శాశ్వతముగా స్థాపించుటయందు. దేవళము=గుడి; జీర్ణము+ఐ=శిథిలమై (పాడై) కాఱువులను=వడ్రంగులను; రావించి=రప్పించి; వేతనములు=జీతములు; నియోగించెను= ఏర్పాటు చేసెను; సుకరముగా= తేలికగా; ప్రేల్చుటకు = చీల్చుటకు; సూత్రధారుడు=వడ్రంగి; మ్రానిమేకులు=కొయ్యమేకులు (గసికలు) భోజన అర్థము=భోజనము కొఱకు; పరిసరతరువులు=సమీపమందలి చెట్లు; దాపునకు=దగ్గరకు; ప్రాకారములు = చుట్టు గోడలు; ప్రాంత మహీరుహములు = దగ్గరనున్న చెట్లు; కుప్పించి=దూకుటకు ముందు కాళ్ళు కదియబట్టి నేల నదిమి; దాటుచు=దుముకుచు; వ్రేలు+కొమ్మలు = వ్రేలాడుచున్న కొమ్మలు; వ్రేలుచు=వ్రేలాడుచు పెనుకొమ్మలు=పెద్దకొమ్మలు; విమానములమీదన్ = దేవాలయము పైభాగముకప్పులమీద; వికృతముగాన్=వికారముగా; బరులు = ప్రక్కలు; గీఱుకొను=గోకుకొను; నిక్కుచున్=నిలబడుచు; ఉఱుకొట్టి = ఉఱ్ఱుమని ధ్వనిచేసి; కుఱువుమీద=తొడమీద; పండించుకొని=పండుకొనబెట్టుకొని; మేని పేలన్=శరీరమందలి పేలను; కిలకిల ఆరావములు=కిలకిల ధ్వనులు;

విశే:—సేవాదుఃఖము— పంచమీ తత్పురుషము; పాయసము (ప్ర) పాసెము (వి) తటాకము (వ్య) గట్టును

కొట్టుకొనునది (చెఱువు) దేవళము (వి) దేవాలయము (ప్ర) సూత్రధారుడు (వ్యు) సూత్రమనగా నూళ్లు వేయుదారము. దానిని ధరించువాడు (వడ్రంగి) భోజనము (ప్ర) బోనము (వి) ప్రాంతము (ప్ర) పొంత (వి)

53 మధువులు = తేనెలు; ఆనుచు = గ్రోలుచు; స్వాభావిక చపలభావముతోన్ = స్వతస్సిద్ధమైన చాంచల్యముతో; మల్లు = కోతి; కాలచోదితము + ఐ = మరణముచే ప్రేరేపింపబడినదై; డాసి = సమీపించి; వాలము = తోక; చిక్కన్ పట్టి = గట్టిగా పట్టుకొని, బలిమితోన్ = బలముతో; పుచ్ఛము = తోక; చదియుటన్ చేసి = నలుగుటచేత; ఆలోలుచున్ = బాధచే అఱచుచు, కాలధర్మమున్ బొందెన్ = చనిపోయెను; భృత్యపదము = సేవకస్థానము (కొలువులో) కొలువుకాండ్రు = సేవకులు; హిత + అహితములు = మంచిచెడ్డలు; పర అధికారము = ఇతరుల పెత్తనము; మోదుపడిన = దెబ్బతిన్న; స అవధానముగాన్ = ఆసక్తితో; వారణాసి అందున్ = కాశిలో, మఱుమఱచి = ఒడలెఱుంగక; నడికిరేయి = అర్ధరాత్రి; ఒండొంటితోన్ = ఒకదానితో నొకటి; దొద్దపోగా = కొల్లపోగా; ఒప్పరికింపవచ్చునా = ఉపేక్ష చేయవచ్చునా? తలవాకిలి = ఇంటిముందు; ఆవలంత = ఆవగింజంత (కొంచెమైనను) ఏలిక = ప్రభువు; సాకతము = దయ; కమికిలి + ఎదు = కమికెదు = పుడిసెడు; పాటు + ఎఱుగనిదొరను = శ్రమ తెలిసికొనలేని యజమానుని, మిన్నక + ఉంట = ఊరకుండుట;

విశే:—నిమిషము (ప్ర) నిముసము (వి) ప్రమాదము+పడు=ప్రమాదపడు-షష్ట్యాదిసంధి; కమికిలి+ఎడు = కమికెడు; సూ. పరిమాణార్థంబునందు 'ఎడు' వర్ణకంబగు, అకుచోలి వర్ణంబునకు లోపంబగు; వాని యుల్లోక సొంగచొచ్చెను—సూ. ఒక్కొక్కచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు; కుక్క (వి) కుక్కురము (ప్ర)

54 ఖరశ్వాసములు = గాడిద, కుక్కయు; ప్రశ్న+ఉత్తరములు=ప్రశ్న, సమాధానములు (సంభాషణ) పోరామి=ఆపద (ఇక్కట్టు) దోషములు=తప్పులు; తడవి=వెదకి; స్వ+అర్థ + పరుండు = తన పనియందే ఆసక్తి గలవాడు; స్వకృత్యమునందు=తాను చేయవలసిన పనియందు; ప్రవర్తింపండు+ఏని=సంచరింపనియెడల; కృతఘ్నుడు=చేసిన మేలు మఱచువాఁడు; పాపిష్ఠుఁడవు=పాపాత్ముఁడవు; దొసగు=ఆపద; పొసగిన అప్పుడు=కలిగిన సమయమున; ప్రబోధించెదను = మేలు కొల్పెదను; ఓండ్ర=గాడిద అఱపు; మడివేలు=చాకలి నిద్రాభంగము = నిద్రకు విఘ్నము; బడియతో = కఱ్ఱతో; మోదెను=కొట్టెను; ఆయుమందు = ఆయువు పట్టునందు; తాకుటన్ చేసి=తగులుటచేత; పసరముల డొక్కలు=పశువుల యొక్క ఎముకలగూఁడులు; భక్షిత+అవశిష్టము+ఐన=తినగా మిగిలిన; జంతువులు=ప్రాణులు; ఆహార నిద్రా, భయములు= తినుట, పండుకొనుట, భయపడుట; సహజధర్మములు=పుట్టుకతో పుట్టుగుణములు; కుక్షింభరత్వముచేన్ =(తన) పొట్టను

పోషించుకొనుటచే; గారవము=గౌరవము; మిత్ర+అమిత్రు లకు=స్నేహితులకు; విరోధులకు; ఉపకార+అపకారములు = మేలుకీళ్ళు (మిత్రుల కుపకారము, అమిత్రుల కపకారము —క్రమాలంకారము) రాజ+ఆశ్రయము = ప్రభువుయొక్క అండ; స్వ+ఉదర మాత్రము=తనపొట్టను మాత్రము; భరింపన్ =పోషించుకొనుటకు; ఏను లేదు=ఎవఁడు లేఁడు అనగా అందరు తమ పొట్టలను తాముపోషించుకొనువారే; జీవింతురు= బ్రతుకుదురో; మనుగడ లో=జీవితమే; సఫలము=సార్థకమయినది; వా డొకడు జీవించువాఁడు = చచ్చినను బ్రతికి యుండువాఁడు వాఁడే (మృతజీవుడు); ఆమిషశూన్యమై = మాంసము లేనిదై; వసాగంధిలమైన=క్రొవ్వుచే దుర్వాసన గలదియగు; శల్యము=ఎముక; వేఁపి=కుక్క; అంగద=ఆకలి; అడంగదు= పోదు; కేసరి_సింహము; ఆసన్నము అయిన=దగ్గరకు వచ్చిన క్రముక్కుడి మృగముకు=అల్పజంతువును; నిజ = తనయొక్క; ఖర_వాడియైన; నఖర=గోళ్ళచేత; విదారిత = చీల్చబడిన; హస్తి=యేనుగుయొక్క; మస్త=తలయందలి; మస్తిష్కము +అ=మెదడునే; కోరున్ =కోరును,

విశే :—ప్రశ్న (ప్ర) పన్నము (వి); సహాజము(ప్ర) సాజము (వి); మాత్రము+న = మాత్రాన – సూ. లు,ల, న, లు......విభావనగు; సంతోసము+పడు=సంతోసపడు, సంతోసంపడు – పడ్వాదిసంధి.

౨౨ సత్త్వ+అనురూపమైన=బలమునకు తగినట్టి; వాంఛింతురు=కోరుదురు; శునకము=కుక్క; ఓగిరము=ఆహారము; ద్విరదము=ఏనుగు; కరముధీరముగాన్=మిక్కిలి ధైర్యముగా; విలోకించుచు=చూచుచు; సారెకు=మాటి మాటికి; ఆధోరణ+ఉపలాలితము+ఐ=మావటివానిచే బుజ్జగింపబడినదై కబళము=ముద్ద; హీనుడు=అల్పుడు; దీనభావము=దైన్యము (గుణము); తనియన్=తృప్తిపడునట్లు; వినయ వచనములు=అణకువ మాటలు; మీరన్=అతిశయించునట్లు; అనవద్యము+అగు=నింద్యము కానిదగు (నిర్దుష్టము) అవక్రమగు విక్రమము=వంకర కాని (మొక్కవోని) పరాక్రమము; నిర్+అపాయము=అపాయము లేని నృపాలుర మెప్పు=రాజుల మెప్పు; పడసినవాని= పొందినవాని; గరువతనము = గొప్పతనము (హోదా - Dignity); కలిమికొలంది=సంపదకొద్ది; లోకులకు=ఇతరులకు; స్వ+ఉదరమాత్ర+పూరకము=తన పొట్టను మాత్రమే నింపుకొనునది; కరటము=కాకి; మనినన్=జీవించినను; అలంతి జలముచేన్=కొంచెము నీటిచే; మొరము+నేల=రాతి నేల; వెల్లిపొడిచినట్లు = ప్రవాహము మేర్పడినట్లు; క్షుద్రు+అందున్=అల్పునియందు; హర్షము=సంతోషము; పొడమును=కలుగును; హిత+అహిత+వివేకము=మంచి చెడు ఆలోచన; విహిత కర్మములు=విధికృత్యములు; (తప్పక చేయవలసిన పనులు) పశుతుల్యుడు=పశువుతో సమానుడు; భారవాహి+ఐ=బరువు మోయునట్టిదై; తృణమాత్ర+అశనము+

అయి=గడ్డినిమాత్రమే ఆహారముగా గలదై; కృషి+ఆది+కర్మలకు=వ్యవసాయము మొదలగు పనులకు; అత్యంత ఉపకారకము=మిక్కిలి లాభము కలిగించునదై; వృషభము=ఎద్దు నరపశువు కంటెన్=మనుష్య పశువుకంటె ప్రధానులకు=మంత్రులకు; కావుటన్=అగుటకు; పురాకృత సుకృతము వలనన్=పూర్వ జన్మమునందు చేసికొనిన పుణ్యము వలన, ప్రజ్ఞావంతుడు=బుద్ధిమంతుడు: ప్రాజ్ఞుడు=ప్రజ్ఞ కలవాడు; రాజపూజితుడు=రాజుచేగౌరవింపబడువాడు; తంత్ర+ఆవాపము=తంత్రమనగా స్వరాష్ట్రచింత ఆవాపమనగా పరరాష్ట్రచింత; ప్రధానత్వము=మంత్రిత్వము

విశే:—ఓగిరము (వి) ఆహారము (ప్ర) ద్విరదము (వ్యు) రెండు రదములు (దంతములు) గలది (ఏనుగు) నిరపాయము—అవ్యయీభావ సమాసము; నృపాల+లు=నృపాలురు.

సూ. అదంతంబై దీర్ఘపూర్వలోపదంబయిన మహాత్తుమీఁది శిథిల క్తి ల కారమునకు రేఫంబగు కరటము (వ్యు) 'క' యని పలుకునది (కాకి) మొరము+నేల=మొరపనేల—సూ కొండొకచో సమాసంబులందు నామ్వాదికను మ్వాదుల మువర్ణంబులు పబ్బవర్ణంబులగు; హర్షము (ప్ర) అరుసము (వి) కృషి (ప్ర) కరిసెము (వి) కృషి+ఆది=కృష్యాది-యణాదేశసంధి;

56. పేటిక+అంతఃగత+రత్నమున్ పోలెన్ = పెట్టె లోపలిభాగమును పొందినమణివలె (పెట్టెలోనున్న) ఇన + ఆలోక యోగ+లేక = సూర్యుని వెలుగుతోడి కలయిక లేక ఇది రత్నపరమైన అర్థము; పండితపరముగా అర్థము-ఇన + ఆలోక యోగము=రాజుచూపుయొక్క కలయిక లేక (రాజాశ్రయమున్ననే పండితుడు ప్రకాశించునని భావము) సాధువర్తనుడు+మంచిప్రవర్తన గలవాడు; గర్హ్యుడు+నిందింపతగిన వాడు; మాన+అవమానములు+గౌరవ అగౌరవములు; ప్రవర్తన+ఆయత్తములు=నడపడికి స్వాధీనములు; దుర్లభము = కష్టము; లాతివిధము=అన్యవిధము; మహాగ్రావమును = పెద్ద రాతిని; గ్రావ+అగ్రమున్ = కొండకొనను; దుష్కరము కాదు=చేయశక్యముకానిది కాదు; తొల్లి=పూర్వము; కంటగించుచున్నది=నొచ్చుచున్నది; వచియించితిని = చెప్పితిని; భృత్యుల=సేవకులయొక్క; గుణదోషములయందున్+మంచి చెడ్డలయందు; వివేకము = తెలివి (యుక్తాయుక్తవిచక్షణ) అన్యులచే=ఇతరులచే; అర్థము=పని (అవసరము) ఉచితము= తగినది; జలపాన+అర్థము=నీరుత్రాగుకొఱకు; కాళిందికిన్= యమునానదికి; తీర్థ+అవతరణము=నీటిలోనికిదిగుట; వెఱగు పడి=నిశ్చేష్టతనుపొంది (రాపడి) పరహృదయము = ఇతరుల మనస్సు; ప్రత్యక్షముకాదు=కంటికగపడదు; చిత్తవృత్తి = మనోవ్యాపారము; అర్థము = విషయము; అవగతముఅయి నది=తెలియబడినదైనది (తెలిసినది) సుగమము+ఐ=సులభ

ముగా తెలిసికొనదగినది; తురంగ+మాతంగ+ఆదులు=గుఱ్ఱములు, ఏనుగులు మొదలైనవి; వహన+ఆదికార్యంబులు = మోయుట మొదలగుపనులు; పర+ఇంగిత+అవగాహి = ఇతరుల మనోభిప్రాయములను తెలిసికొనునట్టి; పామరుడు = మూర్ఖుఁడుఁ కర్తవ్య+అంశము = చేయదగినపని; తత్ భావ+అనురూపముగాన్ =అతని మనసునకు తగినట్లుగా;

విశే:—పేటిక (ప్ర) పెట్టె (వి) ఇనుఁడు (నానా) సూర్యుఁడు, రాజు;

57. కడిఁది=కష్టము (అసాధ్యము) స్వచ్ఛందవృత్తి=స్వేచ్ఛావ్యాపారము; ప్రియవాదికి=హితముపలుకువానికి; సత్ వర్తనము=మంచినడవడి; నిచ్చలు=ఎల్లప్పుడు; ఱేని = రాజుయొక్క; ప్రసాదము=అనుగ్రహము; అంగముచ్చములు = ఆనవాళ్ళు (గుర్తులు) మెలగెన్ ఏనిన్ =సంచరించినయెడల, తత్ అనుగ్రహము=వానిదయకు; పాత్రుడు = తగినవాడు; నుడువన్ దొరకొను=చెప్పుటకు ప్రయత్నించు; ప్రతిభాశాలి = ప్రతిభచే ఒప్పువాడు (ప్రతిభయనగా అప్పటికప్పుడుదయించు తెలివి) సమయ + ఉచితముగన్ = సమయమునకు తగినట్లు; అడకువతోఁ పక=వినయము అగపడునట్లు; కడు+ఎదురు = కట్టెదురు=ఎట్టయెదుట; పట్టుతలఁగి=ప్రదేశమువిడిచి; ఏలిక=ప్రభువుయొక్క; మొగమునన్+అ = ముఖమునందే, తన వలనను=తనవైపు; తత్ కాల+ఉచితముగ=ఆసమయమునకు తగినట్లు; పౌర్వాపర్యము=పూర్వాపరసందర్భములు (వెనుక

ముందున సంకల్పములు) తక్కఁగల = మిగిలిన; అవిరుద్ధముగన్ = వ్యతిరేకము కాకుండ; నేరిమి మీఱఁజన్ = నేర్పు అతిశయించునట్లు; కావుత = అగుగాక! తనయిరవునకు = తన చోటికి (ఇంటికి) డాకొనవచ్చు = డాగుకొనవచ్చును.

విశే:— సిచ్ఛలు (వి) ఇచ్ఛము (ప్ర) కోపప్రసాదములు— ద్వంద్వసమాసము; ప్రభువు+ఎదుర = ప్రభువు నెదుర— సూ. షష్ఠీసమాసమందు ఉకారఋకారములకు అచ్చుపరంబగునపుడు నుగాగమంబగు; కడు+ఎదుర = కట్టెదుర — సూ. కఱు, చిఱు.........ద్విరుక్తటకారంబగు; న+విరుద్ధము = అవిరుద్ధము — నఞ్ తత్పురుషము;

ప్ర శ్నో త్త ర ము లు:—

1. మిత్రభేదమన నేమి? అది యే గ్రంథములోనిది? దానిని రచించినకవిని, కాలమును, ఇతరగ్రంథములను దెల్పునది.

మిత్రభేదమనగా నిరువురుమిత్రులకు మధ్య విరోధము కల్పించుట. అదినీతిచంద్రికలోనిది. దానిని పరవస్తుచిన్నయసూరిరచించెను. అతడు క్రీ. శ. 1806 మొదలు 1862 వఱకు నున్నవాడు. ఇతరగ్రంథములు:— బాలవ్యాకరణము, అక్షరగుచ్ఛము, ఆంధ్రపదకోశము మొదలైనవి.

2. నీతిచంద్రికయనుపేరు దానికేల కల్గెను? అందలిభాగము లెవ్వి? వానినెవరెవరు రచించిరి?

నీతిచంద్రికయనగా నీతికివెన్నెలవంటిదని యర్థము. వెన్నెల చీకటినిపోగొట్టునట్లే యిందలినీతులు అజ్ఞానమును పాఱద్రోలుననిభావము. ఇందలిభాగములు మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహము. మొదటిరెండుభాగములను చిన్నయసూరిరచించెను. చివరిరెండుభాగములను కందుకూరి వీరేశలింగముగారు రచించిరి.

3. నీతిచంద్రికకు మూలగ్రంథమేది ?

నీతిచంద్రికకు సంస్కృతములోని పంచతంత్ర,హితోప దేశములు మూలగ్రంథములు.

4. వర్ధమానుడను సార్థవాహుడు మిక్కిలిగా ధనము సంపాదింపవలెనని యేమనిచింతించెను ?

అర్థము పురుషార్థములలో నుత్తమమైనది. అర్థవం తున కసాధ్యమైనదేదియు లేదు. న్యాయముతప్పక మానవు డేయుపాయముచేతనైనను అర్థముసంపాదింపవలయును. బుద్ధి మంతుఁడు జరామరణములు లేనివానివలె విద్యాధనములు గడింపవలెను.ధనార్జనమున కనేక సాధనములుగలవు. వాని లోపలవర్తకముమేలైకన్పట్టుచున్నదనిసార్థవాహుఁడు చింతిం చెను

*5. "ఆయువు గట్టిగా నుండెనా మహామృత్యువు వాతఁ జొచ్చియైనను మరలి రావచ్చును" దీనికి మీపాఠ్య భాగము నుండి యొక దృష్టాంతమును వ్రాయుము ?

దక్షిణాపథమున రత్నావతి యను పట్టణములో వర్ధ మానుడను సార్థవాహుడు గలడు. అతఁడు ధనార్జనముచేయ

నాఁడి తన దేశమున మేలిసరకులను బండ్లకై వేయించుకొని యుత్తర దేశమునకు బ్రయాణ మయ్యెను. ఒకబండికి సంజీవక నందకములను నెద్దులనుకట్టి నిండ సరకులు వేసికొని యరణ్యములలోనుండి పోవుచుండ సంజీవకుఁ డు కాలుజారి మోకాలు విఱుగ నేలపైఁ బడిపోయెను.

వర్తకుఁడు మఱొక యెద్దును కొని తెచ్చి యా సంజీవకము నా భయంకరారణ్యములలో విడిచి తనదారిని పోయెను. ఏక్షణమునందైన నేపులి యైనను దానిని తినివేయవలసినదే. కాని దానియదృష్టము మంచిది కాబట్టి యేక్రూర మృగముల బారిఁబడకుండ, విఱిగిన మోకాలు చక్కఁబడి లేచి నడయాడ సాగెను. ఆయువు గట్టిగా నుండెనా మహా మృత్యువువాతఁ జొచ్చియైనను మరలి రావచ్చును.

6. ఇంకనేమి యిటుమపాటు రానున్నదో యెవరెఱుగుదు రని పలుకు కరటకునకు దమనకుఁ డేమనెను?

దమనకుఁడు "ఈయరణ్యము మనకుమాన్యక్షేత్రమా మఱొకచోటికి పోఁగూడదా? ఇంక నరణ్యములు లేవా? అభిజనమెట్టివారికిని విడువరానిదే కాని మరణమున కొప్పుకొన వచ్చునా? ఇప్పుడు మనకు పలసపోవలసినంత యవసర మేమి వచ్చినది? ఆ జంతువుయొక్క స్వరూపమే మనకు తెలియలేదు. ఆ జంతువు చిన్నదో పెద్దదో తెలిసికొనిన పిమ్మట మన మాలోచించు కొనవచ్చును. పిట్ట కొంచెము కూఁత ఘనమన్నట్లు చిన్నజంతువునకు నయితము పెద్దనోరుండ

వచ్చును. జంతువంత పెద్దది కాదనుటకు కొన్ని సూచనలగపడుచున్నవి ఆధ్వని వచ్చినవైపున నున్న జంతువు లేమియు భయపడినట్లు కనబడదు.'' అని కరటకునితోఁ జెప్పెను.

*7. రాజభయము పోఁగొట్టి రాజానుగ్రహము సంపాదింతమని పల్కు దమనకునకు కరటకుఁ డేమని సమాధానమిచ్చెను ?

కరటకుఁడు దమనకునితో ''నీవు చెప్పినది నాకు నచ్చలేదు. మున్ను రాజసేవ చేసి పడ్డపాట్లుచాలు. ఈ రాజెత్తువారిచేతిబిడ్డ. అట్టి రాజును సేవించుట కష్టము. అది యట్లుండనిమ్ము. పొట్టపోసికొనుటకు పరులశరీరమమ్ముకొనుట హేయము. పరాధీనవృత్తి గలవాడు చచ్చినవానితో సమానుఁడు. అయినను తన పనిని సరిగా నెఱవేర్చి ప్రభువు మన్నన పడసినచో సేవా దుఃఖము కొంత తొలగును పనిసరిగా చేయని యెడల అంతకంటె దుఃఖము మఱొకటి లేదు. అవమానితుఁడైనచో నింకఁ జెప్పవలసిన దేమి? సేవావృత్తిచే లభించు పాయసము కంటె స్వేచ్ఛావృత్తిచే లభించు గంజిమేలు కనుక దొరికిన దానితో తృప్తిపడి సుఖముగా నుందము. ఇప్పు డాతని భయము పోఁగొట్టవలసిన యవసరము మన కేమి గలదు. జోలిమాలినపని పయిని పెట్టుకొన్నవాఁడు మేకును పెఱికిన కోఁతివలె నాశనమునుపొందునని యా కథదృష్టాంతముగా జెప్పెను.

అదియుఁగాక మనమాతని సేవలో లేము. ప్రభువు హితాహితములను విచారించు పనిగాగను మన కేల

పరాధికారము పై వేసికొన్నవాఁడు ఓంగ్రకెట్టి మోదువడి చనిపోయిన గాడిదవలె నాశనమునుపొందునని యీ కథ తాత్పర్యముగాఁ జెప్పెను.

౪. భక్షితావశిష్టమైన మాంసము కావలసినంత యున్నది. పోదము. రమ్మను కరటకునకు దమనకుఁ డేమిసమాధానమిచ్చెను ?

దమనకుఁడు "తిండికిప్పుడుతొందరయేల ? ఆహార నిద్రాభయములు అన్నిప్రాణులకు సహజము. తనపొట్ట తాను పోసికొనుటవలన గౌరవము రాదు. మిత్రులకుపకారము శత్రువుల కపకారము చేయనెంచి బుద్ధిమంతులు రాజాశ్రయము కోరుదురు. ఎవఁడుజీవింప నసేకులుజీవింతురో వానిమనుగడ సఫలము. వాఁడొక్కఁడే మృతజీవి. ఒకయెముకముక్కతో కుక్కసంతోషపడును. సింహము మదించినయేనుగుల కుంభస్థలములలోని మెదడుతినికాని తృప్తిపడదు. అందఱును సత్వానురూపమైనఫలమేకోరుదురు. నిష్కళంకమైనవిద్యచే, మొక్కవోని పరాక్రమముచే, మంచియుపాయముచే రాజుల మెప్పుపొందిన వానిజన్మయేజన్మ. పరులకుమేలుచేయువాని జన్మమొక్కనాటిదైననుచాలు. కాకిచిరకాలమున్న నేమి లాభము. కొలదిలాభముచే క్షుద్రుఁడు సంతోషముగల్గును. విహితకర్మలుమాని తన పొట్టమాత్రమే నింపుకొనువాఁడు పశుతుల్యుఁడు. అంతేకాదు. పశువుకంటెనీచుఁడు. గడ్డిమాత్రమే తిని యెంతోబరువు మోయుచు వ్యవసాయాది కర్మల

కత్యంతో ప్రకారకమైన పశువే మనుష్యునికంటె మెఱుగు'' అని సమాధానమిచ్చెను?

*9. ''మనము ప్రధానులము కాము. మనకీవిచారముతో ప్రయోజనమేమి'' యనిపలుకు కరటకునకు దమనకుం డేమిసమాధానమిచ్చెను?

దమనకుండు కరటకునితో ''ప్రధానుడగుట కెంత సేపు పట్టును? పూర్వపుణ్యమువలన ప్రజ్ఞావంతుడగును. ప్రజ్ఞావంతుండు రాజుచే పూజింపబడును. రాజు గౌరవించినచో ఉన్న ప్రజ్ఞ రాణించును. దానివలన తంత్రాలాపములు నడుపసమర్థుడగును. ఆసామర్థ్యముచే ప్రధానత్వముపొందును ఎంత ప్రజ్ఞావంతుండైనను పెట్టెలోని మణివలె నినాలోకయోగము లేక ప్రకాశింపడు. మానవుడు మంచిప్రవర్తనగలవాడేని సర్వలోకపూజ్యుడగును. కానిచో నిందితుడగును. మంచి చెడ్డలు నడవడినిబట్టియుండును. గుణవంతుడని యనిపించు కొనుటకష్టము. దుర్గుణుడని యనిపించుకొనుటసులభము. పెద్దరాతిని కొండపై కెక్కించుటకష్టము. అక్కడినుండి క్రిందికి ద్రోయుటసులభము'' అనిసమాధానము చెప్పెను

10. 'ఉచితమగునట్లు చేయుము. ఇప్పుడు నీవు చేయంబూనిన కార్యమేమి' యని యడుగు కరటకునకు దమనకుడేమని సమాధానమిచ్చెను?

దమనకుండు కరటకునితో ''మనరాజు కాళ్లి దిక్కుబోయి యెద్దురంకెవిని భయపడి నీరుత్రాగమానినాడు ఇదియునిని

యాకారముచేతనే తెలిసికొంటిని. ఇతరులయభిప్రాయము బుద్ధిమంతు లెఱుంగఁగలరు. గుఱ్ఱము, ఏనుఁగు మొదలగు జంతువులే చెప్పినపని గ్రహించి బరువుమోయుట మొదలగు పనులు చేయుచున్నవి. ఇతరులమనోభిప్రాయము తెలిసికొను బుద్ధియొక్కటియే పామరునికంటె పండితునకు విశేషము. నేనిప్పుడు రాజుదగ్గరకు వెళ్ళి వానియభిప్రాయము ననుసరించి నడచి కావలసినమాటలే మాటలాడి, యీపనినీవు చేయు మని వానిచేనాజ్ఞాపింపఁ జేసికొని వానిమనస్సునకు నచ్చినట్లు ప్రవర్తించి యాతనిమెప్పుపొందెద'నని బదులుచెప్పెను.

11. రాజులకొలువుగోరువారు మెలఁకువగలిగి ప్రవర్తింప వలెనని కరటకునకు దమనకుఁడేమనెను ?

'ఉద్యోగికిదూరదేశమును, విద్వాంసునకు పరదేశము, ప్రియవాదికి శత్రువులు లేనియట్లు బుద్ధిమంతునకు సాధ్యము కానిదేదియు లేదు. మంచినడవడిగల్గి యెల్లప్పుడు తమకొలువు గోరువారిని రాజులాదరింతురు సేవకుఁడు రాజుకోపప్రసాదముల జాడలెఱింగి చరించునాఁడు వానిదయకు పాత్రుఁడగు'నని దమనకుఁడు కరటకునితోఁ జెప్పెను

12. తొలుత రాజును చూచి సమయదొరకను నర్థమేది యని యడుగు కరటకునకు దమనకు డేమనెను ?

''సోదరా! ఈ యర్థము పలుకవలెనను నియమము గలదా? ప్రతిభావంతునకు ప్రభువు దగ్గర సమయమునకు తగినట్లుగా పలుకవలసినది బహువిధములుగా నుండును. సేవకు

డణకువ గల్గియుండవలెను. సభలోనికి పోవునపుడు రాజుముఖమున కేసి మాత్రమే చూచుచు పట్టుతలఁగి యారాజు తనవైపు చూచునపుడు నతనివైపే చూచుచు, సమయోచితముగా ముందువెనుక లాలోచించి రాజు అభిప్రాయ మెఱిఁగి, తక్కిన రాజసేవకులకు వ్యతిరేకముగా మాటాడక పలుకవలసిన మాట కడునేర్పుతోఁ బలుకవలయు" నని దమనకుఁడు కరటకునితో చెప్పెను.

13. (a) ఎవ్వనికిఁగాని యేది దుస్త్యజము?

ఎవ్వనికిఁగాని అభిజనము దుస్త్యజము.

(b) ఎవఁడు మృతకల్పుఁడు?

పరాయత్తవర్తనుఁడు మృతకల్పుఁడు

(d) ఎవని మనుగడ సఫలము?

ఎవ్వఁడు జీవింప వానివలన ననేకులు జీవింతురో వాని మనుగడ సఫలము.

(c) ఎట్టివాఁడు పశుతుల్యుఁడు?

యుక్తాయుక్త విచక్షణలేక విహితకర్మములను విడిచిపెట్టి తనపొట్ట మాత్రమే నింపుకొనువాఁడు పశుతుల్యుఁడు.

(e) ఎవని మనుగడయే మనుగడ?

అనవద్యమగు విద్యచే, అవక్రమగు విక్రమముచే, నిరపాయమైన యుపాయముచే రాజుల మెప్పుపొందిన వానిమనుగడయే మనుగడ.

(f) ఎల్లజంతువులకు సహజ ధర్మములెవ్వి ?

ఎల్లజంతువులకు ఆహార, నిద్రా భయములు సహజ ధర్మములు.

(g) ఎల్లవారు సత్త్వాను రూపమైన ఫలమే వాంఛింతురు- దీనికొక దృష్టాంతమును దెల్పుము ?

మాంసములేక వసాగంధిలమైన యెముక దొరికిన మాత్రాన కుక్క మిక్కిలి సంతోషపడును. సింహము నీచ మృగములను కోరక తన వాడియైన గోళ్ళచే చీల్చబడిన యేనుగు కుంభస్థలములోని మెదడునే తిని సంతోషపడును.

14. ఈ క్రింది నీతులను బోధించు కథలను సంగ్రహముగా వ్రాయుము ?

(a) జోలిమాలిన పనికిం బోరాదు.

(b) పరాధికారము పైం బెట్టుకోరాదు.

జవాబులకు 'కథాసంగ్రహము' అని వ్రాసినచోట ఆయా శీర్షి కలుగల కథలను చూచుకొనుండు.

15. ఈ క్రింది వాని యర్థసందర్భములను వ్రాయుము ?

(a) ఎత్తువారిచేతిబిడ్డ

(b) ఎట్టి ప్రజ్ఞావంతుండుగాని పేటికాంతర్గత రత్నముం బోలె వినాలోకయోగము లేక ప్రకాశింపండు

(a) ఎత్తుకొనువారిచేతిలో నుండు పసిబిడ్డ – పసిబిడ్డ యెవ్వరు చేయి చాచిన వానిచేతిలోనికి వచ్చును. అట్లే యెవ రేమి చెప్పినను విను ప్రభువును ఎత్తువారిచేతిబిడ్డ యందురు. రాజానుగ్రహము సంపాదింప బోవుదునను దమనకునకు కర టకుండు చెప్పెను.

(b) ఎట్టి ప్రజ్ఞావంతుఁడుగాని = ఎంత బుద్ధిమంతుఁడైనను పేటికాంతర్గత రత్నమాన్ పోలెన్ = పెట్టెలోని మణివలె ఇనాలోకయోగము = రాజుచూపుయొక్క కూడిక (సూర్య కిరణముల కూడిక) లేక; ప్రకాశింపఁడు = లేని దేరాణింపడు; అనగా పెట్టెలోని రత్నములు వెలుగులోనికి తీసికొనిరాకుం డిన నెట్లు ప్రకాశింపదో యట్లే యెంత బుద్ధిమంతుడైనను రాజాశ్రయములేని యెడల ప్రకాశింపడని దమనకుఁడు కరట కునితో, కరటకుఁడు దమనకుని రాజదర్శనమునకు వెళ్ళవద్దని సమయమున చెప్పెను.

16. ప్రకృతులు – వికృతులు :—

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| పట్టణము | పట్నము | చంకురము | కంచరము |
| ప్రయాణము | పయనము | పరివారము | పరివారు |
| భాగ్యము | బాగెము | మృత్యువు | మిత్తి |
| యమున | జమున | సందేహము | సందియము |
| ఉపేక్షించు | ఒప్పరికించు | నిభము | నెపము |
| పాయసము | పాసెము | దేవాలయము | దేవళము |
| భోజనము | బోనము | నిమిషము | నిముసము |
| కుర్కురము | కుక్క | ప్రశ్న | పన్నము |
| సహజము | సాజము | ఆహారము | ఓగిరము |
| హర్షము | అరుసము | కృషి | కరిసెము |
| పేటిక | పెట్టె | నిత్యము | నిచ్చలు |
| ప్రజ్ఞ | పగ్గె | | |

17. వ్యాకరణాంశములు :—

1. కంచరము+ఎద్దు = కంచరపుటెద్దు; బెట్టిదము+ ఉలివు=బెట్టిదపుటులివు;

సూ. కర్మధారయమందు మువర్ణకంబునకు పుంపు లగు=కంచరపు+ఎద్దు; (b) కర్మధారయమందు ఉకారము నకు అచ్చుపరంబగునపుడు టుగాగమంబగు=కంచరపుటెద్దు.

2. నాఁడు+నాఁడు=నానాఁడు

సూ ఆమ్రేడితంబు పరంబగు నపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు. ఇంచుక. నాఁడు ఇత్యాదులందు బహుళ గ్రహణముచేత అంతిమాక్షరలోపంబగు.

3. క్రేవ+కన్ను=క్రేఁగన్ను;

(a) సూ. సమాసంబున ప్రాతాదుల తొలి యచ్చు మీఁదివర్ణంబుల కెల్ల లోపంబుబహుళంబుగానగు=క్రే+కన్ను (b) లుప్తశేషమునకు పరుషంబులు పరంబగునపుడు దుగాగ మంబగు=క్రే+న్+కన్ను (c) ద్రుతప్రకృతికము మీఁది... సరళములగు=క్రే+న్+గన్ను. (d) ఆదేశసరళములకు...విభా షనగు=క్రేఁగన్ను.

4 విడి+విడి=విచ్చలవిడి

సూ అందమునకు ప్రభృతులు యథా ప్రయోగంబు గ్రాహ్యంబులు.

5 ప్రమాదము+పడు=ప్రమాదపడు; ప్రమాదంపడు;

సూ. పడ్వాదులు పరంబగునపుడు మువర్ణమునకు లోప, పూర్ణబిందువులు విభాషనగు.

6. మాత్రము+న=మాత్రాన

సూ. లు, ల, నలు పరంబగునపుడు ఒకానొకచో ముగాగమంబునకు లోపంబును తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు;

7. కడు+ఎదురు=కట్టెదురు.

సూ. కఱు, చిఱు, కడు...ద్విరుక్త టకారంబగు.

8 మొరము+నేల=మొరపనేల

సూ. క్రొందొకచో సమాసంబులందు నామ్వాది కను మ్వాదుల మువర్ణంబులు పఞ్చవర్ణంబులగు;

9. ప్రభువు+ఎదుర=ప్రభువు నెదుర.

సూ. షష్ఠీ సమాసమందు ఉకార ఋకారములకు అచ్చు పరంబగు నపుడు నుగాగమంబు

10. బెట్టిదము+కూత=బెట్టిదపుఁ గూఁత.

(a) సూ. కర్మధారయమందు...పు ంపులగు = బెట్టిదపు+కూఁత. (b) సమాసంబుల ఉదంత స్త్రీ సమంబులకును, పుంపులకును పరుష సరళములు పరంబగునపుడు నుగాగమంబగు=బెట్టిదపు+న్ +కూఁత (3) ద్రుత ప్రకృతి...సరళములగు బెట్టిదపు +న్+ గూఁత (4) ఆదేశ సరళ......విభాషనగు=బెట్టిదపుఁ గూఁత.

18 సంస్కృత సంధులు :—

సవర్ణదీర్ఘ సంధి :—పురుష+అర్థము= పురుషార్థము; పర+అధికారము = పరాధికారము; సత్వ+అనురూపము= సత్వానురూపము; భోజన+అర్థము=భోజనార్థము,

గుణసంధి :—స్వ+ఉదర = స్వోదర; అత్యంత+ఉప కారకము=అత్యంతోపకారకము; పర+ఇంగితము = పరేంగితము; కాల+ఉచితము=కాలోచితము.

జశ్త్వసంధి :—తత్+భావము=తద్భావము; సత్+వర్తనము = సద్వర్తనము; తత్+అనుగ్రహము = తదనుగ్రహము;

యణాదేశసంధి :—కృషి+ఆది = కృష్యాది; అతి+అంతము=అత్యంతము.

19. సమాసపదములు విడదీయుట:—

| వ. సం | సమాసపదము | విడదీయుట | విగ్రహము | సమాసము పేరు |
|---|---|---|---|---|

(a) క్రూరసత్వము—క్రూర+సత్వము - క్రూరమైన సత్వము— విశేషణ పూర్వపద కర్మధారయము. (భీషణ ఘోషణము)

(b) సంజీవకరావము—సంజీవకము + రావము-సంజీవకము యొక్క రావము-షష్ఠీతత్పురుషము. (యమునా కచ్ఛము).

(c) హితాహితములు—హిత+అహితములు—హితమును, అహితమును—ద్వంద్వసమాసము.

(d) సత్త్వానురూపము—సత్త్వ + అనురూపము—సత్త్వమునకు అనురూపమైన—షష్ఠీతత్పురుషము

(e) నిరపాయము—నిర్+అపాయము - అపాయము లేని—అవ్యయీభావము.

(f) ప్రతిభాశాలి ..ప్రతిభా+శాలి-ప్రతిభచేత ఒప్పు వాఁడు—తృతీయాతత్పురుషము.

(g) అవిరుద్ధము—న+విరుద్ధము—విరుద్ధము కాని—నఞ్ తత్పురుషము.

20. కఠినపదముల కర్థములు:—

కంచరము=బండి; నడ్డి=ఎద్దు; ఇక్కుదప్పు = ఆపద; మీసరము=శ్రేష్ఠము; కచ్ఛము=ఒడ్డు; ఉలివు=ధ్వని; మృత కల్పుడు = చచ్చినవానితో సమానుడు; కారువు = వడ్రంగి; కాలచోదితము=కాలముచే ప్రేరేపింపబడినది; వేపి=కుక్క; ఆధోరణుడు=మావటివాడు; అంగమచ్ఛము=గుర్తు;

# నాగానందము

సంస్కృతభాషలో హర్షుడు నాగానంద మను నాటకమును రచించెను. దానిని కొత్తపల్లి సూర్యారావు గారు తెనుగుచేసి గద్యములో వ్రాసిరి. ఇంకను నితరనాటకములు తెనుగుచేసి దానికి సంస్కృతనాటక కథాసారము అను పేరు పెట్టిరి. వీరికి అరవము కన్నడము హిందీ మొదలైన భాషలలోకూడ పరిచయము గలదు.

## కథా సంగ్రహము

జీమూతకేతుడు విద్యాధరాధిపతి. అతని కుమారుడు జీమూత వాహనుడు. కొడుకునకు పట్టాభిషేకము చేసి జీమూతకేతుడు భార్యతో కూడ వనమునకు బోయెను. పితృసేవా పరాయణుడగు జీమూతవాహనుడు మిత్రుడగు ఆత్రేయునితో ననుదినము పోయి తలిదండ్రుల సేవచేసి వచ్చుచుండును పరోపకారము, సత్యధర్మదయా శౌచములు వాని స్వాభావికగుణములు. ఒకనాడు తండ్రి మలయ పర్వతమున తన కొక పర్ణశాల నిర్మింపుమని కుమారుని కోరెను. వెంటనే తండ్రి కోరిక నెఱవేర్చ మలయగిరిపై విహరించుచుండెను. కొంతదూరమునుండి వీణానాదము వినిపించెను. మిత్రునితో గూడ ముందునకు సాగిపోగా నట గౌరి ఆలయ మగపడెను. అట మలయవతి యను స్త్రీ వీణ వాయించుచుండెను. చతురిక ఆమె చెలికత్తె.

కొంత సేపటికి చెలికత్తె మలయవతితో నీవెంత సేపు దేవి నారాధించినను ఆమెకు నీపై దయ గలుగుట లేదనెను. మలయవతి చెలి మాట వారించి దేవికలలో గనిపించి విద్యాధరచక్రవర్తి భర్త కాగలడని చెప్పినదని పలికెను. జీమూతవాహనుఁడు ఆమె మాటలను బట్టి కన్యయని తలంచి సమీపమునకు పోవుట తప్పు కాదని మిత్రునితో కూడ ముందునకు పోయెను. మలయవతి జీమూతవాహనుని సౌందర్యమును చూచి యాశ్చర్యపడి దేవి చెప్పిన యాత డితడేమోయని చతురిక పలుక మలయవతి సిగ్గున వెనుకకుబోవ నప్పుడే మధ్యాహ్నమైనది రమ్మని రాజాజ్ఞయని చెప్పెను. మలయవతి యక్కడనుండి వెడలెను.

మలయవతి తండ్రి కౌశికుఁడు కుమార్తెకు పెండ్లి చేయనెంచి తన కుమారుఁడగు మిత్రావసువును జీమూతవాహనుని కడ కంపెను. అతడు వెళ్ళి చాల సేపటివఱకు రాకుండుటచే మలయవతి జీమూతవాహనుని యెడబాటు సహింపలేక యుద్యానవనములోనికి పోయెను. జీమూతవాహనుఁడు గౌరి ఆలయముదగ్గర చూచిన మలయవతినే మనస్సున నుంచుకొని నిద్రించుటచే మలయవతిని పోలిన స్త్రీయే కలలో నగపడి ప్రణయమున కోపగించినట్లు కలగని మెలకువ తెచ్చుకొని యామె యింకను నక్కడనే యుండునని యుద్యానవనములోని పొదరింటివైపునకు వచ్చుచుండెను.

ఎవరో వచ్చుచున్నారని మలయవతి చతురికతో వేఱొక పొదమాటునకు పోయెను. జీమూతవాహనుఁడు

మలయవతి పటమును వ్రాసి యానందించుచుండెను. అన్నగారు శుభవార్త యింకను తేలేదని మలయవతి తహతహపడుచుండెను. మిత్రావసువు వెదకికొనుచు జీమూతవాహనుండున్నచోటికి వచ్చెను. జీమూతవాహనుండు చిత్రపటమును కప్పిపుచ్చి తాను వచ్చిన పని యేమని యడిగెను. తన చెల్లెలి నిచ్చి వానికి వివాహము చేయవలయునని మిత్రావసువు జీమూత వాహనునితో చెప్పెను. మిత్రావసువు చెల్లెలిని పెండ్లాడజాలననియు తన మనసీవఱకొక స్త్రీకి దత్తమైనదనియు నిష్కర్షగా చెప్పివేసెను. తాను గౌరీ నిలయమున చూచి ప్రేమించిన స్త్రీయును మిత్రావసువు చెల్లెలునొక్కతే యను సంగతి జీమూతవాహనునకు తెలియదు. జీమూతవాహనుండు తండ్రిమాట దాటడని యెఱిగి మిత్రావసువు పెండ్లి నిశ్చయమున కచ్చటికి వెళ్ళెను. చాటునుండి జీమూతవాహనుని మాటలు విన్న మలయవతి మూర్ఛపోయెను.

మలయవతి నిరాశచేసికొని యురిపోసికొని చనిపోవుటకు సిద్ధపడుచుండెను. అంతలో చతురికవచ్చిచూచి 'రక్షింపుడు రక్షింపుడు. మా చెలిచావనున్న'దని కేకలువెట్టెను. జీమూతవాహనుండా మాటలువిని యచ్చటికిపోయిచూడగా తానుకలలోచూచిన స్త్రీయు నామెయు నొక్కతెయే యగుటకు యామె మరణమునకు కారణమడిగెను. చతురిక కారణము వివరించెను. జీమూతవాహనుడు మలయవతి చేయి

పట్టుకొని తీసికొనిపోయి తానుచిత్రించిన పటమును చూపెను. ఆ బొమ్మ యామెదే యగుట మలయవతి సిగ్గుపడెను. మీ యిరువురకు నిపుడు గాంధర్వ వివాహమైనదని యాత్రేయుడు వారి నాశీర్వదించెను.

మిత్రావసువు జీమూత కేతువుదగ్గరకుంబోయి పెండ్లి విషయము చెప్పి యొప్పించి ముహూర్తమునుకూడ నిశ్చయించెను. విశ్వావసువు మలయవతి తండ్రి మంగళస్నానాంతరము మలయవతిని తీసికొనిరమ్మని యాజ్ఞాపించుటచే చెలికత్తెయొకతెవచ్చి యామెనింటికి తీసికొనిపోయెను. శుభ ముహూర్తమున వివాహము వైభవముగా జరిగినది. పెండ్లి సందడిలో మతంగుడను రాజు జీమూతవాహనుని రాజ్యము లాగుకొని యేలుచుండెను. పరోపకారపరాయణుడగు జీమూత వాహనుడు చాలసంతసించెను.

ఒకనాడు మిత్రావసువుతో జీమూత వాహనుడు షికారువెళ్ళెను. అక్కడకొన్ని తెల్లగుట్టలుగుపడగా నవి యేమని జీమూత వాహనుడు బావనడిగెను పూర్వము గరుడుడు నాగలోకమునకుపోయి నాగులను తినివేయుచుండగా వాసుకి యొక నియమము చేసినాడనియు దినమున కింటి కొక్కొక నాగునంపెదమనియు నాగలోకము నాశనముచేయ వలదని కోరగా నతడంగీకరింప నిత్యమొక నాగు నిక్కడకంపగా నతడు తినుచుండెననియు నాగుట్టలు నాగులయెముకల గుట్టలనియు చెప్పెను. ఆమాటలకతని శరీరము కంపించెను.

చాలవిచారపడెను. పరోపకారమునకు గాని యీజన్మమెందు కని దుఃఖించెను. అంతలో నొకభటుడువచ్చి రాజాజ్ఞయని మిత్రావసువును తీసికొనిపోయెను.

జీమూతవాహనుఁడు సముద్రతీరమున పోవుచుండగ నొక ఆడుకూయి వినిపించెను. ఆనాడు శంఖచూడుడను నాగునివంతు వచ్చినది. ఒక్కడే కొమరుడగు వానినెదుట బెట్టుకొని యాతల్లి విచారించుచుండెను. జీమూత వాహనుడా తల్లినోదార్చి వారు వలదనివారించుచున్నను వినక శంఖ చూడునకు ముందుగాబోయి తాను గరుత్మంతున కాహార ముగాఁబోయెను. పెండ్లియైన పదిదినములలో ఎఱ్ఱనివస్త్ర ములు ధరింపవలయునను నాచారానుసారము పెండ్లివారు జీమూతవాహనున కెఱ్ఱనివస్త్రములంపిరి. ఎఱ్ఱనివస్త్రములాన వాలుగా గరుడుడు నాగుని భక్షించుచుండును. ఎఱ్ఱవస్త్రము లతో జీమూతవాహనుడుపోయి వధ్యశిలపైనుండ గరుడుడు వచ్చి యతడు నాగుడేయని తినివేయ నారంభించెను. జీమూత వాహనునికొఱకు తలిదండ్రులు వెదుక జొచ్చిరి. శంఖచూడుని వలననే యీవృత్తాంతము తెలిసికొని యందరు వధ్యశిల దగ్గర చేరిరి. శంఖచూడుడును వధ్యశిలదగ్గరకువచ్చి తాను భక్షించుచున్నది, మహానుభావుడగు జీమూతవాహనునని గరుడునితో చెప్పగా గరుడుడు భయాశ్చర్యముల నొందెను. తా నొనరించిన పనికి చాలదుఃఖించెను. జీమూతవాహనుఁడు బాధచే చనిపోయెను. అమృతమైననుపోసి బ్రతికింపలేదని

జీమూతవాహనుని తలిదండ్రులు దేవలోకము ప్రవేశించిరి. ఆమాట గరుడుడువిని పరోపకారపరాయణుడగు జీమూతవాహనుని బ్రతికించెదనని యమృతమును తెచ్చుటకు స్వర్గలోకమునకు పోయెను. అందరును అగ్నిప్రవేశము చేయుటకు సిద్ధముగానుండిరి. మలయవతి చితిపేర్పించి యందుపడబోవుచు "గౌరీ! నాకు జీమూతవాహనుడు భర్తయగునని వరమిచ్చితివి. నీమాట అబద్ధమని యనుకొనలేను. మరుజన్మమున నితడే నాకు భర్తయగునట్లు చేయుము" అని యాపతివ్రత పలుకునంతలో పార్వతి ప్రత్యక్షమై యామె సాహసమును వారించి జీమూతవాహనుని బ్రతికించెను. ఇంతలో గరుడు డమృతమును తెచ్చి జీమూతవాహనునిపై నచటినాగుల ప్రోగులపై చల్లెను. నాగులందఱు జీవించిరి. జీమూతవాహనుడు వజ్రకాయుడయ్యెను. గరుడుడది మొదలు జీవహింసమానినాడు. నాగలోకము దీపముపెట్టి జీమూతవాహనుని మ్రొక్కినది. మతంగుడు సిగ్గుపడి జీమూతవాహనునకు వానిరాజ్యమిచ్చివేసినాడు.

## ప్రతిపదార్థములు

58 రాజ్యాభిషేకము = పట్టాభిషేకము; తపస్ + శాలి = తపస్సుచేత ఒప్పువాడు; కంద = దుంపలు; మూల = వేళ్ళు; ఫల + ఆదులు = పండ్లు మొదలైనవి; పర్ణశాల = ఆకు

టిల్లు; శిరసావహించి=నెత్తిపైఁబెట్టుకొని; ఏంచు=వెళ్ళు మ
నాశనసహితము=నాశనముతో కూడినది;

విశే:—తపస్+వనము = తపోవనము – విసర్గసంధి – చతుర్థీతత్పురుషము–ప్రతిదినము–అవ్యయీభావము; మలయ పర్వతము – సంభావన పూర్వపదకర్మధారయము;

59. యౌవనము=పడుచుదనము; అశాశ్వతసౌఖ్యము =నిలుకడలేని సుఖము; వనవాస+ఆయాసమునన్ = అరణ్యవాసము వలన కలిగిన శ్రమవలన; మేనులు = శరీరములు; వంశభూషణుడు=వంశాలంకారము; నెయ్యుడా=స్నేహితుడా ఏల్బడి=పరిపాలన; వీణానాదము = వీణయొక్క ధ్వని, కుతూహలము=సంతోషము;

విశే:—యౌవనము (ప్ర) జవ్వనము (వి); భద్రము+పఱచి=భద్రపఱచి; పడ్వాదిసంధి

60. స్వప్నము=కల; ఆరాధన=పూజ; శంకించిరి=సందేహించిరి; కాంతలు=స్త్రీలు; మన్మథ+ఆకారుడు=మన్మథుని యాకారమువంటి ఆకారముగలవాఁడు; లజ్జాభరంబునన్ = సిగ్గు యొక్క పెంపుచే;

61. దృష్టి=చూపు; సఖీ=చెలీ !; సముచితము=తగినది; సత్కరించెదను=గౌరవించెదను; చక్రరేఖలు = చక్రాకారముగల రేఖలు (శంఖము, చక్రము మొదలైన రేఖలు) ఏవారివో = ఎవ్వరివో; కైకొనుటకు = గ్రహించుటకు; జవ

దాటుట = అతిక్రమించుట; ఉఱ్ఱూటలు ఊరుచు = మిక్కిలి ఆసక్తికలది యగుచు; పతి = భర్తను;

విశే:—అనతి (వి) ఆజ్ఞప్తి (ప్ర);

62. విరహము=ఎడబాటు (కోరిక); లతాగృహము= తీగటిల్లు; గౌరీగృహము=దేవిఆలయము, అలజడిపడి యెదవు= బాధ పడెదవు; పువ్వు+ఈటము=పూలపొద; కొంపోయ్యి= తీసికొనిపోయ్యి; అభిలాషము=కోరిక; ఉవిదతో = స్త్రీతో; లతావాటికకు=తీగటిండ్లవరుస (ఉద్యానవనము); సంతాపము =విచారము; దృష్టాంతము=తార్కాణము; రాజమన్మథుడు= మన్మథునివంటి రాజు; చతురికను = చాతుర్యముకల దానను (చతురిక యను పేరుసార్థకము చేసికొనగల్గుదునేని);

విశే:—గృహము (ప్ర) గీము (వి); పువ్వు+ఈటము =పువ్వుటీరము - సూ, కర్మధారయ మందు ఉకారమునకు అచ్చుపరం బగునపుడు టుగాగమంబగు;

63. తేక = తీసికొనిరాక; యోచించు చుండెను = ఆలోచించు చుండెను; గౌరీనిలయము = దేవి ఆలయము; ఒక్క ఉవిద=ఒకస్త్రీ; ప్రణయము=ప్రేమ; లతాగృహము= తీగటిల్లు; అభిలాష= కోరిక; విరహవేదన = ఎడబాటువలన బాధ; స్వప్నవృత్తాంతము=కలసంగతి; ఉపాలంభించినదో = నిందించినదో (దెప్పుట), ఒడలు=శరీరము;

విశే :— ఉవిద (వి) యువతి (ప్ర) పొదరు+ఇల్లు = పొదరిల్లు; పొదరుటిల్లు—సూ, కర్మధారయంబునందు పేర్వాది

శబ్దములకు అచ్చుపరంబగునపుడు ఉగాగమంబు వికల్పముగ; చంద్రకాంతము + ఆయి = చంద్రకాంతపుటాయి — సూ కర్మధారయంబునందు మువర్ణమునకు పుంపులగు;

64 నిస్పృహాత్మ = ఆశ లేమితో; ఉపాసించెను = ఓదార్చెను; మోహనాంగి = స్త్రీ; తలపుతో = ధ్యానముచేత (తలచినంత మాత్రమున)

ఇశ్లో :— వలకు (శి) ఘంటము (వ) కృతి (సి) (స్త్రీ) (ప్ర)

65, అంగనను = స్త్రీని; మదవతికై = స్త్రీకొఱకు; భ్రమ = భ్రాంతి; చేటిక = పరిచారిక; పశ్చాత్తాపము = వెనుక విచారించుట; నిరాకరించిన = తిరస్కరించిన; ముడిపెట్టి = ముడిపెట్టి; అతి ముక్తలతలు = పూలగుత్తి కనకలతలు; అనుగ్రహము = దయ; మనఃస్థిమితము లేని = మనస్సు నిలకడ లేని; ఉంకించుచున్నది = ప్రయత్నించుచున్నది; హస్తము = చేయి; కఠోరతకు = కఠినమైన పనిచేయుటకు; శక్తుడు అయినది = చాలినది;

66. అపరాధి = తప్పుచేసినవాడు, తెగించుటకు = సాహసించుటకు; హితుడు = స్నేహితుడు; నిరపరాధి = తప్పులేనివాడు; శిలాతలము = రాతిప్రదేశము; పొడమిన = కలిగిన; గాంధర్వ వివాహము = వధూవరులు పరస్పరేచ్ఛ చేత చేసికొను వివాహము (అష్టవిధ వివాహములు—బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, రాక్షసము, ఆసురము, గాంధర్వము, పైశాచము)

67. ఒద్దికి=ఒద్దకు; వధూవరులు = పెండ్లికూతురు, పెండ్లికొడుకు; వ్రుతినొందింపక = చంపుటకు; అనువుగా = తగినట్లు; వలను=వీలు; వ్యర్థము=నిష్ప్రయోజనము; శరత్ + మేఘము=శరత్కాలమునందలి మేఘము; మలయసానువు= మలయపర్వతపు కనుమలు; భాసిల్లుచున్నవి = ప్రకాశించు చున్నవి; ఎమ్ములు=ఎముకలు; జాలిగొని=దుఃఖపడి; నాగ లోకము=పాతాళలోకము; వెఱచి=భయపడి. తత్+కారణ మునక=ఆ హేతువుచే;

68. పంకయుతము=పాపముతో కూడినది; అశాశ్వ తము=నిలుకడలేనిది; పాతకము=పాపము; ఒక్క-జీవమును= ఒక్క-ప్రాణిని; ప్రతీహారి=ద్వారపాలకుడు (సేవకుడు) నూతన వధూవరులు=క్రొత్తదంపతులు, ప్రతిపత్+ఉత్సవము=ప్రతి పదుత్సవము—పాడ్యమినాడు చేయు నుత్సవము—దీపా రాధనచేసి యాయుత్సవమును చేయుదురుగాన దీపప్రతిపదు త్సవమని పేరు; ఆటంకసహితము = అడ్డుతో గూడిన; నిర్ద యుడు=దయలేనివాడు; జీవులను=ప్రాణులను; దాదివలె = పెంపుడు=తల్లివలె; అనిత్యత=అశాశ్వతత్వము (శాశ్వతము కానిపోవుట) అనిత్యత్వము=అస్థిరత్వము;మాత=తల్లి;

69. వృద్ధురాలు=ముసలిది; పక్షి+ఇంద్రుడు=పక్షు ప్రభువు (గరుడుడు) నాగకులభయంకరము=నాగకులవంశ ములకు భయమును కలుగఁజేయు, సౌమ్యమూర్తి = శాంత మైన ఆకారముగలవాడు; పాపపురుష్ణులు = పాపపు జీవులు

(పాము+పురుష=పాఁపపురుష – పాముజాతి పురుగని వ్యుత్పత్త్యర్థము); అరుదు=దుర్లభము;

విశే :—వృద్ధ+ఆలు = వృద్ధురాలు – రుగాగమసంధి; పక్షి+ఇంద్రుఁడు= పక్షీంద్రుఁడు – సవర్ణదీర్ఘసంధి; పాము + పురుష=పాఁపపురుష – నామ్యాదికనుమ్యాదిసంధి;

70. ఉడిగి=విడిచి; కుసుంభవస్త్రములు=ఎఱ్ఱనిబట్టలు (కుసుంభ మనగా కుంకుమపువ్వు – కుంకుమపువ్వురంగుబట్టలు) తలవని తలంపుగా=అనుకోకుండ; దివమునన్ = స్వర్గమున; దుందుభులు=భేరులు;

71. వేల=పొలిమేర; సముద్రవేల = సముద్రతీరము; వగవన్ చొచ్చెన్=విచారింపసాగెను; శిరోరత్నము=శిరస్సునందలి మణి; ఉమ్మలింపసాగెను = దుఃఖింప సాగెను; ప్రేరణము=ప్రోత్సాహము,

72. కలఁత=విచారము; చూడామణి=శిరోరత్నము; విషధరుడు = విషమును ధరించినవాడు (పాము అని వ్యుత్పత్త్యర్థము) మఱుమేలు=ప్రత్యుపకారము; ఆశ్వాసించు చుండెను= ఓదార్చుచుండెను. సహగమనము = భర్తతోకూడ చనిపోవుట; నాగవిరోధి=గరుడుఁడు;

73. పక్షిపుంగవుడు = పక్షిశ్రేష్ఠుడు; వ్యసనపడు = దుఃఖపడు; అచలము=పర్వతము; చారణులు ఖేచరజాతి (దేవతాజాతి) పన్నగ+అశనునకు=పాములు ఆహారముగా గలవానికి అనగా గరుత్మంతునకు;

74. ప్రాయశ్చిత్తము=పాపపరిహారార్థము చేయుకర్మ; బడబానలము=బడబయను పేరుగల అగ్ని;

75. తనయుఁడు=కుమారుడు; తడవి=చేతితో రాచి; నవయౌవనశోభ=క్రొత్తపడుచు దనము కాంతి; సుపర్ణు=గరుడుడు (మంచిరెక్కలుగలవాడు) సరోవరములో=చెఱువులో; నాగకులము=పాముజాతి; విహరించును=సంచరించును; నాగ అంగనలు=నాగస్త్రీలు; అనవరతము=ఎల్లప్పుడు; గీతప్రబంధములు = కావ్యగీతములు;

76. దారువులు=కఱ్ఱలు; మందభాగ్య + ఆలు=దురదృష్టవంతురాలు; మృషావచనను = అబద్ధమాడుదానను; మింటన్=ఆకాశమందు; భవాని=పార్వతి (భవునిభార్య భవాని—ఇంద్రునిభార్య ఇంద్రాణి) ఎముకలగుట్టలు=ఎముకలదిబ్బలు; తనివితీఱన్=తృప్తితీఱునట్లు; తేరును=రథమును; వెల్లగుట్టము=తెల్లగుట్టము;

77. వశమయినాడు= స్వాధీనమైనవాడు; వర్ధిల్లునట్లు=పెంపొందునట్లు; అంబ=గౌరి; అంతర్ధానమునుపొందెను=అదృశ్యురాలయ్యెను; స్వస్థానములకున్=తమతమ చోట్లకు;

ప్రశ్నోత్తరములు:—

1. నాగానందమును సంస్కృతములో నెవరురచించిరి?

నాగానందమును సంస్కృతములో హర్షుఁడురచించెను.

2. స్వేచ్ఛగా రాజ్యభోగము లనుభవించుమని బోధించు నాత్రేయునకు జీమూతవాహనుఁ డేమి సమాధాన మిచ్చెను?

"ఆత్రేయా! నాకు తండ్రియొద్దఁ గూరుచుండిన నుండు సౌఖ్యము సింహాసనమున నున్నను ఉండదు. తండ్రి పాదము లొత్తు సౌఖ్యమును తండ్రి తిని విడిచినదానిం దిను సౌఖ్యమును నాకు రాజ్యమువలన గలుగవు. తలిదండ్రులను వదలితినా రాష్ట్రము నాకెంతయో బరువుగా నుండు"నని జీమూతవాహను డాత్రేయునితో బల్కెను.

3. "మీ యిరువురకు నిట్లు గాంధర్వవివాహ మైనది" ఎవరికి? ఎట్లు?

మలయవతీ జీమూత వాహనులకు.

జీమూత వాహనుఁడు జీమూత కేతువు కుమారుడు. మలయవతి కౌశికుని కూతురు. మిత్రావసువు చెల్లెలు ఒక నాడు జీమూతవాహనుఁడు మలయగిరికి చెలికాడగు ఆత్రేయు నితో విహారమున కేగెను. వానికి కొంచెము దూరములో వీణానాదము వినిపించెను ఆ నాదమును బట్టిపోగా నట గౌరి ఆలయమున్నది. మలయవతి వీణ వాయించుచుండెను. ఆమె చెలికత్తె చతురిక ప్రక్కనున్నది. ప్రసంగవశమున విద్యాధర చక్రవర్తి తనకు భర్త కాగలడని గౌరి కలలో చెప్పినదని మలయవతి చతురికతో పలికెను. జీమూత వాహనుడు ఆ మాటలు విని యామె కన్యయే యని దగ్గరకు పోయెను. ఆ

మన్మథాకారః మలయవతి చూచి సిగ్గుచే చాటునకు వెళ్ళెను. అంతలో రాజాజ్ఞ యని మలయవతి యింటికి వెళ్ళినది.

కౌశికుడు మలయవతిని జీమూతవాహనున కిచ్చి పెండ్లి చేయ సంకల్పించి తన కుమారుడగు మిత్రావసువును జీమూత వాహనుని దగ్గరకు పంపెను. అతఁడు వచ్చుసరికి గౌరి ఆలయ మున చూచిన స్త్రీపటమును జీమూతవాహనుఁడు వ్రాయు చుండెను. మిత్రావసువును చూచి యతఁడా పటమును దాచెను. మనసు నిలకడలేక మలయవతి జీమూతవాహనుని వెదకుకొనుచు వచ్చి తన యన్న వానికడనుండుట చూచి పొదచాటున దాగియుండెను. తనకు స్వప్నములో కనబడిన కన్నెయే యా గౌరి ఆలయమున కనిపించినదని లోన సంత సించుచుండెను. మిత్రావసువు తన చెల్లెలిని పెండ్లాడుమని జీమూత వాహనుని కోరుచుండెను. తానిదివఱకే తన హృద యము నొక స్త్రీ కర్పించినాడనియు వాని చెల్లెలిని పరిగ్ర హింప వీలులేదనియు నిష్కర్షగా జీమూత వాహనుఁడు మిత్రావసువుతో చెప్పెను. తాను చెప్పి లాభము లేదనియు జీమూతవాహనుడు తండ్రిమాట దాటడు గాన పోయి వానితో చెప్పవలెనని మిత్రావసువు బయలుదేరి వెళ్ళెను. జీమూత వాహనుడే స్త్రీకై యిప్పుడు విరహము ననుభవించు చున్నాడో యామెయు నీమెయు నొక్కతె కాదని యతని యభిప్రాయము.

పోవచ్చునండి వానిమాటలను విన్న మలయవతి మూర్ఛపోయి కొంతసేపటికి తెలివొంది యింక బ్రతికి ప్రయోజనము లేదని నిశ్చయించుకొని చనిపోవుటకు ఉరిపోసికొనబోయెను. చతురిక మాచెలి రక్షింపుడు రక్షింపుడు. మాచెలి ప్రాణములు పోగొట్టుకొనుచున్నదని కేక వేసెను. ఆ కేక విని జీమూతవాహను డచ్చటికి పోయి యామె తన ప్రియురాలే యని యాశ్చర్యపడి చతురిక వలన కారణము తెలిసికొని యతడు సంతసించెను. ఆమె చేయి పట్టుకొని యామె ప్రయత్నమును మాన్పించెను. ఆత్రేయుడు మిత్రావసువు ప్రార్థించిన దింకొక చిన్నదాని కొఱకని యనుకొని మా రాకుమారుడు తిరస్కరించినాడు. అమ్మా! మా హితుడు నిరపరాధి. నీ ప్రతిమనే వ్రాసి యా శిలాతలమున నుంచినాడు చూడు"మనెను. జీమూతవాహను డామె చేయి పట్టుకొని యా శిలాతలము దగ్గరకు తీసికొనిపోయి పటమును చూపెను. తన రూపే యందు వ్రాయబడి యుండుటచే మలయవతి పొంగిపోయెను. అపు డాత్రేయుడు "మీ యిరువురకును నిట్లు గాంధర్వ వివాహమైనది" అనెను.

*4. శంఖచూడుని వృత్తాంతమును వ్రాయుము.

పూర్వము గరుత్మంతుడు నాగలోకమునకుం బోయి పాముల నెత్తుకొనివచ్చి మలయపర్వత సానువులలో పెట్టుకొని తినుచుండెను. ప్రతిదినము లెక్కలేనన్ని నాగులు చనిపోవుచుండెను. నాగలోక ప్రభువు వాసుకి యది చూచి

కొలది దినములలో సర్పజాతము నాశనమగునని విచారించి యతడు దినమునకొక్క నాగుని చొప్పున నాహారముగా బంపెదమనియు ననుదినము పెక్కు నాగులను జంపినచో మున్ముందు తన కాహారమే యుండదనియు వర్తమాన మంపెను. గరుడు డాలోచించి వాసుకి సూచనకు సమ్మతించెను. అది మొదలు ప్రతిదినము నాగలోకమున వంతు ప్రకారము నాగుడొకడు గరుడున కాహార మగుచుండెను.

ఒకనాడు శంఖచూడుడను నాగుని వంతు వచ్చెను. వాని తల్లి ఏకైకపుత్రుడగు శంఖచూడుని కొఱకు విలపించుచుండెను. దేహము శాశ్వతములని సుఖము లనిత్యములని యాతడు తల్లికి బోధించి పరిపాటిగా ఎఱ్ఱబట్టలను ధరించి వధ్యశిల నెక్కుటకు బోవ సిద్ధపడుచుండగా నాడు దాని యార్తధ్వనిని క్రొత్తగా పెండ్లియైన జీమూతవాహనుడు ఆనాగ మాత దుఃఖమును పోగొట్టి యామె కొడుకును రక్షించి తాను గరుడున కాహారముగా బోయి తన జన్మసార్థకము చేసికొందు నని సిద్ధపడెను. ఆమె వాని యాకారము చూచి పరోప కార పరాయణతను గుర్తించి వలదని వారించెను. శంఖ చూడుడును వలదని వాని ననేక విధముల ప్రార్థించి యెఱ్ఱ బట్టలను తీసికొని ముందుగా గోకర్ణేశ్వరు నాలయములోనికి వెళ్ళెను. జీమూతవాహనుని యత్తవారా సమయమునకు ఎఱ్ఱబట్టలనుపంపి యదివారియింటి యాచారము కట్టుకొమ్మని యాజ్ఞాపించిరి. అది మంచి సమయముగా పరిగణించి యెఱ్ఱ

బట్టలు ధరించి శంఖచూడుని కంటె ముందుగా బోయి వధ్య శిల నెక్కెను. ఎఱ్ఱనిబట్టలే యానవాలుగా పెట్టుకొన్న గరుడుడు, వచ్చినవాడు నాగుడే యని వానిని తిని వేయుట మొదలుపెట్టెను. సగముపైగా తినివేయునంతకే గోకర్ణేశ్వరాలయమునుండి శంఖచూడుడు వచ్చిచూచి "నేను పాపాత్ముండను, నా నిమిత్త మొక మహానుభావుని ప్రాణములు తీసితిని" అని దుఃఖించి జీమూతవాహనునకై విచారించుచున్న తలిదండ్రులకు భార్యకు నావార్త చెప్పి గరుడుని బ్రతిమాలుదమని వాని కడకు తీసికొని వచ్చెను.

"పక్షిరాజా! నీవు మహాపాపము చేసితివి. అతడు పరోపకార పరాయణుడగు జీమూతవాహనుడు. నేను నీ కాహారమైన శంఖచూడుడను" అని శంఖచూడుడు వాని యెదుట బడెను. గరుడడిదిని ఖిన్నుడై తాను చేసిన పనికి ప్రాయశ్చిత్తము లేదని విచారించి యింద్రలోకమునకు పోయి యమృతము తెచ్చి జీమూతవాహనునిపై చల్లెను. తక్కిన నాగులపై చల్లి మున్నెన్నడో చచ్చిన వానినికూడ బ్రతికించెను.

జీమూతవాహనుని కోసమగ్నిప్రవేశము చేయవలయునని వృద్ధదంపతులు పలుకగా శంఖచూడుడు కూడ వారితో బాటగ్నిప్రవేశమునకై సిద్ధపడెను. జీమూతవాహనుని దయ వలన శంఖచూడుడు బ్రతికెను గరుడు డది మొదలు జీవ హింస మానినాడు.

5. జీమూత వాహనుని వృత్తాంతమును సంగ్రహముగా వ్రాయుము ?

జీమూతవాహనుఁడు విద్యాధరచక్రవర్తి. రాజ్యమును కూడ విడిచి వానప్రస్థాశ్రమమున నున్న తలిదండ్రుల సేవయే నిరంతరము చేయువాఁడు వారిపాదములొత్తనిదే యేనాడు భుజింపఁడు. పరోపకారపరాయణుఁడు. అతఁడు రాజ్యమును వీడి తిరుగుచుండుట చూచి మతంగుడను విరోధి రాజ్యమాక్రమించుకొనెను. అదివిని జీమూతవాహనుఁడు తండ్రి సేవ చేయుట కెక్కువకాల మవకాశము చిక్కెనదనిసంతసించెను. అతఁడేకపత్నీవ్రతుఁడు. మలయవతిని పెండ్లియై యొకానొక నాఁడు బావయగు మిత్రావసువుతో మలయపర్వత సమీపమున విహరించుచు నాగుల యెముకలగుట్టలను చూచి విచారించి యశాశ్వతమైన శరీరమునైననిచ్చి నాగులను కాపాడ లేని జన్మయెందు కనెను. అప్పటికి పెండ్లియై పదిదినములైన కాలేదు. ఏమి యా త్యాగము ! ఆపరోపకార పరాయణత !

ఒకనాఁడు సముద్రతీరమున పోవుచుండ ముదుసలినాగుమాత యేడ్పువినవచ్చిన వెంటనే యామెవిచారమునకు కారణము తెలిసికొని ఆమె వలదని వారించుచున్నను వినక ఆమె కుమారుఁడగు శంఖచూడునకు బదులుగా గరుత్మంతున కత డాహారముగా వెళ్ళెను. శంఖచూడు డానవాలు కొఱకగు ఎఱ్ఱ బట్టలీయకున్నను తనకు దైవవశమున ఆనాడే యత్తవారంపిన యెఱ్ఱనిబట్ట ధరించి గరుత్మంతున కాహారముగా వెళ్ళెను.

6. 

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| యౌవనము | జవ్వనము | వీణ | వీణె |
| స్థలము | తలము | అజ్ఞప్తి | ఆనతి |
| గృహము | గీము | హృదయము | ఎద |
| యువతి | ఉవిద | ఫలకము | పలక |
| స్త్రీ | ఇంతి | ఆశ్చర్యము | అచ్చెరువు |
| సముద్రము | సంద్రము | స్నానము | తానము |
| ఆహారము | ఓగిరము | నిత్యము | నిచ్చలు |
| ధాత్రి | దాది | వస్త్రము | పాత |
| ప్రాయశ్చిత్తము | పాచితము | భృంగారము | బంగారు |

7. వ్యాకరణాంశములు:—

(a) మందభాగ్య+ఆలు = మందభాగ్యురాలు; వృద్ధ+ఆలు=వృద్ధురాలు; సూ. కర్మధారయమునందు తత్సమశబ్దములకు ఆలుశబ్దము పరంబగునపుడు రుగాగమంబును అత్వంబునకు ఉత్వంబునగు.

(b) వ్యసనము+పడు = వ్యసనపడు సూ. పడ్వాదులు పరంబగునపుడు...........

(c) రక్తము+జాడ= రక్తపుజాడ సూ. కర్మధారయమందు మువర్ణమునకుపుం పులగు.

# మొక్కలు పిలిచినవి

ఈ పాఠ్యభాగమును కొడవంటి నరసింహంగారు రచించిరి. ప్రకృతిశాస్త్రమునందు వీరగ్రగణ్యులు. తెనుగున శాస్త్రగ్రంథములు రచించిరి. వీరు కవిత్వము కూడ చెప్పగలరు. లోకబాంధవులు, ఎక్కడనుండియెక్కడికి మొదలగు గ్రంథములకు వీరికి ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు పోటీపరీక్షలో నొక్కొక్కదానికి వేయేసిరూపాయీలు బహుమానమిచ్చిరి. ఈపాఠ్యభాగము లోకబాంధవులను గ్రంథములోనిది.

## క థా సం గ్ర హ ము

ఢక్కా జిల్లాలో రాఢీల్ అను గ్రామముగలదు, అందు భగవాన్ చంద్రబోసుగలడు. అతడు ఫరీద్పూరుజిల్లాకు డిప్యూటీమెజస్ట్రేటు. అతడు సమర్థుడై యెవ్వరులొంగదీయ లేని దొంగలగుంపును దొంగలనాయకుని లొంగదీసెను

1858 సం॥రం॥ నవంబరు 30వ తేదీని భగవాన్ చంద్రునకు కొడుకుపుట్టెను. అతడే విశ్వవిఖ్యాతిగన్న జగదీశచంద్రబోసు. అతడు చిన్నతనమున విక్రమపురములో విద్యనభ్యసించెను. ఐదేండ్లు చెరసాలలోనుండి విడుదలయై వచ్చిన దొంగలనాయకుడు భగవాన్ చంద్రబోసు దగ్గరకు వచ్చి క్షమార్పణకోరుకొని వానియాశ్రయమునర్థించి యచట

సేవకుడుగా ప్రవేశించెను. అనాదినమాతను జగదీశుని శిక్షకు పురపాఠశాలకెత్తుకొని తీసికొనిపోవువాడు. నాలుగేండ్లు తరువాత జగదీశుడు కలకత్తాలో సైంటుక్సేవియరు కళాశాలకు సంబంధించిన పాఠశాలలోచేరెను. 16వ యేట మెట్రిక్ పరీక్షయం దుత్తీర్ణుడయ్యెను. అక్కడేపట్టభద్రుడై పిదప నింగ్లండువెళ్ళి యైదేండ్లు విద్యనభ్యసించెను. కలకత్తాలో భగవాన్‌చంద్రుని స్నేహితుడొకడు వైద్యశాస్త్రములో పరీక్షయిచ్చిన తనకూతురుఅబలను జగదీశునకిచ్చెదనని పెండ్లినిశ్చయించెను. ఇంగ్లండునుండి వచ్చినతోడనే అబలా జగదీశులవివాహము వైభవముగాజరిగెను.

మొక్కలకుకూడ ప్రాణముగలదని రెసానెండు రికార్డరను యంత్రమూలమున ఋజువుచేసెను. రాయల్‌సొసైటీ వారితనిని గౌరవించి యతని యత్నము వ్యాప్తము చేసిరి. కాని కొందరసూయాపరులుకూడ లేకపోలేదు. సత్యము జయించున్నట్లు తుదకతడే విజయమును పొందెను. అతడు మహాపురుషుడయ్యెను. భార్యయగు అబల యెల్లప్పుడు వానికి తోడునీడయై యుత్తమ సాధ్వి యనిపించుకొన్నది. బెంగాలులో కాలపరిమితిదాటినను నతడు 57వ సంవత్సరమువచ్చువఱకు ఆచార్యుడుగా పనిచేసెను. తనసర్వస్వము దేశభాగ్యోదయమునకై ధారపోసినాడు. విద్యాసంస్థలకు చాల ధనము విరాళమిచ్చినాడు. రాజకీయసాంఘిక సారస్వతవిషయములలో కూడ పనిచేసినాడు. వంగభాషలో కవిత్వము చెప్పినాడు.

గోఖలే. గాంధీవంటి మహనాయకుల మైత్రి సంపాదించినాడు. రవీంద్రుని మెప్పు పొందినాడు. బెర్నార్డుషా, రోమారోలా వంటి పాశ్చాత్య విద్యావేత్త లితనిని ఎక్కుసార్లు మెచ్చు కొనిరి. లండనులో 'స్పెక్టేటరు' సంపాదకుడు జగదీశుని ఆహ్వానించి గొప్పవిందు చేసెను. అతడు డెబ్బదిఎనిమిదేండ్ల వయస్సువచ్చు వఱకు జీవించి జగద్విఖ్యాతిగాంచి మొక్కల పిలుపు నాకించి మొక్కల ప్రపంచమునకు మహోపకారము చేసినాడు.

అ ర్థ ము లు: —

78వ పుట. జగత్ + ఈశ = జగదీశ = లోకములకుప్రభు వైనవాడా! (భగవంతుని గూర్చి యొక అర్థము, జగదీశ చంద్రబోసని అర్థము); మానవులు = మనుష్యులు; దానవులు = రాక్షసులు; స్నిగ్ధ = నున్నని; సుకుమార = కోమలమైన; లతా దేహములు = తీగవంటి శరీరము; శ్రేష్ఠ అంగములు = మేలైన అవయవములు; నిర్ దాక్షిణ్యముగన్ = దయలేకుండ; నరులు = మనుష్యులు, వానరులు = కోతులు; నును = నున్నని; నగ్న లను = దిసమొలగల వారినిగా; (Naked or bare bodied) మొక్కజొన్నలు = కంకులబుద్దులు; పత్రములు = ఆకులు;

విశే:—జగత్ + ఈశా = జగదీశా - జశ్త్వసంధి; స్నిగ్ధము (ప్ర) నిద్దము (వి); కాళ్ళేతులు—ద్వంద్వము; లేత కొమ్మ - విశేషణపూర్వపదకర్మధారయము;

79వ పుట. జననమరణములు = పుట్టిక చావులు; అతి అవశ్యకములు = మిక్కిలి అవసరమైనవి; గాయము = పుండు; పారీణులు = పారమును ముట్టినవారు; నామధేయము = పేరు; పొందిక = కలయిక; ఉద్దేశము = పిల్ల ధరణము; చైతన్యము = ప్రాణము; ప్రకృతి = సృష్టి; నిరూపించిరి = దృష్టాంతముగా చూపిరి; నిరసించినది = తిరస్కరించినది (నిందించినది); నిర్జీవులము = ప్రాణము లేనివారము; విషాదము = విచారము; ఒంటన్ = శరీరమునకు;

విశే:—అతి+అవశ్యకము = అత్యావశ్యకము – యణాదేశసంధి;

80. విచారణము = పోగొట్టుట; చిఱు+వడవి = చిట్టడవి = చిన్న అడవి; కొల్లగొట్టి = దోచుకొని; అలజడి = బాధ, విడి+విడి = విచ్చలవిడి = స్వేచ్ఛ; ఆగడములు = దౌర్జన్యములు; భంగకారణము = విఘ్నమునకు హేతువు; దయాళువు = దయయు దాసక్తి గలవాడు, బహు ప్రయాసలు = పెక్కు కష్టములు;

విశే:—చిఱు+అడవి = చిట్టడవి – సూ. కఱు, చిఱు, ......ద్విరుక్తటకారంబగు; సమాసము (ప్ర) సాధనము (వి);

81. అదను = సమయము; సిబ్బంది = బంట్రోతులు; ఘోరము = భయంకరము; ఠాణా = కావలిస్థలము; శిశురోదనము = చంటిబిడ్డ యేడ్పు;

విశే :—భటుఁడు (ప్ర) బంటు (వి); సంకెల (వి) శృంఖల (ప్ర); శిశువు (ప్ర) నిసుఁగు (వి);

82. కార్మికులు=పనివాండ్రు; కర్షకులు = వ్యవసాయదారులు; దయాళుత్వము = దయగలిగియుండుట; అహంభావము = గర్వము; అసహనభావము = ఓర్వలేనితనము; సాధ్వి=భార్య;

83. చులకనగా = తేలికగా; నరకము = దుర్గతి; న్యాయబద్ధుడను=న్యాయముచేత కట్టబడినవాఁడను; త్రికరణశుద్ధిగాన్ = మనోవాక్కాయకర్మలచే; దుష్ప్రవర్తనము=చెడ్డనడవడి; అశ్రుధారలు=కన్నీటిధారలు;

84. ఒకించుక=కొంచెము; ప్రథముడు=మొట్టమొదటివాఁడు; ఉత్తీర్ణుడు అయ్యెను=గెలుపొందెను (ప్యాసయినాడు) పట్టభద్రుడు=బి.ఏ. పట్టా పుచ్చుకొన్నవాడు (Graduate) ఉన్నతవిద్య=పెద్ద చదువు; పొడమినది=కలిగినది; అమాయికుడు=మాయమర్మము లెఱుఁగనివాఁడు; మదుపు=పెట్టుబడి; స్వల్పవేతనము = కొద్దిపాటి జీతము; కృతార్థులము = ధన్యులము; ఆర్థికపరిస్థితి=ధనసంబంధమైన స్థితి;

85. ఖిన్నుడు = విచారము నొందువాఁడు; అశ్రుకణములు=కన్నీటి బిందువులు;

86. సంబరము=సంతోషము; పరిణయము = పెండ్లి; మిత్రుడు=స్నేహితుఁడు; అభీష్టము=కోరిక; మురిసిపోయిరి=ఎక్కువసంతోషించిరి; గోడు=దుఃఖము;

87. జీవనవిధానము=బ్రతుకురీతి; ఖేదమోదములు=విచార, సంతోషములు; ప్రవచించెను=గట్టిగా చెప్పెను; గుణప్రదర్శనము=గుణము చూపుట; మతిభ్రమణముకలిగినదా=బుద్ధిచలించినదా; పెదవులు విఱచినారు=ఈసడించినారు; గోలెములు=కుండ్లు;

88. ధ్వనిశాస్త్రము=Sound theory (శబ్దమును గుఱించిన శాస్త్రము) స్పందించును=కంపించును; నాడీస్పందనము=నాడికదలుట; స్తంభించిపోయినది=నిలిచిపోయినది; ఒదవినది=కలిగినది;

89. మార్గఅవరోధము=దారికడ్డు; శ్రేయాంసి=మేళ్లు బహువిఘ్నాని=అనేక ఆటంకములుగలవి (మంచి కార్యములకు అన్నియు విఘ్నములతో కలుగుచుండునని భావము) ఆర్య+ఉక్తి=పాతమాట; వినూత్నవిశేషము = మిక్కిలి క్రొత్తవిషయము; అమోఘములు=వ్యర్థముగానివి (తిరుగులేనివి) తందాన తాన అనిరి=తాళము వేసిరి (బోసు చెప్పంతే తక్కినవారు అదే అనిరి కాని వానికివ్యతిరేకముగా పలుకరైరి)

90. ముగ్ధులైరి= ఆశ్చర్యపడిరి; ఆహ్వానించెదము= పిలిచెదము;

91 ద్రష్ట=చూచువాడు; విజ్ఞానప్రభలు=విజ్ఞానము యొక్క కాంతులు (విజ్ఞానమనెడు కాంతులు—రూపకమైనను చేయవచ్చును) పరమపదించిరి=చనిపోయిరి; ప్రతిష్ఠ=గౌరవము సర్వదా=ఎల్లప్పుడు; తోడునీడయై=సహాయులై; సమభాగిని=

సమానమైనపాటాకలదియై; ఉత్తమసాధ్వి=శ్రేష్ఠురాలగుస్త్రీ వత్సరములు=ఏండ్లు; దిక్+అంతములు = దిక్కులచివరలు; ప్రముఖనగరములు=ముఖ్యమైనపట్టణములు; పర్యటించెను= తిరిగెను;

92. భావి=రాబోవుకాలము; ప్రణామము=నమస్కారముచేయు (నేలకు వ్రాలు) స+అష్ట+అంగనమస్కారము = ఎనిమిది అవయవములు నేలకు తగునట్లుగా చేయునమస్కారము-2చేతులు, 2కాళ్ళు, వక్షము, నొసటిప్రదేశము, రెండు భుజములు మొత్తమెనిమిది); తిలకించుటకై =చూచుటకై; దేవఅంశ సంభూతము=దేవతల అంశతో పుట్టినది; సూర్య+ఉష్ణము=సూర్యుని వేడిమి; అనేక+ఇతర వృక్షములు = ఇతరములైన పెక్కుచెట్లు;

93. అపూర్వ యంత్రము=అద్భుతమైన యంత్రము; సర్వస్వము=సమస్తము; ఆర్జించిన=సంపాదించిన; అభిరుచి = మంచి యిష్టత; సాహిత్యము=భాష; సన్నిహిత మిత్రుడు= దగ్గర స్నేహితుడు; అభివందనములు=ప్రశంసలు;

94. ప్రభృతులు=మొదలైనవారు; అనన్య సామాన్య ప్రతిభ=అసాధారణమైన తెలివి (ఇతరులకులేని ప్రతిభ); లోక బాంధవుడు=ప్రజాబంధువు (సూర్యుడు); యశః+వికాసము= కీర్తికాంతి; మధుమాసము=చైత్రమాసము; రసాలశాఖలు= మామిడిచెట్ల కొమ్మలు; పంచమ సుస్వరము=కోయిల ధ్వనికి పంచమ స్వరమనిపేరు; అస్వరముతో; పాటపాడుచున్నవి,

ప్రశ్నోత్తరములు:—

1. మొక్క లేమని పిలిచినవి ?

"జగదీశా! రక్షింపవా! మానవులు దానవులు మాపుష్పములను దయాదాక్షిణ్యములు లేక త్రుంపి వేయుచున్నారు. కోతులవలె మా లేతకొమ్మలను కాల్సేతులను విఱిచి వేయుచున్నారు. మాపచ్చని ఆకులను వస్త్రములను ఒలిచి మమ్ము వస్త్రవిహీనలనుగా చేయుచున్నారు. ఇతర జంతువులకువలె మాకు కాకలి దప్పులున్నవి మాకును ప్రాణమున్నది. మా యవయవములకు హాని కలిగించునపుడు మేమును దుఃఖింతుము. మూర్ఖులైన మానవులు మాకు ప్రాణములు లేవని వాదింతురు. మా దుఃఖము పోగొట్టి మమ్ము రక్షింపుము" అని జగదీశుని అనగా పరమేశ్వరుని మరియు జగదీశచంద్రబోసును మొక్కలు వేడుకొన్నవి

2. జగదీశచంద్రబోసు పరదేశ విద్యాభ్యాసమువఱకు జీవితమును సంగ్రహముగా వ్రాయుము ?

విక్రమపురములో రెండు పాఠశాలలున్నవి, సాధారణ గ్రామ పాఠశాల యొకటి దొరతనమువారి పాఠశాలయొకటి జగదీశు డైదేండ్ల వయసున సాధారణ గ్రామపాఠశాలలో చేర్చబడెను. పిమ్మట కలకత్తాలో సైంటుక్సేవియరు కళాశాలకు చెందిన పాఠశాలలో చేరి పదునారవయేట మెట్రిక్ పరీక్ష యందు త్తీర్ణుఁ డయ్యెను. మరినాలుగేండ్లకు సైంటు

క్సేవియరు కళాశాలలో పట్టభద్రుఁ డయ్యెను. బి. ఏ. పరీక్షయిన వెనుక నింగ్లండు పోయి యున్నతవిద్య నభ్యసింపవలెనని జగదీశుడు వాంఛించెను. కాని యార్థికపరిస్థితులు సరిగా లేవు జగదీశుని తల్లి కుమారుని బాధను కనిపెట్టి తన నగలమ్మి కుమారుని నింగ్లాండు పంసినది. అచట విద్యాభ్యాసము చేసి జగదీశు డైదేండ్లకు తిరిగివచ్చినాఁడు.

3 1901 వ సంవత్సరము మేనెల 10 వ తేదీ భారతవాసులకేల మఱువరాని దినము ?

జగదీశుడు మొదటిసారిగా రాయల్ సొసైటీ సభ్యుల యెదుట జంతువులలోను వృక్షములలోను జీవన విధాన మొక్కటే యని యుపన్యసించిన దానాడే యంత్రమును నిర్మించి ప్రదర్శనముచేసి యాసామ్యమును నిరూపించిన దానాడే. కనుక ఆ దినము మఱువరానిది.

*4 రెసొనెంటు రికార్డరు నిర్మాణమును దాని ప్రయోజనమును జగదీశు డెట్లు ప్రకటించెను ?

రెండు ఫిడేళ్ళ తీగల నొకే స్వరమున కమర్చి యా దొకదాని తీగను మీటిన రెండవదాని తీగయు దనుకరణ కంపనము నుద్భవించి యదియు మ్రోగును. ధ్వనిశాస్త్రమందీ విశేషసంఘటనమును రెసొనేన్సు అని వ్యవహరింతురు. ఆయాసమయములయందు కలిగిన అనుభవముల కారణముగా మొక్కలయందలి నాడులు ఉద్రేకపూరితములై స్పదించును. ఆస్పందనలను రెసొరెంటు రికార్డరు స్పష్టముగా

గుర్తించును. ఒక మొక్కకును రెసొనెంటు రికార్డరునకును సంబంధమును జగదీశుడు కలిగించెను. ఆయంత్రము మొక్కలోని నాడీస్పందనమును గుర్తించినది. పిదప జగదీశుడు ఆ మొక్క కొమ్మలోనికి విషమెక్కించెను. మొక్కలో నాడీస్పందనమాగిపోయెను. వేరొక మొక్క కొమ్మలోనికి మత్తుపదార్థ మెక్కించెను నాడీస్పందనము నిలిచిపోయెను. సిరెంజితో నతడు మత్తు పదార్థమును లాగివేసినతోడనే మొక్కలో చైతన్యము కలిగెను.

ఇట్టి ప్రయోగముల మూలమున మొక్కలనాడీస్పందన వేసవికాలములో వృద్ధిపొందుననియు, శీతకాలములో క్షీణించుననియు జగదీశుడు నిరూపించెను మొక్కలు రాత్రి పండ్రెండు గంటలకు నిద్రించి యుదయమెనిమిది గంటలకు మేల్కొనునని స్థిరపరచెను. జంతువుల శరీరములోనికి విద్యుత్తు ప్రవహింప జేసిన నది యెట్లు కొట్టుకొనునో యదే విధమున మొక్కలు కొట్టుకొనునని జగదీశుడు నిరూపించెను.

5. జగదీశుని ప్రయోగములకు విఘ్నము లెట్లు కలిగినవి ? అవి యెట్లు తొలగిపోయినవి ?

రాయల్ సొసైటీసభ్యులు కొందఱు జగదీశుని గౌరవించుటకు మారు నిందించిరి లండనులో రాయల్ ఇన్‌స్టిట్యూటను వేరొక సంస్థగలదు. అందతడు మరల ప్రయోగములను చేయనారంభించెను. వృక్షశాస్త్రాచార్యుడు ప్రొఫెసరు వైన్సు, హారెస్‌బ్రౌను, హావెన్ అను యిరువురు శాస్త్ర

జ్ఞులు జగదీశుని ప్రయోగములను చూచి యాశ్చర్యపడిరి. రాయల్ సొసైటీ యతని ప్రయోగములను ప్రకటింపకున్నను, 'లినియన్' సంస్థ ప్రకటించునని వారు జగదీశుని హెచ్చరించిరి. ఆ సంస్థకు తన నాహ్వానించుమనియు, రాయల్ సొసైటీవారిని కూడ నాహ్వానించుమనియు నందరి యెదుట ప్రయోగములను ప్రదర్శింపుమనియు వారు జగదీశునికోరిరి

లినియన్ సంస్థలో ప్రయోగప్రదర్శనములకు ముందే యెవరో యీ ప్రయోగఫలితములను తానే కనుగొనినట్లు ప్రకటించినాడు. తన ప్రయోగములను సొంతప్రయోగములుగా చాటిన పెద్దమనిషిని బయటపెట్టి తానుఋజువుచేసికొన వలసిన బాధ్యతగలైను. రాయల్ సొసైటీలో జగదీశు డుపన్యసించినపు డా పెద్దమనిషి యొకద్రష్టగానుండెనని గ్రహించి న్యాయవిచారణకు న్యాయస్థానమునకు ఫిర్యాదుచేసెను. వైన్సు, హోవెన్ జగదీశునితరపున సాక్ష్యమిచ్చిరి. రాయల్ సొసైటీ తనతప్పునొప్పుకొనెను. జగదీశుడు విఘ్నములనుండి బయటపడెను.

6 జగదీశుడుకనిపెట్టిన మరొకయపూర్వయంత్రమేది ? దానియుపయోగ మేమి ?

జగదీశుడు 'క్రెస్కో-గ్రాఫు' అనుయంత్రమును కని పెట్టెను. అది మొక్కలయెదుగు పొదుగులను తెలియజేయును. ఏ మొక్కయైనను ఒకనిమిషకాలములో నెంత యెదుగునో తెలియును.

7. ఒక శాస్త్రమునందే కాక యితరరంగములలో జగదీశుని కీర్తి యెట్టిది ?

దేశమందలి రాజకీయ సాంఘిక సారస్వతవిషయములలోకూడ జగదీశునకభిరుచి మెండు. వంగభాషలో కవిత్వము చెప్పెను. రాజకీయములలో గోఖలే, గాంధిజీవంటి నాయకుల మైత్రి సంపాదించెను. సాహిత్యములో రవీంద్రుడీతనికి దగ్గర మిత్రుడు. ప్రఖ్యాతచిత్రకారుడు అవనీంద్రఠాకూరు విఖ్యాత వైద్యుడు నీలరతన్ జగదీశుని ప్రాణమిత్రులు బెర్నార్డుషా, రోమా రోలావంటి మహాపండితులితని కభినందనములంపిరి. గాల్సువర్ది, నోయస్ హార్మన్ ఏన్ జెల్, ఈట్సు, రాబర్టుబ్రౌను మొదలగువారితని ప్రశంసించిరి. జగదీశుడొక లోకబాంధవుడు.

8. ప్రకృతులు – వికృతులు:—

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| స్నిగ్ధము | నిద్దము | పురము | ప్రోలు |
| ప్రగ్రహము | పగ్గము | సహజము | సాజము |
| భటుడు | బంటు | శృంఖల | సంకెల |
| శిశువు | నిసుగు | సంభ్రమము | సంబరము |
| యంత్రము | జంత్రము | అపూర్వము | అపురూపము |

9. వ్యాకరణాంశములు:—

(a) కాలు+చేయి = కాల్సేతులు.—సూ. ద్వంద్వంబున బదంబుపై పరుషములకు గసడదవలగు;

(b) అను+ఆశ=అనునాశ——సూ. ఉదంతతద్ధర్మార్థక విశేషణమునకు అచ్చుపరంబగునపుడు నుగాగమంబగు;

(c) చిఱు+అడవి=చిట్టడవి సూ. కుఱు, చిఱు......

10. జశ్త్వసంధి: — జగత్+ఈశ=జగదీశ;

యణాదేశసంధి:—అతి+అవశ్యకము=అత్యావశ్యకము

గుణసంధి:——అనేక + ఇతరము = అనేకేతరము; సూర్య + ఉదయము = సూర్యోదయము; ఆర్య+ఉక్తి = ఆర్యోక్తి, ప్రభుత్వ+ ఉద్యోగము=ప్రభుత్వోద్యోగము.

11. సమాసపదములను విడదీయుట :—

| వ.నెం | సమాసపదము | విడదీయుట | విగ్రహము | సమాసము పేరు |
|---|---|---|---|---|

(a) శిశు రోదనము—— శిశు+రోదనము—— శిశువు యొక్క రోదనము——షష్ఠీతత్పురుషము.

(b) నాలుగేండ్లు——నాలుగు+ఏండ్లు —— నాలుగుఏండ్లు ద్విగువు.

(c) మహోత్సవము—— మహా+ఉత్సవము—— గొప్ప యుత్సవము——విశేషణపూర్వపద కర్మధారయము

(d) ఉద్రేకపూరితములు——ఉద్రేక+పూరితములు—— ఉద్రేకముతో నిండినవి.——తృతీయాతత్పురుషము

(e) అనేకేతరములు—— న+ఏక+ఇతరములు—— అనేకము కంటె ఇతరములు——పంచమీ తత్పురుష

# ఆంధ్రుల కళాజీవితము

ఈ పాఠ్యభాగమును శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము, బాలేందు శేఖరముగార్లు రచించిరి. 'ఆంధ్రులచరిత్ర-సంస్కృతి, అను గ్రంథమును వీరు రచించిరి. అందలి ఆధునికయుగమను ప్రకరణమునుండి యీ భాగము గ్రహింపబడినది. వీరు సంస్కృతాంధ్రముల యందేగాక యాంగ్లమునందును మంచి పాండిత్యము గలవారు.

95 వ పుట:—— నూతన శకము=క్రొత్త శకము; విరిసెను=వికశించెను: లలితకళలు=మనోజ్ఞమైన విద్యలు (Fine Arts); ప్రాచీన+ఆంధ్రులు=పూర్వపు తెలుగు జాతివారు; మహా+ఉన్నత+శిఖరములు=మిక్కిలి యెత్తైన అగ్రములు; పారతంత్ర్యకాలము=దేశమితరుల స్వాధీనములో నున్నసమయమున; కళా+అభినిరతి=విద్యలయందెక్కువఆసక్తి; దోహదము+ఇచ్చు=పోషించు; కళావిదులు=విద్య నెరింగినవారు; యథాశక్తిగ=శక్తి కొలది; కళాక్షేత్రము=విద్యా భూమి; నూతన చైతన్యము=క్రొత్త తెలివి; నవజీవిత వికాసఫలితముగా=క్రొత్తజీవితము వికసించుటవలని ప్రయోజనముగా.

విశే:——శక్తి (ప్ర) సత్తి (వి) యథాశక్తి=అవ్యయీభావము

96. సౌందర్య + ఆరాధనము = అందమునర్చించుట; గాంధర్వవిధులు=సంగీతవిద్య తెలిసినవారు; బహుజన+ఆకర్షణ

ము నే= పెక్కుమంది జనులను లాగుటనే; లక్ష్యము = గురి; మార్గదర్శకులు = దారిచూపువారు; మక్కికిమక్కి=ఉన్న దున్నట్లు (మక్కి అనగా ఈగ; మక్షిక (ప్ర) మక్కి (వి) పూర్వము గురువుగారు శిష్యునిచూచి వ్రాయుమని యొక తాటాకు గ్రంథమిచ్చిరి. శిష్యుడనుదినము వ్రాయుచుండగా నొకనాడాకులమధ్య నొక మక్షిక (ఈగ) పడి చచ్చెను ఆతడు చూడకుండ గ్రంథము కట్టకట్టి మరునాడు వ్రాయ టకు ప్రారంభించెను. చచ్చిన ఈగ యొకటి ఆ వ్రాయ చోటున నగుపడగా తన గ్రంథములో ఆ శ్లోకముననున్న తావున నొక యీగను చంపి యచట పెట్టినాడు. గురువుగా రదిచూచి యదియేమిరాయని యడిగినారు. అసలుగ్రంథ ములో నచ్చట చచ్చినయీగ యున్నదండి ఇక్కడకూడ నొక యీగను చంపియుంచినాననినాడు శిష్యుడు అది మొదలుగా 'మక్కికి మక్కి' అను సామెతవచ్చినది) ప్రశంస నీయము=పొగడదగినది; ప్రతిభావంతులు = బుద్ధిమంతులు; దాక్షిణాత్యులు=దక్షిణదేశస్థులు (తమిళులు) హిమాలయ శృంగసన్నిభుడు = హిమాలయశృంగముతో సమానుడు; వాగ్గేయకారులు=పాటగాండ్రు; అమూల్యము = విలువలేని (మిక్కిలి విలువగల) ఇనుమడించును=రెట్టింపగును;వర్తమాన యుగము=ఇప్పటికాలము; విశిష్టలక్షణములు=ప్రత్యేకతగల లక్షణములు, ఆవిర్భావము=పుట్టుక;

97. ప్రాచుర్యము = అధిక్యత; చతుఃవిధ అభినయ ఆత్మకము=నాలుగువిధములైన నాట్యముతో కూడినది; (చతు

ర్విధాభినయములు —1. ఆంగికము 2. వాచకము 3. ఆహా ర్యము 4 సాత్త్వికము) రసాభినయబహుళములు=రసమునకు తగిన అభినయములచేత విస్తారమైనవి; రూపకము=నాటకము (దశవిధరూపములు:—1. నాటకము 2 ప్రకరణము 3. భాణము 4. ప్రహసనము 5 డిమము 6 వ్యాయోగము 7. సమవాకారము 8 వీథి 9 అంకము 10 ఈహామృగము) మేళవింపబడిన=జతపఱుపబడిన; చతుర్థపాదము= నాల్గవపాదము; నటకఅవతంసులు = నాట్యముచేయువారిలో శ్రేష్ఠులు; భిన్నమతములు=భేదాభిప్రాయములు; భూమిక=పాత్ర (వేషము)

98. సంపన్నులు=సంపదతో కూడినవారు; నెలకొల్పి=స్థాపించి; రసఆనందఅభిషిక్తులు = రసమనుభవించుటవలని సంతోషముచే అభిషేకముచేయబడినవారు; (సంతోషరసముచే నభిషిక్తులు) యశః+భూషితులు=కీర్తిచే అలంకరింపబడినవారు; గానమాధుర్యము = సంగీతముయొక్క తియ్యందనము; అభినయకౌశలము=నటనయొక్క నేర్పు; సాత్త్వికాభినయము = చూపఱకు రోమాంచముకల్గించునటన; వనితాలోకము = ఆడప్రపంచము; నృత్యకళ = నాట్యవిద్య; విరచితము=వ్రాయబడినది; అనూచానముగ=గురుముఖతా అభ్యసించుట మూలముగా; అపూర్వ అలంకారము = క్రొత్తయలంకారము;

99. నయన ఆనందకరము=కంటికింపు కలిగించునది; ఆత్మ+ఉత్తేజకరము=మనస్సునకు ప్రేరేపణకలుగ జేయునది;

అనుభూతి=అనుభవము; స్వీకరించి=తీసికొని; తదజ్ఞులు = ఆ శాస్త్రము తెలిసినవారు; రంజిల్లిన = ప్రకాశించిన; తొంటి ప్రాశస్త్యము=పూర్వపు గొప్పతనమును; నయనపర్వము= కన్నులపండువు; తుల్య ప్రాధాన్యము=సమానమైన ప్రాముఖ్యత, వర్ణములను మేళవించుటలో=రంగులను కలుపుటలో; లౌకికజ్ఞానము=ప్రపంచజ్ఞానము; ప్రభవించిన=పుట్టిన; జన్మతః=పుట్టుకతోనే; త్రివిధ = మూడువిధములైన; మహా+ ఉత్కృష్ట శిల్పనైపుణ్యము=మిక్కిలి గొప్పశిల్పమునందలి నేర్పరితనము; తరుణవయస్సు=యౌవనము; దివంగతులైరి= చనిపోయిరి; మెదిగిన=నలిగిన;

100. కళాసౌరభము=విద్యయొక్క సువాసన; బహిఃర్గతము అగుటకు=వెల్లడియగుటకు; గేయములు=పాటలు; అవగతము చేసికొని=తెలిసికొని; సిద్ధహస్తులు = ఆరితేరిన చేతులు; గ్రాస, వాసః దైన్యములకు=తిండి, ఉనికి, పీనిహైన్యములకు (తినుటకుతిండి, ఉంటకుకొంపలేని యెడల) తారాపథములన్ = నక్షత్రమార్గములందు (ఉన్నతస్థితినందజాలదని భావము) సంస్కృతి=విజ్ఞానము (Culture) సభ్యత=సభకుచితమైనదాని (మంచిని) పరిహాసించు=నవ్వు; ఈసడించు= నిందించు;

101. అదను=సమయము;

## ప్రశ్నోత్తరములు

*1. ఇరువదియవ శతాబ్ది ప్రారంభమునుండియు నాంధ్రుల కళాజీవితమునందు నూతనశకమొకటి యెట్లువిరిసెను?

ప్రాచీనాంధ్రులు శిల్పము, సంగీతము, నాట్యము, చిత్రలేఖనము మొదలగు లలితకళలలో నగ్రస్థానమందుకొని నారు. దేశము పరిపాలనలో నున్నప్పుడు ప్రభుత్వసహాయము లేదు. మహారాజులు జమీందారులు యథాశక్తిసహాకరించిరి. ఆంధ్రుల నవజీవిత వికాశఫలితముగా కళాక్షేత్రమునందు నూతనచైతన్యము కలిగినది. పూర్వమువలె గొప్ప గొప్ప దేవాలయములు కట్టించుట మొదలైనవిలేవు. ఆనాటి శిల్పమునకు మతము, భక్తిప్రధానములు ఈనాడా రెండును సున్న. సౌందర్యారాధనమే యీనాటి ముఖ్యవిషయము. అన్నమాచార్యులు, క్షేత్రయ్య, త్యాగయ్యవంటి మహానీయులు కర్ణాటక సంగీతమునకు ప్రాణముపోసిరి. ఈనాడాంధ్రదేశము సంగీతమున వెనుకబడియున్నది ఆంధ్రులు శాస్త్రపద్ధతిని సంగీతకళ నభ్యసించుటలేదు. హిందూస్తానీ బాణీలకు మక్కికిమక్కి యనుకరణములను గావించుచు సినీమాసంగీతమును లక్ష్యముగా పెట్టుకొని శాస్త్రీయ శుద్ధ సంగీతరీతిని పాడుచేసినారు. మనవారికా గానము జనబాహుళ్యము నాకర్షించిన నేచాలు. తమిళులుమాత్రము గానకళను మనవలె పాడుచేయలేదు. వారిలోనిప్పటికిని పెక్కుసంగీత

విద్వాంసులున్నారు. త్యాగయ్యగారి గానవిద్యా సంప్రదాయమును నిలబెట్టుచున్నారు తెలుగువారిలోను నందిగామ వెంకన్న వీణావేంకటరమణదాసు, తుమరాడసంగమేశ్వరశాస్త్రి మొదలైన ప్రతిభావంతులైన నాదోపాసకులుండిరి. వీరివిద్యను తమిళులుకూడ మిక్కిలి ప్రశంసించిరి. పిడేలువాద్యమునందు ద్వారము వేంకటస్వామి నాయుడుగారికి సాటిమరెవ్వరును లేరు వాగ్గేయకారులలో హరినాగభూషణంగారు పేరు మోసినవారు. ఈకాలమున గ్రామఫోను, రేడియోలు సంగీతవ్యాప్తికి ముఖ్యసాధనములు. ఆంధ్రుల శుద్ధకర్ణాటక సంగీతమును పోషించి ప్రచారముచేసినప్పుడే పైచెప్పిన సాధనములకు సార్థక్యము కల్గును లేకున్న నిష్ప్రయోజనము

3\. వర్తమానయుగమున నాటకకళాపిర్భావ విశిష్టతయేది?

పూర్వమాంధ్రదేశమున యక్షగానములను సంగీత ప్రధానములైన నాటకములు మాత్రముండెడివి. తంజావూరు మధురరాజులు రంగస్థలముల నేర్పాటుచేసి యక్షగానములు ప్రదర్శింపచేసెడివారు. వానిలో చతుర్విధాభినయాత్మకము, రసాభినయ బహుళమునగు నాట్యకళ కన్పట్టెడిది కాదు. ఈనాటి నాటకకళ యట్టిదికాదు. సంస్కృతనాటకముల యొక్కయు, ఆంగ్లనాటక కళయొక్కయు ముఖ్యధర్మములు లీనా డాచరణలో పెట్టబడినవి. కనుకనే రసాభినయనమున కిప్పుడు ప్రాముఖ్యతవచ్చినది. నాటకాంతము కళాప్రవీణత

యను ప్రశస్తివచ్చినది. ఆంధ్రదేశము నాటకప్రదర్శనము లందు మిక్కిలి ప్రసిద్ధివహించినది. దక్షిణదేశ మిందులోతీసి గట్టు. పందొమ్మిదవ శతాబ్దము చివరిభాగములో ఆంధ్రదేశ మున గొప్పగొప్ప నటకులు బయలుదేరిరి. వీరినటనాచాతు రికి మేనులు గగుర్పొడిచెడివి. అదిసాత్త్వికాభినయము. కాని నాటకములో సంగీతముండవలయునా లేదాయను నభిప్రాయ భేదములు కలిగినవి. అభినయమునకు సంగీతములోబడియుండ వలయునుగాని దానిని మ్రింగివేయునంతటి సంగీతముండ రాదని నిర్ణయించిరి. అందుచేతనే ఆంధ్రులలో సంగీతసాధన తగ్గినది.

ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు నాటకరచ యితలు. నటకావంతసులు కూడనైరి. రాజమహేంద్రవరము ఏలూరు మొదలైన గ్రామములలో నాటక సమాజములు వెలసినవి. టంగుటూరి ప్రకాశంపంతులు, హరిప్రసాదరావు, బళిజేపల్లి లక్ష్మీకాంతం, ముప్పిడి జగ్గరాజు, ఎడవల్లి సూర్య నారాయణ, ఉప్పులూరి సంజీవరాజు, స్థానం నరసింహారావు, డి. వి. సుబ్బారావు, బెల్లంకొండ సుబ్బారావు, టి. వి. రాఘవాచారి మొదలగు వారెందరో వారి గానమాధుర్య ముచే, అభినయ కౌశలముచే నాటకరంగమునకు వన్నెతెచ్చి నారు. నాటక ప్రదర్శనముల మొదటికాలములో పురుషులే స్త్రీపాత్రలను ధరించెడివారు. అట్టివారిలో స్థానమువారి దగ్ర స్థానము.

3. ఆంధ్రులు నృత్యకళ యందు విజయము సాధించిరని నిరూపింపుము ?

నాట్యశాస్త్రము భరతముని రచించినాఁడు. అభినయదర్పణమను నాట్యశాస్త్రమును నందికేశ్వరు డంతకు ముందే రచించెనని పండితుల అభిప్రాయము. ప్రాచీన భరతనాట్య సంప్రదాయములను కూచిపూడివా రిప్పటికిని పాటించుచున్నారు. కూచిపూడి భరతాచార్యుఁడు జగద్విఖ్యాతి వహించినాడు. వారి భరతనాట్య ప్రదర్శనము కన్నుల పండువుగా ఆత్మోత్తేజకరముగా పవిత్రతరముగా నుండెడిది. అభినయదర్పణమునే ప్రమాణముగా తీసికొనెడివారు. ప్రతి సినిమాలోను తఱచుగా నృత్యప్రదర్శనము చూపబడినది. కాని అది శాస్త్రయుక్తముగా లేదని పండితుల యభిప్రాయము.

4. ఆధునిక యుగమున చిత్రలేఖన వికాసమును గూర్చి వ్రాయుము ?

అజంతా, లేపాక్షి మొదలగుచోట్ల ఆంధ్రుల చిత్రలేఖన కళాకౌశలము మహోన్నతస్థితి నందినది. ఈనాఁడు పాశ్చాత్య చిత్రకళా ప్రభావముచే మనపద్ధతి మోటుపనిగా భావింపఁబడి తిరిగి పూర్వపు టాంధ్రపద్ధతియే గొప్పదని యనిపించినది. చిత్రలేఖనములో భావరూపములు రెండింటికిని సమానప్రాధాన్యము గలదు. రంగులను కలుపుటలో, చాల కాలము రంగులు నిలువయుండునట్లు తయారు చేయుటలో, శాస్త్రజ్ఞానము, లౌకికజ్ఞానము కూడ అవసరములే. తెలుగుఁ

దేశమున రెండు మూడు చిత్రకళా కేంద్రములు గలవు. తెలుగు చిత్రకళకు పేరు తెచ్చిన ఖండాంతరకీర్తి సంపాదించిన వాడు, శ్రీదామెర్ల రామారావు. భావచిత్రరచన, రూపచిత్ర రచన, దృశ్యచిత్ర రచనలను మూడు మార్గములందు రామా రావుగారు మహోత్కృష్ట శిల్పనైపుణ్యమును చూపినారు. అడవిబాపి రాజుగారు ప్రఖ్యాత చిత్రకారులని పేరు మోసిరి. ఇంకను కొందరు చిత్రకారులు శాంతినికేతనములో చిత్రకళా రహస్యములను తెలిసికొనుచున్నారు. వరదా వేంకటరత్నము చామకూర సత్యనారాయణ, చావలినాగేశ్వరరావు, కవుతా రామమోహనశాస్త్రి, ఆనందమోహనశాస్త్రి, వి. ఆర్. చిత్ర, భగీరథి, దామెర్ల సత్యవాణి, ఆర్ కమలాబాయి మొదలగువారు చిత్రలేఖనములో ప్రసిద్ధులు

5. ఆంధ్రులజానపద చిత్రకళనుగూర్చి సంగ్రహముగా వ్రాయుము.

మన దేశీయమైన ప్రాచీనసంప్రదాయము జానపద కళయే. విద్యాధికులైనవారు పాశ్చాత్యనాగరికతకు, పాశ్చా త్యకళకు లొంగిపోయి విదేశసంస్కృతిప్రవాహములో మునిగి పోయిరి. తెలుగు దేశపుస్త్రీలు, పల్లెటూరిప్రజలుమాత్రము మనపూర్వసంస్కృతిని పూర్తిగావిడిచిపెట్టలేదు. జాతీయ భావము దేశములో వ్యాపించినతరువాత జానపదకళకును,

సంప్రదాయములకును గౌరవము హెచ్చినది. దేశీయచిత్ర కళను ప్రదర్శించువారు ముచ్చివారు. వీరికిచిత్రకళయే ముఖ్యవృత్తి. క్రీ. శ. పదునాలుగవశాబ్దమునుండి 'ముచ్చి' వారు కృష్ణాగోదావరిజిల్లాలలోనుండిరి. దేవాలయపుగోడల మీద బొమ్మలువ్రాయుట, వాహనములు మొదలగునవిచేసి రంగులు వేయుట, దశావతారములను ఆటబొమ్మలుతయారు చేయుట మొదలైన చిత్రచిత్రపుపనులు చేసెడివారు. ఈకళకు ప్రోత్సాహము లేకపోవుటచే నిపుడు సన్నగిలినది. ప్రఖ్యాతిపొందిన కొండపల్లిబొమ్మలు వీరుతయారుచేయు చున్నవే.

## 6. తెలుగువారి యద్దకపుపరిశ్రమనుగూర్చి వ్రాయుము.

బట్టలకుఁగాని నేతకుపయోగించు నూలునకుగాని రంగు వేయుట అద్దకమనబడును. తెలుగుదేశమున నీకళచిరకాలము నుండి ప్రసిద్ధిలోనున్నది. దీనికే కలంకారీఅద్దకమని పేరు. పెక్కురంగులలో కల్పనాచిత్రములనద్దుటయే యిందలివిశే షము రంగరేజులు, జీనిగరులు, ఉనుపులవాండ్రు అనబడు వారికీ యద్దకమేజీవనాధారము. ప్రజలయాదరము లేకపోవు టచే నీకళయు క్షీణించినది. ఇప్పటికిని బందరు అద్దకపుచీర లను ప్రశస్తికలదు. పాలకొల్లు, కాళహస్తి, కొండపల్లి మొదలగు పట్టణములలో నింకను అద్దకపుపని సాగుచున్నది

7. ప్రకృతులు - వికృతులు:—

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
| --- | --- | --- | --- |
| భక్తి | బత్తి | మక్షిక | మక్కి |
| యక్షులు | జక్కులు | స్వామి | సామ్మి |
| గ్రాసము | గాసము | కుడ్యము | గోడ |

8. సంస్కృత సంధులు :—

గుణసంధి :—మహా+ఉన్నత=మహోన్నత; నాద+ఉపాసకుడు=నాదోపాసకుడు; ఆత్మ+ఉత్తేజకరము=ఆత్మోత్తేజకరము.

సవర్ణదీర్ఘసంధి :—ఉత్కృష్ట+ఆదర్శము=ఉత్కృష్టాదర్శము; పవిత్ర+అనుభూతి=పవిత్రానుభూతి;

విసర్గసంధి :—చతుః+విధము=చతుర్విధము; బహిః+గతము=బహిర్గతము; యశః+భూషితుడు=యశోభూషితుడు;

9. సమాసపదముల విడదీయుట :—

| సమాసపదము | విడదీయుట | విగ్రహవాక్యము | సమాసము పేరు |
| --- | --- | --- | --- |

(a) యథాశక్తి — యథా+శక్తి — శక్తి నతిక్రమింపక—అవ్యయీభావము.

(b) అమూల్యము — న+మూల్యము- మూల్యము లేని —నఞ్ తత్పురుష.

(c) నటశ్రేష్ఠుఁడు—నట + శ్రేష్ఠుఁడు— నటులలో శ్రేష్ఠుడు షష్ఠీతత్పురుషము.

(d) అభినయకౌశలము—అభినయ+కౌశలము — అభినయమునందు కౌశలము—సప్తమీతత్పురుష.

(e) విద్యాధికుఁడు— విద్య + అధికుఁడు— విద్యచేత అధికుడు—తృతీయాతత్పురుషము.

(f) నయనపర్వము—నయన + పర్వము — నయనములకు పర్వము—షష్ఠీ తత్పురుషము.



(శ్రీ) కొండపల్లి ...

# కల్పతరువు S. S. L. C. 1961

లక్ష్మీప్రసాదము, స్వామి వివేకానందుడు, మహారాణి
ఝాన్సీ లక్ష్మీబాయి, సుభాష్ చంద్రబోస్

# నాండిటెయిల్డు నోట్సు

పై వాటిపై చాల విపులముగా నోట్సు వ్రాయబడినది.
ప్రశ్నలు జవాబులు చాల వ్రాయ బడినవి.

గ్రంథకర్త
శ్రీ శిష్ట్లా వేంకటసుబ్బయ్యగారు

Publishers
**A. V. Ram & Co.,**
NARSAPUR
1960

# లక్ష్మీ ప్రసాదము

## ఇందువచ్చు ముఖ్యపాత్రలు :

1. లక్ష్మి — రామశర్మ కూతురు
2. ప్రసాదరావు — రాజేశ్వరమ్మ పెద్దకొడుకు
3. రామశర్మ — మంచిగృహస్థు — చోడవరము
4. రాజేశ్వరమ్మ — రామశర్మ చెల్లెలు
5. అన్నపూర్ణ — ,,
6. జోగారావు — రాజేశర్వమ్మభర్త — కోర్టు మునసబు
7. కామేశ్వరమ్మ— అనంతశర్మభార్య—సుభద్రమ్మకు అక్క
8. గంగాధరుడు — కామేశ్వరమ్మ మఱది
9. భ్రమరాంబ — కామేశ్వరమ్మ కూతురు
10. సరస్వతి — రాజేశ్వరమ్మ కూతురు
11. రామారావు — రాజేశ్వరమ్మ రెండవ కొడుకు
12. సుభద్రమ్మ — రామశర్మ భార్య
13. సోమేశ్వరము — అన్నపూర్ణ కొడుకు
14. పాపమ్మ — కామేశ్వరమ్మకు దూరపు బంధుగురాలు పచ్చని కాపురములను పాడుచేయు పాపాత్మురాలు.

# లక్ష్మీ ప్రసాదము



## 1

విశాఖపట్టణ మండలమున చోడవర మను గ్రామము కలదు. అందు రామశర్మ యను మంచి కుటుంబి కలడు. వానికి రాజేశ్వరి, అన్న పూర్ణ యను నిరువురు చెల్లెండ్రు కలరు. సంక్రాంతి పండుగకు రాజేశ్వరి పుట్టింటికి వచ్చినది. ఆమె భర్త జోగారావు కోర్టు మునసబు. పండుగ నాడు సంతోషముతో సంసారమున నందఱు కబుర్లు చెప్పుకొను చున్నారు. అభిప్రాయములలో రాజేశ్వరి యభిప్రాయము లాధునికములు. నాగరికములు. రాజేశ్వరి తన పెద్దకుమారు డగు ప్రసాదరావును ఐ. సి. ఎస్. పరీక్ష కింగ్లాండు పంపినది. అన్న రామశర్మ కుమార్తెను లక్ష్మిని ప్రసాదరావున కిదివరకే పెండ్లి చేసినది. లక్ష్మి యనిన నామె కెంతయో ముద్దు. ప్రసంగవశమున ప్రసాదరావు చదువున కైదు వేలు కావలయును, సాయము చేయుమని కోరిన దన్నను రాజేశ్వరి. తనకు మించిన యా సహాయము చేయజాలనని రామశర్మ నిరాకరించినాడు. ఇట్లుండగా జోగారావునకు దెబ్బలు తగిలినవనియు నాసుపత్రిలో చేర్చినారనియు తంతి వచ్చినది. రాజేశ్వరి యారాత్రియే కోడలిని తీసికొని విశాఖపట్టణము ప్రయాణమై వెళ్ళినది.

## 2

జోగారావు క్లబ్బులో చీటులాడుట, త్రాగుడు మొదలగు దుర్వ్యసనములకులోనయినాడు. ధనము లేమి భార్య ప్రోత్సాహముచే లంచములు పట్ట ప్రారంభించినాడు. దానితో నన్యాయమగు తీర్పు అందినవారయ్యవారికి దేహశుద్ధి చేసినారు. కొట్టిన వారిని గుర్తుపట్టి చర్య తీసికొనుమని రాజేశ్వరి భర్తను ప్రోత్సహించినది. కాని యభిమాని యగు

జోగారావా విషయమును కప్పిపుచ్చి గుఱ్ఱపు బండి బోల్తాకొట్టుటచే గాయములు తగిలినవని యితరులతో చెప్పినాడు. ప్రసాదరావునకు డబ్బు పంపవలెనని లక్ష్మి నగల నమ్మ నెంచినది రాజేశ్వరి. అయినను డబ్బు చాలదు. తన యన్న వదినెగారు కామేశ్వరమ్మ యున్నదనియు ఆమె యాస్తి నంతను తన యన్నయే చూచుచున్నా డనియు, కామేశ్వరికి గంగాధరు డను మఱది గలడనియు, గంగాధరునిచే కామేశ్వరమ్మకు నోటీసిప్పించి కొంతధనము నార్జింత మనియు రాజేశ్వరి భర్తకు బోధ చేసినది. అన్నదమ్ముల విభాగము లదివఱకే యైనవనియు అనంతశర్మ మరణశాసనము కూడ వ్రాసినా డనియు, కామేశ్వరియే తనయాస్తికి సర్వాధికారిణి యనియు గంగాధరుని ప్రయత్నము వ్యర్థమనియు జోగరావు భార్యతో చెప్పినాడు. కామేశ్వరికి వ్యవహారజ్ఞానము లేదనియు గంగాధరుడు బెదిరించినచో కొంత డబ్బిచ్చి యామె రాజీపడుననియు నందులోసగము తమ కిచ్చునట్లు గంగాధరునితో మాట్లాడితి ననియు చెప్పి, రాజేశ్వరి యెట్లో భర్తను మాటాడకుండ చేసినది. తండ్రికి నచ్చచెప్పి డబ్బిప్పింప లేకపోయినదని లక్ష్మిపై నున్న మమకారము ప్రేమ కూడ తగ్గినది రాజేశ్వరికి.

## 3

కామేశ్వరమ్మయు రామశర్మ భార్యయు అక్కచెల్లెండ్రు. కామేశ్వరి భర్త అనంతశర్మ. విజయనగరరాజుల యాస్థానపండితుడు. శృంగవరపుకోట ప్రాంతమున నానందగజపతి యితనికి భూవసతి నిచ్చినాడు. అనంతశర్మ యవసానకాలమున తన వ్యవహారమంతయు తోడియల్లుడు రామశర్మ కప్పగించినాడు. అత డప్పటినుండి వ్యవహారములను జాగ్రత్తగా చూచుచుండెను. కామేశ్వరి కూతురు భ్రమరాంబ. ధనవంతురాలగుటచే నెప్పుడు కని విని యెఱుగనివారు కూడ బంధువులమని చెప్పుకొని యెందరోవచ్చి కామేశ్వరి యింట నుండిరి. ఆ వచ్చినవారిలో దూరపుబంధుగురా లొకతె పాపమ్మ. ఈమె యీవఱకే రెండు పండు

వంటి కాపురములను పాడుచేసి యిపుడు కామేశ్వరి నాశ్రయించినది. ఆమెకు సకలోపచారములు చేయుచు తలలోని నాలుకయై మెలగుచు నామెను వలలో వేసికొన్నది.

ఆ సంవత్సరము వర్షములు లేక పంటలు పాడైనవి. రైతులు శిస్తు లీయలేదు. పన్నులు కట్టుట తప్పలేదు. నిజస్థితి కామేశ్వరికి చెప్పినాడు రామశర్మ. బంధుపోషణ కాటంకమైనది. చాలమంది బంధుగులు వెళ్ళిపోయినారు. పాపమ్మ తప్ప. రామశర్మయం దపనమ్మకము కలిగినది కామేశ్వరికి. అంతలో భ్రమరాంబకు మశూచి వచ్చినది. తెలిసినవెంటనే భార్యను తీసికొని రామశర్మవచ్చి తగు సహాయము చేసినాడు. నెలరోజులకు బ్రమరాంబ కోలుకొన్నది. విజయనగర కాపురము కష్టమని శర్మ కామేశ్వరమ్మ కాపురము శృంగవరపుకోటకు మార్పించినాడు. పాపమ్మ విశాఖపట్టణముపోయి తనకు రావలసిన భరణమును రాజేశ్వరి సహాయమున రాబట్టుకొందునని వెళ్ళిపోయినది. కామేశ్వరి కాపురమును శృంగవరపుకోటకు మార్పించుటచే రామశర్మ చాలమంది బంధువులకు విరోధియయ్యెను.

## 4

లక్ష్మి గుణవతి. అత్తమామల కెదురాడదు. భర్తనే దైవముగా పూజించును. పాపమ్మ వచ్చి రాజేశ్వరియింట ప్రవేశించినది. రామశర్మ మూలమున తన కుపాధి పోయినదని యెంచి వానిపై పగ లక్ష్మిపై తీర్చుకొన నెంచినది. రాజేశ్వరికి కోడలిపైగల కోపమును ద్వేషముగా మార్చినది. జోగారావునకు రాజేశ్వరికి అడ్డమైన చాకిరిచేసి వారిని వశపఱచుకొన్నది. పిల్లలకు రహస్యముగా చిరుతిండ్లుపెట్టి యామె చెప్పుచేతలలో నుంచుకొన్నది. ఆ యింటిలో లక్ష్మి గో డెవ్వరికి నక్కఱలేదు. పాపమ్మ లక్ష్మిపై లేనిపోని నేరములు మోపినది. శ్రావణమంగళవారము నాడైన నగ లిత్తురో లేదో యని పక్కింటి శారదతో లక్ష్మి చెప్పిన దనియు నది సరస్వతి విన్న దనియు సరస్వతిచేత దొంగసాక్ష్య మిప్పించినది పాపమ్మ. లక్ష్మి దిక్కులేక విలపించినది.

౫

జోగారావు కడుటపడి కోర్టుకు పోవుచున్నాడు. అప్పులబాధ యెక్కువైంది. ఇంతలో దీపావళిపండుగ వచ్చినది. పిల్లలు బాణసంచు కావలెనని పోరుపెట్టినారు. సాయంకాలము పెందలకడనే కోర్టునుండి వచ్చి బజారు తీసికొని పోయెదనని పిల్లల నోదార్చి జోగారావు కోర్టునకు వెళ్ళి పెందలకడనే వచ్చినాడు. తాను దుర్వ్యయము చేయుచున్నట్లును, లంచములు మేయుచున్నట్లును పైయధికారులకు తెలిసి రహస్యవిచారణ జరుప నున్నారని యొక మిత్రుడు వ్రాసిన జాబును చూచి జోగారా వధైర్యపడినాడు. భార్య ధైర్యము నూలొల్కొల్పినది. వడ్డీవర్తకులయొద్ద తెచ్చిన మూడువేల రూపాయీల ఋణము మిక్కిలి ముఖ్యమైన దనియు వారి యప్పు తీర్చి పత్రములు విడిపించుకొనకున్నచో నుద్యోగమునకు భంగము రాకమానదని జోగారావు చెప్పినాడు. అంతలో కామేశ్వరమ్మ వారియింటికి వచ్చెను. భర్తను పిల్లలను బజా రంపి రాజేశ్వరి కామేశ్వరిని గౌరవించినది. పాపమ్మ కామేశ్వరికి సకల సదుపాయము లొనర్చినది.

## 6

ఆస్తివిషయమై తనమరది గంగాధరుడు వ్యాజ్యము వేయ నున్నాడని కామేశ్వరి జోగారావుతో చెప్పినది. భ్రమరాంబను రాజేశ్వరి చెల్లెలికొడు కగు సోమేశ్వరమునకు రామశర్మ నిర్ణయించినాడని కామేశ్వరి చెప్పినది. పాపమ్మ ఆమాటలువిని నిక్షేపమువంటి పిల్లను తీసికొని పోయి పేడగుంటలో వేయవలదనియు నింగ్లీషు చదువుకున్న మంచి పిల్లవాని కిమ్మనియు చూచాయగా నంటించినది.

జోగారావు కాగితము లన్నింటిని పరిశీలించినాడు. అనంతశర్మ వ్రాసిన మరణశాసనము, కొన్ని ఋణపత్రములు నందులో లేవనియు శర్మ తీసికొనినాడేమో యనియు పల్కినాడు. గంగాధరు డిచ్చిన రిజిష్టరునోటీసు చూచి యాస్తి యంతయు తనకే చెందవలెనని వ్రాసినా

డని చెప్పి వానితో రాజీ చేసికొనుట మంచిదని సలహా నిచ్చినాడు. రాజేశ్వరి కలుగజేసికొని యేవిధముగానైన రాజీ కుదిర్చెదననియు, భయపడవలదనియు, పాపమ్మచే వర్తమానింతు ననియు వెంటనే ధనము పంపియో స్వయముగా వచ్చియో రాజీపత్రము వ్రాయించుకొను మనియు చెప్పి యా విషయము లేమియు తన యన్నతో చెప్పవద్దనియు చెప్పినచో రాజీ కుదురదనియు బోధించి కామేశ్వరిని పంపివేసెను. శర్మ నడిగి తక్కిన కాగితములు తెచ్చెదనని భ్రమరాంబను తీసికొని కామేశ్వరి చోడవరము పోయెను.

# 7

కామేశ్వరమ్మ చోడవరము చేరుకొన్నది. "గంగాధరు డిచ్చిన రిజిష్టరీ నోటీసువలన హాని యేమియు లేదంటివి. జోగారావు వన్నయ్య చాల చిక్కు లున్నవని చెప్పినాడు. నీవు నన్ను ద్రోహము చేయు చుంటివి. మరణశాసనమును, రెండు పెద్ద ఋణపత్రములును నీదగ్గర నట్టేపెట్టుకొని తక్కిన కాగితము లిచ్చితివి. అవి యిచ్చివేయు" మని కామేశ్వరి శర్మ నడిగినది. కాగితము లన్నియు నిచ్చివేసితి ననియు నామెను మోసగించి యెవరో యా కాగితములు హరించి యుందురనియు, తా నా కాగితముల సంగతి యెఱుగ ననియు శర్మ యొట్టిడినాడు. కామేశ్వరి నమ్మలేదు, శర్మ ద్రోహము చేసినాడని యందరితోను చెప్పి యేడ్చుచు కామేశ్వరి కూతురుని వెంటపెట్టుకొని వెడలిపోయినది.

# 8

1914 వ సంవత్సరములో ప్రథమ ప్రపంచ సంగ్రామము ప్రారంభ మగుటచే విద్యార్జనకై యాంగ్లదేశమునకు వెళ్ళిన విదేశీయు లందఱు తమ తమ దేశములకు వెడలిపోవలసి వచ్చుటచే చదువు పూర్తికాక పూర్వమే ప్రసాదరావు స్వదేశమునకు రావలసి వచ్చెను. తాను వచ్చు చున్నట్లు తండ్రికి తంతినంపెను. ఒకనాడు జోగారావు, భార్యయు నవ్వో మాట లాడుకొనుచుండిరి, అక్కమ్మ యింటిపనులను చూచుచుండెను.

అంతలో సరస్వతి నూతిలో పడినది. పాపమ్మ యీదృశ్యమును కనులార చూచియు లక్ష్మి సరస్వతిని నూతిలో త్రోసినదని బొంకి యామెపై కోపమును రేపించినది. పొరుగున నున్న రాఘవరావు నూతిలోనుండి సరస్వతిని తీసినాడు. వైద్యుడువచ్చి చికిత్స చేసినాడు. క్రమముగా సరస్వతి కోలుకొన్నది. పాపమ్మ కృత్యములకు కొంద రసహ్యించుకొనిరి. కాని గట్టిగా నెవ్వరును మాట్లాడలేకపోయిరి. తనకు గల్గిన యవస్థకు లక్ష్మి చాలసేపు విచారించినది.



రాజేశ్వరి సహజముగనే మూర్ఖురాలు. ఆర్థికదుస్థితిచే నామెబుద్ధి మరింత చెడినది. పాపమ్మ దుర్బోధయు బాగుగా తల కెక్కినది. లక్ష్మిని పుట్టింటికి పంపివేసినది. సేవకు డొక డనకాపల్లివఱకు లక్ష్మి ననుసరించి యటనుండి చోడవరము పోవుట కొక బండికుదిర్చి తాను వెనుకకు మరలెను. అది రాజేశ్వరి యాజ్ఞ. బండివాడు బండితోలినాడు. అనకాపల్లి నుండి యెనిమిది తొమ్మిదిమైళ్ళు పోవుసరికి సాయంకాలమైనది. దురదృష్టవశమున గాలి, వానకూడ వచ్చినది. బండి బోల్తాకొట్టినది. అదృష్టవశమున లక్ష్మికి దెబ్బలుమాత్రము తగులలేదు. బండివాడు బండి నెత్తి సరియైనస్థితిలో నుంచ నెంచెను గాని వానికి సాధ్యముకాలేదు. ఎవరో యిరువురు వ్యక్తులు దూరమున నగుపించిరి. వారిని బ్రతిమాలి తెచ్చి బండిని సరియైన స్థితిలో పెట్టించినాడు బండివాడు. అంతలో లక్ష్మి యం దొక వ్యక్తిని చూచి 'నాన్నా' యని యఱచినది. రామశర్మ తనకుమార్తెను పోల్చుకొని యత్తవారొనర్చిన దురాచారమున కాగ్రహించి పిల్ల నింటికి తీసికొనిపోయినాడు.

## 10

ప్రసాదరా వింగ్లాండు నుండి తిరిగి వచ్చినాడు. అతడు తల్లిమాట కెన్న డెదురాడి యెఱుగడు. లక్ష్మి యనిన ప్రేమ మెండు. లక్ష్మి చాల గుణవతియని యతడెఱుగును. లక్ష్మి స్వభావము మారిపోయిన

దనియు, వచ్చినప్పటినుండి తనను రాచి రంపాన పెట్టుచున్నానని యిరుగు పొరుగు వారితో చెప్పుచుండెడి దనియు, తన నగ లన్నియు నేదో చేసినానని ప్రక్కయింటి శారదతో చెప్పుకొని యేడ్చినదనియు, శారదతో చెప్పుచుండగా మన సరస్వతి విన్నదనియు, సరస్వతిపై కోపముచే నొకనాడామెను నూతిలో త్రోసినదనియు, రాఘవరావు దయవలన పిల్ల బ్రతికినది లేకున్న నేమై యుండెడిదో యనియు, పాపమ్మ వంటింటి కిటికీలోనుండి యది యంతయు చూచి చెప్పిన దనియు, మనయింటిపై దాని కావంతయు ప్రేమ లేదనియు చిట్టచివరకు వలదన్నను వినక యొంటరిగా చోడవరము పోవుటకు సిద్ధపడిన దనియు, అది తాను గ్రహించి యొక నౌకరు నిచ్చి పంపగా ననకాపల్లినుండి వానిని వెనుకకు పంపివేసిన దనియు, మంచి సంబంధమును చూచి త్వరలో తన నొక యింటివానిగా చేయ యత్నించుచుంటి ననియు, అభిమానములేని భార్యతో కాపురము చేయరాదనియు, తన నోటికి వచ్చిన ట్లెల్ల రాజేశ్వరి ప్రసాదరావుతో చెప్పి నూతిపోసినది.

ప్రసాదరావు తల్లిమాటలు వినకుండ నుండలేకపోయినాడు, లక్ష్మినిగురించి మనస్సున ననుమానింపను లేదు. కాని పరిస్థితు లన్నియు విని విచారగ్రస్తుడైనాడు.

# 11

రామశర్మ గంభీర హృదయుడు. ధైర్య స్థైర్యములు గలవాడు. అయినను రాజేశ్వరిలో కలిగిన మార్పునకు కారణ మేమియో, కామేశ్వరమ్మకు తనయం దవిశ్వాసము కల్గుటకు హేతు వేమియో, త్వరగా గ్రహింపలేకుండెను. పోయిన వని కామేశ్వరమ్మ చెప్పిన పెద్ద ఋణపత్రములు రెండును శర్మకు కరతలామలకములే. వారి యొద్దకుపోయి సంగతి తెలిసికొనినాడు. ధనము చాల అవసరముగా నున్నదని కామేశ్వరమ్మయే యా పత్రములను జోగారావునకు పంపిన దనియు, వడ్డీని పూర్తిగా త్రోసివేయుటకు జోగారా వంగీకరించుటచే తా మెట్లో యప్పు నెత్తి

మును జతపఱచి పత్రములను విడిపించుకొంటి మనియు పత్రములవార్త
శర్మకు చెప్పగా సంగతి యంతయు శర్మకు బోధపడినది. సమయము
వచ్చినప్పుడు సాక్ష్య మిచ్చి సత్యమును నిలుపవలసినదని శర్మ వారిని
కోరినాడు. వా రందుల కొప్పుకొనినారు. డబ్బుకై యిబ్బందిపడుచుండిన
రాజేశ్వరి కుతంత్ర మనియు శర్మ గ్రహించినాడు. జోగారావునకు
కూడ నాసంగతి తెలిసి యుండదనియు శర్మ యూహించినాడు. మరణ
శాసనముకూడ పాపమ్మ సాయమున రాజేశ్వరియే తీసియుండవలెనని
నిశ్చయించినాడు. మరణశాసనములోని ముఖ్యవిషయములు రెండు.
రామశర్మ కుమారుని కామేశ్వరమ్మ దత్తత చేసికొనుట. భ్రమరాంబను
అన్నపూర్ణ కుమారున కిచ్చి పెండ్లిచేయుట. ఈ రెండింటి కిష్టపడనివారే
దాని నపహరించి యుందురని యూహించినాడు. మరణశాసనము
లేకుండ చేసి భ్రమరాంబను ప్రసాదరావునకు చేసికొన్నచో కామేశ్వ
రమ్మ ఆస్తి యంతయు తమకే దక్కునని రాజేశ్వరి యెత్తిన యెత్తని
శర్మ గ్రహించినాడు. మరణశాసనము వ్రాసిన వకీలునొద్ద నొక నక
లున్న దనియు, దానియందుకూడ అనంతశర్మ వ్రాలును, ఇతరసాక్షుల
వ్రాళ్ళు నున్నవని శర్మ యెఱుంగును. కాని రాజేశ్వరి కేమి తెలియును?
శర్మ వకీలుదగ్గరకు వెళ్ళుటకు ప్రయాణమైనాడు. అనకాపల్లి స్టేషనులో
నుండగా నాకస్మికముగా ప్రసాదరా వగుపించినాడు. అతనితో ప్రసం
గించినాడు శర్మ. అగ్నిసాక్షిగా వివాహ మాడిన భార్య నకారణముగా
విడిచిపెట్టరాదని ప్రసాదరావునకు ధర్మబోధ చేసినాడు. లక్ష్మి
స్వభావము మారినదనియు, పతితయగు ఆడుదానిని కట్టుకొని వంశ
గౌరవము నాశనము చేయవలదని తల్లి యాజ్ఞ యని ప్రసాదరావు
సమాధాన మిచ్చినాడు. పతితయైనచో తప్పక పరిత్యజింపుమనియు
పరిశుద్ధ యైననే పరిగ్రహింపు మనియు రామశర్మ మరల కోరినాడు.
సరస్వతిని నూతిలో త్రోయుట, వద్దన్నను నొంటరిగా పుట్టింటికిపోవుట
యీ రెండును నిరుగుపొరుగువారల వల్ల తేలు విషయములే యనియు,
నగలవిషయమై తానే తేల్చెదననియు చెప్పి ప్రసాదరావును శర్మ

విశాఖపట్టణము తీసికొనిపోయినాడు. నగలపర్తకుడగు వరదరాజు దగ్గరకు వెళ్ళి క్రొత్తవిగాని ప్రాతవిగాని బంగారు నగ లమ్మకమున కున్నవా ? సుమారు మూడువేల రూపాయీల నగలు కావలెనని యడిగి నాడు శర్మ. మంచినగలు మొన్ననే యమ్మివేసినా ననియు, మజూరి మినహాయింపుగా వెళ్ళిపోయిన వనియు, మునసబు జోగారావుగారి యింటిలోని నమ్మకమైన, నాజూకైన నగ లన్నియు, రాజేశ్వరమ్మగారే యమ్మిపెట్టుమని తనచేతి కిచ్చినా రనియు నదివఱ కొకసారికూడ నగ లమ్మినా రనియు వరదరాజు పూర్తిగా శర్మతో చెప్పినాడు. ప్రసాద రావు నిర్ఘాంతపోయినాడు. మంచినగలు వచ్చినప్పుడు చెప్పుమని రామ శర్మ వరదరాజుతో చెప్పి, మొదట నమ్మిన నగలు మీ యమ్మగారివి. తరువాతవి నీభార్యవి యని ప్రసాదరావుతో చెప్పి వాని నింటికి బంపి తాను వకీ లింటికి వెళ్ళినాడు.

# 12

లక్ష్మి ప్రవర్తన విషయమై నిజము తెలిసికొన ప్రయత్నించి ప్రసాదరావు రాఘవరా వింటికి వెళ్ళెను. రాఘవరావు తల్లి మంగమ్మ లక్ష్మియెడ నేదోషము లేదనియు, నన్నిటికి పాపమ్మ ముఖ్యకారకురా లనియు, పాపమ్మ దురోభ్చ రాజేశ్వరి నెత్తి కెక్కి పుట్టింటికి పోనని యేడ్చుచున్నను లక్ష్మిని రాజేశ్వరి బయటికి గెంటించిన దనియు, ధనాశచే కామేశ్వరమ్మ కుమార్తెను భ్రమరాంబను నీకిచ్చి నీతల్లి పెండ్లి చేయ నిశ్చయించిన దనియు ప్రసాదరావుతో చెప్పినది. లక్ష్మియెడ నేదోషము లేదని గ్రహించినాడు ప్రసాదరావు. ప్రసాదరా వింటికివచ్చి లక్ష్మిని విడిచినప్పుడు లక్ష్మినగలు లక్ష్మి కిచ్చివేయుట ధర్మమని నగ లిమ్మని ప్రసాదరావు తల్లి నడిగినాడు. సరియైన సమాధానము చెప్పక కొడుకుపై విసుగుకొనుచు రాజేశ్వరి వెళ్ళిపోయినది. వరదరాజు వలన నగలవిషయము విన్న ప్రసాదరావు తల్లిచేసిన దుష్కార్యమునకు విచా రించెను.

# 13

సింహాచలము గొప్ప పుణ్యక్షేత్రము. వైశాఖశుద్ధ తదియనా డచ్చట గొప్ప యుత్సవము జరుగును. నరసింహస్వామి విగ్రహమునకు పూయుచుండిన గంధపు పూతను నాడర్చకు లొలిచి స్వామి నిజరూపమును యాత్రికులకు చూపుదురు. అదే చందనపు టొలుపు. గొప్పయుత్సవము. లక్ష్మి తలిదండ్రులతోకూడ నా యుత్సవమునకు వచ్చినది. తన వలెనే దేవు నారాధింపవలెనని ప్రసాదరావును వచ్చినాడు. లక్ష్మి వానిని చూచి పాదములకు నమస్కరించినది.

రామశర్మ బోధించినప్పటినుండి, మంగమ్మ నిజము చెప్పినప్పటి నుండి లక్ష్మియెడ మిక్కిలి జాలిగలిగిన ప్రసాదరావు దైవసన్నిధిని, దైవసాక్షిగా జరిగిన సంగతులు నిజముగా చెప్పుమని లక్ష్మి నడిగినాడు. ఆమె ప్రమాణముచేసి తనపై నిందారోపణచేసి యవమానించి యత్తగారు తనను పుట్టింటికి పంపినదనియు, ఇరుగు పొరుగువారితో నత్తపై చాడీలు చెప్పినానని పాపమ్మ కల్పించి చెప్పుటచే అత్త నమ్మినదనియు, ప్రక్కింటి శారదతో నేవో చెప్పినానని సరస్వతిచే ననిపించినది పాపమ్మయే యనియు, సరస్వతిని, శారదనుకూడ నడిగిన తెలియగలదనియు సరస్వతిని నూతిలోనికి త్రోయుచుండగా పాపమ్మ వంటింటి కిటికీలో నుండి చూచితిననికదా చెప్పినది. వంటింటి కిటికీ యేవైపున నున్నదో మీరైన చూచినారా? చూచినచో దాని నిజమప్పుడే తెలియగలదనియు బావిగాని, పెరడుగాని యా కిటికీనుండి కనిపించనే కనిపించదనియు, పుట్టింటికి పోనని యేడ్చుచున్నను బయటికి గెంటిన దత్తగారే యనియు, మామగారి నడిగినను వారు నిజము చెప్పుదురనియు, మొదలగు సంగతులు చెప్పి యేడ్చినది. వెనుక విన్న సంగతులకు లక్ష్మి చెప్పిన సంగతులకు వీసముకూడ భేదములేదని గ్రహించినాడు ప్రసాదరావు. ఖిన్నుడైనాడు సత్య మెఱింగినను అప్పుడే యామె నింటికి తీసికొని పోజాలననియు కొంతకాల మోపికపట్టుమనియు లక్ష్మితో చెప్పినాడు. లక్ష్మిని వెదక

కొనుచు తలిదండ్రులువచ్చి ప్రసాదరావును చూచి జరిగిన విషయములను పూసగ్రుచ్చినట్లు చెప్పినారు. భ్రమరాంబకు ప్రసాదరావును పెండ్లాడుట కిష్టములేదనియు, ఆమెను సుముఖురాలుగా చేయుటకు రాజేశ్వరి పాపమ్మను కామేశ్వరమ్మ యింటి కంపినదని శర్మ ప్రసాదరావుతో చెప్పినాడు. తాను పోగొట్టుకొన్న వ్యవహారపత్రముల నిజస్థితి కామేశ్వరమ్మ కంతవఱకు తెలియదనియు తెలిసినతరువాత నేమిచేయునో చూతమనియు శర్మ ప్రసాదరావుతోచెప్పి యూరకుండెను.

# 14

రాజేశ్వరమ్మతో సంబంధము కలుగనున్నదని కామేశ్వరమ్మ చాల సంతోషించినది. జోగారావు తన వ్యవహారము లన్నియు చక్కబెట్టగలడనియు, జ్ఞాతులవలన తనకెట్టిహానియు లేదని సంతసించినది. వివాహము జరిపించు భారము పాపమ్మనెత్తిపై బెట్టినది. రాజేశ్వరి కంపవలసిన మూడువేల రూపాయిలమాట పాపమ్మ ప్రసంగించుచున్నది. అంతలో రామశర్మ భార్య పిల్లనెత్తుకొని వచ్చినది. కామేశ్వరమ్మ నిర్ఘాంతపోయినది. తరువాత రామశర్మ తనకుచేసిన ద్రోహమును వెలిపుచ్చి, భ్రమరాంబను ప్రసాదునకిచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయించితినని కామేశ్వరి సుభద్రతో చెప్పినది. ఆమె చేయనున్న పని చాలనింద్యమైనదని సుభద్రమ్మ అక్కయగు కామేశ్వరిని నిందించి యామె యింట భోజనము చేయకయే చోడవరము వెళ్ళిపోయెను.

# 15

రాజేశ్వరి కాపురాలైన పాపమ్మ కామేశ్వరమ్మ యింట ప్రవేశించినది. భ్రమరాంబ పెండ్లి పెత్తనమంతయు నామెదే. తిరుపతయ్య కామేశ్వరమ్మకు దూరపుబంధువు. అతనిని సహాయముగా తీసికొని సరకులు కొనుటకు కామేశ్వరమ్మ విజయనగరము వెళ్లినది. ఆమె సేవించిన వర్తకులు చాలమంది కలరు. వారామె నాదరించిరి. కాని జోగారావుగారికి పత్రములిచ్చి తమమీద వ్యాజ్యెము వేయుమనిచెప్పుట న్యాయమా

యని యామె నడిగెను. ఆయన న్యాయాధికారి యగుటచే ఋణపత్రము మీద నాయన చెల్లువ్రాయక భార్యచే వ్రాయించి యిచ్చినారనియు చెప్పిరి. ఆమాటల కామె యాశ్చర్యపడినది. ఋణపత్రములు రామశర్మ యపహరించినాడని యనుకొనుచున్న కామేశ్వరమ్మ యూవర్తకుల మాటలకు నిశ్చేష్టురాలైనది. ఆ పత్రములను వారు తెచ్చి చూపగా చూచి వడ్డీ కూడ మానివేసినారని తెలిసికొని కామేశ్వరి యద్భుతపడినది. జోగారావుపరిస్థితి బాగుండలేదనియు, భ్రమరాంబను ప్రసాదరావున కిచ్చి పెండ్లిచేయ తలంచుట యన్యాయము, దూష్యమనియు వర్తకులు కామేశ్వరమ్మను నిందించిరి. తొందరపడవలదని హెచ్చరించిరి.

కామేశ్వరికేమియు తోచలేదు. నిష్కారణముగా రామశర్మను శంకించి నిందించినందులకు విచారించినది. ఆమె ప్రయాణమై తిరిగివచ్చుచుండ నరసయ్యయను దూరపు బంధు వొకడును, తన మఱది గంగాధరుడును కనిపించిరి. నోటీసిచ్చిన గంగాధరుని కామేశ్వరమ్మ తిట్టిపోసినది. మూడువేల రూపాయీలు ముట్టినవాయని చెప్పినది. ఆమాట లతనికర్థముకాలేదు. రూపాయీల సంగతియే తనకు తెలియదనినాడు గంగాధరుడు. ఆ డబ్బు తనకిచ్చి రాజీ చేయుదునని రాజేశ్వరమ్మ పుచ్చుకొనినదని కామేశ్వరి గంగాధరునితో చెప్పినది. చాలమంది పెద్దమనుష్యులు రాజేశ్వరిని నిందింపగా విన్నది కామేశ్వరి. అనకాపల్లినుండి పెండ్లిసామగ్రిని తెచ్చునప్పుడు పాపమ్మ కొంతడబ్బును వెనుక వేసికొన్నదనిగూడ కామేశ్వరమ్మకు తెలిసినది. ఈ విషయము లన్నియు కామేశ్వరికి భయము గలిగించినవి. పాపమ్మ ధైర్యముచెప్పి యింకను కామేశ్వరికి బోధింప సాగినది.

## 16

కామేశ్వరమ్మ విజయనగరమునుండి స్వగ్రామమునకు వచ్చినది. మొగమెఱుగని పెండ్లివా రెందరో వచ్చినారు. ఊరిలోనివా రెవ్వరు నామెకు సహాయపడుటలేదు. రాజేశ్వరి చేసిన దురన్యాయములు తెలిసికొన్నది. రామశర్మ, సుబ్బయ్యశాస్త్రి మొదలగు పెద్దలను తీసికొని

కామేశ్వరి యింటికి వచ్చినాడు. వికారి సంవత్సరము పంటలు రైతులెవ్వరు నివ్వలేదని రామశర్మ వారిచే సాక్ష్యమిప్పించి ఋజువుచేసినాడు. మరణ శాసనమును తానపహరించుటకు కారణమేలేదని నిరూపించినాడు. రాజేశ్వరియే మరణ శాసనము నపహరించి కామేశ్వరి కుమార్తెను ప్రసాదరావునకు పెండ్లిచేసి యా యాస్తిని సంగ్రహింపవలెనని యోజించినదని ఋజువుచేసినాడు. తొందరపడి శర్మను నిందించినందులకు కామేశ్వరమ్మ చాల విచారించినది. వకీలు కృష్ణరావును తీసికొనివచ్చి రామశర్మ మరణశాసన విషయ మంతయు చెప్పించినాడు. నకలు చూపించినాడు. భర్త మరణశాసనము ప్రకారము నడుచుకొనినప్పుడే కామేశ్వరమ్మ కాస్తిపై నధికారము గలదనియు లేకున్న భరణము మాత్రమే యనియు కృష్ణారావు చెప్పినాడు కామేశ్వరమ్మ తలపై పిడుగు పడినట్లయ్యెను. అంతలో కలకలలాడుచు లక్ష్మి ప్రసాదరావు లచ్చటికి వచ్చిరి. జరిగిన దానికి రాజేశ్వరి బాధపడుచున్నదనియు, ఆర్థికపరిస్థితులవల్లను పాపమ్మ దుర్బోధవల్లను మతిచెడి ప్రవర్తించినదనియు, లక్ష్మియెడ చేసిన యన్యాయములనుదలచుకొని విచారించుచున్నదనియు ప్రసాదరావు రామశర్మతో చెప్పినాడు.

మఱదిని క్షమాపణ వేడుకొన్నది కామేశ్వరమ్మ. పెండ్లికిచేసిన ప్రయత్నము లూరకపోరాదు మరణశాసనము ప్రకారము భ్రమరాంబను సోమేశ్వరమున కిచ్చి పెండ్లిచేయుమని శర్మ యాజ్ఞాపించినాడు.

పాపమ్మ యీపరిస్థితులన్నింటిని పరిశీలించి యెప్పుడో చల్లచల్లగా జాఱినది. అది యెవరును గమనించలేదు. కామేశ్వరమ్మ చోడవరము వెళ్ళి చెల్లెలు సుభద్రతోను, అన్నపూర్ణతోను పెండ్లివిషయమై సంప్రతించినది. అదియు రామశర్మయాజ్ఞ. ఆమెమనసు కుదుటపడినది. అన్నియు సుఖాంతములైనవి.

## ప్రశ్నోత్తరములు

### 1. పాపమ్మ చరిత్ర :—

చోడవరమున రామశర్మయను మేలిగృహస్థుడుగలడు. అతనిభార్య సుభద్రమ్మ. కుమార్తె లక్ష్మి. అనంతశర్మ భార్య కామేశ్వరమ్మ. కామే

శ్వరమ్మయు సుభద్రమ్మయు అక్కచెల్లెండ్రు. అనంతశర్మ చాలయాస్తి సంపాదించి చనిపోయినాడు. అతనికి భ్రమరాంబయను కూతు రొక్కతెయే. రామశర్మకు రాజేశ్వరి, అన్నపూర్ణయను నిరువురు చెల్లెండ్రు గలరు. అందు రాజేశ్వరి కోర్టుమునసబగు జోగారావుభార్య. ఆ దంపతుల పెద్దకొడుకు ప్రసాదరావు. ప్రసాదరావుభార్య లక్ష్మి. కూతురు సరస్వతి. అనంతశర్మ మరణశాసనము వ్రాసి చనిపోయినాడు. అందు రామశర్మ కొడుకును దత్తత చేసికొనుమనియు, అన్నపూర్ణ కుమారుడు సోమేశ్వరమునకు భ్రమరాంబను పెండ్లిచేయుమనియు వ్రాసి వ్యవహారమంతయు రామశర్మ చేతిలో పెట్టినాడు.

కామేశ్వరమ్మ యిల్లు విజయనగరమున నున్నది. ధనవంతురా లగుటచే బంధుగులు చాలమందివచ్చి యామె యింట నిలువకుండిరి. ఆమె యిల్లొక చిన్న సత్రమైనది. ఈమె దూరపుబంధు వొకతె పాపమ్మ. ఈమె వితంతువు. పచ్చపచ్చగానున్న రెండు కుటుంబముల నెండించి వచ్చి యిప్పుడు కామేశ్వరమ్మ నాశ్రయించినది. ఆమెకు సకలోపచారములుచేసి ఆమెకు తలలో నాలుకయై మెలగుచు ఆమెను వలలో వేసికొన్నది. ఇంటికార్యకలాప మంతయు పాపమ్మచేతిమీద నే నడుచుచున్నది. పరమునకై పుణ్యమును కామేశ్వరమ్మయు, ఇహమునకై ధనమును పాపమ్మయు కూడబెట్టుగొనుచున్నారు.

ఒకయేడు వర్షములు కురియకపోవుటచే పంటలు పండని రైతులు శిస్తు లెగగొట్టిరి. కామేశ్వరికి బంధుపోషణ కష్టమైనది. విజయనగర కాపురము కష్టమని రామశర్మ కామేశ్వరిని శృంగవరపుకోటకు పంపినాడు. పాపమ్మ తన పెత్తనము పోయినదని యేడ్చి రామశర్మయే కుతంత్రము పన్నినాడని రైతులు దెబ్బగొట్టుట యబద్ధమని కామేశ్వరితో చెప్పి కామేశ్వరికి రామశర్మయెడ నపనమ్మకము పుట్టించినది. తనకింక నచట లాభము లేదనుకొని, తనకు రావలసిన భరణపుసొమ్మును రాబట్టుకొనుటకు విశాఖపట్టణము వెళ్ళవలెననియు, రాజేశ్వరమ్మ సహాయమున రాబట్టుకొందుననియు వంకచెప్పి పాపమ్మ మెల్లగా జారినది. విశాఖ

పట్టణము చేరినది. రాజేశ్వరి పాపమ్మకు తనయింట స్థానము ఇచ్చినది. రాజేశ్వరి యార్థికస్థితి బాగుండలేదని తెలిసికొన్నది పాపమ్మ. రాజేశ్వరి కోపము, విసుగు లక్ష్మిపై చూపుచుండుటచే రామశర్మపై పాపమ్మకుగల కోపమును వానికుమార్తె లక్ష్మిపై చూపసెంచి మండెడు నగ్నిలో నేయి పోసినది పాపమ్మ. అత్తకు కోడలిపై నేర్పడిన కోపమును ద్వేషముగా మార్చినది. తగినచర్యతీసికొన్నచో వియ్యంకుడు రామశర్మ కాళ్ళబేరమునకు రాడాయని మెల్లగా నటించినది పాపమ్మ. చాటుగ చిరుతిండ్లు పెట్టుచు పిల్లలను తన చెప్పుచేతలలో పెట్టుకున్నది.

శ్రావణ మంగళవారము వచ్చినది. లక్ష్మి తన నగలసంగతియెత్తనే లేదు. మంగళవారము నోమునకైనను మా అత్త నగలిచ్చునో లేదోయని పక్కింటి శారదతో చెప్పుచుండగా సరస్వతి విన్నదని రాజేశ్వరితో చెప్పి లక్ష్మిపై కోపాగ్నిని రగులు కొల్పినది.

కామేశ్వరమ్మ రాజేశ్వరమ్మ యింటికిరాగా నామెకూతురు భ్రమరాంబ పెండ్లిప్రసంగము తెచ్చి బంగారువంటి పిల్లను పల్లెలో పాఱవేయవద్దనియు జోగారావుతో సంబంధము చేసికొనుమనియు ప్రోత్సహించి లక్ష్మికాపురము పాడుచేయుట కంకురార్పణ చేసినది. కామేశ్వరమ్మ తాలూకు పెద్ద ఋణపత్రములు, మరణశాసనమును రాజేశ్వరి యపహరించుటలో చేదోడువాదోడైనది పాపమ్మ. పిమ్మట కామేశ్వరమ్మ ఋణపత్రములు, మరణశాసనము రామశర్మ యపహరించినాడని పాపమ్మ కామేశ్వరమ్మకు దుర్బోధ చేసినది.

ఒకనాడు సరస్వతి కాలుజాఱి నూతిలోపడినది. రాజేశ్వరీ జోగారావు లిరువురు నెక్కడనో కబుర్లు చెప్పుకొనుచుండిరి. అది సమయము కనిపెట్టి సరస్వతిని నూతిలోనికి త్రోయుచుండగా వంటఇంటి కిటికీలో నుండి చూచితినని పాపమ్మ బొంకి లక్ష్మిపై నేరము మోపి రాజేశ్వరి కెక్కడలేని కోపము పుట్టించినది. తన నోటికి వచ్చినట్లెల్ల మాట్లాడ జొచ్చెడిది. నగలవిషయమై ప్రక్కింటి శారదతో చెప్పినప్పుడు విన్నానని సరస్వతి చెప్పుటచే నా కోపముచే నూతిలో త్రోసినదని చక్కగా,

నతుకునట్లు బొంకినది. లక్ష్మిని పుట్టింటికి పంపుటయే తమకుటుంబమునకు శ్రేయస్కరమని రాజేశ్వరికి నచ్చజెప్పి యట్లు చేయించినది పాపమ్మ. భ్రమరాంబను ప్రసాదరావునకు చేసికొన్నచో కామేశ్వరమ్మ యాస్తి యంతయు తమకే దక్కగలదని రాజేశ్వరికి పాపమ్మయే బోధ చేసినది. భ్రమరాంబను వివాహమునకు సుముఖురాలినిగా చేయుటకు పాపమ్మ బయలుదేరి కామేశ్వరమ్మ యింటికి వచ్చినది. మరల పెత్తనమంతయు పాపమ్మయే వహించినది. కామేశ్వరికి ధైర్యము చెప్పి యెవ్వరు సహాయ పడకున్నను తన కాపురులగువారున్నారనియు వారిని పిలిపించి యంతయు నిర్వహించెదనని బాసచేసినది పాపమ్మ. గంగాధరుని వ్యాపారము కూడ తనకు తెలిసినదే కనుక రాజేశ్వరికి రాజీనిమిత్తము మూడువేలు కామేశ్వరమ్మ పంపునట్లు చేసినది. భ్రమరాంబా ప్రసాదరావుల వివాహమునకు తానే కారకురాలని పెండ్లియైపోయినట్లే మురిసిపోయినది పాపమ్మ. కామేశ్వరమ్మకు పాపమ్మ చేసిన బోధ మధురాతి మధురమయినది.

పరిస్థితులు తారుమారైనవి. పాపమ్మ చేసిన పను లన్నియు నొక్కొక్కటే బుజువైనవి. లక్ష్మి నిరపరాధిని యని తేలిపోయినది. శర్మ తనపై మోపబడిన నిందల నన్నింటిని పరిహరించుకొనినాడు. నిష్కళంక దంపతు లగు లక్ష్మీ ప్రసాదులు వచ్చి నిలిచినారు. కాపురములు పాడుచేయుట కవతరించిన పాడుముండ పాపమ్మ సమయము చూచుకొని మెల్లగా జారినది. మరే యమాయకురాలి కొంప కూల్చుటకు పోయినదో !

## 2. లక్ష్మి గుణశీలములు :—

లక్ష్మి మిక్కిలి గుణవంతురాలు. అత్తమామల కెప్పుడు నెదురాడి యెరుగదు. అత్తమామలకే కాదు. పెద్ద లెవ్వరికి నెదురుచెప్పదు. అది యామె తలిదండ్రుల శిక్షణ. ఆమె చదు వంతయు భారత భాగవత రామాయణములపై నాధారపడినది భర్తను దైవముగను భర్తదలిదండ్రులం తన తల్లిదండ్రులుగను గణించి వారితో నైకమత్యము పొందవలయు

ననుట ఆమె తలిదండ్రులు తనకు చూపిన ఆదర్శము. ఇట్టి యాదర్శము లామెకు వెన్నతో పెట్టినవి. భారతీయ సత్సంప్రదాయ మీమెకు రెండవ ప్రకృతి. అతి శాంతగుణము గలది. ఎట్టి విపరీత పరిస్థితు లేర్పడినను జంకదు. పుట్టింటికి జాబులు వ్రాయరాదని యత్త ఆజ్ఞ. ఆ యాజ్ఞకు బద్ధురాలే. ఇంటిపను లన్నియు చక్కగా నిర్వహించెడిది. ఆడుబిడ్డను మఱది నెంతో ప్రేమతో చూచెడిది. పొరుగింట పేరాడు కాలుపెట్టి యెఱుగదు. పరుషవాక్య మను మాట నోట వెలువడిన జాడలేదు.

అత్తవారి యార్థిక పరిస్థితులు మారినవి. డబ్బునకిబ్బంది పడుచున్నారు. అత్తగారు మూడువేలరూపాయీల నగలు తీసికొనిపోయి వరదరాజున కమ్మివేసినది. లక్ష్మి పల్లెత్తుమాటైనను ననలేదు. పాపమ్మ కల్పించి యేవేవో చెప్పినను ఊరకున్నదిగాని పాపాత్మురాలగు పాపమ్మను కూడ నేమియూ ననలేదు.

లక్ష్మి మంచి తార్కిక జ్ఞానము గలది. సరస్వతిని నూతిలో త్రోసివేసినది లక్ష్మియే యనియు వంటయింటి కిటికీనుండి పాపమ్మ చూచినదనియు చెప్పిరి. వంటయింటి కిటికీవైపు నూయి లేనేలేదు. బావిగాని, పెరడుగాని యా కిటికీలోనుండి కనబడవనియూ నందుచే పాపమ్మ శుద్ధ అబద్ధ మాడినదనియు చక్కగా ఋజువుచేసినది. ఆమె పడు బాధలను చూచి యిరుగుపొరుగువారైన విచారించిరిగాని యత్తవారు బాధ పెట్టుచున్నారని యా యిల్లాలి నోట వెలువడనేలేదు.

రాజేశ్వరి నిర్బంధించి సెలవు నిచ్చి పంపిననే పుట్టింటికి వెళ్ళినది కాని తానై లక్ష్మి స్వతంత్రించి వెళ్ళలేదు. పుట్టింటికి పోయినను అత్తపై నేమియు నేరము చెప్పనేలేదు. లక్ష్మి దేవతాపూజయం దాసక్తి గలది. వైశాఖశుద్ధ తదియనాడు సింహాచల నృసింహస్వామి యుత్సవము మహావైభవముగా జరుగును. తలిదండ్రులతో లక్ష్మి యా యుత్సవమునకు పోయి భక్తితో నాదేవు నారాధించెడిది. లక్ష్మి సత్యమునే పలుకును గాని యసత్య మాడదు. ప్రసాదరావు తన వృత్తాంతమును చెప్పుమనినపుడు పొల్లుపోకుండ నగ్నసత్యమే చెప్పినది. ఆ సత్యము చెప్పు నప్పు

క త్తగారిపై నేరము చెప్పకలసి వచ్చినను తన దురదృష్టముచే అత్త యట్లు మారినదికాని యత్త దోషమని చెప్పదయ్యె. లక్ష్మియన్న లోకజ్ఞానము నకు తార్కిక దృష్టికి ఆమె సరళవాక్యపు ప్రసంగములే నిదర్శనములు. లక్ష్మి గుణవతి కనుకనే మరల భర్తను కలిసికొని సమస్త సౌఖ్యము లనుభవించినది.

3. రామశర్మపైని, లక్ష్మిపైని ఆరోపింపబడిన యపవాదము లెవ్వి? వాని నెట్లు రామశర్మ తొలగించెను?

రామశర్మ తోడియల్లుడు అనంతశర్మ. అనంతశర్మ భార్య కామేశ్వరమ్మ. ఆమెకూతురు భ్రమరాంబ. అనంతశర్మ చాల ఆస్తి సంపాదించినాడు. అవసానకాలమున మరణశాసనము వ్రాసినాడు. రామశర్మ కుమారుని దత్తత చేసికొనుమనియు భ్రమరాంబను అన్నపూర్ణ కుమారుడు సోమేశ్వరమున కిచ్చి పెండ్లిచేయవలయుననియు వ్రాసినాడు. రామశర్మ తన వ్యవహారము లన్నియు చూచువాడు. రామశర్మ సహజ ధైర్యస్థైర్యములు కలవాడు. కష్టములకు జంకడు. గంభీరహృదయుడు. కామేశ్వరమ్మ తన కాగితముల నన్నింటిని తీసికొనిపోయి జోగారావున కిచ్చినది. ధనాసక్తిగల రాజేశ్వరి యందలి ఋణపత్రములను మరణ శాసనమును నపహరించినది. రామశర్మయే యపహరించినాడని కామేశ్వ రమ్మ వానిపై నిందవేసినది.

పోయినవని చెప్పిన రెండు ఋణపత్రములను ఎవ్వరు వ్రాసి యిచ్చిరో తనకు తెలియును గనుక వారియొద్దకు పోయి రహస్యముగ నీవిషయము ప్రస్తావించినాడు. ధనము చాల నవసరముగా నున్నదని కామేశ్వరమ్మయే యాపత్రములను జోగారావుతో పంపినదనియు వడ్డీని పూర్తిగా త్రోసివేయుటకు జోగారా వంగీకరించుటచే తా మెట్లో అప్పు మొత్తమును జతపఱచి పత్రములను విడిపించుకొంటి మనియు వారు చెప్పిరి. సమయమునకు వచ్చి వారు సాక్ష్య మిచ్చిరి. డబ్బుకై యిబ్బంది పడి రాజేశ్వరి చేసిన కుతంత్రమని యందరికి తెలిసినది. రామశర్మపై నానింద తొలగినది.

రెండవది రామశర్మ కుమారుని కామేశ్వరమ్మ దత్తత చేసికొనుట. భ్రమరాంబను అన్నపూర్ణ కుమారునకు పెండ్లిచేయుట. ఈ రెండింటి కిష్టపడనివారే దాని నపహరించి యుందురని రామశర్మ నిశ్చయము చేసికొనినాడు. అది రాజేశ్వరి తన చెల్లెలే చేసినదని నిశ్చయించినాడు. కామేశ్వరమ్మ కూతునని ప్రసాదరావుకి పెండ్లిచేసి యాస్తి యంతయు లాగుకొని లక్ష్మి గొంతు కోయతలంచినది తన చెల్లెలేయని నిశ్చయించినాడు. కాని మరణశాసన మెట్లువచ్చును? తనపైన నింద యెట్లు తొలగించుకొనుట? మరణశాసనము వ్రాసిన వకీలునొద్ద నొక నకలు ఉన్నదనియు, దానియందుకూడ అనంతశర్మ వ్రాలును, ఇతరసాక్షుల వ్రాళ్ళుండిన వనియు తెలిసినవాడగుటచే శర్మ విశాఖపట్టణముపోయి కృష్ణారావను న్యాయవాదిని తీసికొనివచ్చి కామేశ్వరమ్మ యెదుట పెట్టినాడు. కృష్ణారావు అనంతశర్మ వ్రాసిన మరణశాసనము నకలు చూపి యందలి షరతులను చెప్పినాడు. రాజేశ్వరియు కామేశ్వరమ్మయును లక్ష్మీదేవి గొంతుకోయుటకు ప్రయత్నించిరన్న సంగతి వెల్లడియైనది. రామశర్మపై రెండవనింద తొలగిపోయినది.

మూడవది యనావృష్టి దోషము లేదనియు, రైతులు శిస్తు లిచ్చినను. వానిని రామశర్మ తినివేసి యివ్వలేదని చెప్పినాడన్న నింద. రామశర్మ శృంగవరపుకోటలోని పెద్దమనుష్యుల నందరిని ప్రోగుచేసి వికారిసంవత్సరము రైతు లెవ్వరు శిస్తు లివ్వలేదని వారివల్ల తెలిసికొన్నాడు. సుబ్బయ శాస్త్రి మొదలగు పెద్దమనుష్యుల నందరిచే కామేశ్వరమ్మకు సాక్ష్య మిప్పించినాడు. పాపమ్మ చెప్పుటచే నిజమని నమ్మి రామశర్మ ననరాని మాట లంటిననియు క్షమింపుమనియు కామేశ్వరమ్మ శర్మను కోరినది. ఈవిధముగా నతనిపై బడ్డ మూడు నిందలను తొలగించుకొనినాడు.

లక్ష్మిపై నారోపింపబడిన నిందలు మూడు. 1. సరస్వతిని నూతిలో త్రోయుట. 2. పెద్దల యాజ్ఞనుదాటి లక్ష్మి పుట్టింటికిపోవుట. 3. తన నగల నమ్మినదని యత్తగారిపై నిందమోపుట.

రామశర్మ ప్రసాదరావును కలిసికొని యిరుగుపొరుగువారి నడిగిన మొదటి రెండును బుజువు కాగలవని చెప్పి ప్రోత్సహించి ప్రసాదరావు నంపినాడు. అతడు వెళ్ళి పొరుగింటి రాఘవరావు మంగమ్మలవలన సంగతి యంతయు తెలిసికొని లక్ష్మియెడ నేదోషములేదని రామశర్మతో చెప్పినాడు. పాపమ్మ పలికి బొంకినదనియు రాజేశ్వరియే ధనాశచే లక్ష్మిని పుట్టినింటికి పంపినదనియు బుజువైనది.

నగలసంగతి వెల్లడించుటకు స్వయముగా రామశర్మ ప్రసాదును వెంటపెట్టుకొని విశాఖపట్టణము వెళ్ళినాడు. వరదరాజు దుకాణము లోనికి వెళ్ళినాడు. మూడునాలుగువేల రూపాయీల వస్తువు లమ్మకమున కున్నవా యని యడిగినాడు. మొన్ననే యమ్మివేసితి ననియు మజూరీ కూడ లేకుండ పోయిన దనియు, మునసబు జోగారావుగారి వనియు రాజేశ్వరమ్మగారే వాని నమ్మమని తనచేతి కిచ్చినారనియు వరదరాజులు స్పష్టముగా చెప్పినాడు. ప్రసాదరావు నిశ్చేష్టుడైనాడు. ఈవిధముగా లక్ష్మిపై బడ్డ నిందలుకూడ తొలగింపబడినవి.

## 4. రాజేశ్వరమ్మ గుణశీలములు :-

రాజేశ్వరి రామశర్మ చెల్లెలు. మునసబు జోగారావు భార్య. ఆమెకు ప్రసాదరావు పెద్దకొడుకు. సరస్వతి కూతురు. రామశర్మకూతురు లక్ష్మిని ప్రసాదరావునకు పెండ్లిచేసినది. రాజేశ్వరి చిన్నప్పటినుండియు మొండిదనిపించు కొన్నది. చిన్నప్పుడే తండ్రిగతించుటచే నామె శిక్షణలో లేకపోయినది. కాక స్వభావ మతిక్రమింపరానిది. తన పెండ్లి విషయమున అన్నను తల్లిని చిక్కులలో పెట్టినది. ఇంగ్లీషు చదువు లేదని బంధువుల నందఱిని త్రోసివేసినది. పాశ్చాత్య నాగరకతపై రాజేశ్వరి కభిమానము మెండు. పెద్ద యుద్యోగస్థులు, తెల్లదొరలు గడుపుచుండు కృత్రిమజీవితమే నాగరకత యని యామె నమ్మకము. తన పిల్లలుకూడ దొరపిల్లలవలె నుండవలెనని యాశించెడిది. గొప్పగా జీవింపవలెనను కోరిక రాజేశ్వరికి ప్రబలమైనది, దానిచే గౌరవప్రాప్తి లేకున్నను ఋణ

ప్రాప్తి మాత్రమైనది. పట్టపరీక్షలో నుత్తీర్ణుడైన పెద్దకొడుకును ఐ. సి. ఎస్. చదువుటకై యింగ్లాండు పంపినది. ఆర్థికపరిస్థితు లధ్వాన్నమైనవి. ఉద్యోగ వ్యామోహామునకు సాయు విూమెకు సహజమైన మూర్ఖతగలదు.

ఆర్థికపరిస్థితులు బాగుగా లేకపోవుటచే మధ్యవస్తులు రాజేశ్వరమ్మ నాశ్రయించినపు డామె అంచములు పుచ్చుకొనుట ప్రారంభించినది. ఇంటి పెత్తన మంతయు నామెదే. లక్ష్మి నగలను అమ్మి ప్రసాదరావునకు పంపినది. డబ్బు సంపాదించుటలో నెత్తుపై యెత్తు లెత్తిగిన జాణ. అనంతశర్మకు సోదరుడు గంగాధరుడు, అన్నదమ్ము లదివఱకే విభాగము తేర్పఱచుకొన్నను గంగాధరునిచే కామేశ్వరమ్మకు నోటీ సిప్పించి రాజీ చేయించెదనని కామేశ్వరమ్మతో చెప్పి యిరువురకు తెలియకుండ మూడు వేలు గుంజుకొన్నది. చిట్టచివర కీరహస్యము బయటపడినది.

డబ్బుకోస మెంతంతపనులైన చేయుటకు వెనుదీయదు రాజేశ్వరి. ఎంతో ప్రేమగల లక్ష్మిపై నామెతండ్రి ధనసహాయము చేయలేదని కోపించి యామె నగ లమ్మించి నానాబాధలుపెట్టి చివరకు పుట్టింటికి త్రోలివేసినది. కామేశ్వరమ్మ కూతురు భ్రమరాంబను తన కుమారునకు పెండ్లిచేసినచో కామేశ్వరమ్మ యాస్తి యంతయు వచ్చునని యూహించి కాపురముచేయు లక్ష్మిని పంపివేసినది. పాపమ్మ చెప్పిన పాడుమాట లన్నియు పట్టుకొని నిరపరపరాధినియగు లక్ష్మిని బాధించినది.

రాజేశ్వరిది మొండిధైర్యము. ఆపద రానున్నది, ఉద్యోగము పోనున్నదని భర్త జోగారావు చెప్పినను అధైర్యముపడక వానికిధైర్యము నూల్కొలిపి నూతనోత్సాహము కల్పింప గల్గినది. ఎంత ధైర్యస్థైర్యములు కలది కాకున్నచో కామేశ్వరమ్మ యిచ్చిన వ్యవహారపు కాగితములలో పెద్ద ఋణపత్రములను, మరణశాసనమును తీసి దాచగలదా ?

రాజేశ్వరమ్మ సహజముగనే మూర్ఖురాలు, సాధారణముగా బుద్ధిహీనతయే మూర్ఖతకు కారణమనక తప్పదు. రాజేశ్వరి యత్నములన్నియు తారుమారు కాజొచ్చినవి, లక్ష్మి యింట నున్నచో పిల్లల క్షేమము విష

యమై తనకు భయముగా నున్నదని భర్తతో చెప్పి రాజేశ్వరి లక్ష్మి నంపి వేసినది. ప్రసంగము వచ్చినప్పు డెల్ల లక్ష్మీదేవిని నిందించి రాజేశ్వరి కుమారునకుగల పత్నీప్రేమను తగ్గింప యత్నించినది.

ఆదాయమును మించిన వ్యయముచేసి దర్జాకుపోయి దారిద్ర్య మార్జించుకొన్నది రాజేశ్వరి. అందుచే నన్యాయముల కొడిగట్టవలసి వచ్చినది. లేమి యేపని చేయింపలేదు! భ్రమరాంబను సుముఖురాలునిగా చేయుటకు రాజేశ్వరి పాపమ్మను కామేశ్వరమ్మ యింటికి పంపినది. అదేమి పాపమో రాజేశ్వరి నందఱు నిందించువారే. మొత్తముమీద రాజేశ్వరి పాపమ్మ దురోభవల్లను, ధనమునం దాశచేతను అకృత్యము లాచరించినది.

## ౫. రామశర్మ గుణశీలములు :-

రామశర్మ కాపురస్థలము చోడవరము. ఆత డన్నివిధముల గొప్ప కుటుంబి. అతడు మహోదారుడు. కడుపునిండతిని నలుగురికి పెట్టగల స్తోమతగలవాడు. పదిమంది తిన్నప్పుడే యతనికి తృప్తి. అతడు పూర్తిగా పూర్వసంప్రదాయానువర్తి. సంస్కృతాంధ్రములందు మంచి పాండిత్యము గలవాడు. ఆంగ్లవిద్యయు, పాశ్చాత్య నాగరకతయు నతనికి నచ్చవు. నచ్చకపోవుటయేకాదు, వానియెడ నాతనికి సమానభావముకూడ లేదు. అతడు సర్వస్వతంత్రుడు. పట్టుదలగలవాడు. తనవా రెవ్వరికి నత డాంగ్ల విద్య చెప్పించలేదు. అతని జీవితము ప్రశాంతముగా నడచిపోవుచున్నది.

రాజేశ్వరి, అన్నపూర్ణయు శర్మకు చెల్లెండ్రు. రాజేశ్వరి కుమారుడు ప్రసాదరావునకు, రామశర్మ తనకూతురు లక్ష్మినిచ్చి పెండ్లిచేసి నాడు. గొప్పకుపోయి సంవత్సరాదాయమును మించి ఖర్చుచేయువాడు కాడు. చెల్లెలు ప్రసాదు నింగ్లాండు చదువునకు రెండుమూడు వేలు సర్దు మని యడిగినపుడు కొన్నివందలు సర్దగలను కాని వేలుసర్ద సమర్థత లేదని నిష్కర్షగా చెప్పివేసినాడు.

రామశర్మ ధర్మాత్ముడు, న్యాయపరుడు. అనంతశర్మయు రామశర్మయును తోడియల్లుండ్రు. అనంతశర్మ చనిపోవుచు మరణశాసనము వ్రాసినాడు. ఋణపత్రములు చాలగలవు. తన వ్యవహారమంతయు రామశర్మ చేతిలో పెట్టినాడు. అదిమొదలు వదినెయగు కామేశ్వరమ్మకు నామె కూతురగు భ్రమరాంబకు నేలోటు లేకుండ నేకష్టము కలుగకుండ చూచినాడు. భ్రమరాంబకు స్ఫోటకమురాగా ఆప్తుల మనువారందరు తప్పుకొనిరి. భార్యను తీసికొనివచ్చి భ్రమరాంబకు బాగుగా నెమ్మదించువరకు సేవచేయించిన యుదారుడు రామశర్మ. తన సంసారమెట్టిదో యితరుల సంసారము నట్టిదియే యని భావించువాడు శర్మ. న్యాయముపట్ల లోకులకు వెఱపడు. కామేశ్వరమ్మ యిల్లు చిన్న సత్రముగా మారిపోవుట చూచి రైతు లొక సంవత్సరము శిస్తులీకుండుట చూచి కాపురము శృంగవరపుకోటకు మార్పించి బంధువిరోధి యైనాడు. బంధువిరోధియే కాదు పాపమ్మకును క్రూరాత్మురాలి కోపమునకు గురియైనాడు. అనేకములగు నిందలను ధైర్యముతో శాంతముతో తలదాల్చినాడు. రాజేశ్వరి కుట్ర పన్ని గంగాధరునిచే కామేశ్వరమ్మకు నోటీసిప్పించినను చెల్లెలనియెంచక రాజేశ్వరి చేసిన కుట్రయే యని మొగమోటము లేకుండ సత్యము నే చెప్పినాడు శర్మ. ఋణపత్రములు మరణశాసనము రామశర్మ యపహరించినాడని కామేశ్వరమ్మ యల్లరిచేసి యందరితో చెప్పుకొని యేడ్చినది. రామశర్మ గంభీరహృదయుడు, ధైర్యశాలి. కనుక నే తొందరపడి కామేశ్వరిని పల్లెత్తు పరుషవాక్యమైనను పలుకక యా యపవాదములను మెల్లగా నేర్పుతో తొలగించుకొని తనదే తప్పని క్షమింపుమని కామేశ్వరమ్మచే ప్రార్థింప చేసికొనినాడు.

శర్మ యభిమానవంతుడు. ఆత్మగౌరవ రక్షణాభిలాషి. తనపైనను లక్ష్మిపైన నారోపింపబడిన యపవాదములను తొలగించిననే కాని నిద్రపోనని శపథముచేసి నెఱవేర్చుకొనిన దీక్షాపరుడు. ఋణపత్రములు మరణశాసనమువిషయమై తన చెల్లెలు రాజేశ్వరి చేసినదని ఋజువుచేయుటకు కృష్ణారావను వకీలును తదితరులను తీసికొనివచ్చినాడు. ఒక సంవత్సరము శిస్తు లపహరించి రైతులు శిస్తులీయలేదని రామశర్మ సాకు చెప్పుచున్నాడని కామేశ్వరమ్మ యల్లరిచేసినది; ఆ రైతులను సుబ్బయ్యశాస్త్రి

కొందలకు పెద్దలను తీసికొనివచ్చి సాక్ష్యమిప్పించి, ఋజువుచేసి తాను నిర్దోషి ననిపించుకొనినాడు.

రామశర్మ యొడుదుడుకు లేనివాడు. లక్ష్మి సంతబాధ పెట్టుచున్నను పైకేమియూ విచారము కనిపించనీక ప్రసాదరావు పగపడినప్పుడు దగ్గర కూర్చుండబెట్టుకొని యెంతో చక్కని నీతులు బోధించినాడు. లక్ష్మిపై వేసిన నిందల నన్నింటిని ప్రసాదరావు చేతనే పరిహరింపచేసినాడు. అతడు మంచి పలుకుబడి గౌరవము గలమనిషి. సకలవర్తకు లాతని నెంతో గౌరవింతురు. అతడు దైవభక్తుడు. ప్రతిసంవత్సరము కుటుంబముతో వైశాఖశుద్ధ తదియనాటికి సింహాచలము వెళ్ళి నృసింహస్వామి నర్చించివచ్చును. అతడు పరోపకార పరాయణుడు. గాలివానవచ్చి బండివాడు దురవస్థలో నుండగా నర్ధరాత్రి వానికి సహాయము చేయుటయే తార్కాణము. రామశర్మ ఆప్తస్నేహితుడు; న్యాయవర్తనుడు. జోగారావు ఋణద్రవ్యమును వారినుండి పుచ్చుకొని పత్రములను వెనుక నిచ్చినట్లు ఋజువు చేయగల్గియును రామశర్మ యూరకుండెను. కామేశ్వరమ్మ పరముగా రాజేశ్వరి పత్రములపై చెల్లువ్రాసి సంతకము చేసినప్పుడు రామశర్మ పోలీసు ఫిర్యాదుచేసి మాననష్టము దావా తేగలడు. కాని తేలేదు. అనంతశర్మ రామశర్మ కుమారుని దత్తత చేసికొనుమని మరణశాసనములో వ్రాసినను దత్తత నిచ్చుటకు దామంత గర్భదరిద్రులము కామని నిరాకరించినాడు. ఋణపత్రములను మరణశాసనము నాధారముగా తీసికొని రాజేశ్వరిని కామేశ్వరమ్మను ముప్పుతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించెదనని కోపావేశమున నన్నవాడే కాని వెంటనే యా కోపమును విడిచి యెవ్వరికి నపకారము చేసినవాడు కాడు.

కామేశ్వరమ్మ తానొనర్చిన దుష్కార్యములను క్షమింపుమని యడిగిన తోడనే రామశర్మ దీర్ఘకోపి కాక శాంతించి సరళహృదయముతో నున్నవాడు. భ్రమరాంబను సోమేశ్వరమునకిచ్చి వివాహము చేయుమని యాదేశించినాడు.

లక్ష్మిప్రసాదు లొక్కటగుటయే శర్మకు పరమానందము. శర్మవంటి పరోపకార పరాయణుడు, సత్యసంధుడు, న్యాయవర్తనుడు, బంధుప్రియుడు, అభిమానధనుడు, ఆత్మగౌరవాభిలాషి మరియొకడు లేడు.

---

# స్వామి వివేకానందుడు

వివేకానందుని జన్మస్థలము కలకత్తా. దుర్గాచరణదత్తు వివేకానందుని తాత. విశ్వనాథదత్తు తండ్రి. అతడు ప్రముఖ న్యాయవాది. మహాదాత. తల్లి భువనేశ్వరీదేవి. విశ్వనాథునకు సంగీతమునం దభిమాన మెక్కువ. వివేకానందుని అసలుపేరు నరేంద్రుడు. తల్లియే నరేంద్రుని మొదటి విద్యా గురువు.

(నరేంద్రుని) వివేకానందుని విద్యాభ్యాసము :-

వివేకానందునకు మొదటి విద్యాగురువు తల్లియే. చిన్నప్పటినుండి యతనికి భారత రామాయణ పురాణ శ్రవణమునం దాసక్తి మెండు. మనస్సును కేంద్రీకరింపచేయు నభ్యాసము బాల్యముననే కుదిరినది. ఆరవ యేట వివేకానందుడు ప్రాథమిక పాఠశాలలో చేరెను. అందు బాలునకు పట్టిన మాటలు తలిదండ్రులకు బాధకలిగించినవి. వెంటనే బడి మానిపించి యింటియొద్ద గురువు నేర్పాటుచేసినారు. నరేంద్రుని మేధాశక్తి యత్యద్భుతమైనది. జ్ఞాపకశక్తి యసాధారణము. అతడేక సంథాగ్రాహి. ఏడేండ్ల నాటికి నరేంద్రుడు ముగ్ధబోధ యనెడు సంస్కృత వ్యాకరణమును రామాయణ భారతము లందలి భాగములను కంఠస్థముచేసెను.

ఏడేండ్లు నిండినతోడనే ఈశ్వరచంద్ర విద్యాసాగరునిచే స్థాపింపబడిన నగర విద్యాలయమున ప్రవేశించెను.

తరగతిలో పాఠము జరుగుచున్నది. నరేంద్రుడు తోడి విద్యార్థులతో మాటలాడుచున్నాడు. గురువునకు కోపము వచ్చి నరేంద్రుని పిలిచి బోధించుచుండిన పాఠముపై ప్రశ్న పరంపరలు వేసినాడు. అన్ని ప్రశ్నల కద్భుతముగా నరేంద్రుడు సమాధాన మిచ్చినాడు. అతని యవధానశక్తి కందరాశ్చర్యపడిరి. ఇంత బుద్ధిమంతుడైనను అతడు గర్వ మనునది యెఱుగడు. బాల్యముననే సర్వ సమత్వభావ మతని కలవడినది. నాటక సంఘము నొకదాని నేర్పఱచి తనయింట నాటకము

లను ప్రదర్శించినాడు. కత్తిసాము, కఱ్ఱసాము, కుస్తీ మొదలగు పరిశ్రమ లను సాధించినాడు. దుష్టులతో నెన్నడు స్నేహము చేయలేదు. మోస మనుమాట యెఱుగడు. సత్యసంధత యతని జీవితమున కాధారము. రాత్రులందు ధ్యానసాధన చేసెడివాడు. వయస్సు వచ్చుకొలది యతని దృష్టి మానసిక వికాసమువైపునకు మరలినది. గ్రంథములను చదువుట, ఉపన్యాసములు వినుట అతనికి పరిపాటియైనవి. నిశితమైన విమర్శనశక్తి యలవడినది. హేతుబద్ధమగు తార్కికవాద మతని సొమ్మైనది. అతని వక్తృత్వమున కందఱు నాశ్చర్యపడువారు.

విశ్వనాథదత్తు కలకత్తావిడిచి రాయపురము పోవలసి వచ్చెను. నరేంద్రున కచ్చట పాఠశాల లేదు. కాని ప్రసిద్ధులగు పండితులు విశ్వ నాథుని దగ్గరకు వచ్చుచుండుటచే నరేంద్రుడు వారి చర్చలను విని తానును గొప్పభావములతో కూడిన యనేక విషయములను చర్చించెడి వాడు. కలకత్తాకు మరల వచ్చిన తోడనే మరల పాఠశాలలో చేరి గడిచిన మూడేండ్ల చదువు నొక్కసంవత్సరములో ముగింపగలిగినాడు.

నరేంద్రుడు తన పదునాఱవయేట ప్రవేశ పరీక్షలో నుత్తీర్ణుడై విశ్వవిద్యాలయమున ప్రవేశించెను. భారతీయాధ్యాపకులే కాక ఆంగ్లా ధ్యాపకులుకూడ నరేంద్రుని ప్రతిభ కాశ్చర్యపడినారు. కళాశాలాధ్యక్షు డగు హేస్టీ మహాశయుడు నరేంద్రునివంటి బుద్ధిశాలి నెందును చూడలే దనినాడు. మొదటి రెండుసంవత్సరములలోనే పాశ్చాత్య తర్క శాస్త్రము నభ్యసించినాడు. తరువాతి రెండు సంవత్సరములలో తత్త్వ శాస్త్రమును, ప్రపంచచరిత్రను పఠించినాడు. నరేంద్రున కింత జ్ఞానతృష్ణ యున్నను కాలమంతయు గ్రంథములతోనే గడిపెడువాడు కాడు. అన్ని వినోదములం దతని కభిమానమే. రానురాను నరేంద్రునకు తత్త్వజిజ్ఞాస అధికము కాజొచ్చెను. పిదప రామకృష్ణ పరమహంస నరేంద్రుని తన వానిగా చేసికొనినాడు.

భగవత్స్వరూపమును ప్రత్యక్షీకరింపజాలని శాస్త్రాదులు, చర్చలు నిష్ప్రయోజనములని నరేంద్రుని నిర్ణయము. దక్షిణేశ్వరమున నున్న రామ

కృష్ణ పరమహంస నరేంద్రునియందు నిగూఢమైయున్న యాధ్యాత్మిక శక్తిని గుర్తించి దానిని వ్యాఖ్యానించినాడు. నరేంద్రుడును రామకృష్ణుని సందర్శించ బోయెను. పరమహంస దివ్యపురుషుడని నరేంద్రుడు గ్రహించినాడు. భావస్వాతంత్ర్యమును, సంపూర్ణ స్వేచ్ఛ నొసంగి మానసిక యాధ్యాత్మిక పోషణకు కావలసిన సదవకాశములను కల్పించి రామకృష్ణుడు నరేంద్రుని బుద్ధివికాసమునకు దోహద మొనర్చెను. నరేంద్రునకు పరమహంసయందు గాఢమైన నమ్మకము కుదిరినది. నరేంద్రుని తండ్రి యంతలో మరణించెను. నరేంద్రుడు పలుకష్టముల పాలయ్యెను. కాని తన జీవితాదర్శములను సాధించుట మానలేదు. మానవు లందలి భగవత్స్వరూపమును గుర్తించుటలో నహంకారము నశించును. నిరహంకారమువలన హృదయము పరిశుద్ధమై ఆత్మ స్వరూప జ్ఞానమునకు సాధన మగును. ఇది రామకృష్ణు డుద్దేశించిన దివ్యసత్యము. ఆ దివ్యసత్యమును నరేంద్రుడు లోకమున చాటించెను. సన్న్యాస జీవితమునకు తగిన భిక్షాటనమును గూడ నరేంద్రునకు పరమహంస యలవఱచెను. రామకృష్ణ పరమహంస తాను సంపాదించిన ఆధ్యాత్మిక విజ్ఞాన మంతయు నరేంద్రునకు ధారపోసి నిశ్చింతుడైనాడు. 1866 లో పరమహంస భౌతిక శరీరమును విడిచి పరమాత్మలో నైక్యమైనాడు.

## వివేకానందుని సేవ :—

రామకృష్ణ పరమహంస పరమపదించిన వెనుక శిష్యులు తల్లిలేని పిల్లలవలె దీనాననులైరి. వివేకానందుడు నాయకత్వము వహించి బారా నగరమున రామకృష్ణమఠమును స్థాపించెను. లోకసేవయే యాదర్శముగ బ్రహ్మచర్యదీక్షయు, సన్న్యాసదీక్షయు గైకొని రామకృష్ణుని శిష్యులెల్లరు పరివ్రాజకులైరి. స్వామి వివేకానందుడు దేశపర్యటనము మొదలు పెట్టినాడు. కాశీ, అయోధ్య, లక్నో మొదలగు పట్టణములను చూచి హిమాలయములకు పయనించినాడు. హిమాలయమున మనోనిగ్రహమును సాధించినాడు. దరిద్రులగు పంచముల పంచ నొకప్పుడును,

రాజాధిరాజుల మేడలలో నొకప్పుడును సమత్వ భావములో నాతిథ్యమును పొందినాడు. ధనమదాంధులైన ప్రభువులలో మానవత్వమును, దయాదాక్షిణ్యములను స్వామి బోధలవలన చిగిర్చినవి. సోదర మానవుల దురవస్థను మాన్పుట కుపకరించనిచో అన్నిమతసూత్రములను నిష్ప్రయోజనములేయని స్వామి యాక్రోశించినాడు. దీనులను, దరిద్రనారాయణ సోదరులను ఉద్ధరించుటకై పాశ్చాత్య దేశములనుండి ధనము గడించుకొని వత్తునని స్వామి నిశ్చయించుకొనినాడు.

అమెరికాలో విశ్వమత మహాసభ జరుగనున్నది. తా నచ్చటికి పోవ సంకల్పించినాడు. జూలై నెలనాటికి చికాగోనగరమును చేరినాడు. ఏన్నోశ్రమలంది యుదారుల సిఫార్సుల మూలమున సభలో నుపన్యసించుట కనుజ్ఞ పొందినాడు. సనాతన ధర్మస్వరూపము, వేదమత స్వరూపము చక్కగా హృదయమున నాటుకొనిన స్వామి గంభీరోపన్యాస మిచ్చెను. అందఱును మహాశ్చర్యము నందినారు. ఉపన్యాసములచే ధనముగడించి ప్రజాసేవచేయ నిశ్చయించిన స్వామిని ఉపన్యాససంస్థలు మోసగించినవి. అత డసహ్యించుకొని యుచితముగా నుపన్యాసము లీయ మొదలుపెట్టెను. బీదలు, అజ్ఞానులు, దీనులునైయున్న దేశీయుల సేవయే తమ జీవితాదర్శమని చాటినాడు. దీనజనోద్ధరణమే తన జీవితధ్యేయమని స్వామి ప్రకటించినాడు.

వాల్డోకుమారి సోదరి హరిదాసి యని పేరుపెట్టుకొని స్వామికి శిష్యురాలైనది. వేలకువేలు శిష్యు లేర్పడినారు. న్యూయార్కు వేదాంత సంస్థయను నొక సంస్థను స్థాపించి యుపన్యాసము లిచ్చినాడు. ఆధ్యాత్మిక జీవితప్రచారమునకై భారతదేశమునుండి సమర్థులైన శిష్యులను అమెరికా రప్పించినాడు. ప్రాక్పశ్చిమ పురోభివృద్ధి కెంతయో పాటుపడినాడు.

అమెరికాలో నట్లు సంస్కారసంస్థల నేర్పఱచి స్వామి యాంగ్ల దేశమునకు ప్రయాణ మయ్యెను. ఆంగ్లేయుల సంస్కారములు, సంప్ర

స్వామి యుద్భుతశక్తికి సోదరి నివేదిత, హూక్సు పుల్లుసు, మొద లగువా రెందరో స్వామికి శిష్యకోటిలో చేరినవారైరి. తరువాత యూరపులో పర్యటించి మరల లండను నగరము వచ్చి వేదాంతము, హిందూ మాయావాదము, అద్వైతము అను గొప్పవిషయములను గూర్చి యుపన్యసించెను. న్యూయార్కు నగరమున శారదానందుని లండను నగరమున అభేదానందుని, నిలిపి స్వామి మాతృదేశమునకు వచ్చెను.

దేశమందంతటను మఠములను నెలకొల్పి దీనజనోద్ధరణమునకు తన యావచ్ఛక్తిని వినియోగించెను. విజ్ఞాన వ్యాప్తిని గావించెను. ప్రజా సేవకై నడుము కట్టుడని తన దేశప్రజలకు సందేశ మిచ్చినాడు. ఉపని షత్తులు, స్మృతులు, పురాణములు, వీనిలోని యుత్త మాదర్శములను ఉన్నత భావములను ప్రజల మనస్సులలో రేకెత్తించి బహుళప్రచారము చేసినాడు స్వామి. సర్వసంగపరిత్యాగము, సేవానిరతి, నైతికశిక్షణ, భగవచ్చింతన యివియే ప్రధానసూత్రములుగ రామకృష్ణ మఠముల నెల్లెడల స్థాపింప మొదలుపెట్టెను. అన్ని సంస్థలను క్రమముగా ప్రజా సేవా సంస్థలుగా మారిపోయినవి.

జీవితావసరములగు వృత్తి విద్యలకును, పరివ్రాజక జీవితమునకును సమన్వయము కుదుర్చుట స్వామి యాశయములలో నొకటి. వృత్తి విద్యలలో శిక్షణ మొసంగుట కళలను పరిశ్రమలను పెంపొందించుట, వేదాంతమునకును మతమునకును సంబంధించిన సత్యములను ప్రచార మొనర్చుట రామకృష్ణ సంస్థల ముఖ్యాదర్శములుగ స్వామి నిర్ణయించి నాడు. ఉత్తరహిందూస్థానమున కూడ పర్యటించి స్వామి సేవ చేసి నాడు. వంగదేశమందలి బేలూరుమఠము ప్రధానకేంద్రముగా నిర్ణయింప బడినది. పాశ్చాత్యదేశములలో తాను నెలకొల్పిన సంస్థ లెట్లు పనిచేయు చున్నవో చూచుటకు వివేకానందుడు మరల ప్రయాణమైనాడు. స్వామి మరల యూరప్ ఖండమునందంతటను పర్యటించి రామకృష్ణ పరమ హంస దివ్యాశయములను ప్రచారము గావించి ఆయా దేశప్రజలకు ఆధ్యాత్మిక జీవిత ప్రాధాన్యమును బోధించెను. విశ్వమానవ కల్యాణము

నకు ఆధ్యాత్మిక దృష్టియే యవసరమని బోధించినాడు. ఇట్లు దేశ దేశాంతరములందు ఖండ ఖండాంతరములందు స్వామి వివేకానందుడు ప్రజాసేవ చేసినాడు.

ఉన్నట్లుండి స్వామి మాతృదేశమునకు మరలి వచ్చినాడు. అద్వైతాశ్రమమును నడుపుచుండిన సేవియర్ పండితుడు మరణించెను. సేవియర్ సతి నోదార్చి, ఆమెచే పుణ్యక్షేత్ర సేవ చేయించి తుదకు బేలూ రాశ్రమమునకు వచ్చినాడు స్వామి. అచ్చటనే బ్రహ్మచారులకు, సన్యాసులకు విద్యాశిక్షణల నొసంగుచు స్వామి తన జీవిత శేషమును ప్రశాంతముగా గడిపెను. భక్తులసంఖ్య పెరిగిపోయినది. స్వామి విసుగుకొనక యందరిని ఆదరించెడివాడు. మఠమునందలి పరివ్రాజకుల కందరికి నొక్క నిప్రణాళిక లేర్పఱచి ఆశ్రమజీవితమును క్రమబద్ధ మొనర్చెను. క్రమముగా మఠ కార్యములను శిష్యులకువదలి ధ్యానమున కాలము గడుప జొచ్చెను. ధ్యాననిష్ఠయందు స్వామి కనిర్వచనీయానందము సిద్ధించుచుండెడిదట. ప్రకృతిరూపమున నగుపించు జగన్మాతలో తనయాత్మ లీనము కావలెనని స్వామి యాతురత. ప్రశాంత ప్రదేశములలో నొంటరిగా తిరుగుచు స్వామి వివేకానందుడు తన్మయత్వమును పొందెడివాడు.

ఒకనాడు భోజనాంతరము శిష్యులకు వ్యాకరణపాఠము బోధించెను. సాయంకాల మొక గంట ధ్యాననిష్ఠయందుండెను. పిమ్మట ప్రక్కపై పరుండి కన్నులు మూసికొనినాడు. ఒకగంట తరువాత రెండవ ప్రక్కకు తిరిగి దీర్ఘముగా నూపిరి తీసికొనెను. పంచభూతాత్మకమగు నీ శరీరమును విడిచి వివేకానందుడు ప్రకృతిలో లీనమైపోయినాడు. వివేకానందవాణి గంభీరమై విశ్వమంతట ధ్వనించుచు నేయున్నది. వివేకానందుడు మృతజీవుడు.

## ప్రశ్నోత్తరములు

### 1. వివేకానందుని విద్యాభ్యాసము :-

ఈ ప్రశ్నకు "వివేకానందుని విద్యాభ్యాసము" అను శీర్షికగల భాగమంతయు వ్రాయుడు. "వివేకానందునకు మొదటివిద్యాగురువు...

దగ్గరనుండి నరేంద్రుని తనవానిగా చేసికొనినాడు''—వఱకు చూచుకొనుడు.

2. వివేకానందుని సేవ :—

ఈ ప్రశ్నకు "వివేకానందునిసేవ" అను శీర్షికగల భాగమంతయు వ్రాయుడు. "రామకృష్ణపరమహంస...... మొదలుకొని "ఖండ ఖండాతరములందు స్వామి వివేకానందుడు ప్రజాసేవ చేసినాడు"—వఱకు చూచుకొనుడు.

3 అమెరికాలో విశ్వమత మహాసభలో స్వామివివేకానందుని గంభీరోపన్యాస సారాంశమేమి?

జవాబు. స్వామి వివేకానందుడు విశ్వమత మహాసభలో సకల జాతులను సమత్వ దృష్టితో పరికించి తనలో నైక్య మొనర్చుకొన్నది, సనాతన భారతధర్మ మనెడు వాక్యముతో మొదలుపెట్టి యీక్రింది విధముగా నుపన్యసించినాడు.

వివిధ ప్రదేశములలో పుట్టి భిన్నమార్గములందు భిన్నరీతుల ప్రవహించినను నదులన్నియు సముద్రమున కలియునట్లు సర్వేశ్వరా! భిన్న జాతుల విభిన్నారాధన మార్గములన్నియు నిన్నే చేరుచున్నవి.

ఎవ్వరే రూపమున నన్ను చేర ప్రయత్నించినను నేను వానిని చేరదను. మానవులందఱు నన్ను చేరుటకనియే వివిధమార్గములలో ప్రయాసపడుచున్నారు. ఆ మార్గములన్నియు నన్నే చేరుచున్నవి.

ప్రపంచమునందలి మానవులందరు నొక కుటుంబముగ కూర్చెడి విశ్వమతము దేశకాలాతీతమైనది కావలయును. అది బోధించు భగవంతుని వలెనే అదియును ననంతమై యుండవలెను. హిందువులు, క్రైస్తవులు, పుణ్యాత్ములు, పాపాత్ములు అను భేదములేక అందరిపై సమానముగా ప్రకాశించు సూర్యునివంటిది విశ్వమతము, వివిధమతములన్నియు దానిలో

నివూడగలవు. ప్రపంచమందలి ప్రతివ్యక్తిని ప్రతిప్రాణిని తన హృదయమున ఇముడ్చుకొను నంతటి విస్తృతికలదియై యింకను విస్తృతికలిగినదియై యుండవలెను. అసహనమునకు పరమ పీడనకు అది దూరము. స్త్రీపురుష భేదమున కతీతమైన ప్రతివ్యక్తియందును నిహితమైయున్న భగవదంశమును గుర్తించుచు దానిని తద్వ్యక్తి గుర్తించి తరించునట్లు సహకరింపగలుగునదియే విశ్వమతము. అట్టి మతమును మనము చూపగలిగితిమేని ప్రపంచ మంతయూ మనవెంటపడును. అప్పుడు మతాభిమానములకు, మతాంతర స్వీకరణములకు అవసరమేయుండదు. ప్రతి మతమును తన ప్రకృతి కనుగుణముగ దేశకాల పాత్రావస్థల ననుసరించి వికాసమునంది విశ్వమానవ కల్యాణమునకు తోడ్పడగలదు.

---

# మహారాణి ఝాన్సీ లక్ష్మి

మోరోపంతు తాంబేయను మహారాష్ట్ర బ్రాహ్మణునకు మనూ బాయియను కుమార్తెగలదు. అతడు వారణావతమును విడిచి బ్రహ్మావర్త మును చేరి బాజీరావు పీష్వా నాశ్రయించినాడు. మోరోపంతు భార్య భాగీరథీబాయి మరణించినది. మనూబాయి రక్షణభారమంతయు తండ్రిదే యైనది. ఆపిల్ల తెలివితేటలకు బాజీరావు సంతోషించెడివాడు. బాజీరావు దత్తతపుత్రుడు నానా. ఆమె నానాతో నాటలాడుచుండెడిది. ఏడేండ్ల బాలిక యగునప్పటికే మనూ కత్తిసాము, కఱ్ఱసాము మొదలైన విద్యలు నేర్చినది. గజారోహణ, అశ్వారోహణలయందు నేర్పుగలదైనది. ఏడవ యేటనే బందేల్ ఖండమండలి ఝాన్సీరాజ్యపాలకుడగు మహారాజా గంగాధరరావును పెండ్లాడినది. ఆ దంపతులకొక కొడుకు పుట్టినాడు కాని మూడు నెలలకే మరణించినాడు. తన తరువాత రాజ్యము దాయా దుల పరమగునని భయపడి దామోదరరావను బాలుని శాస్త్రోక్తముగ గంగాధరుడు దత్తత చేసికొనినాడు. ఝాన్సీరాజ్యము బ్రిటిషువారి పెత్త నమునకు లోబడియుండుటచే దత్తతకు వారియనుమతి కావలసివచ్చినది. ఆంగ్లేయులు అనుమతించుట యటుంచి యా నెపమున ఝాన్సీరాజ్యమును కబళించిరి. పుత్రశోకము, భర్తృవియోగమునకు తోడు రాజ్యభ్రష్టతకూడ కల్గినది. నెల కైదువేల రూప్యములను భరణముగా నేర్పరచినా రాంగ్లే యులు. ఆంగ్లేయ సైన్యములు కోట నాక్రమించినవి.

రాణి లక్ష్మీబాయి పరాక్రమించి లాభము లేదనుకొని సమయము కొఱకు వేచియున్నది.

దేశమంత దిగ్రమింగ నెంచిన డల్హౌసీ ప్రభువు 1856 లో స్వదేశ మునకు పోయెను. కానింగు ప్రభు వాసనము నాక్రమించినాడు. సిపా యీలలో మత విషయమగు కలవరములు బయలుదేరినవి ఆంగ్లేయు లనిన సిపాయీలకు రోత, ద్వేషము పుట్టినవి. తెల్లవారిచే దోపిడిచేయబడిన రాజ్యములను లాగుకొనుట కదను వేచియుండిరి. సిపాయీలకు స్వదేశ

రాజులు నాయకత్వము వహించినారు. గాజీరావు పీష్వా దత్తపుత్రు డైనందున నానాసాహేబున కిచ్చుచుండిన యెనిమిది లక్షల భరణమును ఆంగ్లేయు లాపివేసిరి. నానా క్రుద్ధుడైనాడు. సంస్థానాధీశ్వరులను కలిసికొని విప్లవాగ్ని ప్రజ్వలింప చేసినాడు. తాంతియాతోపే యుద్ధవిద్యయం దారితేరినవాడు. అతడు నానాకు సైన్యాధిపతి. సంకేతదినమున దేశ మెల్లెడ స్వరాజ్య ధ్వజము నెత్త నిర్ణయించిరి. జూన్ 4 వ తేదీని భారతసైన్యములు ఝాన్సీకోటను ముట్టడించినవి. మూడు రోజులలో కోటను స్వాధీనము చేసికొని స్వాతంత్ర్య పతాక నెగురవేసినారు. మహారాణి లక్ష్మీబాయి భయంకరయుద్ధ మొనర్చినది. ఝాన్సీ స్వాధికారిణి యైనది.

లక్ష్మీబాయి పరిపాలన ప్రజలకు సకల సౌఖ్యములను చేకూర్చినది. ఆంగ్లేయులు దేశము నలుగడల స్వదేశ ప్రభువుల నణచివేసి రాజ్యము నెలకొల్పినారు. ఝాన్సీని కూడ స్వాధీనము చేసికొనవలయునని నిశ్చయించినారు. ఆంగ్లేయ సైన్యాధ్యక్షుడు కాంబెల్, మధ్యభారతమును జయించుటకు సర్ హ్యూరోస్ నియమింపబడెను. హైదరాబాద్, భోపాలు మొదలగు స్వతంత్రరాజు లాంగ్లేయులకు సహాయులైరి. విట్ లాక్ అను నతడు జబ్బలపూరునుండి బయలుదేరి మధ్యదేశములను స్వాధీనము చేసికొని సర్ హ్యూను కలిసికొనవలెనని నిర్ణయించుకొనిరి. జనవరి 6 వ తేదీని హ్యూ రాయగడ దుర్గమును వశపరచుకొనినాడు. 10 వ తేదీని చందేరికోటను జయించెను. మార్చి 20 వ తేదీనాటికి ఆంగ్లసైన్యము ఝాన్సీకోటకు 14 మైళ్ళదూరమునకు వచ్చి చేరుకొన్నది. విప్లవ సైన్యములు ఝాన్సీవైపు నడచినవి. కానింగుప్రభువు ఝాన్సీని త్వరలో పట్టుకొనవలయునని యాజ్ఞాపించినాడు. తాంతియాచే ముట్టడింపబడిన చర్ఖారీరాజును విడిపింపవలెనని కానింగు ఆజ్ఞ. హ్యూ ఆతని యాజ్ఞ తిరస్కరించినాడు. సింధియా, టెహ్రీరాజులు ఆంగ్లేయులకు సాయపడుచుండిరి. తోడి పాలకులు దేశద్రోహులై శత్రువునకు దాస్య మొనరించుచుండిరి. లక్ష్మీబాయి కత్తి చేబూని సైనికులను హెచ్చరించి

నది. భయంకరమైన యుద్ధము జరుగుచున్నది. అయిదారు దినములు సంకుల సమరము జరిగినది. రాణి ఫిరంగుదళము నడిపింపగా ఆంగ్లేయుల కమిత నష్టము కలిగినది. ఏడవ దినమున కోడ తెగని యగ్ని శిలా వర్షపాతముచే ఒక బురుజుగోడ బ్రద్దలయినది. రాత్రికి రాత్రి రాణి యా గోడను మరమ్మత్తు చేయించినది. ఎనిమిదవదినమున ఆంగ్లేయులు శంకరఖిల్లాను చేరిరి. కోటలోని మందుగుండు కార్ఖానాపై నొక గుండు పడుటచే నది కొంత ధ్వంసమైనది. ఎంతసేపామె యొక్కతెయే శత్రుధాటి కాగగలదు. తాంతియాతోపేకు వర్తమాన మంపినది. 22 వేల సైన్యముతో నతడు వచ్చినాడు. ఆంగ్లేయులకు దడలు పుట్టినది. హ్యూ చండశాసనుడు. తన సైన్యమును రెండు చేసి రెండు వైపుల తాంతియా సైన్యము నెదుర్కొనినాడు. ఝాన్సీ సైనికులకు నిరుత్సాహము కలిగినది. రాణి యది చూచి వారిని ప్రోత్సహించినది. ఏప్రియల్ మూడవ తేదీని ఝాన్సీపై నాంగ్లేయు లన్నివైపులనుండి ముట్టడించిరి. తీవ్రమైన ముట్టడి సాగినది. కోటగోడలకు నిచ్చెనలువేసిరి. వానిని ఝాన్సీ సైనికులు నాశనము చేయుచుండిరి. తెల్లవా రెందరో మరణించిరి. ఇట్టి స్థితిలో దేశద్రోహి యొకడాంగ్లేయుల యెరలోపడి మోర్చాద్వారము దగ్గరనున్న రహస్యమార్గమును శత్రువులకు తెలియజేసినాడు. ఆమార్గమున నాంగ్లేయులు ప్రవేశించి పట్టణమంతయు ధ్వంసము చేయసాగిరి. భవనములను కాల్చిరి. దారుణ కృత్యముల నొనర్చిరి. రాణి కోపోద్రిక్తయై వేయిమంది సైనికులతో దక్షిణద్వారము దగ్గర నురికినది. ఆంగ్లేయుల ననేకులను వధించినది. చాలమంది యామె ధాటి కాగజాలక పాఱిపోయిరి. వీథు లన్నియు రక్తసిక్తములైనవి. బాలురు వృద్ధు లనక యెల్లరిని దయాదాక్షిణ్యములు వీడి తెల్లదొరలు నరికి చంపివేసిరి. ఖుదాబక్ష్, గులాంగౌస్ మొదలగు వీరాగ్రేసరులు కూడ ఆంగ్లేయుల ఫిరంగిగుండ్ల కగ్గమైరి. రాణి యాత్మహత్య చేసికొనుటకు ప్రయత్నించినది. కాని యాత్మహత్య మహాపాప మనియు నప్పటిమట్టుకు కోటనువిడిచి వెడలిపోవుట యుక్తమనియు సరదారులు సలహా నిచ్చినారు. ఆమె వారి మాట నంగీకరించినది.

రాణి పురుషవేషమును ధరించి కవచమును తొడిగి పార్శ్వమున ఖడ్గము ప్రకాశించుచుండ దత్తపుత్రుడైన దామోదరుని వీపున కట్టుకొని, గుఱ్ఱమునెక్కి కొంద రాశ్వికులు వెంటరాగ కోటనుండి బయలుదేరినది. ఉత్తరద్వారముకడ టెహ్రీసైన్యమునకు చెందిన కావలివారు వీరి నడ్డగించిరి. కాని యాంగ్లేయుల సహాయమునకు పోవుచున్న టెహ్రీ సైనికుల మని యాశ్వికులు చెప్పి తాము తప్పించుకొని రాణిని దాటించిరి. మోరో పంతు దెబ్బలుతిని యొకచోట విశ్రమింపగా దేశద్రోహులు కొందరాంగ్లేయుల కాసంగతి తెలియచేసిరి. దయాదాక్షిణ్యములు లేని యాంగ్లేయు లతనిని తీసికొనివచ్చి ఝాన్సీ నగరమందే యురితీసిరి.

రాణి తప్పించుకొని పోయినదని సర్ హ్యూరోస్ విని యాశ్చర్యపడినాడు. బేకరు అను సేనాపతిని వెళ్ళి యామె యునికి తెలిసికొని రమ్మనినాడు. ఆమెను బాధించుటకై బేకరు తగినసైన్యముతో కాల్పీ నగరమువైపు వెళ్ళినాడు. రావుసాహెబు పీష్వాకడకు రాణి వెళ్ళినదని ద్రోహు లాంగ్లేయులకు చెప్పినారు. మరునాటి యుదయమునకు రాణి భాండేరను గ్రామము చేరినది. ఆయూరి గ్రామాధికారి వారికి తగిన యాతిథ్య మిచ్చి యాదరించెను. పిదప రాణి కాల్పీనగరమునకు ప్రయాణమైనది. త్రోవలో బేకరుసేనలు వచ్చి మీద బడినవి. ఒక్కదెబ్బతో బేకరును నేలకూల్చినది రాణి. వాడు చావక కాలికి బుద్ధిచెప్పినాడు. పగలంతయు నామె ప్రయాణము చేసినది. రాత్రికూడ విశ్రాంతిలేదు. రాత్రియనక పగలనక యాంగ్లేయు లామెను వెంటాడించుటచే నామెకు విశ్రాంతి యను మాటయే లేను. ఆమె యర్ధరాత్రికి కాల్పీనగరము చేరినది. బాలుని వీపునకు కట్టుకొని, పరాక్రమశాలు రగు వీరులతో పోరి జయించుచు రెండుమైళ్ళు భయంకరాటవులలో విరామములేకుండ పయనించు శక్తి యా మహారాణికే కలదు. ఆమె గుఱ్ఱముకూడ నట్టిదే. ఆమెను గమ్యస్థానము చేర్చినతరువాత నా యశ్వరాజము నేలకూలినది.

మరునా డుదయము రాణి పీష్వా రావుసాహెబును కలిసికొనెను. వీరి రువురును పూర్వచరిత్రలను, వీరగాథలను తడవుకొని పులకరించి

స్వరాజ్యసమరమును మానక కొనసాగింప నిశ్చయించుకొనిరి. లక్ష్మీ బాయి, తాతియాతోపే రావుసాహేబు యుద్ధమునకు ప్రయత్నములు చేయ సాగిరి. చాందనవాబు, షహాఘర్, బనపూర్ రాజులు మొదలగువారు విప్లవవీరుల పక్షము వహించి తమసైన్యములతో కాల్పీకి వచ్చిరి. రాణి యొక దళమునకు నాయకత్వము వహించినది. అచ్చటికి 40 మైళ్ళ దూర మున నున్న కుంచ్ గ్రామమువైపు నడచినది. కాని యాసైన్యమున క్రమశిక్షణలేదు. క్రమశిక్షణలేని సైన్య మెంతయున్న నేమిలాభము! ఆంగ్లేయ సైన్యములు క్రమశిక్షణ గలవి. సర్ హ్యూ సైన్యములను ఝాన్సీనుండి తీసికొని కుంచ్‌కి వచ్చినాడు. ఎండ యెక్కిన తరువాతనే విప్లవవీరులు యుద్ధ మారంభించిరి. ఆంగ్లేయులకు చాల నష్టమే కల్గినది. కాని జయముమాత్రము వారినే వరించినది. కాల్బల అశ్వికబలములకు విరోధభావములు కలుగుటచే నాంగ్లేయులకు మేలైనది.

తాతియా, చర్ఖీయను గ్రామమునకు పోయెను. అట నాతనితండ్రి గలడు. తండ్రిని చూచుటకు వెళ్ళినాడని యందరును తలంచిరి. క్రమ శిక్షణతో మెలంగవలయునని రాణి సైన్యముల కాదేశించినది. విప్లవవీరు లందఱు విజయమో వీరమరణమో యని శపథములు చేసిరి. పీష్వా సమస్త సైన్యమునకు నాయకుడయ్యెను. రాణి తన యాశ్వికదళమును వెంటపెట్టు కొని ఆంగ్లసైన్యమునందలి దక్షిణపార్శ్వము నెదుర్కొనెను. ఆమె కత్తికి పెక్కు రాంగ్లేయు లాహుతియగుచుండిరి. యుద్ధ మతిభయంకరముగా సాగుచున్నది. రాణి వీరనారియై చెలరేగినది. ఆంగ్లేయులను తన క్రోధా గ్నిచే భస్మముచేయసాగినది. సర్‌హ్యూకి యేమియు తోచలేదు. తన యుష్ట్రబలమును తీసికొని యుద్ధరంగమున కరికినాడు. పీష్వా సైన్యములు నిలువలేకపోయినవి, ఆంగ్లేయుల కఖండవిజయము గలిగినది. విప్లవనాయ కులుమాత్ర మాంగ్లేయులకు స్వాధీనముకాలేదు. అఖండవిజయము లభిం చినదని సర్‌హ్యూ విశ్రాంతి తీసికొనసెంచెను. యుద్ధరంగమునుండి వెడలిపోయిన విప్లవనాయకులు గోపాలపురమున చేరి ముందేమి చేయు టయా యని యాలోచింపజొచ్చిరి. తాతియావచ్చి వారిని కలిసికొనెను.

తాతియా తండ్రిని చూచుటకు వెళ్ళినవాడు కాడు. గ్వాలియరు కేగి యచటి సరదారులను, సైన్యములను ప్రోత్సహించి సమయమునకు సాయము చేయునట్లు వారిచే వాగ్దానము చేయించుకొనినాడు. విప్లవవీరులు గ్వాలియరును ముట్టడింప సైన్యములను చేకూర్చుకొని నడచిరి. గ్వాలియరు మహారాజు జాయాజీరావు సింధియా మొదటనుండి యాంగ్లేయపక్షము వహించినవాడే. సింధియా విప్లవసైన్యము నెదిరించినాడు. ఝాన్సీలక్ష్మి మూడువందల యాశ్వికదళముతో సింధియా ఫిరంగిసైన్యముపైబడినది. ఆమె ప్రతాపమునకు సింధియా సైనికు లాగలేకపోయిరి. జాయాజీరావు తన దివానగు దినకరరావుతో ఆగ్రాకు పాఱిపోయినాడు.

పీష్వా గ్వాలియరు కోటను స్వాధీనము చేసికొని స్వాతంత్ర్య పతాక నెగురవేసినాడు. ఫూల్ బాగ్ లో నతివైభవముగ దర్బారు జరిగినది. రామారావుగోవిందు ప్రధానమంత్రి. తాతియా సర్వసైన్యాధ్యక్షుడు. పీష్వా దానధర్మములు పెక్కులు చేసినాడు. భోగములలో మునిగిపోయి రాజ్యరక్షణవిషయమే మఱచినాడు. లక్ష్మీబాయి కది కష్టమనిపించినది. సైన్యములకు తగు శిక్షణ నిప్పింపుమనియు ఆంగ్లేయుల ప్రమాద మింకను పోలేదుగనుక జాగరూకతతో నుండవలయు ననియు హెచ్చరించినది లక్ష్మి. పీష్వా పెడచెవిని బెట్టినాడు.

సర్ హ్యూరోజ్ పీష్వాసంగతి తెలిసికొని వెంటనే పెద్దసైన్యముతో గ్వాలియరుపై దండెత్తెను. లక్ష్మీబాయి కత్తిపట్టక తప్పినదికాదు. యుద్ధభూమిలో కురికినది. తూర్పుద్వారముదగ్గఱ జనరల్ స్మిత్తు ఎదుర్కొనినాడు. ఆమె గొప్పవ్యూహము పన్నినది. ఒక్కడు ఆంగ్లేయుడుగూడ నూపిరితో పోలేదు. స్మిత్తు ఓడిపోయినాడు. నాటియుద్ధము ముగిసినది. మరునా డాంగ్లేయు లన్నివైపుల కోటను ముట్టడించినారు. అపజయము నొందిన స్మిత్తు క్రొత్త సైన్యములతో లక్ష్మి నెదుర్కొనినాడు. ఒకవంక సర్ హ్యూరోజ్ ఉష్ట్రబలము నడిపించినాడు. రాణి హృదయమున కోపాగ్ని ప్రజ్వలించినది. రాణి పురుషవేషము ధరించి శత్రువులను చీల్చి చెండాడుచున్నది. ఆమెను మందర, కాశి యను సఖులు రక్షించుచు యుద్ధము

చేయుచున్నారు. మందర ఆంగ్లేయుల తుపాకుల కెరయైనది. మహారాణి యా వైపున పరికినది. ఆవైపున నొక యేరున్నది. ఆ యేరు దాట యత్నించినది రాణి. గుఱ్ఱము మెత్తపడి దాటలేకపోయినది. ఇంతలో నాంగ్లేయాశ్వికులు ఆమెను సమీపించిరి. వారందరి నామె యొక్క దెబ్బతో కూల్చినది. కాని విధి దాటరానిది. ఆసమయమున వెనుకనుండి యొకడో కొట్టుటచే ఆమె ముఖము బ్రద్దలైనది. మరియొకడామెవక్షమున పొడిచెను. అట్టిస్థితిలోకూడ వారిరువురను తన కరవాలమున కెరచేసినది. సమీపములోనున్న రామచంద్రరావు దేశముఖులు వచ్చి యామెను పటీరమున చేర్చినాడు. అందున్న గంగాదాస్ బావాయనుసన్యాసి యామెకు చల్లని నీరిచ్చి మెత్తని శయ్యపై పరుండబెట్టినాడు. దుర్మార్గులగు నాంగ్లేయులు తన శరీరమును ముట్టకుండ ప్రాణముపోవుసరికి దహనము చేయుమని రాణి యాదేశించినది. స్వాతంత్ర్యముకొఱకు పోరాడిన వీరనారీమణి ఝాన్సీ లక్ష్మీబాయి కన్నుమూసినది. వెంటనే రామచంద్రరావు దేశముఖు దహన సంస్కారములు చేయించినాడు. భౌతికశరీరము నశించినదికాని ఆ త్యాగాగ్నిజ్వాల నేటికిని చల్లారలేదు. ప్రళయము వచ్చినను చల్లారబోదు. ఆమె భౌతికశరీరము నశించినది. కాని కీర్తిశరీరము దేదీప్యమానముగా ప్రకాశించుచునేయున్నది.

## ప్ర శ్నో త్త ర ము లు

### 1 ఝాన్సీ లక్ష్మీబాయి బాల్యచరిత్ర (పదునారేండ్లవరకు)

1835 వ సంవత్సరము వారణావతమున మోరోపంతు తాంబేయను మహారాష్ట్ర బ్రాహ్మణునకు మనూబాయి అను బాలిక పుట్టెను. ఆమె నాల్గవయేట మోరోపంతు కుటుంబముతో బ్రహ్మావర్తమును చేరెను. అచట బాజీరావు పీష్వా నాశ్రయించెను. కొలది దినములకే మనూతల్లి భాగీరథీబాయి మరణించినది. కుమార్తె కేలోపములేకుండ తండ్రి వేకండ్ల కనిపెట్టెడివాడు. ఆమె యందచందములకు తెలివితేటలకు మెచ్చుకొని

బాజీరావామెను చబేలీ యని ముద్దుగా పిలిచెడివాఁడు. చబేలీ యనగా సంపంగియని యర్థము. బాజీరావు దత్తపుత్రుడు నానా. మనూ నానాతో నెప్పుడును ఆటపాటలలో మునిగియుండెడిది. వానితోపాటామెకూడ అశ్వికశిక్ష పొందినది. వ్యూహములు పన్నుట, అందలి రహస్యము లన్నియును చక్కగా గ్రహించినది. ఏడేండ్ల బాలికయగు మనూ కత్తి నెత్తి యవలీలగా త్రిప్పెడిది. శత్రుకంఠములను చీల్చుటయం దామె కాళికామూర్తి కాగలదని చూచినవారు తలంచెడివారు ఆమెకు గజారోహణమన్న నల్లేరుపై బండినడక. శౌర్యరస ముగ్ధబాలలతో రంగరించి పోసిరా యనున ట్లామె కన్పట్టెడిది.

అప్పటి యాచారముల ననుసరించి ఆమె కేడవ యేటనే పెండ్లి చేసిరి. బుందేల్ ఖండమందలి ఝాన్సీరాజ్య ప్రభువగు మహారాజాగంగాధరరావున కిచ్చి పెండ్లిచేసిరి. దేశాచారము ననుసరించి యామె యత్తవారింట లక్ష్మీబాయియను క్రొత్తపేరు పెట్టుకొన్నది. భర్తకు తలలోని నాలుకవలె మెలగెడిది లక్ష్మీబాయి. కాశీవిశ్వేశ్వరుని కరుణవలన నా దంపతుల కొక కొడుకుదయించెను. కాని మూడు నెలలైన నిండక ముందే యాబాలుడు మరణించినాడు. ఈదుఃఖ మాదంపతులకు భరింపరానిదైనది. తనయనంతరము రాజ్యమేలువా రెవరని గంగాధరుడు దుఃఖించువాడు. వానికి మనోవ్యాధి పట్టుకొన్నది. చివర కవసానదశ సమీపించినది. మోరోపంతుతో నాలోచించి దామోదరరా వనుబాలుని శాస్త్రోక్తముగా దత్తత చేసికొనినాడు గంగాధరుడు. బాలునకు యుక్తవయసు వచ్చువఱకు వానిపేరనే లక్ష్మీబాయి రాజ్యపరిపాలన చేయవలెనని గంగాధరుని కోరిక. ఝాన్సీరాజ్యము ఆంగ్లేయుల పెత్తనమునకు లోబడియుండుటచే తన కోరికను ఆంగ్లేయులకు తెలిపి దానిని మన్నింపవలెనని విన్నపము వ్రాయించి పంపినాడు. పంపిన కొలది కాలముననే గంగాధరుడు స్వర్గలోకమునకు పోయినాడు.

లక్ష్మీదేవి యబల. పదునారేండ్లైన రాని పసిబిడ్డ లక్ష్మి. రాజ్యభారమును వహింపవలసిన యవసరము వచ్చినది. దత్తత పుత్రుడు పుత్రుడు

కాదని గవర్నరు డల్హౌసీ నిర్ణయించినాడు. ఆంగ్లేయులు ఆరాజ్యమును కబళింప నెంచినారు. ఆరాజ్యమునకు తామే వారసు లన్నా రాంగ్లేయులు. సతారా రాజ్య మదివరకే ఆక్రమించినారు. ఝాన్సీ నాంగ్లేయుల కిచ్చుట కెంతమాత్ర మంగీకరింపనని పదునాల్గేండ్ల బాల వీరగర్జన మొనర్చినది. రాణి తగిన సమయమునకై వేచియున్నది.

## 2. సిపాయి కలహము (లేక) లక్ష్మీబాయి ఝాన్సీకి సర్వాధికారిణియైన విధము.

ఆంగ్లేయు లత్యాశతో దేశమునంతను కబళింప మొదలు పెట్టిరి. సంస్థానాధీశ్వరులు సంతతిలేక చనిపోయినచో శాస్త్రోక్తముగా వారు దత్తత చేసికొన్నను చెల్లదని గవర్నరు డల్‌హౌసీప్రభు వాజ్ఞాపించి సతారా మొదలైన రాజ్యములను వశపఱచుకొన్నాడు. ఝాన్సీ రాజ్యము కూడ స్వాధీనము చేసికొనబడినది. సిపాయీలలో మత విషయ మగు కలహములు బయలుదేరినవి. ఆవు క్రొవ్వున్నచో హిందువులును, పంది క్రొవ్వున్నచో మహమ్మదీయులును నే పదార్థములు ముట్టుకొనరు. ఆరెండు క్రొవ్వులను పూసిన తూటాలను నోటితో కొఱికి యుపయోగింపవలెను. దీనితో సిపాయీలలో నాంగ్లేయు లన్న రోత, ద్వేషము పుట్టినవి. కాని వీరిని విడిపించు నాయకులు లేకుండిరి. స్వదేశరాజులు నాయకత్వము వహింప సిద్ధపడిరి. విప్లవము చెలరేగినది. బాజీరావు పీష్వా దత్తపుత్రుడైనందున నానాసాహేబున కిచ్చుచుండిన యెనిమిదిలక్షల భరణము నాంగ్లేయులు తీయకుండిరి. నానాసాహేబు కోపాగ్ని హరిసినాడు. సంస్థానాధీశ్వరులను కలిసికొని విప్లవాగ్నిజ్వాలలను వ్యాపింపచేసినాడు. తాతియాతోపే నానాసైన్యమున కధిపతి. నిర్ణీతమైన దినమున దేశమందెల్లెడల స్వరాజ్య పతాకము ప్రతిష్ఠింప నిశ్చయింపబడెను. ప్రజలలో పౌరుషరక్తము పొంగులువాఱినది. లక్నోలో మంగలపాండే యను నతడు తన యజమానున కెదురుతిరిగి యతనిని తుపాకీతో కాల్చి చంపినాడు. ఆంగ్లేయులకు రోషము వచ్చినది.

1856 సంవత్సరము జూన్ నాల్గవతేదీని భారత సైన్యములు ఝాన్సీకోటను ముట్టడించినవి. ఆంగ్లేయు లందఱు కోటలోనే దాగి యుండిరి. రసల్‌దార్, మహమ్మద్ హుస్సేనుల నాయకత్వమున ఝాన్సీ కోటను విప్లవవీరులు స్వాధీనము చేసికొని కోటకొమ్మలపై స్వాతంత్ర్య పతాకము నెగురవేసిరి. మహారాణి లక్ష్మీబాయి కత్తి చేతఁబట్టి యుద్ధభూమిలో వీరవిహార మొనర్చినది. మూడుదినములు భయంకరయుద్ధము. శత్రువులపై నెంతకోపము చూపినను శరణన్నవారిని కనికరించి విడిచినది. ఆంగ్లేయ స్త్రీల నెందరినో తనయింట నిడుకొని కాపాడినది. కోటలోని వారి కాహార పదార్థములను పంపెడిది. మహారాణి లక్ష్మీబాయి ఝాన్సీకి సర్వాధికారిణియైనది. దామోదరరావామెకు వారసుడుగా నిర్ణయింపబడినాడు.

## 3. ఝాన్సీలక్ష్మీబాయి పరిపాలన – దినచర్య :–

ప్రతిదిన ముదయ మయిదుగంటలకే లేచి నిత్యకృత్యములాచరించి లక్ష్మీబాయి దైవప్రార్థన చేసెడిది. పిమ్మట తులసిపూజ యొనర్చెడిది. తరువాత పార్థివపూజ ప్రారంభమయ్యెడిది. అప్పుడాస్థాన గాయకులు సంకీర్తనములు పాడెడివారు. పౌరాణికులు పురాణపఠనము గావించెడివారు. పిమ్మట రాణి సర్దారులకును, సామంతులకును దర్శన మిచ్చెడిది. ప్రతిదినము తన్ను దర్శించి నమస్కారములు చేయవచ్చు నేడువందల యేబదిమంది సరదారులలో నే యొక్కరు రాకున్నను మరునాడాతనిని కారణమడిగి తెలిసికొనెడిది. ఆమె యంత జ్ఞాపకశక్తిగలది. మధ్యాహ్న భోజనముచేసి యొక గడియ విశ్రమించెడిది. ఆ తరువాత ఉదయమున తీసికొని రాబడిన కానుకలను తెప్పించి వానిలో కొన్ని తీసికొని మిగిలిన వానిని సేవకులకు పంచిపెట్టించెడిది.

ఆమె ప్రతిదినము మధ్యాహ్నము మూడుగంటలకు దర్బారులో నుండును. తెల్లని పైజామా తొడుగుకొని, శ్యామలవర్ణముగల కంచుకము తొడిగి, జరీయుత్తరీయమును ధరించి, తలపాగచుట్టి, రత్నఖచితమైన

కత్తి ప్రక్కను వ్రేలాడ నామె పేరోలగమందుండును. తక్కిన సమయములలో స్త్రీవేషముతోనే యుండెడిది. తెరవెనుక కూర్చుండెడి యామె సభలోనివారికి కనిపించెడిది కాదు. సభలోనివారి నందఱ నామె పరికించుచునే యుండెడిది. లక్ష్మణరావు దివాను. అతడు రాజకీయవ్యవహారము లన్నియు. రాణికి నివేదించువాడు. సూక్ష్మబుద్ధితో నామె వెంటనే గ్రహించి యప్పటికప్పుడే యుత్తరువుల నిచ్చెడిది. ఆ తీర్పు లెంతో న్యాయసమ్మతములుగా నుండెడివి. బీదల కన్నవస్త్రము లిచ్చి పోషించెడిది.

ఆమె నగరవీథులలో నుండి పోవునపుడు స్వాతంత్ర్యపతాక ఆమె ముందు నడువవలసినదే. సైనిక గీతములు పాడబడుచుండెడివి. నూరుగు రాశ్వికులు, రెండువందలమంది తెల్లదొరలు ముందువెనుకల నడచెడివారు. మహారాణి లక్ష్మీబాయి యంతవైభవముగా రాజ్యమును పరిపాలించెడిది.

### 4. ఆంగ్లేయులు ఝాన్సీ నెట్లు స్వాధీనము చేసికొనిరి ? (లేక) ఝాన్సీరాణి లక్ష్మీబాయి యాంగ్లేయులతో పోరాడిన విధము :—

ఆంగ్లేయులు ఝాన్సీ నెటులైన స్వాధీనము చేసికొనవలెనని నిశ్చయించినారు. యమున కుత్తరమునగల రాజ్యము నాకళించి హిమాలయము వఱకు నాంగ్లరాజ్యాధిపత్యమును కాంబెల్ సైన్యాధ్యక్షుడు నెలకొల్పినాడు. మధ్యభారతమును జయించుటకు సర్‌హ్యూరోస్ నియమితుడయ్యెను. హైదరాబాదు, భోపాల్ మొదలగు సంస్థానాధీశు లాంగ్లేయులకు వశులైరి. విట్‌లాక్ అనునతడు జబ్బలపూరునుండి బయలుదేరి త్రోవలోని దేశములను జయించుచు సర్‌హ్యూను కలిసికొనెను. జనవరి 6 వ తేదీని మౌనుండి బయలుదేరి హ్యూ రాయగడ దుర్గమును జయించెను. మార్చి 20 వ తేదీకి ఆంగ్లసైన్యములు ఝాన్సీకోటకు 14 మైళ్ళ దూరమునకు వచ్చి చేరినవి. విప్లవసైన్యములును ఝాన్సీవైపునకు నడచినవి. ఝాన్సీ దుర్భేద్యమైన రక్షణ స్థానమైనది. దానిని నాశనముచేయ పూను

కొన్నాడు సర్ హ్యూ. రాణి లక్ష్మీబాయి యాజ్ఞచే పరిసర భూముల లోని తృణధాన్యకాష్ఠము లన్నియు నాశనము చేయబడినవి. దేశద్రోహు లగు సింధియా టెహ్రీరాజు లాంగ్లేయులకు సాయపడిరి.

రాణి లక్ష్మీబాయి యుద్ధమునకు సర్వసన్నాహములను చేయించి స్వయముగా పరిశీలన చేయుచున్నది. ఆహారము వండియిచ్చుటకు, క్షత గాత్రులను కాపాడుటకు, మందుసామగ్రుల నందించుటకు భారతనారీ మణులే కంకణము కట్టుకొనిరి. జూన్ 23 వ తేదీని రణభేరి మ్రోగినది. ఝాన్సీకోటపైనున్న 'ఘనగర్జ' అను ఫిరంగినుండి అగ్నివర్షము కురిసినది. శత్రువులును అగ్నివర్షము కురిపించినారు. మిక్కిలి బరువుగల ఫిరంగి గుండ్లు కోటగోడలపైనను నగరములోను పడి భీతి గలిగించుచుండెను సైనికులు చాలమంది మరణించినారు. మహారాణి కోటగోడపై పరవళ్లు త్రొక్కుచు సైన్యాధిపతియగు గులాంగౌస్‌ఖానును ప్రోత్సహించినది. అతడు విజృంభించుటతోడనే శత్రుపక్షము వారు చాలమంది మరణించిరి. అయిదారు దినములు ఘోరయుద్ధముజరిగినది. రాణి యైదారు గంటలసేపు దారుణాగ్ని వర్షమును కురిపించినది. ఏడవదినమున నాంగ్లేయులు కురి పించిన యగ్నిశిలావర్షముచే నొక బురుజుగోడ బ్రద్దలైనది. రాత్రికి రాత్రి కంబళ్ళు చాటుపెట్టుకొని మహారాణి యా గోడను మరమ్మతు చేయించి నది. ఎనిమిదవనాడు ఆంగ్లేయులు 'శంకరఖిల్లా'ను చేరిరి. నగరములో నొక కోనేటిని చూచి యక్కడికి మంచినీటికై పోవు ప్రజలపై నిర్దయు లగు నాంగ్లేయులు ఫిరంగులు ప్రేల్చిరి. కోటలోని మందుగుండు కార్ఖా నాను తగులబెట్టిరి. కొంచెమైనను జంకక రాణి ఘోరముగా పోరొనర్చి నది. వెలుపలినుండి సహాయము నపేక్షించి రాణి తాతియాతోపేకు వర్త మానము పంపినది. చర్ఖారీరాజు నోడించి తాతియా వచ్చినాడు. అతడు యుద్ధమున మాక్కాకలుతీరిన వీరుడు. అతడిరువదిరెండవేల సైన్యముతో వచ్చినాడు. ఆంగ్లేయు లడలిపోయినారు. సర్ హ్యూ సామాన్యుడు కాడు. యుద్ధకళా నిపుణుడు; సమయజ్ఞుడు. సైన్యమును రెండు భాగ ములుచేసి యొకభాగమును కోట ముట్టడికి నియమించినాడు. రెండవ

భాగమును తీసికొనిపోయి చేత్వానదిని దాటి వచ్చుచున్న తాతియా సైన్యము నెదుర్కొనినాడు. ఆ సైన్యములు నాశనమైనవి. యుద్ధసామగ్రి ఆహారపదార్థములుకూడ నాంగ్లేయుల వశమైనవి. రాణిసైన్య మదిచూచి నిర్వీర్యమైనది. లక్ష్మీబాయి సింహగర్జనచేసి సైనికుల నుద్బోధించినది.

ఏప్రియల్ 3 వ తేదీ నాంగ్లేయు లన్నివైపులనుండి ఝాన్సీని ముట్టడించినారు. రాణి ఖడ్గము చేతబట్టి యుద్ధరంగమున నురికినది. వీర వచనములతో, చిరహాసములతో, భయంకర సింహగర్జనలతో యుద్ధ భూమి యంతయు తానేయై రాణి విజృంభించినది. వీరాధివీరులగు గులాంగౌస్ ఖాన్, ఖుదాబక్షీలు భయంకరముగా పోరాడుచుండిరి. సింహ ద్వారముదగ్గర నాంగ్లేయులు తీవ్రముగా ముట్టడించిరి. కోటగోడలకు నిచ్చెనలు వేసిరి. వానినన్నింటిని త్రోసివేసి తెల్లవారి నెందరినో రాణి మట్టుపెట్టినది. దొరలు కాళ్ళకు బుద్ధులు చెప్పినారు.

విధి దాటరానిది. ఈస్థితిలో నొక దేశద్రోహి యాంగ్లేయులకు లోబడి మోర్చాద్వారముకడనున్న రహస్యమార్గమును వారికిచెప్పినాడు. వారామార్గమున ప్రవేశించి యన్నిటిని నాశనముచేసిరి. రాణి కోపా రుణిత నేత్రయై వేయిమంది సైనికులతో వచ్చి దక్షిణద్వారమున భయం కర యుద్ధము చేసినది. ఆంగ్లేయులు చాలమంది చచ్చిరి. ఆమె యొంటరి గనే యుద్ధము చేయుచున్నది. అంతలో గులాంగౌస్ఖాను మొదలగు వారు చంపబడినవార్త వచ్చినది. ఇక నామె కధైర్యముతోచినది. మందు గుండు కొట్టులోనికిపోయి నిప్పంటించుకొని మరణింప తలంచినది. ఆత్మ హత్య పాపమనినారు సరదారులు. అప్పటికి కోటను వీడిపోవనెంచి పురుషవేషము ధరించి దత్తపుత్రుడైన దామోదరుని వీపునకట్టుకొని యుత్తమమైన గుఱ్ఱమునెక్కి కోటనుండి బయలుదేరి వెళ్ళిపోయినది. ఆ సంగతి సర్‌హ్యూరోస్ విని యంతటితో నూరకొనక బేకరను సేనా పతిని పంపినాడు. మార్గమధ్యమున చౌకరుసేన యెదుర్కొనినవి. ఆ సైన్యము నురుమాడి చౌకరు నొక్కపెట్టు పెట్టినదని రాణి ఆ దెబ్బతో

వాడు నేలకూలి యొడలు దులుపుకొని కాళ్ళకు బుద్ధిచెప్పినాడు. అర్ధరాత్రి కామె కాల్పీనగరము చేరుకొన్నది.

ఝాన్సీ యాంగ్లేయుల వశమైనది.

## 5. గ్వాలియరు యుద్ధము—దానిఫలితములు :—

కుంచ్ యుద్ధము ముగియగనే తాతియా తండ్రిని చూడబోయెదనను నెపమున చర్ఖియను గ్రామమున కేగెను. సైనికులు క్రమశిక్షణ గల్గియున్నచో తమకు జయముగల్గునన్నది రాణి. చాందానవాబుకూడ నామెతో నేకీభవించినాడు. విప్లవవీరులందరు స్వరాజ్య స్వధర్మములను నిలబెట్టుదుమనియు, విజయమో వీరమరణమో తప్ప మరొండు లేదనియు శపథములు చేసిరి. రావుసాహెబు పీష్వా సకలసైన్యాధిపతి యయ్యెను. తన యాశ్వికదళమును వెంటనిడుకొని రాణి ఆంగ్లసైన్యమును మార్కొనెను. యుద్ధమతిభయంకరమైనది. రాణి సాహసమునకు మేరలేదు. ఫిరంగులనుకూడ ఛేదించుకొనిపోయి వీరనారీమణియై విజృంభించినది. తమ కపజయమే యని యాంగ్లేయులు నిశ్చయించుకొనిరి. సర్ హ్యూకు ఈ సంగతి తెలిసినది. తన యుష్ట్రబలమును తీసికొని యుద్ధమునకు వచ్చినాడు హ్యూ. వానిధాటికి పీష్వాసైన్యములు వెనుకాడినవి. కాల్పీపట్టణము నాంగ్లేయులు జయించి పతాక నెగురవేసినారు.

విప్లవనాయకులు నిస్పృహులై గోపాలపురము చేరిరి. గ్వాలియరు నగరమునకేగి యచటి సరదారులను సైన్యములను సమయమునకు సాయము చేయునట్లు వారిచే వాగ్దానములు చేయించుకొనిన తాతియా వచ్చి వీరిని కలిసికొని సంగతులన్నియు చెప్పినాడు. విప్లవవీరుల కుత్సాహముగల్గినది. గ్వాలియరును ముట్టడింప విప్లవవీరులు నడచిరి. సింధియా మహారాజు జాయాజీరావు ఆంగ్లపక్షపాతి. విప్లవసైన్యము నెదిరించినాడు. మూడు వందల యాశ్వికదళముతో ఝాన్సీలక్ష్మి సింధియాసైన్యముపైబడి చిందరవందర చేసినది. సింధియారాజు తన దివానగు దినకరరావుతో నాగ్రా పాఱిపోయినాడు.

రావుసాహెబు గ్వాలియరుకోటను స్వాధీనము చేసికొని స్వాతంత్ర్య పతాకను నిల్పినాడు. పట్టాభిషిక్తుడై సమస్తభోగము లందుచున్నాడు. ఆంగ్లేయులను నమ్మరాదనియు సైన్యములకు తగు శిక్షణ నిప్పించి చాల జాగరూకతతో నుండవలయుననియు రాణి లక్ష్మీబాయి పీష్వాకు నిరంతరము చెప్పెడిది. అతడు పెడచెవిని పెట్టినాడు. పీష్వా పట్టాభిషిక్తుడగుట సర్ హ్యూస్ విని యాశ్చర్యపడినాడు. పెద్దసైన్యముతో గ్వాలియరుపై దండెత్తినాడు. పీష్వా క్రుంగిపోయినాడు. లక్ష్మీబాయి కత్తిపట్టినది. యుద్ధభూమికి నురికినది. తూర్పుద్వారముదగ్గర జనరల్ స్మిత్తు రాణి నెదుర్కొనినాడు. ఆమె పన్నిన వ్యూహమున నాంగ్లేయులందరు నోడిపోయినారు. స్మిత్ చిత్తయినాడు. మరలా నాంగ్లేయు లతితీవ్రముగా పోరాడజొచ్చిరి. దెబ్బతిన్న స్మిత్తు రెట్టింపు సైన్యముతో లక్ష్మీబాయి నెదుర్కొనినాడు. రాణి మందర, కాశియను చెలికత్తెలను వెంట నిడుకొని విరోధుల నతితీవ్రముగా నెదిరించినది. ఆ సమయమునకు ఉపబలముతో హ్యూస్ వచ్చి స్మిత్తును కలిసినాడు. రాణి పురుషవేషమున తన పరాక్రమమును ప్రకటించుచున్నది. మందర ఆంగ్లేయుల తుపాకుల కెరయైనది. రాణి యది కనిపెట్టి యా వైపునకు పరుగెత్తించినది తన గుఱ్ఱమును. ఆ వైపున నొక యేఱున్నది. ఆ యేఱు దాట ప్రయత్నించినది రాణి. ఆమె గుఱ్ఱము మొత్తపడి నిలిచిపోయినది. ఇంతలో నాంగ్లే యాశ్వికు లామెను సమీపించిరి. నిర్దాక్షిణ్యముగా నామె యా యాశ్వికులను రూపుమాపుచున్నది. అంతలో నెవడో వెనుకనుండి రాణి ముఖము బ్రద్దలగునట్లుగా కొట్టినాడు. మరియొకడామె వక్షమున పొడిచినాడు. అట్టి స్థితిలోకూడ నా యిరువుర నామె తన కరవాలమున కెరచేసినది. సమీపముననున్న రామచంద్రరావు దేశముఖు వచ్చి యామె నొక కుటీరములో చేర్చినాడు.

అందు గంగాదాస్ బావాయను సన్యాసిగలడు. అత డామెకు చల్లని నీరు త్రావనిచ్చినాడు. మెత్తని శయ్యపై పరుండబెట్టినాడు. తానిక మరణింపనున్నదనియు దురాత్ములగు నాంగ్లేయు లామె శరీరమును తాకకుండ ప్రాణముపోయిన తత్క్షణమే దహనము చేయుమనియు రాణి యాదేశించినది. కన్నుమూసినది. వెంటనే రామచంద్రరావు దేశముఖు శవదహన సంస్కారములు చేయించినాడు. వీరనారీమణి గ్వాలియరు కోటకు బలియైనది.

———

# సుభాసచంద్రబోసు

కటకపురిలో జానకీనాథు డొక ప్రముఖన్యాయవాది. అతనికుమారుడు సుభాసచంద్రుడు. వంగదేశమునువదలి కటకపురిలో జానకీనాథుడు న్యాయవాదివృత్తి నవలంబించెను. సుభాసు 1897 జనవరి 23వ తేదీని జన్మించెను. వాని నైదవయేట బడిలో వేసినారు. చిన్నపుడే యతనికి సామ్యవాద సూత్రములంకురించినవి. ఆ పాఠశాల దొరలకని పెట్టబడినది. భారతీయులు నూటికి పదిమందికన్న నెక్కువయుండరు. నడవడిక, పరిశుభ్రత, సమయపరిపాలన యివి చదువుకన్న ముఖ్యములు. ఆంగ్లభాషా ప్రమాణమం దెక్కువగానే యుండును. కాని భారతీయ సంప్రదాయమున కావిద్యా విధానము విరుద్ధమైనదే. ఆంగ్లదేశ భూగోళము, ఆంగ్లదేశచరిత్ర, ఆంగ్ల వీరగాథలు తప్ప భారతదేశ విషయమేలేదు. ఉపకారవేతనముల కాంగ్లేయులే యర్హులు. పరీక్షలలో నాంగ్లేయులకన్న భారతీయులే యున్నతస్థాన మొందెడివారు. ఆంగ్లోఇండియనులు స్వచ్ఛంద సైనికశిక్షణ కర్హులు. భారతీయుల కాయర్హతలేదు. జాతి యాధారముగా నాబడిలో విద్యార్థులమధ్య విరోధము లేర్పడినవి. వాగ్యుద్ధములు ముష్టియుద్ధములుకూడ జరుగుచుండెడివి. నూతనవిద్యా నిబంధనావళి ప్రకారము పరీక్షలకు వంగభాష నభ్యసించుట తప్పనిసరియైనది. సుభాసచంద్రుడు తన పండ్రెండవయేట భారతీయ పాఠశాలలో చేరినాడు.

పరీక్షలో బోసు మొదటివాడుగానే నిలిచినాడు. అతని కాట అనిన నిష్టములేదు. ఇంటిలోనే శరీర వ్యాయామము చేయువాడు. తోటపని చేయువాడు. ఈడునకు మించిన యాలోచనలు చేయసాగినాడు. అతడు దయార్ద్రహృదయుడు. అతడు ప్రకృతిసౌందర్యము నారాధించువాడు. అందుచే మనస్సు నొకదానిపై కేంద్రీకరింప చేయు శక్తి చేకూరినది. వరడ్స్వర్తు గ్రంథములను, సంస్కృత భారతమును, కాళిదాసు కావ్యములను చదివి మైమఱచెడివాడు. ప్రకృతిలోని బాహ్యసౌందర్య మతనికి నచ్చలేదు. ప్రకృతి తత్త్వము నన్వేషింప మొదలు

పెట్టినాడు. "నీ ముక్తికొఱకును, ప్రపంచ హితముకొఱకును ప్రయత్నింపుము" అను వివేకానందుని సూక్తిని చదివి దానిని తనజీవితమున కాదర్శముగా చేసికొనినాడు. బోసునకు పదునైదుసంవత్సరములు వచ్చినవి. వాని కంకురించిన సందేహము లన్నియు వివేకానందుని గ్రంథములవల్ల తీరుచుండెడివి. వివేకానంద, రామకృష్ణపరమహంస లవతారపురుషులని తలంచెడివాడు. వారితత్త్వము లతని మనస్సును పట్టినవి' తానుతరించుచు ప్రపంచహితము కొఱకు పాటుపడవలెనని ప్రపంచబంధము లన్నియు త్రెంచుకొనవలెనని నిర్ణంచుకొనినాడు.

అతనికి చదువుపై శ్రద్ధ తగ్గినది. మానసిక వ్యవసాయము, ఆధ్యాత్మిక వ్యవసాయము—ఇవే అతని సర్వస్వము. బ్రహ్మచర్యము, జపము, యోగము, మొదలగువానిని గురించిన గ్రంథము లన్నింటిని బాగుగా చదివినాడు. గురువులేనిదే సాధ్యముకాదని యనుకొనినాడు. విశ్వమానవ కల్యాణమునకై పాటుపడనిదే ఆధ్యాత్మికాభివృద్ధి లేదని గ్రహించినాడు. పేదసాదలకు దానధర్మము లొనరించినాడు. గ్రామ పునరుద్ధరణ కార్యములలో కలుగజేసికొనినాడు. 1912వ సంవత్సరమున కలకత్తా నుండి విద్యార్థిసంఘ సభ్యుడొకడు కటకపురికి వచ్చినాడు. తమ యౌన్నత్యమునకు పాటుపడుచు దేశసేవ చేయుట యాసంఘాదర్శము. కటకపురిలో నొక విద్యార్థిసంఘ మేర్పఱచినాడు. మెట్రిక్ పరీక్షలో నుత్తీర్ణుడైనతరువాత బోసు కలకత్తా వెళ్ళెను. తాను వివేకానంద రామకృష్ణులవలె జీవింప తలచినాడు. స్వార్థమును విడిచి ప్రజాసేవ చేయువలెనన్నచో కామప్రవృత్తిని నిర్మూలింపవలెను. కళాశాలలో చేరునాటికి సుభాసునకు చాలమంది మిత్రులైరి. ఆనాటి కలకత్తా వాతావరణములో జాతీయతకు దూరమైన యుద్యమము లేదు. విజ్ఞాన సముపార్జన, సంఘమున సభ్యులను చేర్చుకొనుట, పెద్దలతో సన్నిహితత్వము నేర్పఱచుకొనుట యీమూడును సుభాసచంద్రు డేర్పఱచిన మిత్రబృందముయొక్క ఆశయములు. విధ్వంసకచర్యలను ప్రోత్సహించు రాజకీయములు వీరికి పనికిరావు. రాజకీయములలో అరవిందఘోషు, లోకమాన్య బాలగంగా

ధరుడు ప్రవేశించి కాంగ్రెస్సును స్థాపించినారు. రాజకీయములతో నింకను సుభాసచంద్రుని కాసక్తి కలుగలేదు. కలకత్తా సేవాసమితిలో సభ్యుడుగా చేరి సుభాసచంద్రుడు కఱవు కాటకములవల్లను వరదలవల్లను పీడితులైనవారికి సహాయపడుట, నిధులను ప్రోగుచేయుట, విద్యార్థులను గురించి యధికారులతో మాట్లాడుట, విహారయాత్రలకు పోవుట మొదలగునవి చేయుచుండెను. సంఘసేవకుడుగా ముందడుగిడెను. తనకు ట్రాముఖర్చుల కిచ్చిన డబ్బును బిచ్చగాండ్రకిచ్చి తాను కళాశాలకు నడచి వెళ్లెడివాడు.

వేసవి సెలవులకు కటకపురివచ్చినాడుబోసు. ఊరిలో విషూచి రోగము ప్రబలియున్నది. పల్లెపట్టులకు వెళ్ళి ఊరిలోనికివెళ్ళి విషూచి రోగులకు సేవ చేసెడివాడు. మరల కలకత్తా వచ్చినతోడనే సాధు సంఘసేవ మొదలుపెట్టినాడు.

## వంగదేశమున విధ్వంసకవిప్లవసిద్ధాంతమునకు పునాదివేసిన సంఘటనలు :-

ప్రథమ ప్రపంచయుద్ధము ప్రారంభమైనది. రాజకీయములగు కం పరములు దేశమం దెల్లడల వ్యాపించినవి. కలకత్తా విధ్వంసకవిప్లవకారుల కునికిపట్టు. సుభాసచంద్రుడు కలకత్తాలోనే యున్నాడు. విద్యార్థి వసతిగృహములలోను, కళాశాలలలోను మరెచ్చటచూచినను దేశ స్వాతంత్ర్య సమర సంరంభములే కాని సుభాసు విప్లవకారుల గుంపులో చేరలేదు. ఆధ్యాత్మికచింతతప్ప మరొండులేదు. ఆదినములలో ఆంగ్లేయు లొనర్చుచుండిన దుర్మార్గములకు దౌర్జన్యములకు హద్దులేదు. ట్రామ బండ్లలో ముందుకూర్చుండిన భారతీయులపై నాంగ్లేయులు కాళ్ళుపెట్టి కూర్చుండెడివారు. భారతీయు లేమియు నోరెత్త కుండిరి. ఇట్టివి తలచ కొలదినపుడెల్ల నాధ్యాత్మికచింత అడుగంటెడివి. యువకరక్తము ఉప్పొంగెడివి. ఏ దేశమునుండియో పొట్టపోసికొనుటకు వచ్చినవారు మన యింటిలోనే యిట్టివను లొనరింప నెవడోర్వగలడు ? కళా

శాలలలో నాచార్యపదవు లవలంబించినవారికి కూడ నిట్టి జాత్యహంకారముండెడిది.

ఒయేటన్ అను నాంగ్లేయాధ్యాపకు డొకనాడు బోసు మిత్రులలో నొకనిపై చేయిచేసికొన్నాడు. విద్యార్థులపక్షమున కళాశాలాధ్యక్షుని కడ కేగి తీవ్రనిరసన తెలియచేసినాడు బోసు. అతడు నిర్లక్ష్యము చేయగా సమ్మె ప్రారంభమైనది. ప్రతివిషయమునను బోసుపక్షమే జయించెడిది.

సుభాసచంద్రుడు ఐ. సి. ఎస్. పరీక్ష చదువుటకు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునకు వెళ్ళినాడు. అచటి విద్యార్థుల స్వాతంత్ర్యమునకు, గౌరవమున కాశ్చర్యపడినాడు. ఆ సమయముననే భారతదేశములో జలియన్ వాలాబాగ్ హత్యలు ప్రజల నందరను గగ్గోలెత్తించినవి. 1920 సంవత్సరమున ఐ. సి. ఎస్. పరీక్షలో బోసు నాల్గవవాడుగా నుత్తీర్ణుడైనాడు. కాని యుద్యోగకాంక్ష వానికిలేదు. మానవసేవచేయుట కుద్యోగ మడ్డువచ్చునని యాతని యాశయము. వివాహము కూడ నైహిక బంధమే కనుక తా నొనరింపనున్న దేశసేవకు ప్రతిబంధకమగునని బ్రహ్మచారిగా నుండుటకే నిశ్చయించుకొనినాడు. ప్రజాసేవ, దేశసేవకొఱకు పదవిని పరిత్యజించినవా డప్పటికి సుభాసచంద్రు డొక్కడే. చెక్కుచెదరని యాదర్శములతో, అకుంఠితదీక్షతో, ఆత్మత్యాగము పునాదిగా దేశమును నిర్మింపవలెనేకాని సురేంద్రనాథబెనర్జీవలె మంత్రిత్వముపై నాసపెట్టుకొని ప్రభుత్వ బిరుదములకు దేవులాడరాదని నొక్కి వక్కాణించినాడు. ప్రభుత్వమునకు సహాయమును నిరాకరించి దేశస్వాతంత్ర్యము సాధింపలె నన్నాడు బోసు.

బో సుద్యోగము మాని బొంబాయి చేరినాడు. అతని మనసు గాంధిమహాత్మునివైపు తిరిగినది. దేశస్వాతంత్ర్య సాధనవిషయమైన మార్గ మేమైన నుండిన తెలుపుమని బోసు గాంధిని ప్రార్థించినాడు. అత డేమియు తెలుపలేదు. అటనుండి దేశబంధుని దగ్గరకు వెళ్ళినాడు. అతడు బోసును మెచ్చుకొని వాని యాశయములు తెల్పినాడు. ఆదినము

ఆలో వేల్సుయువరాజు భారతదేశమునకు ప్రయాణమైనాడు. వెనుకకు పొమ్ము వెనుకకు పొమ్మని భారతప్రజానీకము కేకలు పెట్టెను. మహాత్ముని సహాయ నిరాకరణోద్యమము ఉచ్చస్థితిలో నున్నది. ప్రజలు న్యాయస్థానములను, కార్యాలయములను, కళాశాలలను బహిష్కరించిరి. జాతీయకళాశాలలు బయలుదేరినవి. పంజాబురాష్ట్ర జాతీయ విద్యాధిపతి లాలాలజపతిరాయి, వంగజాతీయ విద్యాధికారి చిత్తరంజనదాసు, కలకత్తా జాతీయకళాశాలాధిపతి సుభాసచంద్రబోసు, యుద్ధము నిలిచిన వెనుక ఇండియాకు స్వరాజ్య మిచ్చెదమని వ్యర్థ వాగ్దానములు చేసినారాంగ్లులు. మాట నిలుపుకొనలేని ప్రభుత్వమును బోసు ప్రభృతులు పడగొట్టసెంచిరి. ప్రభుత్వము సుభాసున కారునెలలు కారాగార శిక్ష విధించినది.

1922 సంవత్సరమున కాంగ్రెసు గయలో సమావేశమయ్యెను. అందు స్వరాజ్యపక్షమొకటేర్పడినది. 'ఫార్వర్డు' దినపత్రికకు సుభాసు సంపాదకుడు, స్వరాజ్యపక్షపు ఎన్నికలలో గొప్ప జయము కలిగినది. బోసు కలకత్తానగర ప్రధాన కార్యనిర్వాహకోద్యోగియైనాడు. అతని జీతము నెలకు మూడువేల రూపాయీలు. సగముజీతము తగ్గించుకొన్నాడతడే. పెత్తనముగహించు నధికారులు ప్రజాసేవకులైరి. ఆంగ్లేయులకు పిచ్చియెత్తినది. బోసుకు మరల చెరసాలలో నుంచినారు. కలకత్తా పురపాలకసంఘ కార్యకలాపము లన్నియు స్తంభించిపోయినవి. చెరసాలలోనుండియే యా కార్యభారమును రెండునెలలు నిర్వహించినాడు బోసు. సుభాసుచేసిన పనులన్నియు చిత్తరంజనదాసు నిర్వహింపమొదలు పెట్టినాడు. అతనినికూడ ప్రభుత్వము ఖైదుచేయవలసివచ్చినది. కాని చేయలేకపోయినది. అందుచే బోసును విడిచిపెట్టుట తప్పనిసరియైనది. విడిచిన నేమి ప్రమాదించునోయని భయపడి వానిని ఆలీపూర్ చెరసాలకు మార్చిరి. అక్కడను కల్లోలములు చెలరేగినవి. రాత్రికి రాత్రి యుత్తర బర్మాలోని మాండలే చెరసాలకు మార్చిరి. లోకమాన్యుడు, లజపతిరాయి బంధింపబడిన చెరసాల యగుటచే తనజన్మ ధన్యమైన దను కొన్నాడు బోసు.

1926 సంవత్సరమున ఎన్నికలు వచ్చినవి. చెరసాలలోనున్న సుభాసుబాబు శాసన సభ్యుడుగ నెన్నికైనాడు. అతని విడుదలకై శాసనసభలో ప్రయత్నములు జరిగినవి కాని ప్రయోజనము లేకపోయెను. అతని యారోగ్యము చెడినది. అప్పుడు విడిచిపెట్టక తప్పినది కాదు ప్రభుత్వమునకు. మొండి ప్రభుత్వ మపుడైనను విడిచిపెట్టుచు సుభాసు స్వదేశములో నడుగు పెట్టరాదని యాజ్ఞాపించినది. స్వంత ఖర్చులపై స్విట్జర్లెండు పోవలయునని శాసనము. ఆ నిర్బంధమును నిరసించినా డతడు. చిట్టచివరకు 'బేషరతుగా' విడుదల చేసినారు.

1927 వ సంవత్సరమున వంగదేశము వచ్చినాడు. అతనికి గొప్ప ప్రాపైన చిత్తరంజనుడు మరణించినాడు. చిత్తరంజనుని కార్యభారమును బోసు వహించినాడు. ప్రజలు బ్రహ్మాండమైన స్వాగతమిచ్చిరి. అతడు బంగాళారాష్ట్ర కాంగ్రెసభ్యుడైనాడు. ఆ సంవత్సరము కాంగ్రెసు మహాసభ మదరాసులో జరిగినది. డాక్టరు అన్సారీ దాని కధ్యక్షుడు. జవహరులాల్ నెహ్రూ, సుభాసచంద్రబోసు కార్యదర్శులుగా నియమితులైనారు. అనాటి కాంగ్రెసు పెద్దలు అధినివేశ స్వాతంత్ర్య సంపాదనకు యత్నించుచుండిరి. బోసు, నెహ్రూలు దాని నెదుర్కొనిరి. దానితో కాంగ్రెసులో రెండువర్గము లేర్పడినవి. బోసు నెహ్రూల నాయకత్వమున స్వాతంత్ర్య సంఘ మొకటి యేర్పడినది. దానికే యువజన కాంగ్రెసు సంఘమని పేరు. ఆ సమయమున సైమను సంఘము భారత దేశము వచ్చినది. నల్లజెండాలు విస్తృతముగా చూపి "సైమన్ వెడలిపో" అని కేకలు వేసినారు ప్రజలు. వీరాంధ్రకేసరి టంగుటూరి ప్రకాశము గుండె యర్పించిన యుజ్వల ఘట్టమది. బార్డోలీలో ప్రభుత్వము పన్నులు వసూలు చేయలేకపోయినది. సుభాసు నెహ్రూల యాశయములతో గాంధి యేకీభవింపలేదు. 1929 లో జవహరులాల్ కాంగ్రెసులో నధ్యక్షుడైనాడు బోసుతో నతడు వేఱుపడవలసివచ్చినది. గాంధీ బోసులకు భేదాభిప్రాయములు వచ్చినవి. దానితో ప్రజాస్వామ్య కాంగ్రెసు సంఘమను నొకసంఘము నేర్పఱచినాడు బోసు. అంతలో 1930 లో సహాయ

నిరాకరణోద్యమ మారంభ మైనది. సుభాసు బంధితుడై నాడు. చెసాలలో నుండగనే కలకత్తాపురపాలక సంఘాధ్యక్షుడుగా బోసెన్నుకొనబడినాడు. ప్రభుత్వమువారు సెప్టెంబరు నెలలో విడుదల చేసి మరల జనవరిలో వానిని బంధించిరి. గాంధీ యిర్విన్ ఒడంబడిక యొకటి జరిగినది. గాంధీ సత్యాగ్రహమును నిలిపినాడు. రౌండు టేబుల్ సమావేశము నిరుపయోగ మైనది. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము బొంబాయిలో సమావేశ మైనది. సుభాసచంద్రబోసును ప్రత్యేకముగా పిలిచినారా సభకు. అది ప్రభుత్వము తెలిసికొని యేమి కొంపమునుగునో యని బోసును మరల చెరసాలలో పెట్టిరి. అతని కీసారి చెరసాలలో క్షయరోగము పట్టుకొన్నది. మరల ప్రభుత్వ మాతని విడువక తప్పినదికాదు. ప్రభుత్వ నిర్బంధమువలన స్విట్జర్లెండు పోవలసి వచ్చినది. ఎక్కడికి వెళ్ళినను దేశసమస్యలే యాతని యాశయములు. అట్టుండ తండ్రి మరణావస్థలో నున్నాడని తంతి వచ్చినది. స్వదేశమునకు వచ్చినాడు కాని యతడిల్లు విడిచి బయటికి పోకూడదని, ఎవ్వరితోను మాటాడరాదని ప్రభుత్వము నిర్బంధించినది. వారము దినములలో స్వదేశమును విడిచిపెట్టి వెళ్లవలయునని ప్రభుత్వ మాజ్ఞాపించినది. మరల దేశాంతరమునకు వెళ్ళినాడుబోసు.

ఇతర దేశములకు వెళ్ళుట మేలేయైనది. ఆయా దేశములలో భారతదేశమునుగూర్చి ఉపన్యసించి దీని గొప్పతనము చాటినాడు. భారతీయ సమర మనుగ్రంథమును వ్రాసి ఆయా దేశములలో ప్రచారము చేసినాడు. ఆఫ్ఘన్ స్థాన్ చక్రవర్తిని కలిసికొని రాజకీయములు చర్చించినాడు. జినీవాలో విఠల్ బాయి పటేలు విగ్రహము నావిష్కరించినాడు. డబ్లిన్ లో డీవెలరాను కలిసికొని మాట్లాడినాడు. రాజగౌరవము లందినాడు. విదేశములలో మనదేశమునకు బలము చేకూర్చినాడు. 1936 లో లక్నోలో కాంగ్రెసు సమావేశ మైనది. సుభాసును రావలసినదని కాంగ్రెసు కోరినది. అతడు వచ్చునని ప్రజ లువ్విళ్ళూరినారు. గొప్ప స్వాగతము లిచ్చినారు. కాని యతడు స్వదేశమునం దడుగు పెట్టిన తోడనే ప్రభుత్వము మరల బంధించినది. బోసు పేరుచెప్పిన ప్రభుత్వ

మూన కంఠభయము. ప్రజలకు కోపాగ్ని రగులుకొన్నది. 1937 లో దాని ఫలితముగా బోసును విడిచిపెట్టినారు. ఆరోగ్యము చెడిపోవుటచే యూరోపా వెళ్ళినాడు. లండనులో నెన్నియో గంభీరోపన్యాసము లిచ్చినాడు. అతడు విదేశములలో నున్నను భారతజాతీయ కాంగ్రెసు అధ్యక్షుడుగా నెన్నికయైనాడు. అందుచే మరల దేశమునకు రావలసివచ్చినది. పరిస్థితులు మారి బోసునకు స్వదేశమునందే కొందరు వ్యతిరేకులైనారు. అతని కనారోగ్య మెక్కువైనది. పరిస్థితులుకూడ వాని కసహ్యమనిపించినవి. అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చినాడు. కాంగ్రెసు పెద్ద లతనిపై క్రమశిక్షణచర్య తీసికొనినారు. వంగరాష్ట్రము మాత్రము వాని నాయకత్వమును విడువలేదు. వంగదేశమున రెండు కాంగ్రెసు సంఘము లేర్పడినవి. సుభాసు ఫార్వర్డు బ్లాకునకు చెందినవాడు. హోవెల్ అను విదేశీయుని విగ్రహమును తీసివేయవలయునని కలకత్తాలో నొక యుద్యమమును లేవదీసినాడు బోసు. ఆంగ్లేయుల కాగ్రహమువచ్చి మరల నతనిని చెరసాలలో బంధించినారు. మహాత్ముని పక్షమునుండి విడివడిపోయినతరువాత మహాత్ముని మించిన మహాత్ముడైనాడు. ఈసారి యాతఁడెవరితోను మాటాడడు. ఎవరు వచ్చినను చూడనైన చూడడు. పాలు, పండ్లు తప్ప ఆహారమేమియు లేదు. ఆ చెరసాలలో నాతడేమి చేయదలచుకొన్నాడో యెవ్వరికిని తెలియదు.

ఒక విచిత్రమైన సంఘటన. ఒక యింద్రజాల మహేంద్రజాలము. కనివిని యెఱుగని యద్భుత సంఘటనము. అది 1941 వ సంవత్సరము, జనవరి 26 వ తేదీ. అది స్వాతంత్ర్య దినము. స్వాతంత్ర్యమును సాధించుటకై ప్రజలు ప్రమాణ పత్రములను చదువుచుండిరి. సుభాసచంద్ర బోసు చెరలో నుండినాడేయని ప్రజలందఱు బాధపడినారు. అతడెట్లుండునోయని చెరసాలాధికారులకుకూడ తహతహ కలిగినది. వారు మెల్లగా చెరసాలతలుపులు తెఱచి చూచినారు. బోసుబాబు చెరసాలలో లేడు. ముద్రముద్రగానే యుండినది. ఏమైనాడాయని కంగారుపడినారు. ఎల్లెడల వెదకినారు. ఎక్కడకెట్లు పోయెనో యెవ్వరికిని తెలియదు. తన దేశమునకు స్వాతంత్ర్యము సంపాదించుటకు పరదేశములకు ప్రయాణమైనాడు. వేయికన్నుల కావలికాయుచు మహాదక్షులమని విఱ్ఱవీగు తెల్లదొరలు కన్నులలో చూచుచుండగా దుమ్ముగొట్టి వెడలిపోయినాడు. కొలది దినములకే బెర్లిన్ నగరమున జర్మన్ నియంత హిట్లరుచే సమస్త

గౌరవముల నందుకొనుచున్నాడని తెలిసినది. అతడిప్పుడే భారత సర్వాధి కారిగా పరిగణింపబడినాడు. ప్రపంచయుద్ధము విస్తృతమయినది. జర్మనీ లోనే జర్మనుయువతిని పెండ్లాడినాడు. ఆ దంపతులకు ఒక కుమార్తె కలిగినది. పిమ్మట జర్మనీనుండి జపానుదేశమునకు వెళ్ళి స్వేచ్ఛా భారత సంఘములో పనిచేసినాడు.

ఆ దినములలో జపానులో రాసుబిహారిబోసు భారతీయులకు నాయ కత్వము వహించియుండెను. భారత జాతీయసైన్య మేర్పడినది. జపాను వారికి లొంగిపోయిన భారతీయసైనికులు ఇతర భారతీయులు నందుచేరిరి. వారందరును కలిసి దేశస్వాతంత్ర్యసంగ్రామ సైనికులైరి. ఆయుద్ధమున కు సుభాసచంద్రబోసును నాయకత్వము వహింపుమని కోరిరి. 1943 సంవత్సరము జూలై 3 వ తేదీని బోసు సింగపూరులో భారతదేశ స్వాతంత్ర్యోద్యమమునకు నేతృత్వము వహించినాడు. అందుచేతనే నేతాజీ సుభాసచంద్ర బోసయినాడు. ఆ యుద్ధమునకు క్రొత్తవికా సము, క్రొత్తజీవనము, క్రొత్తపటుత్వము కలిగినవి. స్త్రీలుకూడ తండోప తండములుగ నందు చేరినారు. ఝాన్సీరాణి దళమను పేరుతో స్త్రీల సైనికదళ మొకటి యేర్పడినది. సింగపూరులోను రంగూనులోను శిక్షణ శిబిరము లేర్పాటుచేయబడినవి. భారత స్వాతంత్ర్య సమితినొక దాని నేర్పాటుచేసిరి. స్వేచ్ఛా భారతప్రభుత్వ మేర్పాటైనది. దానికి బోసే యధికారి. ఆ ప్రభుత్వమును తొమ్మిది విదేశ ప్రభుత్వములు సమానప్రతి పత్తిగల స్వతంత్ర ప్రభుత్వముగ నంగీకరించినవి. సింగపూరునుండి రాజ ధానిని రంగూనునకు తరలించిరి. అందువలన స్వదేశమునకు దగ్గరైనారు. భారతజాతీయసైన్యము యుద్ధభేరీ మ్రోగించినది. 1944 వ సంవత్సరము మార్చి 18 వ తేదీని భారతసైన్యము ఇంఫాల్ ప్రాంతమున భారత భూమిపై కాలుపెట్టినది. కుంభవృష్టి కురియుచున్నను, దారితెన్ను లేక పోయినను, బురదయైనను సైన్యములు జంకక కదలినవి. కాని ఆహార పదార్థములు లేవు. వైద్యసౌకర్యములు లేవు. శత్రువుల కాకాశమార్గ మున నన్ని సామగ్రు లందుచున్నవి. రంగూను నగరమునుకూడ విడిచి పెట్టవలసినస్థితి యేర్పడినది. 1945 వ సంవత్సరము ఏప్రియల్ 24 వ తేదీని బోసు మొదలైనవారు రంగూన్ విడిచి పెట్టిబ్యాంగ్ కాక్ పట్ట ణమునకు వెళ్ళదలచినారు. 1945 మే నెల 28 వ తేదీనాటికి రంగూన్ లోని భారతీయ కార్యకలాపము లన్నింటికిని ప్రభుత్వము వారిచే నాటం

కము కలిగినది. ఓటమి కలిగినదని నిరాశాజేతుడైన భారతీయసైనికులను బోసు సింగపూరు చేరియుండి ధైర్యోత్సాహములను ప్రబోధించు చూలొక్కల్పినాడు. మరునాడు విమానములో బ్యాంగ్ కాంగ్ పట్టణము నకు పోవుచున్నాడు. నాలుగైదు దినములు తరువాత బోసు విమాన ప్రమాదమువలన మరణించినాడని టోకియో రేడియో ప్రకటించినది. అది 1945 అగష్టు 23 వ తేదీ.

ఇరువదిరైదు సంవత్సరములు దేశసేవ, ప్రజాసేవ చేసి బ్రతు కంతయు చెరసాలలోనే గడపిన భారతజాతీయ సైన్యాధినేత సుభాస చంద్రబోసు మృత్యుదేవత భయంకర దంష్ట్రిలలో చిక్కినాడు. అతడు మాసిపోయినను వాని కీర్తి చంద్రికలు నిరంతరము నిండుకాంతులతో కాయుచునే యుండును.

## ప్రశ్నోత్తరములు

1. సుభాసచంద్రుని విద్యాభ్యాసకాలమున నాంగ్లపాఠశాల లెట్లుండెడివి ?

ఆనాటి పాఠశాలలు యూరోపీయుల బిడ్డలకే ముఖ్యముగా నేర్పాటు కావింపబడినవి. భారతీయులు నూటికి పదిమందికంటె నెక్కు వగా నుండరు. విద్యాభ్యాసముపైనే శ్రద్ధవహింపవలెనను నిర్బంధము లేదు. నడవడిక మంచిదై యుండవలెను. పరిశుభ్రత కలిగియుండవలెను. సమయపరిపాలన పాటింపవలెను. ఈమూడును భారతీయ పాఠశాలలలో కానరావు. విద్యావిషయమున కూడ వ్యక్తిగతమైన శ్రద్ధ వహింపబడెడిది. అక్కడి యాంగ్లభాషాప్రమాణము ఇతర పాఠశాలల ప్రమాణముకన్న మిన్నయే, కాని యెంత క్రమశిక్షణయు, క్రమబద్ధత యున్నను ఆ విద్యా విధానము భారతీయ సంప్రదాయమునకు వ్యతిరేకముగానే యుండెడిది. ఆంగ్లదేశ భూగోళశాస్త్రము, ఆంగ్లదేశచరిత్ర ముఖ్యముగ బోధింప బడుచుండెడివేకాని భారతదేశమును గూర్చి వివరములు విషయములు లేనేలేవు. పాఠ్యపుస్తకములలో నాంగ్లేయగాథలే కాని యొక్క భారత వీరుని గాథయేలేదు. భారతీయత మచ్చునకైనను కానరాదు.

బాహ్యప్రపంచమున దరిద్రనారాయణుడు తాండవించు చుండినాడు. పాఠశాలలో మాత్రము వీరు సీమగొరింకలవలె [illegible] చేసెడివారు. ఉపకారవేతన పరీక్షలు జరుపబడెడివి. అందు ఆంగ్లేయులే యభ్యర్థులుగా నుండతగినవారు. భారతీయులకర్హత లేదు. అంత పక్షపాతబుద్ధితో సంచరించినను సంవత్సరాంత పరీక్షలలో మాత్రము భారతీయులే యున్నతస్థానములను పొందెడివారు. ఆంగ్లోయిండియనులు స్వచ్ఛంద సైనిక శిక్షణ కర్హులు. భారతీయు లర్హులుకారు. ఆ పాఠశాలలో జాతి ఆధారముగా విద్యార్థులమధ్య కక్షలేర్పడినవి. అప్పుడప్పుడు వాగ్యుద్ధములు ముష్టియుద్ధములు నేర్పడెడివి. కలకత్తా విశ్వవిద్యాలయమువారి నూతన నిబంధనావళి ప్రకారము పరీక్షలకు వంగభాష నభ్యసించుట తప్పనిసరి యైనది. ఈ యాంగ్ల పాఠశాలలో నెన్నాళ్లు చదివినను వంగభాషలో ఓనమాలు కూడ వచ్చెడివి కావు. ఆపాఠశాలల పరిస్థితు లిట్లుండెడివి.

## ౨. సుభాసచంద్రబోసు సంఘసేవ.

కళాశాలలో చేరునాటికే సుభాసచంద్రుని మిత్రబృందము విస్తృతమైనది. రామకృష్ణ వివేకానందుల బోధల నాచరించుట సంఘసేవ చేయుటయు వాని యాశయములు. విద్యాప్రదానమే ముఖ్యసేవ యని దాని నాచరణలో పెట్టినాడు బోసు. మతప్రచారకులను దర్శించి సంఘసేవచేయు నర్హత సంపాదించినాడు. కలకత్తాలో సేవాసమితి యొకటి కలదు. ఆహారపదార్థములను, ధనమును యాచించి యట్లు లభ్యమైన ధనముతో పేదలకు సేవచేయుట వారి కర్తవ్యము. అందు బోసు సభ్యుడైనాడు. కఱవు కాటకములవల్లను వరదలవల్లను బాధితులైనవారికి నిధులను ప్రోగుచేసి సహాకరించెడువాడు. ట్రాముకర్చులకై తనకిచ్చిన డబ్బును బీదలకు బిచ్చగాండ్రకు పంచిపెట్టి తాను నడిచి కళాశాలకు వెళ్లెడువాడు.

కటకపురిలో విషూచి ప్రబలినది. మిత్రులతో కలిసి పల్లెపట్టులలో సంచరించి సేవచేసినాడు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున ఐ. సి. ఎస్. పరీక్షలో నుత్తీర్ణుడై వచ్చినను గొప్ప యుద్యోగము వచ్చినను ఆసింపక దానిని త్యజించి సంఘసేవ మానవసేవకై కంకణము కట్టుకొనినాడు.

సంఘసేవకు వివాహము కూడ ప్రతిబంధకమే యని బ్రహ్మచారిగనే యుండ నిశ్చయించుకొనినాడు. సంఘసేవకొఱకు పదవీవిరమణ చేసిన వాడు అప్పటికి బోసు ఒక్కడే. కలకత్తా జాతీయకళాశాలాధిపతియై బోసు స్వార్థత్యాగము, పరోపకారపరాయణత యనునవి ముఖ్యము అని బోధించినాడు. కలకత్తానగర ప్రధానకార్యనిర్వాహణోద్యోగియై నెలకు మూడువేలరూపాయల జీతముపై నియోగింపబడినాడు. పేదజనులకు చాల నుపయోగపడునదియు తన కంత జీత మక్కరలేదనియు చెప్పి సగము జీతము తగ్గించుకొనిన త్యాగి బోసు. చెరసాలలోనుండియే పురపాలక సంఘ వ్యవహారములు చూచుచు ప్రజాసేవచేసిన స్వార్థరహితుడు బోసు. చిత్తరంజనదాసు మరణింపగా నాతని కార్యభార మంతయు నెత్తిపై వేసికొని నిరంతర సేవ చేసినాడు.

ప్రభుత్వ నిర్బంధముపై విదేశముల కేగినను ప్రజాసేవ మానలేదు. స్వదేశమునుగూర్చి విదేశములలో ప్రచారము చేసినాడు. తాను మరణించిన నేకాని దేశము జీవింపజాలదను స్థితిలో నాత డందుకు సిద్ధపడినాడు. ఇంతకంటె స్వార్థత్యాగి, ఇంతకంటె సంఘసేవా పరాయణుడు, నింతకంటె దేశభక్తిపరుడు నింకొకడు గలడా!

## ౩. విద్యార్థులదృష్టిలో బోసు వీరు డెట్లైనాడు?

అవి ప్రథమ ప్రపంచయుద్ధ మారంభమైన దినములు. విధ్వంసక విప్లవకారులకు కలకత్తా యునికిపట్టు. విద్యార్థుల వసతిగృహములలోను కళాశాలలోను నెచ్చటచూచినను దేశస్వాతంత్ర్య సమరోత్సాహమే.

సుభాసచంద్రుని మిత్రులలో నొక మిత్రునిపై ఆటెన్ అను ఆంగ్లేయాధ్యాపకు డొకడు చేయిచేసికొన్నాడు. తన తరగతి విద్యార్థుల పక్షమున బోసు కళాశాలాధ్యక్షుని దగ్గరకు పోయి తీవ్ర నిరసన తెలియజేసినాడు. కళాశాలాధ్యక్షుడు వినలేదు. ఆ నిర్లక్ష్యభావమును చూచి విద్యార్థు లందఱు సమ్మెకట్టినారు. మౌల్వీసాహేబుగారి సాయమున కళాశాలాధ్యక్షుడు ముస్లిం విద్యార్థులును వేఱుచేయదలచి నాడు. అదియును కొనసాగలేదు. అందుచే సమ్మె జయప్రదమైనది. ప్రభుత్వపు కళాశాలలోనే సమ్మె జయమందినదని వినినతోడనే ప్రజ లాశ్చర్యపడిరి. ప్రజల యుత్సాహము ద్విగుణీకృతమైనది. అధికారులకు ఒడలుమండినది. కట్టిమాటలతోను, బెదరింపులతోను రాజీ కుదుర్పదని

ప్రభుత్వమున పెద్ద లాలోచించిరి. రెండుపక్షములకు సౌకర్యప్రదముగా వ్యవహారము పరిష్కారమైనది.

విద్యార్థులపై జరిమానాలు విధింపబడినవి. వానిని తొలగింపవేడిరి. సరేయని మాట ఇచ్చినారు పెద్దలు. ఇంతలో నా యుపాధ్యాయుడు మరియొక విద్యార్థిపై చేయిచేసికొనినాడు. మరల్ల శాంతి స్థానమేలేదని కొందరు విద్యార్థులు తొందరపడినారు. ఏమూల విన్నను నిదియే గొడవ. ప్రభుత్వమువారికి కొంచెము ఒత్తిడి బాధ కలిగినది. దానితో కళాశాల మూసివేసినారు. ఆ పరిస్థితు లన్నిటిని సరిగా తెలిసికొనుటకై యొక సంఘ మేర్పడినది. తనను తెలుపకుండ నట్టినిర్ణయ మొనర్చుట తన కవమాన మని కళాశాలాధ్యక్షుడు ప్రతిఘటించినాడు. దానిఫలితముగా నుద్యోగమునుండి యతడు తాత్కాలికముగా తప్పుకొనవలసి వచ్చినది. తాను వెడలిపోవు లోపున సుభాసచంద్రునకు తాత్కాలిక బహిష్కారణాజ్ఞ నొసంగి మరీవెళ్ళినాడు. కళాశాలాధిపతియే యుద్యోగభ్రష్టుడైనపుడు అతని యాజ్ఞకు విలువయేలేదనియు దానిని పాటింపరాదనియు సుభాసు విచారణసంఘముతో చెప్పుకొనినాడు. దొరగారిదే దోషమని బోసునా డన్న కారణముచే సంఘము బోసుమాట వినిపించుకోలేదు. ఆ వీరహృదయమును రగుల్కొలిపి తమకు తాము చేతులార చేటు తెచ్చుకొనినారు. విద్యార్థుల దృష్టిలో బోసు మహావీరుడైనాడు.

## 4. 1920 సంవత్సర ప్రాంతమున భారతదేశస్థితి యెట్టిది?

ఆదినములలో ప్రపంచసంగ్రామము ప్రజ్వలముగా నుండినది. భారతదేశమున జరిగిన జలియన్‌వాలాబాగ్ హత్యలు ప్రజల హృదయము లను భగ్గున మండజేసినవి. ఆ హత్యలను సమర్థించు దుర్మార్గులుకూడ నాంగ్లదేశమున నుండిరి. విశ్వవిద్యాలయ సైనికశిక్షణాలలోకూడ జాతి భేదము కనపఱచెడివారు. కార్మికపక్షమువారుమాత్రము భారతీయులపట్ల సానుభూతి చూపెడివారు. ఐ. సి. ఎస్. పరీక్షలో నుత్తీర్ణుడైన బోసు దరిద్రనారాయణులలో దరిద్రనారాయణుడుగా నుండి సంఘసేవ దేశసేవ చేయ నిశ్చయించినాడు గాని యుద్యోగము నాశింపలేదు. ప్రభుత్వము బిరుదములకు ప్రాకులాడు సురేంద్రనాథ బెనర్జీవంటివారిని బోసు నిందించినాడు. చెక్కుచెదరని యాదర్శములతో, మొక్కవోని

దీక్షతో ఆత్మత్యాగము పునాదిగా దేశమును నిర్మింపవలెనను నాయకులు బయలుదేరినారు. స్వాతంత్ర్యసాధన విషయమైన పథక మేమైన నుండినచో తెలుపుమని బోసు గాంధిని ప్రార్థించినాడు. మహాత్ము డేమియు చెప్పలేదు. ఆశాభంగమై బోసు దాసు దగ్గరకు పోయినాడు. అవి వేల్సు యువరాజు భారతదేశమునకు రానెంచిన దినములు. వెనుకకు వెడలిపొమ్మని నిరాశతో ప్రజ లుద్ఘోషించిన దినములవి. మహాత్ముని సహాయ నిరాకరణోద్యమము తీవ్రముగా కొనసాగుచున్న దినములవి. న్యాయస్థానములు, కార్యాలయములు, కళాశాలలు ప్రజలచే బహిష్కరింపబడినవి. జాతీయకళాశాలలు బయలుదేరినవి. పంజాబులో లాలా లజపతిరాయి, బెంగాలులో చిత్తరంజనుదాసు కలకత్తాలో సుభాస చంద్రుడు జాతీయకళాశాలాధిపతులు. స్వార్థత్యాగము, పరోపకార పరాయణత-ఇవియే యచట ముఖ్యముగా బోధింపబడు విషయములు.

యుద్ధమైపోయిన వెంటనే స్వరాజ్యమిచ్చెదమని యాశ చూపి తమపని యైనతరువాత నాంగ్లప్రభుత్వము మొండిచేయి చూపినది. ఆట్టి రాజ్యమును భారతదేశము పడగొట్ట నెంచిన దినములవి. మాటాడిన నాయకులను జైలులోపెట్టి బంధించు బాధించు రోజులవి. ప్రజలందఱు వేల్సు యువరాజును చూచి 'వెడలిపో' అని వెఱ్ఱి వెఱ్ఱి కేకలు వేసిన రోజులవి.

సుభాసచంద్రుడు నాలిపూర్ చెరసాలకు మార్చినారు. అటనుండి మాండలే చెరసాలకు రాత్రికి రాత్రి మార్పు చేసినది ప్రభుత్వము.

## ౫. 1927 నుండి భారతదేశ రాజకీయ పరిస్థితు లెట్టివి? (లేక) భారత స్వాతంత్ర్యసమర మెట్లు సాగినది?

1927 వ సంవత్సరమున భారతదేశమున బోసు తిరుగిడినాడు. చిత్తరంజనుడు ప్రజలను దుఃఖాబ్ధి ముంచి మరణించినాడు. సుభాసు బంగాళా రాష్ట్ర కాంగ్రెసధ్యక్షు డైనాడు. ఆసంవత్సరము మదరాసులో డాక్టరు అన్సారి అధ్యక్షతను జరిగిన భారత జాతీయకాంగ్రెసునకు జవహర్ లాల్ తో పాటు సుభాసచంద్రుడును కార్యదర్శిగా నియమితుడైనాడు. అధినివేశ స్వాతంత్ర్యసంపాదనకై యానాటి కాంగ్రెసు పెద్దలు యత్నించుచుండిరి. బోసు నెహ్రూలు అధినివేశ ప్రతిపత్తి స్వాతంత్ర్య

మెట్లుగునని తిరుగబడి ప్రశ్నించిరి. కానితో కాంగ్రెసులో రెండువర్గము లేర్పడినవి. బోసు నెహ్రూల నాయకత్వమున యువజన కాంగ్రెసు సంఘ మొకటి క్రొత్తగా నేర్పడినది.

యువకులలో నుడుకురక్తము ప్రవహించుచున్న దినములవి. ఆ సమయమున సైమను సంఘము భారతదేశమునకు వచ్చినది. ప్రజలు నల్లజెండాలను వికృతముగా చూపినారు. 'సైమన్! వెడలిపో' అని కేకలు వేసినారు. ఢిల్లీనగరప్రాంతపు నక్కలుకూడ "సైమన్! వెడలిపో" అని యరచినవని జవహర్‌లాల్ పలికినాడు.

తుపాకుల కెదురు నిలిచి చొక్కా చించి గుండె చూపి వీరాంధ్రకేసరి టంగుటూరి ప్రకాశము విజృంభించిన దినములవి. బోసు సమర శంఖానినాదములు కలకత్తానగరమును గడగడలాడించినవి. మహాత్ముడు సబర్మతి ఆశ్రమములో సర్వసంగ పరిత్యాగివలె కూర్చుండినాడు. బార్డోలీ ప్రజలు పన్నుల నెగగొట్టినారు. సంపూర్ణ స్వాతంత్ర్య నినాదము వదలుకొన్న గాని గాంధీ బయటికి రానన్నాడు. 1929 లో లాహోరు కాంగ్రెసులో జవహరులాలును అధ్యక్షునిగా చేసినాడు గాంధి. ఈ యెత్తుతో సుభాసునుండి జవహరును విడదీయవలసి వచ్చినది. పూర్ణస్వరాజ్యతీర్మానము నెగ్గినది. సుభాసున కది నచ్చలేదు. ప్రజాస్వామ్య కాంగ్రెసు సంఘ మొకటి బోసు స్థాపించినాడు.

1930 లో సహాయనిరాకరణోద్యమ మారంభమైనది. సుభాసచంద్రుడు బంధితుడైనాడు. చెరలో నుండగనే కలకత్తా పురపాలక సంఘాధ్యక్షుడైనాడు. ప్రభుత్వము బోసును విడిచిపెట్టెను. కాని మూడు నెలలకే మరల బంధించిరి. ఇంతలో గాంధి యిర్విన్ ఒడంబడిక ప్రకారము గాంధీ సత్యాగ్రహము నాపుచేసినాడు. రౌండుటేబిల్ సమావేశమునకు గాంధి లండను వెళ్ళినాడు. అదియు నిష్ఫలమైనది. కార్యక్రమము నిర్ణయించుకొనుటకు కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గము బొంబాయిలో సమావేశమైనది. 1938 వ సంవత్సరమున బోసు భారతీయ కాంగ్రె సధ్యక్షుడుగ నెన్నికయగుటచే విదేశమునుండి స్వదేశము వచ్చినాడు. అధ్యక్షపదవికి పోటీచేసి పట్టాభి యోడిపోయినాడు. పట్టాభి యోటమి నా యోటమియే యన్నాడు గాంధి. పట్టుదలలు ప్రబలినవి. పరిస్థితులు మారినవి. బోసునకు వ్యతిరేకు లేర్పడినారు. ఆత డసహ్యించు

కాని యధ్యక్షపదవిని త్యజించినాడు. వంగదేశమున రెండు కాంగ్రెసు సంఘము లేర్పడినవి. సుభాసచంద్రుని సంఘము 'ఫార్వర్డుబ్లాకు' తాను మరణించిననే కాని దేశము జీవింపజాలదను స్థితిలో నాతడందుకు సిద్ధపడినాడు. హాల్ వెల్ విగ్రహమును తొలగించు విషయమున బోసు మరల చెరసాలలో పెట్టబడినాడు. చెరసాలనుండి చెరసాలలో నేయద్భుతముగా నంతర్హితుడైనాడు.

౫. సుభాసచంద్రుడు 'నేతాజీ'యై నిర్వహించిన నిర్వాహణ :—

1941 వ సంవత్సరమున సుభాసచంద్రుని చెరసాలలో నుంచిరి. ఎట్లు చెరసాలనుండి యదృశ్యుడైనాడో ఎవ్వరికిని తెలియదు. బెర్లినువెళ్లి జర్మన్ నియంతయగు హిట్లరుచే మన్ననలను పొందినాడు. అచ్చటనే జర్మనీ స్త్రీని వివాహమాడినాడు. జర్మనీనుండి జపానువెళ్ళి అచ్చట స్వేచ్ఛా భారతసంఘ కలాపములలో పాల్గొనినాడు.

ఆ దినములలో జపాన్ దేశములో రాసవిహారిబోసు భారతీయులకు నాయకత్వము వహించినాడు. భారతజాతీయ సైన్యమొకటి యేర్పడినది. జపానువారికి లొంగిపోయిన భారతీయ సైనికులును, ఇతర భారతీయులును జాతీయసైన్యములో చేరినారు. అపుడు వారు దేశస్వాతంత్ర్య సంగ్రామ సైనికులు. అట్టిసమయమున సుభాసచంద్రు డాయుద్యమమునకు నాయకత్వము వహింపవలెనని నిర్ణయము జరిగినది. 1943 వ సంవత్సరము జూలై ౪వ తేదీని సుభాసచంద్రుడు సింగపూరులో భారతదేశ స్వాతంత్ర్యోద్యమమునకు నేతృత్వము వహించుటచేత 'నేతాజీ' యను బిరుదనామము వహించినాడు. ఆ యుద్యమమున కొక నూతనవికాసము, నూతన జీవితము, నూతనోత్తేజము కలిగినవి. స్త్రీలుకూడ నధిక సంఖ్యాకలుగా నయ్యుద్యమమున చేరినారు. స్త్రీల సైనికదళమునకు ఝాన్సీరాణి దళమని పేరుపెట్టిరి. సింగపూరులోను, రంగూనులోను శిక్షణశిబిరము లేర్పరుపబడినవి. భారత స్వాతంత్ర్య సమితినిధి నొకదాని నేర్పాటుచేసి గొప్ప నిధి చేకూర్చినారు. స్వేచ్ఛా భారతప్రభుత్వ మేర్పాటైనది. దానికి సుభాసచంద్రుడే యధినేత. ఆ ప్రభుత్వమును తొమ్మిది విదేశ ప్రభుత్వములు సమానప్రతిపత్తిగల స్వతంత్ర ప్రభుత్వముగ నంగీకరించినవి. సింగపూరునుండి రాజధానిని రంగూనుకు తరలించినారు. అది స్వదేశమునకు

దగ్గరైనది. భారతజాతీయ సైన్యము భయంకరముగా రణభేరీ మ్రోగిం నది. 1944 సంవత్సరము మార్చి 18 వ తేదీనాడు ఆ సైన్యము యింఫా ప్రాంతమున భారతభూమిపై నడుగిడినది. కుంభవృష్టిగా వర్షము కురిసినది. అదంతయు కీకారణ్యము, దారి తెన్ను లేని ప్రదేశములవి. ఎటు చూచి నను మోకాలిలోతు బురదగా నున్నది. అడుగుతీసి యడుగు పెట్టుటకు వీలు లేకుండెడిది. ఆహారపదార్థములా లేవు. వైద్యసదుపాయము లంతకంటె లేవు. యుద్ధసామగ్రి నానాటి కడుగంటినది. రోగములు చుట్టుకొనినవి. ఆకాశమార్గమున నన్నిసామగ్రులు శత్రువుల కడ్డులేకుండ నందినవి. అట్టి పరిస్థితులలో భారత సైన్యమునకు జయముకల్గుట యసంభవము గదా! సైన్యములు వెనుకకు పోకతప్పినదికాదు. పైపయి వచ్చు శత్రువుల ననుభారతసైన్య మహాంకృతితో నెదుర్కొనుట మానలేదు. భారత సైన్యము రంగూను నగరమునుకూడ విడిచిపెట్టవలసిన దుస్థితి యేర్పడి నది. 1945 వ సంవత్సరము ఏప్రియల్ 24 వ తేదీని సుభాసచంద్రుడు మొదలైనవారు రంగూన్ విడిచి బ్యాంగ్ కాక్ పట్టణమునకు పోవ ప్రయాణమైనారు. పోవుటకు కాళ్ళాడలేదు. పోకతప్పలేదు. 1945 మే నెల 28 వ తేదీనాటికి రంగూన్‌లోని భారతీయ కలాపము లన్నిటికిని ప్రభుత్వపు టాటంకములు గలిగినవి. ఆగష్టు 15 వ తేదీ రాత్రి సింగపూరు రేడియోనుండి ప్రసంగించినాడు. ఆ యోటమి తాత్కాలికమే యనియు, సైనికులు ధైర్యము వీడరాదనియు ప్రబోధము చేసినాడు బోసు. మరునాడు విమానములో బయలుదేరి బ్యాంగ్ కాక్ పట్టణమునకు వెళ్ళినాడు. అవల నేమి సంఘటన నెట్లు ఘటిల్లినదో యింతవరకు కూడ తెలియదు. మరి నాలుగైదు దినములకు సుభాసచంద్రబోసు విమాన ప్రమాదమున మరణించినాడని టోకియో రేడియో యీ విషాదవార్తను ప్రకటించినది. ఆ దుర్దినము 1945 సం॥ ఆగష్టు 23 వ తేదీ.

ఇరువదియైదు సంవత్సరములు దేశదేశములందు ఖండఖండములందు ప్రభాసించిన దివ్యమూర్తి సుభాసచంద్రుడు. నేతాజీయై యఖండయశము నందిన యమరమూర్తి బోసు.

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.

# ENGLISH PASS GUIDE

FOR

# S. S. L. C. MARCH 1961



*A complete and exhaustive Guide to English I & II Papers With 2 Nondetailed Texts.*



*Written and Edited by Experienced Tutors.*

**For Copies :**

**A. V. RAM & Co.,**

**PUBLISHERS & BOOK SELLERS,**

**NARSAPUR.**

తా. తన భుజబలము శత్రువుల బలము సరిగా పరిశీలించి ఎవరి బలమెక్కువగా నున్నదో ఎవరికి జయము గల్గునో నిర్ణయింపుకొనలేని స్థితిలో నున్నచో యుద్ధభూమి నుండి తొలగిపోవుట లోకమర్యాద. అది యంత లోకమర్యాద యైనను యుద్ధనీతి తెలిసినవారు మెచ్చుకొనిన మెచ్చుకొన వచ్చును గాని శూరులైతే మెచ్చుకోనే మెచ్చుకోరు. ఇంకను శత్రుసైన్యము నిన్ను కన్నెత్తియైనను చూడలేదు. నీకిప్పుడు కలిగిన భయమునకు కారణమేమి చెప్పుము.

59. దెసలు=దిక్కులు; బీటలుపాఱన్=బ్రద్దలగునట్లు; శివురు=మాఱుమ్రోగు, ఢిండిమముల కోలాహలంబులకు = శంఖముల ధ్వనికి; కలంగ బడక=కలత పొందక; ఊరనడిన్= శీఘ్రముగా; తెరలన్=బయలు దేరగా; పైన్ తో తెంచు = పైకివచ్చు; పెల్లు అడరిన్=ఎక్కువ వ్యాపింపగా; తూల పోక=చలింపక; అతిసాంద్రతన్ = మిక్కిలి దట్టముగా; కవి సిన=ఎదురొ్కనిన; అగ్గలికమునకున్ = విజృంభణమునకు; బెగ్గడిలక=భయపడక; రథ్య=గుఱ్ఱములను; సారథి=రథము తోలువారిని; వర్మ=కవచములను; అంగతతి=దేహసమూహ ములను; నాటుకొఱచునన్=గ్రుచ్చుకొను సమ్మర్దమున; తల్ల డిలక=భీతిల్లక; పగతురన్ = శత్రువులను; బరవసమునన్ = ధైర్యముతో; ఈ తెఱంగునన్ = ఈవిధముగ; క్రందు+ఎల్లన్= ఉపద్రవమంతయు; ఓర్చి=సహించి; నెగడున్+కాక=వ్యాపిం చునుగాని; దవ్వుదవ్వులన్ ఇట్లుఱివనన్=ఇట్లుదూర దూరమునకు పోయిన; ఎట్లు నవ్వరు=నవ్వకుందురా?

తా, తన భుజబలము శత్రువుల బలము చక్కగా పరిశీలించి ఎవరి బలమెక్కువగా నున్నదో ఎవరికి జయము గల్గునో నిర్ణయించుకొనలేని స్థితిలో నున్నచో యుద్ధభూమి నుండి తొలగిపోవుట లోకమర్యాద. అదెంత లోకమర్యాదయైనను యుద్ధనీతి తెలిసినవారు మెచ్చుకొనిన మెచ్చుకొనవచ్చును గాని శూరులైతే మెచ్చుకోనే మెచ్చుకోరు. ఇంకను శత్రుసైన్యము నిన్ను కన్నెత్తియైనను చూడలేదు. నీకిప్పుడు కలిగిన భయమునకు కారణమేమి చెప్పుము.

59. దెసలు=దిక్కులు; బీటలువాఱన్=బ్రద్దలగునట్లు; కివురు=మాఱుమ్రోగు, ఢిందముల కోలాహలంబులకు = శంఖముల ధ్వనికి; కలంగబడక=కలతపొందక; ఉరవడిన్ = శీఘ్రముగా; తెరలన్=బయలు దేరగా; పైన్ తొంటు = పైకివచ్చు; పెల్లు అడరిచన్=ఎక్కువ వ్యాపింపగా; తూల పోక=చలింపక; అతిసాంద్రతన్ = మిక్కిలి దట్టముగా; కవిసిన=ఎదుర్కొనిన; అగ్గలికమునకున్ = విజృంభణమునకు; బెగ్గడిలక=భయపడక; రథ్య=గుఱ్ఱములను; సారథి=రథము తోలువారిని; వర్మ=కవచములను; అంగతతి=దేహసమూహములను; నాటుకొనుచునన్=గ్రుచ్చుకొను సమ్మర్దమున; తల్లడిలక=భీతిల్లక; పగతురన్ = శత్రువులను; బరవసమునన్ = ధైర్యముతో; ఈతెఱంగునన్=ఈవిధముగ; క్రందు+ఎల్లన్ = ఉపద్రవమంతయు; ఓర్చి=సహించి; నెగడున్+కాక=వ్యాపించునుగాని; దవ్వుదవ్వులన్ ఇట్లు ఏలన్=ఇట్లుదూర దూరమునకు పోయిన; ఎట్లు నవ్వరు=నవ్వకుందురా?

ధీరగుణంపుసొంపు, పృథివీవరనందన మున్నె యింగుగుం
గారణజన్మమై తను వికారమువచ్చినఁ జెంపుదప్పునే?

ఉ. ఖాండవమేర్చునప్పుడుదగన్ రథచోదకవృత్తిఁ జల్పి యా
ఖండలసూతికిన్ జయముగల్గ నొనర్చినయట్టి బుద్ధియున్
దండితనంబు నీ యెడనతక్కునె? నాదెస మైత్రి పెన్పు మిం
కొండొకమాటదక్కుము రణోత్సవానం బొనరింపు గ్రక్కునన్.

సీ. అభినవజలధర శ్యామంబులగునెడ
లాకు జొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమ చ్ఛాయంబులగుపట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళ గౌరములగుచోటులు
దఱచుఁ బూఁబొదలచందంబునొంద
హరిద్రరుచిసమానాకృతులగు తావు
లడరెడు పుష్పాదులట్లు మెఱయఁ

తే. గలయ నెగసి ధరాధూళిలలితవనము
దివికి నదిఁ గాపుఁ బోయెడు తెఱఁగుఁ దాల్ప
గోగణము ముంగలిగ నేలకోడి వడఁగ
నడచు కౌరవరాజసైన్యంబుఁ గనియె.

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరాకీర్ణము శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిది! యేఁజేరంగ శక్తుండనే?

ఉ. కౌరవసేనఁజూచి వడఁకం దొడఁగెన్ మదిలోన, మేను నీ
వారకపోవుచున్నది యిదెట్లొ యొప్పునె! యిప్పటిభంగిఁ జూచిన
వీరలతోను మార్కొనమి నిశ్చయ, మట్లగుటన్ రయంబునం
దేర మరల్పు ప్రాణములు దీపవమున్ వినవే బృహన్నలా!

| సంజ్ఞ | ఉదాహరణము | విగ్రహవాక్యము |
|---|---|---|
| ద్వితీయాతత్పురుషము | నెలతాల్పు | నెలను ధరించినవాడు |
| తృతీయాతత్పురుషము | రాజపూజితుడు | రాజుచే పూజితుడు |
| చతుర్థీతత్పురుషము | యజ్ఞార్థము | యజ్ఞముకొఱకర్థము |
| పంచమీతత్పురుషము | పాపభీతి | పాపమువలన భీతి |
| షష్ఠీతత్పురుషము | రామబాణము | రామునియొక్క బాణము |
| సప్తమీతత్పురుషము | యుద్ధకుశలుడు | యుద్ధమందు కుశలుడు |
| నఞ్ తత్పురుషము | అజ్ఞానము | జ్ఞానము లేనిది |

విశేషణ విశేష్యముల సమాసము కర్మధారయము.

1. విశేషణ పూర్వపదకర్మధారయము-ఉదా:—నీలోత్పలము

2. విశేషణోత్తరపద కర్మధారయము (లేక) విశేష్యపూర్వపద కర్మధారయము- ఉదా:—కపోతవృద్ధము

3. విశేషణోభయపద కర్మధారయము-ఉదా:—శీతోష్ణము

4. ఉపమానపూర్వపదకర్మధారయము-ఉదా:—చిగురుకేలు

5. ఉపమానోత్తరపద కర్మధారయము- ఉదా:—చరణకమలము.

6. సంభావనపూర్వపదకర్మధారయము-ఉదా:—వింధ్యాటవి

7. అవధారణపూర్వపద కర్మధారయము- ఉదా:—కోపాగ్ని (దీనికే రూపక సమాసమనియు నామాంతరము)

8. మధ్యమపదలోపికర్మధారయము- ఉదా:—శాకపార్థివుడు

సంఖ్యావాచకము పూర్వమందు గల్గి ఉత్తరపదముయొక్క అర్థము ప్రధానముగాగల సమాసము ద్విగువు. ఉదా:—ముజ్జగములు.

అన్యపదార్థప్రధానము బహుప్రీహి-ఉదా:—చక్రపాణి.

సమాసము మొదట 'స' కాని 'సహ' కాని యున్నప్పుడు సహపూర్వపదబహుప్రీహి-ఉదా:—సపుత్రుడు, సహామాత్యుడు.

ఉభయపదార్థప్రధానము ద్వంద్వము- ఉదా:—పార్వతీ పరమేశ్వరులు.

| సంజ్ఞ | ఉదాహరణము | విగ్రహవాక్యము |
| --- | --- | --- |
| ద్వితీయాతత్పురుషము | నెలతాల్పు | నెలను ధరించినవాడు |
| తృతీయాతత్పురుషము | రాజపూజితుడు | రాజుచే పూజితుడు |
| చతుర్థీతత్పురుషము | యజ్ఞాశ్వము | యజ్ఞముకొఱకశ్వము |
| పంచమీతత్పురుషము | పాపభీతి | పాపమువలన భీతి |
| షష్ఠీతత్పురుషము | రామబాణము | రామునియొక్క బాణము |
| సప్తమీతత్పురుషము | యుద్ధకుశలుడు | యుద్ధమందు కుశలుడు |
| నఞ్ తత్పురుషము | అజ్ఞానము | జ్ఞానము లేనిది |

విశేషణ విశేష్యముల సమాసము కర్మధారయము.

1. విశేషణ పూర్వపదకర్మధారయము—ఉదా:—నీలోత్పలము

2. విశేషణోత్తరపద కర్మధారయము (లేక) విశేష్యపూర్వపద కర్మధారయము— ఉదా:—కపోతవృద్ధము

3. విశేషణోభయపద కర్మధారయము—ఉదా:—శీతోష్ణము

4. ఉపమానపూర్వపదకర్మధారయము—ఉదా:—చిగురుకేలు

5. ఉపమానోత్తరపద కర్మధారయము— ఉదా:—చరణకమలము.

6. సంభావనపూర్వపదకర్మధారయము—ఉదా:—వింధ్యాటవి

7. అవధారణపూర్వపద కర్మధారయము— ఉదా:—కోపాగ్ని (దీనికే రూపక సమాసమనియు నామాంతరము)

8. మధ్యమపదలోపికర్మధారయము— ఉదా:—శాకపార్థివుడు

సంఖ్యావాచకము పూర్వమందు గల్గి ఉత్తరపదముయొక్క అర్థము ప్రధానముగాఁగల సమాసము ద్విగువు. ఉదా:—ముజ్జగములు.

అన్యపదార్థప్రధానము బహువ్రీహి—ఉదా:—చక్రపాణి.

సమాసము మొదట 'స' కాని 'సహ' కాని యున్నప్పుడు సహపూర్వపదబహువ్రీహి—ఉదా:—సపుత్రుడు, సహామాత్యుడు.

ఉభయపదార్థప్రధానము ద్వంద్వము— ఉదా:—పార్వతీ పరమేశ్వరులు.